# దళిత కథలు - 2

(దళిత స్త్రీ సమస్యల కథలు)

(1910 - 1998)

సంపాదకత్వం

ఆచార్య కొలకలూరి ఇనాక్

డా. కె.లక్ష్మీనారాయణ

# DALITHA KATHALU - 2

*(Dalıtha Strı Samasyala Kathalu)*


Compiled & Edited by

Prof. Kolakaluri Enoch

Dr. K. Lakshmi Narayana





నిడో (Nido) ప్రచురణలు – 2

ప్రథమ ముద్రణ 1998

ప్రతులు : 1000

కవర్ డిజైన్: శీలా వీర్రాజు

వెల : లైబ్రరీ ప్రతి 75/-
సాదా ప్రతి 50/-

టైప్‌సెట్టింగ్: కృతి క్రియేషన్స్,
1-1-230/6, వివేక్‌నగర్, చిక్కడపల్లి,
హైదరాబాద్ – 500 020.

ప్రింటర్స్ : ఉషా లేజర్ గ్రాఫిక్స్,
జి-18, సావరిన్ షెల్టర్స్,
లక్డీకాపూల్, హైదరాబాద్ – 500 004.

ప్రతులకు : –

1. జ్యోతి గ్రంధమాల, 1-182-బి-32, 4వ రోడ్ (ఎక్స్‌టెన్షన్), అనంతపురం.
2. జ్యోతి గ్రంథమాల , 191, శాంతినగర్, అనంతపురం
3. శ్రీమతి కె రమాదేవి, 19-437ఎ-47ఇ1, వినాయక్‌నగర్, పాతూరు, అనంతపురం-515 005
4. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ (అన్ని బ్రాంచీలు).
5 నవోదయ బుక్‌హౌస్, కాచిగూడ, హైదరాబాద్.
6. దిశ పుస్తక కేంద్రం, చిక్కడపల్లి, హైదరాబాద్.
7. మణి బుక్‌స్టాల్, సందేమార్కెట్, నెల్లూరు.
8 మారుతి బుక్‌హౌస్, కొత్తపేట, గుంటూరు.

# అంకితం

ఈ దేశంలో దళిత స్త్రీల

స్వేచ్ఛ, సమానత్వం, స్వాతంత్ర్యం కోసం

సంఘటితంగా పోరాటం సాగిస్తున్న

ఉద్యమాలకు......

**ఆచార్య కొలకలూరి ఇనాక్**

ఉపాధ్యక్షులు
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం,
తిరుపతి.

14 - 7 -1998

# ఉన్నమాట

డా. కె. లక్ష్మీనారాయణ నా దగ్గర డాక్టరేటు కోసం పరిశోధనం చేశాడు. నేను సూచించిన అంశం ''హరిజనాభ్యుదయం – తెలుగు కథానిక''. దాన్ని ప్రమరించాడు.

తాను పరిశోధన చేస్తున్న కాలంలో 'దళిత కథలు' విశాలాంధ్ర ప్రచురణంగా వెలువరించాడు. పరిశోధనా కాలంలో సేకరించిన కథానికలలో 25 అందులో చేర్చాడు.

పరిశోధన కాలంలో సేకరించిన కథలతోపాటు అనంతర కాలంలో సంపాదించిన కథానికలు దాదాపు రెండు నూర్లు సంకలనాలుగా వెలువరించాలని సంకల్పించాడు. అందుకు తగిన ప్రయత్నం ఆర్థికంగా చేస్తున్నాడు.

డా. కె.లక్ష్మీనారాయణ నాకు పుత్రతుల్యుడు. పదేళ్ళుగా నాకు మనిషి తెలుసు. అతని పట్ల నాకు, మాకు ప్రేమ. ఆ ప్రేమకొద్దీ అతని కోర్కెను నేను కాదనలేకుండా ఉన్నాను.

కథలు ఎక్కడ దొరుకుతాయో నేను చెప్పి ఉండవచ్చు. ఎవరెవరికో లేఖలు వ్రాయుమని చెప్పి ఉండవచ్చు. నేను వ్రాసి ఉండవచ్చు. నా కథలు, నా దగ్గరున్న కథానికలు ఇచ్చి ఉండవచ్చు. అంతమాత్రాన ఈ కథానికలు నేను సంపాదించినట్లు కాదు. తనతోపాటు సంపాదకుడుగా నా పేరు కూడా వేస్తానంటే వద్దన్నాను. మొండిపట్టు పట్టాడు. కాదు కూడదంటే సరేననక నాకు తప్పలేదు. ఆ కష్టసుఖాలు తాను అనుభవించక తప్పదు. నేను సంపాదకుడుగా ఉండటంవల్ల ఉద్యమానికి మేలు చేకూరితే నేను అదృష్టవంతుణ్ణి. అది డా. లక్ష్మీనారాయణకు ఏవిధంగా ఉపయోగపడినా సంతోషమే.

ఈ సంకలనంలో 24 కథలున్నాయి. ఇందులో ప్రధానాంశం స్త్రీ సమస్య దళిత వాదం, స్త్రీవాదం ప్రధానంగా పరిశీలన పొందుతున్న కాలంలో స్త్రీ సమస్య పట్ల అవగాహనతో వెలువడ్డ దళిత కథలు ప్రచురించడం ద్విధా ప్రయోజనకారి. దాన్ని నిర్వహిస్తున్న డా. లక్ష్మీనారాయణ అభినందనార్హుడు.

దళిత సమస్యతో పెనవేసుకొన్న స్త్రీ సమస్య ఈ కథల అంతస్సూత్రం. అయితే, కొన్నింటిలో అది ప్రస్ఫుటంగా, మరికొన్నింటిలో నిగూఢంగా, మరికొన్నింటిలో అల్పంగా కనిపించవచ్చు.

డా. కె.లక్ష్మీనారాయణ లక్ష్యం, ప్రశంసాపాత్రం! ఇదీ ఇటువంటి అనేక సంకలనాలు తానే తేనున్న మొత్తం పరిశోధన పరిధిలోని రెండు నూర్ల కథానికలు ఒక సమగ్రావగాహనకు దోహదం చేస్తాయి.

దళిత సమస్య దాని లక్ష్యం.దాని ప్రధానాంశంగా కథానిక పరిఢవిల్లడం. అందులో దళిత జీవితం ఉండటం, ఒక పరిష్కారమో, పరిష్కార పథమో, నిర్దిష్టం కావడం, ఈ విషయాలన్నీ కలిసి అది కథగా రూపొందడం. అదీ కళాత్మకంగా మారటం వంటి భిన్న జీవిత సాహిత్యాంశాల రసాయనిక చర్య దృష్టిలో పెట్టుకోమని కోరినా, కొన్ని చోట్ల అది దిట్ట తప్పిపోయి ఉండవచ్చు. అంతమాత్రాన వీటి సాహిత్య ప్రయోజనంలో లోపం కానీ, సామాజిక దృక్పథంలో లోటు కానీ లేదు.

ఈ సంకలనంలోని కథలు ఒక అర్ధశతాబ్ది కాలంలో వెలువడ్డాయి. సంఘంలో నూత్న ఆలోచనకు దోహదం కావించాయి. ముమ్మందు దళితాభ్యుదయానికి పథ ప్రదర్శన కావిస్తాయి.

ఈ కథానికలు సాహిత్యానికిగానీ, సమాజానికి గానీ, ఏమాత్రం ప్రయోజనకారులయినా సంతోషమే.

ఈ కథానికలు సేకరించి మనో వాక్కాయి కర్మల ప్రచురణకు కృషి చేసి కృతకృత్యుడైన డా. కె.లక్ష్మీనారాయణను అభినందిస్తున్నాను.

– కొలకలూరి ఇనాక్

# దళిత స్త్రీ చైతన్య పథాన...

ఆంధ్రదేశంలో దళిత ప్రజా, సాహితీ ఉద్యమాలు బలోపేతమయ్యాయి. ఈ నేపథ్యంలో గత కాలపు దళిత జీవితాన్ని స్మరించుకోవాల్సిన అవసరం, గత కాలపు దళిత సాహిత్యాన్ని విశ్లేషించుకోవాల్సిన అవసరం ఉంది. ఈ ఆలోచనా నేపథ్యంనుండే సమగ్ర దళిత కథానికా సంకలనానికి శ్రీకారం చుట్టబడింది. గత ఎనిమిదిన్నర దశాబ్దాల కథానికా సాహిత్యాన్ని ఒక చోటికి తెచ్చి రూపకల్పన చేయడమే ఈ ప్రయత్నం. దళిత జీవితాన్ని ఎవరు ఏ దృక్పథంనుండి రాసినా, సమగ్ర దళిత కథా సేకరణలో భాగంగా స్వీకరించవలసి వచ్చింది. తెలుగు కథ 1910లో పుట్టింది. తెలుగు దళిత కథ 1925లో పుట్టింది. ఒకవేళ అంతకుముందు ఎవరైనా రచయితలు రాసినా, ఆ సాహిత్యం లభ్యం కావాల్సి ఉంది.

ఆంధ్రదేశంలో 1975నుండి స్త్రీ ఉద్యమాలు ప్రబలమయ్యాయి. అనంతరం సాగిన ఉద్యమాల్లో దళిత స్త్రీ భాగమైంది. దళిత స్త్రీ తన గత జీవితాన్ని సామాజిక పరిధిని పరిస్థితుల స్వభావాన్ని అర్థం చేసుకుంటోంది. నిరాశా, నిస్పృహ, లైంగిక అణచివేత, పెత్తందారీతనం... ఒకటేమిటి అన్ని కోణాలనుండీ ఇటు సవర్ణ దౌర్జన్యాలు, అటు దళిత పురుషాధిక్యాలనుండి అణచివేత, అవమానాలకు గురైంది. కాలగమనంలో ఈ అణచివేతను దళిత స్త్రీ పసిగట్టింది. అవమానతలనూ, దోపిడీని, పీడననూ నిరసిస్తూ, ఆత్మగౌరవంతో పాటు స్వావలంబనంగా జీవితం సాగించడానికి దళిత స్త్రీ పోరాటం ఆరంభమైంది. నేడు వీరు స్వేచ్ఛ, సమానత్వం, స్వయంశక్తి, అనే మౌలిక హక్కుల కోసం పోరాటాన్ని సాగిస్తున్నారు. ఆ నేపథ్యమే ఈ సంకలనానికి మూలం. ఈ సంకలనంలో ప్రధాన పాత్ర దళిత స్త్రీ. ఆర్తి, ఆవేశం, ఆగ్రహం, నిరాశ, నిట్టూర్పు, పోరాటం వంటి యదార్థ జీవన దృశ్యాలకు ఈ సంకలనంలోని కథలు పట్టుగొమ్మలు సామాజిక జీవన పరిణామంలో కొట్టుమిట్టాడే సమస్యలే ఈ కథా వస్తువులు.

తరతరాల బానిసత్వం కాదని, ఫ్యూడల్ విధానంనుండి మాతృస్వామిక విధానంపై పయనించి దళిత స్త్రీ తన స్వయం మేధాశక్తికి పునాదులు వేయగలిగితే అది అసలైన దళిత

# పశువుల కొరం

## కరుణకుమార

''మామా! వాకిలి తియ్యి ; మామా! వాకిలి, వాకిలి!''

పెట్టకూత వినబడ్డ పుంజులాగ, చెవులు దొరెడు చేసుకొని అప్యాయంగా అలక్షించాడు ఆ పిలుపు-పాలలో గుర్రానికి మాలీసు చేస్తున్న రొబ్బడు వడివడిగా పోయి వాకిలిచిలకు తీసి తలుపు తెరిచాడు, గడపలో నిలబడ్డ పెంచెల్ని ఆహ్వానం చేస్తూను.

''వాకిలి బిగించుకొన్నా వేందయ్యా నంజకాడ లోగా చిళ్ళాటలాడు తుండావా ఏంది?'' అని కిసుక్కున నవ్వింది పెంచెలి.

''ఆడుతూనే వుండా'' అన్నాడు బింకంగా రొబ్బడు.

''దేనితో?.... ....'' అని తెల్లమొగం వేసింది పెంచెలి.

''నీతోనే ..... ...'' అని సరాగంగా అన్నాడు రొబ్బడు.

''ఊ!.... '' అని దీర్ఘం తీస్తూ నెత్తిమీద గడ్డి గంప పట్టుకొని ఒక మెట్టెక్కింది పెంచెలి. గిల్లితే పాలుగారే దాని బుగ్గమీద చిటికెతో కొట్టి గడ్డిగంప తన రెండు చేతుల్లోకి తీసుకొన్నాడు రొబ్బడు.

వాకిట్లో రొబ్బడి దర్శనంతోనే శరీరం తేలిక అయిపోయిన పెంచెలికి నెత్తిమీది గంపకూడా తొలగేవరకు పిట్టలాగ ఎగిరి రొబ్బడితో కూడా గుర్రపు సాలలోకి దూకిందది.

''మామా! గుర్రానికి గడ్డి మట్టసం చేసి తెస్తుండానని, దినమ్మూ నీ పోడు పడలేక, ఈ పొద్దు చేతులు బొబ్బలెక్కేటట్టు దోకి దోకి, తెచ్చాడు చూడు! అరిచేతులెట్లా పుళ్ళు పడ్డాయో?'' అని రెండు చేతులూ రొబ్బడికి చూపించింది. తన రెండు చేతులతోనూ పెంచెలి పాణిగ్రహణం చేసి ఆమెను చూస్తున్నాడు రొబ్బడు.

''ఎండలు ముదిరిన్నై మామా! పచ్చని గరికపోచ సిక్కడం లేదు. నేల తడి ఆరి-గట్టిపడి రాయిలాగ పొద్దుగూకులూ ఎంత దోకినా-దోకుడు పార అరిగి మొద్దుబారడం, చేతులు పుళ్ళెక్కడం తప్ప-గంప మట్టానికి కూడా రావడం లేదు గడ్డి. ఇక తేకుంటే మామ కోపం చేస్తాడు గాబోనని మోసుకొని తెచ్చా'' అని తలపైకెత్తి మామ కళ్ళల్లోకి చూచింది పెంచెలి.

''కష్టం చేయకుంటే కడుపులోకి బువ్వ ఏడ నుంచి వస్తుందనుకొన్నావు?'' అంటూ బొబ్బలెక్కిన పెంచెలి చేతులు తన కళ్ళల్లో పెట్టుకొని ఆమెను కంఠ సీమను చుట్టవేసుకొన్నవి. నుదుటిమీది నీటి చుక్కలు చేత్తో తుడిచి, ఆమెను సందిట్లోకి లాక్కొని ఫాలభాగం మీద తన పెదిమెలు మెదిపాడు రొబ్బడు. పెంచెలికి ఆ దినం చేసిన కాయకష్టం అంతా హరించి పోయి ఆనందం పొంగింది

''వొదులు మామా! వొదులు. ఎవరన్నా సూస్తే సిగ్గుబోయేను'' అని విడిపించుకో బోయింది పెంచెలి

పైట జారగా రవికెలో బిర్రెక్కిన చిన్ని రొమ్ము ఒక్కసారిగా కంపించి చలించినట్లు తోచింది రొబ్బడి దృష్టికి, ఆ చలనంలోనే అతనికి హస్త చిత్త చాంచల్యాలు ఒక్కసారిగా అలుపుకొన్నాయి.

''ఇహిహిహీ'' అని గుర్రం సకిలించింది

పరధ్యానంలో ఉలిక్కిపడి

''ఆమ్మో! ఎవరో వస్తుండా''రని పట్టు విడిపించుకొని పైట సవరించుకొంది పెంచెలి.

''ఎంత పిరికిపిల్లవే'' అంటూ గుర్రంవైపు మళ్ళీ మాలీసు ఆరంభించాడు రొబ్బడు

చీరకొంగున కట్టిన మూట విప్పి వక్క ముక్క పంటిసందున కటిక్కుమని కొరికి, సగం ముకక్క మూటలోనే వేసుకొని, ఆకుచుట్టి నోట్లో పెట్టుకొంటూ, గోడ కానుకొని కూర్చుంది పెంచెలి

రొబ్బడు గుర్రానికి మాలీసు చేస్తున్నాడు, తొడలు దిగని లంగోటీ, కండలు తిరిగిన దేహం, నిడుదైన వక్షస్థలం - పిక్కలమీద కండలు చెండుల్లాగ ఉబికేటట్టు, నేలకు కాళ్ళు బిగదన్ని, గుర్రం డొక్కలికి తల మోటించి, ఊపిరి బిగబట్టి రెండు చేతులతోనూ తన శక్తికొద్దీ గుర్రానికి మాలీసు చేస్తున్నాడు రొబ్బడు మోటురాళ్ళను పిడిగుద్దులచే ముక్కలు చేయగల బలం తన బలమేమో, ఎదురుగా నిలబడ్డ గుర్రం బలమేమో కూడా భేదం తెలుసుకోలేని నిర్లక్ష్యం - చేతులు మంటలెత్తేటట్టు గుర్రాన్ని రుద్దుతున్నాడు రొబ్బడు గుర్రం కూడా పొట్టకిందా, మెడకిందా, నడుముల మీదా నొప్పులు తీరేటట్టు మర్దనా చేయించుకొంటూ, తన్నాస్థలంలో నుంచి అడుగుదీసి అడుగుపెట్టేటట్టు కదిలించు చూతామంటూ, వెనక కాళ్ళు వెనక్కీ, ముందుకాళ్ళు ముందుకీ తన్ని పట్టి నిలబడే ఉంది, గుర్రమూ, రొబ్బడూ పంతాలు వేసుకొని కలియబడ్డారు కాని ప్రపంచంలోగల జనం అంతా బ్రహ్మదేవుడు తన నాలుగుకాళ్ళలోనే పెట్టిన సంగతి ఆ గుర్రం మరిచింది కాళ్ళు నేలకి తన్ని పట్టి తల గుర్రాని కానించి, ''హమ్మ''ని హూంకరిస్తూ మర్దించేవరకు ఏనుగ వంటి ఆ గుర్రం నడుము ఉండేలబద్దలాగ జవజవలాడుతూ వంగి, వెనక కాళ్ళు కలగదొకు కొని ఆ పక్కకి కింద పడబోయింది.

''ఆ భద్రం! మోటుతనం చేయవోక!'' అని గోడ కానుకొన్న పెంచలి రొబ్బణ్ణి హెచ్చరించింది.

కిచకిచలుపెట్టిన పిల్లలు నవ్వినట్లుగా ''ఇహిహిహీ'' అంటూ గుర్రం మళ్లా సకిలించింది.

రొబ్బడు ఎడంగా వచ్చి చేతులు దులుపుకొన్నాడు

''ఏందీ, ఒళ్ళంతా ఆ చెమటలు! అయ్యో! నీళ్ళలో మునిగి లేచినట్టుంటావే! మరీ అంతా మోటుతనమా? ఇట్రారా? ఒళ్ళోపాలి తుడుస్తాను. రవ్వంతా తాళి మళ్లా పట్టొచ్చులే! అని మామను పిలించింది పెంచెలి.

''ఉస్సు'' మంటూ పెంచెలి కెదురుగ్గా మోకాళ్ళ మీద మోచేతులు పెట్టుకొని కూర్చున్నాడు రొబ్బడు చీరరంగు తీసి అతని వక్షస్థలం, వీపూ, చేతులూ, ముఖం తుడిచింది పెంచెలి.

రొబ్బడికి అలుపు తీరింది, చెదిరిపోయిన అతని క్రాపింగులోని వెంట్రుకలు చేత్తో సవరిస్తోంది పెంచెలి.

''పిల్లా! బిడ్డల్నికనే ఈడు వచ్చీకూడా మనిద్దరికి ఎన్నాళ్ళీ దొంగచేష్టలు?''

''అయితే నాకు పెళ్ళిచేయమని మా అయ్యనీ, అమ్మని నా నోటితో ఎట్లా అడిగేది, నువ్వే చెప్పూ?''

''ఏమి, అడిగితే ఎగ్గా?''

''ఎంత బాగుండాదీ యిద్దూరం! అంత ఉబలాటంగా ఉన్నవాడివైతే, నువ్వే వచ్చి మా అయ్య నడగ్గూడదూ?''

''మొగజన్మ ఎత్తిమూతి మీద మీసం గలవాడు, ఓ పరాయి మొగాణ్ణి పిల్ల నివ్వమని నాలిక తెగ్గోసినా అడగ్గల?''

''నీకెంత రోషం ఉండాదో ఆడదాన్ని నాకూ అంతే ఉండాది''

''అయితే పెళ్ళి చేసుకోకుండా ఈ మోయిన కూకుంటావా?''

''మొగోడిని నీకు లేని తొందర నా కేమొచ్చె?'' అని రొబ్బడి వెనక చేరి వీపు మీది మట్టినలుస్తూ కూర్చుంది పెంచెలి

రవ్వంత నిదానించాడు రొబ్బడు

''ఇక గడువుపెట్టే క్రియలేదు, ఎప్పుడు నీ మెళ్లో బొట్టు కట్టేనా, గుర్రం మీద నిన్నెక్కించుకొని ఎప్పుడు ఉత్సవం చేసుకొనేనా, ఎప్పుడు నీ బుగ్గలు పులిమేనా- అని ఉబలాటంగానే ఉండాది మా సూపరెంటు దొరని కూడా అడిగాను ఓ! అభ్యంతరం లేకుండా తీసుకొని పొమ్మన్నాడు, గుర్రాన్ని పిల్లా! పసుపుబట్టలు కట్టుకొని, ఈ చింతపువ్వు వన్నె గుర్రం మీద నిన్ను కూకోబెట్టుకొని, గాజుదీపాలేసుకొని, ఔట్లు పేల్చుకొంటూ, ఉత్సవం చేసుకొంటే, నేను రాజులా ఉండనంటే!'' అని మెడ వెనక్కు వెలేసి పెంచెలి ఒడిలోకి ఒరిగాడు రొబ్బడు.

''నువ్వు రాజులా గుంటే నేను మాత్రం రాణిలాగ ఉండనంటయ్యా?'' అని అతని చెక్కిళ్ళమీద రెండు చిట్టి దెబ్బలు కొట్టింది పెంచెలి. ''ఏదీ ఒక్క ముద్దియ్యవే పిల్లా!'' అంటూ ఆమె ముఖం తన ముఖంలోకి లాక్కొన్నాడు రొబ్బడు

''నిజంగా మీదొర గుర్రాన్ని ఇస్తానన్నాడా మామా?'' అని ఆత్రంతో అడిగింది పెంచెలి

''నిజంగానే! నేనంటే మా దొరకి గుండెలో గుండెకాయ, అయిదు వందల కరుకులు పోసి మోజుపడి కొనుక్కొన్న జీవం దాన్ని డబ్బిచ్చి ఆయన కొనుక్కోవడ మేందో, నా చేతిలో పెట్టడం ఏందో- అంతే! ఇంక దొరమళ్ళా గుర్రంమాట మరిచిపోయేటట్లు చేశానుగాని ఏమరి ఉండా ననుకొన్నావా? రేపటేళ అనుకుండా, మాపటేళ అనకుండా బిడ్డని సాకినట్లు సాకుతుండాను గనుకనే తల వెంటికి వాసి కూడా తగ్గిపోకుండా ఏనుగలాగ ఎల్లా ఉండాదో సూడు. వేడుకగా పెళ్ళి చేసుకొంటానంటే ఉత్సవానికి ఒక్క పూట గుర్రమే ఇవ్వననడానికి ఆయనికి నోరు వస్తదా మొదలు?''

''మామా! నాకు గుర్రం మీద కూకోవాలంటే భయమే!''

''నే నుండానుగా! వెనకతట్టు కూచోని పట్టుకోనూ?''

''అబ్బో ఆ మాట తలసుకొంటూంటే ఒళ్లు జలదరిస్తోందయ్యా! మరి గుర్రం ఉండి ఉండి ఒక్కసారి పేరేం తీస్తేనో?''

''తీస్తదా? మనం నిలుచోమంటే నిలుచోవాలే! కదందొక్కమంటే తొక్కాలె! తరటు పొమ్మంటే పోవాలె! గాలప్ తీయమంటే తీయాలె! అంతేగాని దానిష్టప్రకారం పోడానికి గుండె లుండాయా?''

గుర్రం మళ్ళా సకిలించింది.

''మామా! ఆ గుర్రమెక్కి మా వూరు వూరంతా వూరేగాలె ఈ జన్మ ఇక ఈడేరినట్లే అవుతది

నాకు ''

''మీ వూరే అన్నమాటేందే పిల్లా! ఈ నగరం అంతా తిప్పనంటే! గుఱ్రాన్ని లొంగగొట్టడంలో రొబ్బడంటి సైసు ఉండాడా అనిపించుకొన్నా! ఓ! నీ సరదా తీరేటట్లు దేశం అంతా తిప్పుతా గుఱ్రం దిగకుండా ''

''అట్టయితే నే నీరాత్రికే మా అమ్మదగ్గర అంటా నుండు పెళ్ళి సంగతి మామా! నువ్వన్నట్లు మనకీ దొంగ చల్లాటాలు బాగులేదే! ఏందీ కర్మ! మనిద్దరం ఇష్టపడ్డాక ఇంక నలుగు డేమొచ్చు!''

రొబ్బడు సరేనని లేచి నిలబడి చెడ్డీ కంటుకొన్న మట్టి దులుపుకొన్నాడు

తనకు కాబొయ్యే మగాడూ, అతని ఎత్తులే నిలబడ్డ ఉన్నతమైన గుఱ్రమూ, రెండు పురుషసింహాల్లాగా గోచరించారు పెంచలి కళ్ళకు. ఆ ఇద్దరినీ అట్టే చూచుకొని మనస్సులోనే పొంగిపోయింది పెంచెలి

''సీకటి పడింది పరుగుదూరం పోవాలె మామా! రేపు మళ్ళా వస్తా.. ''నని గడ్డి గంప చంకన పెట్టుకొంది జారిపోయిన కొప్పుముడి సవరించుకొంటూ, కట్టుకొన్న కుచ్చిళ్ళు చక్కజేసు కొంటూ, పైటకొంగు నడుంచుట్టూ తిప్పుకొంటూ జరజర నడచిపోయింది పెంచెలి

పోతూఉండే పెంచెల్ని అట్టే పరకాయించి చూచి చూచి, గడప దిగి వీధిలోకి పొంగనే,

''సేసుకొంటే ఇట్లాంటి పిల్లనే సేసుకోవలె, సుకపడాలె''నని అనుకొంటూ, గుఱ్రానికి దాణా పెట్టడానికి ఉలవల సంచి మూత విప్పాడు రొబ్బడు.

పెంచెలి కాపురం ఉండే వూరు ఆ నగరానికి పరుగు దూరంలో వుంది. చీకటి దట్టం గాకముందే ఇల్లు చేరుకోవాలనే పరుగులుతీస్తూ ఇంటి దారిపట్టి పోతోంది పెంచెలి మంచి యౌవనంలో ఉన్న రొబ్బడూ, తన కలిసి కూచొని ఊరంతా ఊరేగగల చేయెత్తు గుఱ్రమూ, తన మాలవాడలో ఏ వధూవరులకీ లభ్యపడని అపూర్వమైన అశ్వారోహణ భాగ్యమూ-ఈ తలపులన్నీ పెంచెలి మనస్సును వికసింప జేయగా, శరీరం పులకరించి, ఆమె ఒక విధమైన ఉత్సాహంతోనూ, ఉద్రేకంతోనూ తొందరగా పోతోంది.

తనవూరు ఇక అరమైలుదూరం ఉంది. కనిచీకటి పడుతూ పడుతూ ఉంది. డబడబమని ఆకాశంలో పెద్ద ఉరుము ఉరిమి, పెంచెలి హృదయాన్ని చెదరగొట్టింది. 'అమ్మో! ఎక్కడనో పిడుగు పడిందే' అని తటాలున వెనక్కి తిరిగి ఆకాశంలోకి చూచింది. సూర్యభగవాను లోకంలోకి జారిపోయాడో కాని నల్లని కాటుక కొండలు రెక్కలు కట్టుకొని ఆకాశంలోకి ఎగిరి పెంచెల్ని తరుముకొని వస్తున్నాయి పెద్ద గాలీ వానా వచ్చి తాను తడిసిపోతా నన్న భయంచేత పెంచెలి కాలివేగం వృద్ధిచేసింది. కాని అంతా కనురెప్పపాటు దృశ్యం. కళ్ళు చీకట్లుకమ్మే మెరుపులు మెరవడ మేమిటో, మేఘాలు పరస్పరమూ ఒరుసుకొని గర్జించడమేమిటో, తూర్పు సముద్రం మీదుగా ఎగిరివచ్చే గాడ్పులు పశ్చిమగోళం వరకూ వ్యాపించడమేమిటో- అంతా అయిదు నిమిషాలలోనే, నల్లని ఆకాశం కరిగి నీరయిపోయింది వడగళ్ళ రాళ్ళ వాన దౌష్ట్యానికి పెంచెలి ఓర్చుకోలేకపోయింది. వడగళ్ళ తాకుడు-ఎవరో దుండగీంద్రుడు ఆమె రాళ్ళతో విసరి కొట్టుతున్నట్లుగా వుంది. రొబ్బణ్ణే ఎంత స్మరించుకొన్నా తన నాదుకోను రాలేకపోతున్నాడు. రాళ్ళదెబ్బలు తప్పించుకొనే ఉపాయం ఊహించుకొనే లోపలనే, ఆమె ఆపాదమస్తకమూ తడిసి ముద్దయిపోయింది. తలమీద వడగళ్ళ దెబ్బ తగలకుండా చంకనవున్న ఖాళీ గడ్డిగంప నెత్తిని బోర్లించుకొంది. అప్పటికప్పుడే కారుమబ్బులు దశదిక్కులా ఆక్రమించుకొన్నవి. పొద్దెంత పోయిందో కాని, కటికి చీకటి కుంభవృష్టితోపాటు లోకాన్ని ముంచెత్తి వేస్తోంది. నెత్తి మీది గంప తన దృష్టికి కొంత అడ్డుతగిలేవరకు, దారి వెతుక్కొంటూ

అడుగులో అడుగు పెట్టుకొంటూపోయే పెంచెల్ని, ఒక పెనుగాలి చేతుల్లో ఎత్తుకొని, ఇరవై గజాల దూరంలో ఒక గానుగ చెట్టు మొదటిలోకి తీసుకొనిపోయి దింపింది.

నెత్తిమీది గంప పైకెత్తి చూచేసరికీ, సమీపంలోనే వున్న దొడ్డి పశువుల కొరకు తలదాచుకోను రక్ష దొరికినందుకు సంతోషిస్తూ ఆ పశువుల పాకలోకి దుడుంగన దూరింది పెంచెలి. వానజల్లు తగలకుండా ఆ పాకలో ఒక మూల ఒదిగి, చలిగి గడగడ వణికే దేహాన్ని కాపాడుకొంటోంది. బయట వానదేవుడూ, వాయుదేవుడూ పంతాలు వేసుకొని ప్రాణికోటులకు తగిలేదే, తప్పేదీ తెలియక విచ్చలవిడిగా విహరిస్తున్నారు తళుక్కుమని మెరుపులు మెరిసినప్పుడల్లా ఆ కొరంలో రెండు వరసలుగా కట్టివేసి, గాటిలో గడ్డి మేస్తూ ఉండిన అబోతులలాంటి పడమటెద్దులూ, వాటి తెల్లని మూపురాలూ, అందమైన కొమ్ములూ, గాంభీరమైన నేత్రాలూ- అన్నీ ఒక్కసారిగా పెంచెలి కళ్ళకు గోచరిస్తున్నాయి ఆ ఆపత్సమయంలో ఆప్రదేశం అంతా నిర్జనప్రదేశంగా ఆమెకు పొడగట్టినప్పటికీ, రొబ్బడిలాగ, రొబ్బడి చేతుల్లో పెరిగే గుర్రం లాక, బలిష్టమై, దేహసౌష్టంగల అన్ని వృషభరాజములు ఆమె దండనుండగా చూచుకొనేవరకు, తన ప్రాణానికేమీ భయంలేదని ఆ అబల కొకవిధమైన ధైర్యం కలిగింది గాలీ, వానా రవంత తెరిపియిస్తే, ఎంతలో పోవాలి ఇంటికి!

తడిసిపోయిన రవికె శరీరాని కంటుకొనిపోయింది. నీళ్ళు కారే పైటకొంగు తీసి పిండుకోవడానికి ఒకటి రెండుసార్లు ప్రయత్నించిందిగాని అన్ని ఎద్దుల సమక్షంలో పైట తొలగించుకోనిచ్చింది కాదు ఆమె శీలం.

గాటిలోని ఎండుగడ్డి విదిలించి, వామిలో నుంచి తెచ్చిన జొన్నచొప్ప కట్టల్ని విరిచి ఎద్దుల ముందు వేసుకొంటూ ఆ చివర నుండి ఈ చివరికి వస్తున్నాడు రాయుడి సేద్యగాడు ముతరాచు సుబ్బడు. ఆ పాకలో మనిషి సంచారం సవ్వడి తెలుసుకొనే వరకు కుదుటబడవలసిన పెంచెలి మనస్సు భీతిచెందింది- ఎందువల్ల? ముతరాసు సుబ్బడిని వేటకుక్క ముక్కులా ఏమిటి? లేకుంటే ఆ గాఢాంధకారంలో పెంచెలి సవ్వడి అతడెట్లా పసికట్టగలిగాడు!

''ఎవరామనిషి?'' అని ప్రశ్నించాడు సుబ్బడు

బదులు లేదు.

''ఎవరంటే మాట్లాడవేం?'' అని సమీపించాడు సుబ్బడు.

''నేను చిన్నాయనా పెంచెల్ని.''

''ఏ పెంచెలివే?''

''నేనయ్యా, వెంకటిగాడి కూతుర్నయ్యా! గడ్డి అమ్ముకొని వస్తుంటే వానకు తడిసి ఇట్టా వచ్చా'' అన్నది పెంచెలి.

''ఎవర్రా ఆ మనిషీ'' అని పాక చివరినుండి ఆ చీకట్లో ఇంకో ప్రశ్న బయల్దేరింది.

జవాబు లేదు.

''ఒరే సుబ్బా! ఎవర్రా ఆ మనిషి?'' అని మళ్ళా వచ్చింది ప్రశ్న.

జవాబు చెప్పకుండానే సుబ్బడు పెంచెల్ని విడిచి ఎద్దుల్లో జొరబడి ఆ చివరికి వెళ్ళిపోయాడు.

''ఎవరితోరా నువ్వు మాటాడుతుండేదీ!''

''అదే....''

''అదే అంటే?...''

''అదే నువ్వు కోరుకున్న మనిషే! వెంకటిగాడి కూతురు.''

''పెంచెలే! ఈడ కెందు కొచ్చిందీ?''

''గడ్డి అమ్ముకొని ఇంటికి పోతుండదట! వాన వచ్చేవరకు పాకలోకి దూరింది ''

''ఒరేయ్! సుబ్బా! ఇదేరా సమయం, చిక్కిందిలే! ఇక పోలేదులే ''

''. .....''

''నేను ఈడుండానని దానితో చెప్పకుండా చెయ్యిపట్టుకొని దాన్నిట్లా లాక్కురా!

''తలా, ఒళ్లూ, గుడ్డా తడిసి ముద్దయిపోయిందే! అబ్బే! ఈ తడవ పోనీ, ఇంకోపాలి పిలుచుకొని వస్తాలే ''

''అట్టా గాదురా, చెయ్యిజారితే మనకు చిక్కదురా- నీకు తెలియదు దానికోసరం ఇప్పటికి ముగ్గురిచేత కబురు చేశాను. అది రానని చెప్పింది ఈ సమయం పోగొట్టుకొని ఉపయోగం లేదు.''

''. ... ''

''నీ కెందుకు, నువ్వు పోయి దాన్నిట్లా లాక్కొని వద్దూ, తరువాత సంగతి నేను సరిపెట్టు కుంటాను.''

ఫెళఫెళమని పెద్ద ఉరుము ఉరిమింది పరధ్యానంలో ఉండిన పెంచెలి జడుసుకొని, మెరుపుతీగలానే దాని శరీరం కంపించి వంకలను తీసింది నోటిలోకి తీసుకొన్న గడ్డి నోటిలోనే పెట్టుకొని, నమలడం చాలించి, మెడలెత్తి నిర్ఘాంతపోయి చూస్తున్నాయి ఆ వృషభరాజములు, గాలీ వానా వాటి ఇష్టంవచ్చినట్లు చెలగాటాలాడుతున్నాయి.

''టర్రు''మని ఎద్దుల్ని అదిలించుకొంటూ, దారి తొలిగించుకొని పెంచెలి దగ్గరికి వచ్చాడు సుబ్బడు. ఏదో సమాధీలో తదేకధ్యానంలో కదలకుండా మెదలకుండా నిలబడే ఉంది పెంచెలి.

''ఏమే'' అని పలకరించాడు సుబ్బడు.

''అమ్మో! ఎంత వానో! ఎంత గాలో! ఇదేం ఖరమ్మయ్యా, ఇంటికి పోనిచ్చేటట్టు లేదే, ఈ మాయదారి వాన!'' అన్నది పెంచెలి.

''ఇంటికి పోవచ్చుగాని, రాయుడు చెప్పిపంపితే రానన్నావట! నీకెమంత పొగరే! అన్నాడు సుబ్బడు.

జల్లుమని కంపించింది పెంచెలి దేహం! అప్పటికి స్పురణకు వచ్చింది, తాను దూరిన కొఠం రాయుడిదని కాని, రాయుడు అప్పుడు అక్కడనే ఉన్నాడని ఆమె కింకా తెలియదు.

''నిన్నే! అడుగుతూంటే పలకవేమే, నీ బతుక్కు అట్టాంటి మారాజు వెయ్యిజన్మా లెత్తినా చిక్కుతాడా? లచ్చనంగా ఇంకా బంగారు పెడతాడు. డబ్బూ,దన్నమూ ఇస్తాడు! నీకెమంత గాడా! ఆయన రమ్మంటే రానన్నావుట- ఎందువల్ల?!

''ఊరుకోవయ్యా! సుబ్బయ్యా! ఇట్టాంటి ముచ్చట్లు నాకాడ ఎత్తకయ్యోవు, బాగుండదు!

''బాగుండక చేదా ఏందే! రాయుడు మోజుపడి, కులమయినా పాటించకుండా అడుగుతుంటే ఎన్నాళ్ళని ఇట్టా ఎగర్తించి పోగలవే! పిచ్చి పిచ్చి చేష్టాలు చేయవోక, నే తీసుకొనిపోతారా!''

ఆకాశంలో మేఘాలు ఒరుసుకొన్నట్లే పెంచెలి గుండెలు రాపిళ్ళు పడుతున్నాయి పెంచెలి నోరు విప్పలేదు.

''రా. రాయుడు ఈడనే వుండాడు. రా! ఆయన్ని ఎగర్తించి పోబోక! చెడిపోగలవు'' అన్నాడు సుబ్బడు.

ఆ సమయంలో రాయుడు ఆ కొఠంలోనే ఉన్నాడన్న సంగతి వినేవరకు పెంచెలికి దడపుట్టింది.

''అమ్మయ్యో! ఈడ కెందుకొస్తికే! పెద్దపులినోట చిక్కి-తినే దేవుడా'' అని భయపడింది

''ఇట్టా రా!'' అని దాని చెయ్యి పట్టుకోబోయాడు సుబ్బడు.

గల్లుగల్లుమని దాని బిళ్ళోరి గాజులు పెద్దశబ్దం చేశాయి. అంబా అని ఒక ముసలిఎద్దు అరిచింది

''సుబ్బా! లాక్కొనిరారా, దాని సొయ్యమణచాలి'' అని ఆ చివరి నుండి గర్జిస్తూనే ఉంది రాయుడు సింహం.

''బాబో, వీళ్ళు నన్ను బతకనివ్వ''రని అంటూ కింద పెట్టిన గడ్డిగంప చేతికి తీసుకొని వాకిట్లోకి దూకింది పెంచెలి

''ఏడకి పోతావే''! అని మీదికి దూకి గంప పట్టుకొన్నాడు సుబ్బడు.

''పోనియ్యబోకురా'' అని అరుస్తూనే ఉన్నాడు రాయుడు.

''నీ తల బద్దలకానూ, నీకేమంత పొయ్యేకాలమయ్యా! సుబ్బాయ్యా!'' అని పెద్ద అరుపు అరిచి సుబ్బడి చేతిలో గడ్డిగంప విడిచిపెట్టి చీకట్లోకి పారిపోయింది పెంచెలి. దాన్ని వెన్నంటి తరుమబోయిన సుబ్బడు కాలుజారి కిందపడిపోయి, లేచే లోపల పెంచెలి జాడ అయోమయమై పోయింది సుబ్బడికి.

''పోనిచ్చా వేమిరా దద్దమ్మా?'' అన్నాడు రాయుడు.

''దాని కిష్టం లేనిది మనం ఎంత చేస్తే మట్టుకు చిక్కు-తుందా ఆడది?''

''ఏడవకపోయినావు! దద్దమ్మా! కాదురా, చేతికి చిక్కిన ఆడదాన్ని పట్టుకొని రాలేకపోయినావే- ఏడవనా నవ్వుండీ!''

''నన్నేం చెయ్యమన్నావయ్యా, అది తప్పించుకొని పారిపోతేను!''

''ఆఘోరించావులే. ఇంతటి పోగొట్టితే పొగొట్టావు కాని రేపు తెల్లవారి దాన్ని నువ్వు ఖండితంగా అడిగి తెలుసుకో ''

''సరే. అట్టనే అడుగుతాలే.''

''చూడు.. పది సవరలు బంగారు ఇస్తానని చెప్పు. మంచి పగడాల దండ ఇస్తానని చెప్పు. ఒప్పుకుంటుం దిలే, ఇంకా పసిది కాబట్టే జంకుతున్నది.

''అట్టనే'' అన్నాడు సుబ్బయ్య.

వాన రవ్వంత తెరపి ఇచ్చిన తర్వాత ఇద్దరూ ఇళ్ళకి పోయారు.

పెంచెలి ఎట్లా ఇంటికి ఘట్టం చేరవేసిందో- తన దేహం తనకి స్మృతి తెలియలేదు. పొద్దుపోయి, గాలీవానలో పిల్ల ఇంకా ఇంటికి రాలేదని దిగులుపడి ఎదురుచూచే తల్లిదండ్రుల మనస్సుకి ఆమె ఆగమనం స్తిమితం చేకూర్చింది. కాని పెంచెలి మనస్సుకు స్తిమితం చేకూరేది ఎన్నటికి?

ఇంటికి పోంగనే తడిగుడ్డలు విడిచి, పొడిగుడ్డలు కట్టుకొని, తడిసిన తల తుడుచుకొని, తనకు ఆకలి లేదంటూ ఆ రాత్రి ఉపవాసంచేసి పండుకొంది పెంచెలి.

పెంచెలికారాత్రి కంటికి నిద్ర రాలేదు. రాయుడు తన గుండెల్లో పెట్టిన అగ్నికణాన్ని రగుల్కొల్పి పెద్దది చేస్తున్నాడు. చిన్నతనం చపలత్వం చేత తనకు పంపించాడని ఆరంభంలో ఆమె లక్ష్యపెట్టకుండా తోసేసుకొంటూ వచ్చింది. కాని చూడగా అతడు పెద్ద ఆలోచన మీదనే ఉన్నట్టుగా ఉన్నాడు. వీలయితే తనను దౌర్జన్యం మీదనైనా లోబరుచుకో వలెననే ప్రయత్నంమీద ఉన్నాడు లక్షాధికారి బలవంతుడు!

ఆయనఅంతరం ఎంత, తన అంతరం ఎంత? ఆ దొరకు తన మీద ఎందుకీ భ్రమ? ఆ నాటి రాత్రి తన రోజు బాగుండి తప్పించుకొని పారిపోగలిగింది కాని, ఆ పెద్దపులిని తప్పించుకొని ఎన్నాళ్ళని తానా గడ్డ మీద తిరుగగలదు? ఈ సంగతి రొబ్బడితో చెప్పి, తొందరగా పెళ్ళిచేసి తీసుకొని పొమ్మంటేనో! అమ్మో, ఈ విషయం అతని చెవికిపోతే తనను గురించి అతడేమి సందేహిస్తాడో! అసలు తాను నోరు విడిచి ఇట్లా ఇట్లా జరిగిందని అతనితో చెప్పడం ఎట్లా?

పోనీ, తల్లితోగాని, తండ్రితోగాని తన బాధ చెప్పుకొంటే? - చెప్పి ఉపయోగం ఏముందీ, వాళ్ళిద్దరి మనస్సుకూ దిగులు, విచారమూ కొనితెచ్చి పెట్టడం తప్ప? వాళ్ళ బ్రతుక్కి వాండ్లు పోయి రాయుడితో తగవులాడగలరా? - ఆమెకు గత్యంతరం తోచలేదు తానీ విషయమై నోరు విప్పినట్లయితే నలుగురి నోటా పెళ్ళికాని పిల్ల తనే రచ్చా రావిడీ అల్లరీ పడేటట్టుగా కనిపించింది కాని ఆ స్థితిలో సంభవించిన విపత్తు నెదుర్కొని నిగ్రహించడానికి ఆమెకు గుండెనిబ్బరం చాలలేదు. కడుపులో పెద్ద భయమూ దుఃఖమూ పుట్టుకొని వచ్చినవి. తండ్రికీ తల్లికీ తెలియకుండా ఆ రాత్రి తెలవార్లూ ఏడుస్తూనే పండుకొన్నది పెంచెలి

రాయుడికి మాత్రం ఆ రాత్రి కంటికి కునుకు ఎట్లా వస్తుందీ? రాత్రి భోజనం చేసుకొని, మిద్దెమీద రెండో అంతస్తు గదిలో పందిరిపట్టె మంచం మీద శయనించినప్పటికీ మాలవాడలో తాటాకు గుడిసెలో నులకకుక్కిమీద పడి పొర్లుతూ ఉండే పెంచెలి స్థితి కంటె హీనంగా ఉన్నది, అతగాడి స్థితి కళ్ళెం తెగిన గుర్రంలాగ, విచ్చలవిడిగా సంచరిస్తోంది అతని మనస్సు. ఫలకం మీద హత్తిపోయిన పెంచెలి ముఖబింబం అతన్ని పిశాచంలా పట్టుకొని పీక్కొని తింటోంది. మనోగతమైన ఆ బింబాన్ని సాకారంగా హస్తగతం చేసితీరుతానని అతని ధనలక్ష్మి అతడాశ వదలుకొన్న కొద్దీ అభయహస్త మిస్తూనే వుందతనికి. తాను కామించింది ఆ స్త్రీ అవయవ సౌభాగ్య సంపత్తికాని, ఆ మాలదాని కులం కాదుగా! తనవల్ల నిత్యమూ ఎన్నో సహాయాలు పొందే ఒక బీద మాలకుటుంబంలో పుట్టిన పిల్ల తన యెడల అంతమాత్రం కృతజ్ఞత చూపలేదూ!

పెంచెల్ని సాధించడం ఎట్లా???

తల పగిలిపోతోంది రాయుడికి

ఆ రాత్రి మాలవాడలోని పెంచెలికీ, మేడమీది రాయుడికీ కాళరాత్రే! గుర్రపు సాలలో చింకిరిచాపమీద శయనించిన రొబ్బడు మాత్రం ఒళ్ళెరగడు

కాలవైపరీత్యం - బళ్ళు ఓడలూ ఓడలూ బళ్ళూ అవుతూ ఉంటవి! రాయుడి తాత ఉప్పుకావిళ్ళు మోసుకొని జీవించేవాడట! అయితేనేం? అది ఎప్పటి సంగతో - పురాతన కాలంనాటి సంగతి, రాయుడి కుటుంబానికి. అతని తండ్రి హయాంలోనే అందుకొన్నది శుక్రమహాదశ! ఆరంభంలో అతగాడు అయిదువందల రూపాయలు అప్పుచేసి, పూనా, బొంబాయి ప్రాంతాల్లో ఆరంభించిన ముత్యం, పగడాల వ్యాపారం, పాటిగడ్డమీది తోటకూర కాడలాగ రెపరెపలాడుతూ ఎక్కివచ్చి, ప్రాణం హరీ అనే వరకు అతడు లక్ష రూపాయల ఆస్తిని గడించి, కొడుకు రాయుడి చేతిలో పెట్టి మరీ చచ్చిపోయాడు ఇంతకీ అదృష్టమంటే రాయుడిదిగాని, నిజంలో అతని తండ్రిది కానేకాదు. తండ్రి సంపాదించి ఇచ్చిపోయిన నూరు ఎకరాల మీద ఏటా పండే నూరు పుట్ల ధాన్యమూ, ఇంటి చుట్టూ కూట్లు కట్టించి నిలవచేసుకొని, కోస్తాలో ధాన్యానికి ధర ఎప్పుడు ఉబుకుతుందా అని తపస్సు చేయవలసిన బదనాయం తప్ప, ఇక ఇతర విధమైన బాధ్యతగాని, చీకుగాని, చింతగాని, ఎరగడు ఆ మానవుడు! పుట్టుభోగి, ముప్పయేళ్ళు నిండని నిండు జవ్వనం! ఏడుకావిళ్ళ రూపాయల సంచులతో కాపరానికి వచ్చిన భార్య - పెంచెలి కంటె కూడా తనకి పచ్చిపచ్చిగా, వగరువగరుగా ఉంది ఇంకా!

అందీ అందనట్లు ఉవ్విళ్ళూరించే దోరకాయ- ఆ పెంచెలి తన మనస్సులో విషం కలిపి, ఊ. కలచివేస్తోంది

పెంచెలి తన చెయ్యి జారిపోయిన రాత్రికి అనంతరం వారంరోజుల కొకనాడు సాయంత్రం రాయుడు మిద్దెమీద వసారాలో గచ్చు అరుగుమీద రెడ్డి కంబడి వేసుకొని చుట్ట కాల్చుకుంటూ పండుకొన్నాడు. ఆనాటి రాత్రి పశువుల కొరంలో వ్యవహారం అంతా చెడగొట్టిన చవటపెద్దమ్మ, ముతరాజు సుబ్బడు మిద్దెక్కి,

''దాని కప్పుడే పెళ్ళిమనువు కూడా ఖాయం అయిందట'' అని అన్నాడు

రాయుడు ఉలిక్కిపడ్డాడు.

''దేనికిరా?''

''పెంచెలికే!''

''ఏ వూళ్ళో?''

''వాడి స్వంతవూరు పడమట- బద్వేలి! మా ఆడదాని వూరే వాడిది కూడా నేను వాణ్ణి బాగా ఎరుగుదును నేను నగరం సంతకి పోయినప్పుడల్లా వాడు నా కగపడుతూనే వుంటాడు తమరెన్నడూ వాణ్ణి చూడలేదూ?''

''ఎవడురా వాడూ?''

''అదేంది సామీ! పోలీసు సూపరెంటు గుర్రంకాడ ఉంటున్నాడు, నల్లంగా పొడుగ్గా-- భారీ మనిషి! తమరు కూడా చూసే వుంటారు, గుర్తు లేదేమో?''

''సూపరెంటు గుర్రంకాడ ఉంటాడా? వాడి పేరు?''

''రొబ్బడు,. నెలకి పదిహేను ఇరవయ్యోకాబోలు వాడికి జీతం! ఇప్పటికప్పుడే ఏడెనిమిది నెల్ల నుంచీ, వాళ్ళిద్దరూ పెళ్ళి చేసుకోవాలని తీర్మానం చేసుకొన్నారంట! వాడెన్నడూ నాతో అననే లేదీ సంగతి! నిన్న తెలిసింది నాకు మాలవాడలో!''

''అట్లానా?''

''ఈ పిల్ల దినమ్మూ గడ్డి ఎత్తుకొని వాడిదగ్గరికి పోయి వస్తానే ఉంటదట! వాడేమో సూపరెంటు ఆసరా చూసుకొని, పెళ్ళికి గుర్రమెక్కి ఊళ్ళో ఊరేగాలని కూడా పట్టుపట్టాడనీ, అందుకు మాలవాళ్ళు కూడా సరేనన్నారనీ మాలవాడంతా గోలగోలగా ఉండది.''

''మనవూళ్ళో మాలవాళ్ళు గుర్రమెక్కి ఉత్సవం చేసుకొని ఆచారం లేదు కాబోలు కదరా?''

''లేదు-సరే. వాడికి తేరగా గుర్రం చేతిలో వుండే. పైగా పోలీసు సూపరెంటు ఆసరా ఒకటి ఉండె. పెద్దమాలవాడు అంకడూ, పెంచెలి అబ్బ వెంకటిగాడూ పెద్దతలకాయలు, గుర్రమెక్కి ఊళ్ళోకి వస్తే, తనబోటి

గొప్పోళ్ళంతా బయట్దేరుతూ ఉండారే, ముందరి జుట్లు పెట్టుకొనే కుర్రకారువాళ్ళు మాత్రం సంబరం చేసుకోవలసిందే అవి హఠంపట్టి ఉండారంట.''

''అబ్బో శానాకథ పెరిగిందే!.. ..''

''పాపం! మన సేద్యగాడు రోశిగాడు, ఒకటే గోల, ఈ పెళ్ళి ఖాయమైనప్పటి నుంచీవి ...''

''ఎందుకూ!''

''వాడు తల్లీతండ్రీ లేని దిక్కు లేని పచ్చి! నీకు పిల్లనిచ్చి పెళ్ళిచేస్తాననీ ''ఇల్లరికం పెట్టుకొంటూ''నసీ చిన్నప్పటి నుంచీ వాడి మేనమామ వెంకటిగాడు ఆశపెట్టి, వాడికి-తమకు ఏటా యిచ్చే జీతంవడ్లు పుట్టి ఏదుంగిజలూ వెంకటిగాడే కాజేస్తూ, తీరా ఇప్పుడు ''పిల్లకి పెళ్ళి ఈడు వచ్చే వరకు దాన్ని పరాయిచోట ఇచ్చి చేస్తున్నాడని రోశిగాడు ఒకటే గోల... పాపం!

''అయితే మన రోశిగాడికి, వెంకటిగాడు స్వయానా మేనమామా!''

''ఓ వేలు విచిడిచిన మేనమామ కాబోలు! అయితే మట్టుకు. ఇన్నేళ్ళుగా ఆశపెట్టి, వాడిచేత అన్ని పనులూ చేయించుకొని, చూడండి, ఇప్పుడెల్లా ఎదురుతిరిగారో వాళ్ళందరూ కూడా''

''అసలు పిల్ల ఏమంటుందీ?''

''అదో మిడిమేలపు పిల్ల'' దానికి ఆ పడమటాడి మీదనే మరులు ఆ గుర్రం, ఆ సంబంరం,ఆ ఊరేగడం... ఆ దరువు మీదనే ఉండాదది ఇట్టాంటి చవటల్ని దగ్గరికి రానిస్తుందా మొదలు?''

''అట్లానా?''

''ఆ రోశిగాడు-ఒకటే గోల! అందులో ఆ పిల్ల ఎర్రగా కాస్త కంటికి నదరుగా ఆగపడే చట్టమైన పిల్లేమో- దాన్ని విడిచిపెట్టుకోవాలంటే, వాడు దిగులుపడి చస్తుండాడు.'

''ఆ వెధవ సంగతికేం గాని, నువ్వు మళ్లా దాన్ని అడగలేదటరా?''

''అడగకేం! వారం రోజులూగా అడిగి, అడిగి, ప్రాణం చాలొచ్చింది నాకు. మనం ఒక్క మాట మాట్లాడితే, అది పది మాటలు చెపుతుంది. అది మనకు అలివి అయ్యే మనిషి కాదు-''

''............ .''

''మా దొర నిన్నేం చేయడులేవే! ఒక్కసారి ఆయన కాడికి వచ్చి, ఒక్క మాట మాటాడి పోదువుగాని రమ్మంటే, రాను పొమ్మని దానిదొకటే పాట! ఇక దాన్నడగడమే నాక చిన్నతనంగా ఉండాది సామీ!''

''సరే!'' ఇక నువ్వు దానితో ఈ ప్రస్తావన ఏమీ చేయనే వద్దు, పలక్కుండా ఊరుకో!....''

''చిత్తం! ....కాని దొరలు ఎట్లనయినా, ఈ పెళ్ళి నిలుపుదల అయ్యేటట్టు చేయిస్తిరా, దాని రోగం కుదురుతుంది. అటు తర్వాత మన చెప్పు కింద తేలయి పడి ఉంటది-'' అంటూ మిద్దె దిగి వెళ్ళిపోయాడు సుబ్బడు.

రాయుడికి మనస్సు స్తిమితం చెడింది. పరి పరివిధాలా పోతోంది అతని మనస్సు. అతని నోటి లోని చుట్ట చివరి ఎర్రడాలు ప్రస్ఫుటంగా గోచరిస్తోంది. పెంచెలి చెయ్యి జారిపోతోందని అతనికి ఒక విధమైన ఖంగారు పుట్టింది. పోనే పోయింది తన యెడల అది చూపిన అవిధేయతకు తగిన శాస్తి చేసి విడిచిపెట్టితేగాని వీల్లేదని అతనికి క్రోధం ఉద్రేకించింది. తన గ్రామం అంత నిర్భయంగా ప్రవేశించి, తాను కాంక్షించిన వస్తువును తీసుకొని పోదలచిన ఆ మొనగాడెవరా అని అతనికి ఆలోచన కలిగింది! అతనికి చిరాకనిపించి పండుకొన్న మనిషి లేచి వసారాలో ఇటూ అటూ పచారులారంభించాడు.

రాయుడిది పిన్న వయస్సయినా, పట్టుదల మనిషీ, హఠవాదీని. తనను ఎదిరించిన మనిషిని సాధించి, రాచి రంపాన పెట్టేవరకూ అతగాడికి ఆ గ్రామంలో ఎదురు లేదు. తనంతటి మనిషికి ఒక మాలదాని వల్ల పరాభవం కలిగిందే అని అతనికి అరికాలిమంట నెత్తికెక్కింది. ''ఛా! నోరు విడిచి ఎందుకు అడిగాను దాన్ని'' అని జుగుప్స పడతాడు.. ...కానీ...... చూతాం...... అనుకొన్నాడు. ఈ విషయం మళ్ళా రెండో చెవికి రానేకూడదను కున్నాడు. ఆ రాత్రి తెల్లవార్లూ, తన బుద్ధికి పదునుపెట్టి ఆలోచన సాగించాడు మెదడు వేడెక్కుతోంది. కాని, పద్మవ్యూహానికి పథకం కుదరడం లేదు.

తెల్లవారుఝామున కోడికూత వేళకు అతనికొక పథకం కుదిరింది అప్పటి పరిస్థితుల్లో పని చేయదగ్గది అదొక్కటే మందు, ఆ గరళం పనిచేస్తే పనిచేసినట్లూ, లేకుంటే లేనట్లూను అనుకొన్నాడు.

ఉదయం నిద్రలేచి లేవడం తోనే ముతరాచు సుబ్బడికి కబురుచేశాడు. వాడితో ఏదేదో మాటాడి, చివరకు ఈ విషయంలో తన పేరు బయటికి వస్తే గొంతుకు పిసుకుతానని చెప్పి వాణ్ణి పంపివేశాడు.

''చిత్తం ఆ పని అంతా నేను చక్కబెట్టుకొని వస్తానుగా-తమరికా సందేహం ఏమీ పనిలేదు.'' అంటూ వెళ్ళిపోయాడు సుబ్బడు.

తెల్లవారి, ఉదయం నాలుగు ఘడియల పొద్దెక్కిన తర్వాత గ్రామంలో ఇతర పెద్ద తలకాయలను -చలమానాయుణ్ణీ, సభాపతినీ, శింగరశెట్టిని పిలిపించాడు రాయుడు. వాండ్లలో రహస్యంగా మంతనాలు చేసి గ్రామంలో మాలవాళ్ళు కొత్తగా గుర్రాలెక్కి ఉత్సవం చేసుకొంటూ ఉంటే పెద్దతలకాయలు నలుగురూ ఊరుకొంటారా, మీకు పౌరుషం లేదా, మీకు పరువు లేదా అని వాండ్లను చివాట్లు పెట్టి శివమెత్తించాడు. మాలవాళ్ళు గనుక గుర్రం ఎక్కి వీధి లోకి వచ్చినట్టయితే, గ్రామం లోని రైతులందరూ చేరి, తలకాయలు పగలగొట్టడానికి తయారుగా ఉన్నారు కాబట్టి జాగ్రత్త అని మాలవాండ్లకు తెలిసేలాగున ఊళ్ళో పుకారు లేవదీశాడు--తాను తెరచాటునే నిలబడ్డాడు.

పెంచెలి ఏ ముహూర్తాన తన వివాహ విషయమై తలపెట్టిందో కాని ఆ క్షణ లగాయతు ఆమెకన్నీ కడగళ్ళుగానే కన్పట్టుతున్నవి ఆమె మనస్సు శాంతీ, సంతోషమూ ఎట్లాంటివో ఎరుగదు గ్రామమూ, మాలవాడా కూడా అట్టుడుకినట్లు ఉడికిపోతున్నది. మాలవాడు గుర్రమెక్కి ఊళ్ళో అడుగుపెట్టినట్టయితే ముక్కలు ముక్కలుగా చెండాడుతామని ఊళ్ళో రైతులూ, ఏమైనప్పటికీ ఈ పెళ్ళికి మాత్రం వెనక్కి జంకకూడదని మాలవాళ్ళూ--అప్పుడే రోషాలెక్కి వీరావేశం మీద కత్తులూ, కటార్లు నూరుతున్నారు. మాలవాడలో పెద్ద తలకాయలు పదిమందీ కలిసి, ఇంతదూరం వ్యవహారం రాకుండానే, నెమ్మది మీదనే చక్కపెట్టుకుందామని యోచనతో గ్రామంలో ఉత్సవం చేసుకోవడానికి ఉత్తర్వు ఇవ్వవలసిందని గ్రామపెద్దలనందరిని ఆశ్రయించి అర్థించారు. కాని ఉపయోగం కనిపించలేదు. రాయుడి దగ్గరికి పోయి ఆయనగారి రెండుకాళ్ళూ పట్టుకున్నారు. గ్రామంలో ఇతర పెద్దలందరూ ఇష్టపడితే తన ఆక్షేపణ ఏమీ లేదని మాలలతో బహిరంగంగా తియ్యని మాటలు చెప్పుతూ- గ్రామంలో మాలవాళ్ళు కొత్తగా కోరే హక్కును వాళ్ళకు ప్రసాదించినందుకు మాలలందరూ కలిసి, ఆ గ్రామ ఉమ్మడి ఖర్చులకుగాను పోగుచేసిన ఫండుకు రు 300 లు నజరానా చెల్లించినట్టయితే ఈ హక్కు శాశ్వతంగా మాలవాళ్ళకి విక్రయం చేయడానికి గ్రామస్థులు సిద్ధంగా ఉన్నారని లోపాయికారీగా రాయుడు మాలలకి కబురు చేయించాడు. కాని వాళ్ళ దగ్గర అంత శక్తి ఏదీ? మాలవాడలో ఎందరి సంసారాల్లోని కుండబొచ్చెలు పోగుచేస్తే మూడువందల చిన్నడబ్బులు కాగలవు, ఎన్ని సంసారాలు దిబ్బ వేస్తే మూడువందల అణాలు కాగలవు? బాబో! మావల్ల కాదంటే మావల్ల కాదని గుండెలు కొట్టుకొన్నారు మాలలు. అంతగా వ్యవహారం వల్ల తప్పి, మెలిబడితే కొండంత ఆసరా సూపరెంటు దొర ఉండనే ఉండాడని వాళ్ళు ధైర్యం తెచ్చుకొని కూర్చున్నారు అయితే అయింది, ఎంతకయినా తెగబడుదామని మాలవాండ్లు నడుముకు ధట్టీలు బిగిస్తున్నారు

మాలవాడలో జరిగే ఈ గలభాకి పెంచెలి తాళలేక పోయింది. తన మూలాన్ని కొంపలూ కొంపలూ అంటుకొని పోయేటట్లుగా ఆమెకు తోచింది.

''దానింట వానగురిసిన గుర్రం! సంబరం లేకుంటే మానె! ఆయనా నేనూ ఇంత పప్పొకూడు తిని, కంకణాలు కట్టుకొని పెళ్ళి అయిందనిపించుకొంటె సాలు! ఆ రాయుడు నన్నెట్లాగూ బతకనిచ్చేటట్టు లేదు ఈ రచ్చ అంతా ఆయనగారు లేవదీసిందే? ఆవులూ ఆవులూ కుమ్ముకొని

లొగల్ని తన్నినట్లు, ఈ కొట్లాటలో నా పెనిమిటి కేం కీడు చేస్తారో, ఆయన తల్లీ తండ్రీ లేని దిక్కు లేని పచ్చి! నా మీదనే కళ్ళు పెట్టుకొని బతుకు తుండాడు! మా ఇద్దరి ప్రాణం సల్లగుంటే ఇంత బొద్దాకు నీళ్ళూ తాగి బతుకుతాం! ఏమైనాసరే, ఈ సంబరం ముగించుకొని ఆయన కాళ్ళు పట్టుకుంటాను. ఒప్పుంటాడు లే, నే చెప్పితే వింటాడులే మామ!'' అని మధ్యాహ్నం పన్నెండు గంటలకు, ఎర్రటి ఎండ అని అయినా అనుకోకుండా, బయలు దేరింది రొబ్బడి దగ్గరికి పెంచెలి

నడినెత్తికి, వచ్చి తేరి చూడడనికి వీల్లేకుండా నిప్పులు కక్కుతున్నాడు ప్రచండ భాస్కరుడు. ఎండ తగలకుండా నెత్తిమీద కొంగు మునుగు కప్పింది పెంచెలి; గుర్రాన్ని గనక ఊళ్ళోకి తీసుకొని రాకుంటే ఇక తన పెళ్ళికేమీ కష్టాలు లేవని స్తిమితపడింది. గుర్రాన్ని తీసుకొని రాకుండా పెళ్ళికొడుకు రొబ్బణ్నే ఒప్పించినట్లయితే తనకే బాధా ఉండదని ఆశించింది. వీధివాకిలి లోపలికి నెట్టి గుర్రపుసాలలోకి పోయింది పెంచెలి.

మంచి నడిజాము పొద్దు. ప్రజలు భోజనాలు చేసే సమయం, భోజనానంతరం విశ్రాంతి తీసుకొనే సమయమూను, రొబ్బడు ఆపూట అన్నం తిన్నాడో లేదో గుర్రపుసాలలో చాపమీద ముసుగుతన్ని పండుకొని గాఢనిద్రలో ఉన్నాడు. గుర్రం కూడా వాడి వైపుచూస్తూ ఏదో విచారాన్ని సూచిస్తూ ముంచుకొని పోయి నిలబడి వున్నది అంత గాఢ నిద్రావస్థలో ఉండిన తన ప్రియుణ్ణి లేవగొట్టనా వద్దా అని సందేహించింది. పెంచెలి; కాని ఆమె తన మనస్సులోకి ఆత్రం అరికట్టలేకపోయింది. ఎర్రటి ఎండలో పేరెంమీద వచ్చిన వగర్పుతోనే--

''మామా! మామా!'' అని అతని పక్కనే కూర్చొని తలమీద ముసుగుతీసి రొబ్బణ్ణి నిద్ర లేపింది. త్రుళ్ళిపడి నిద్రలేచాడు రొబ్బడు. ఎర్రటి చింతనిప్పుకణాల లాక ముఖంలోకి ఉబికి నెత్తురు కక్కుతున్నాయి. అతగాడి నేత్రాలు. పెంచెలికే ఆ ముఖ తీక్షణం భయంకరమయింది. నిద్రలో లేచినందువల్ల ఆ విధంగా ఉన్నా డనుకొన్నది పెంచెలి.

''మామా! మామా! మన కాగుర్రమూవద్దు, ఆ సంబరమూ వద్దు మా!''

''నా కా గుర్రమూ వద్దు, ఆ సంబరమూ వద్దు, ఆపెళ్ళి వద్దు'' అన్నాడు రొబ్బడు.

ఉలిక్కిపడింది పెంచెలి.

''మామా! నిద్రకళ్ళ టేందీ ఆ మాటలు! శుభమల్లే పెళ్లెందుకు వద్దు?''

''సంబర మెందుకు వద్దు''

''మాలాడు గుర్రమెక్కి వూళ్ళో సంబరం చేసుకొంటే, తలకాయ పగులకొట్టుతామని ఊళ్ళో పెద్ద ఆసాములందరూ కత్తికట్టి ఉండారు.''

''మిండగాళ్ళని మరిగిన లంజ, నన్ను మోసం మీద పెళ్ళిచేసుకొనాలని వస్తే తలకాయ పగులగొట్టాలని కర్రచేతపట్టి ఉండాడు ఈ రొబ్బడు.''

''ఏందీ మామా! ఈ మాటలూ?''

''ఏందే లంజా! ఈ తప్పుడు చేష్టలు?'' అని లేచి పెంచెలి కుడిప్రక్కన ఒక్క తన్నుతన్నాడు రొబ్బడు. పెంచెలికేమీ అర్థంకాలేదీ వైఖరి. నిర్ఘాంతపోతోంది. అతన్ని అడుగుదామని అనుకొంటుంది. కాని నోరు విడిబడడం లేదు. ఇంతలోనే రొబ్బడు దాని జుట్టు పట్టుకొని ''ఊళ్ళో వాళ్ళందరినీ మరిగి నన్ను.. పెళ్ళాడాలని తయారవుతావా?'' అని దాని తల కిందికి వంచి, వీపుమీద పిడిగుద్దులు కురిపించాడు

'బాబోయ్, బాబోయ్' అని అరవడానికి కూడా నోరు రాలేదా పడుచుకి! అతని వైఖరి కాశ్చర్యపోవడం తప్ప దుఃఖించడం చేతకాలేదా అబలకి ముఖంమీద విడిబడ్డ కురులు సవరించుకొనే లోపలనే ఎప్పుడు వెనకి విరిచికట్టి ఆమెను బరబర లాక్కొనిపోయి గుంజకు కట్టివేశాడు. రొబ్బడు. నోరూ విప్పలేదు. ఆ భూదేవి! కళ్ళు చారెడు చేసుకొని అతని ముఖంలోకి చూస్తూ నిలబడింది కొయ్యలాగ!

గుర్రాన్నితోలే కంచీ చేత తీసుకొని ఎదురుగా నిలబడ్డాడు ఆమె ప్రేమ చూరగొన్న ప్రియుడు.

''నిజం చెప్పుతావా చెప్పవా?''

ఆమె పెదిమెలు కంపించాయి.

''నువ్వు నీ మేనత్తకొడుకు రోశిగాణ్ణి పెట్టుకొన్నావా లేదా?''

''రామ! రామ!'' అంది హీనపర్వంతో,

''ఏడే నీ రాయుడు''? అని అతడు ఉచ్చరించే లోపలనే ఆమె దేహం మీద కంచీ ఛెళ్ళుమని పలికింది.

''మామా! .. '' అని మాత్రమే అనగలిగింది ఆ శీలవతి.

''ఆనడు నువ్వు నాకాడనుంచి పోయినపొద్దు మీ వూరు కాపురాయుడి పశువుల కొఠంలో దూరావా?''

''దూరాను'' అని సత్యవాణే పలికింది.

''ఎందుకు దూరావు?''

''వానజల్లుకి భయపడి.''

''రంకుతనం అంటే భయం లేనిదానికి నీకు వానజల్లంటే భయమా?'' అని తీవ్రంగా హెచ్చరించింది కంచీ.

''మామా....''

''ఆ పాకలో ఏమీ జరిగిందో నిజం చెప్పు''

పెంచెలి ముఖంలో మిడిగ్రుడ్లే అతనికి జవాబిచ్చాయి.

''పలకవేం?''-- అని కంచీ ఆడించాడు రొబ్బడు.

ఆ కంచీ చేసే ధ్వనికి, దాని రుచి తెలిసిన ఆ గుర్రం భయపడి, బెదిరి కలగదొక్కు కొంటోంది.

పెంచెలి గొంతెండిపోయింది; గుటక పడడం లేదు. కళ్ళు చీకట్లు కమ్ముతున్నాయి. కాని రెప్పలాడడం లేదు. నిజం చెప్పుతావా చెప్పవా అని రొబ్బడి చేతిలోని కంచీ ఇంకా సత్యాన్వేషణ కొరకు పెంచెలి రక్తాన్ని కూడా పరిశీలిస్తోంది.

''మామా--''అని నోరార పిలవాలని ఆమె కోరిక. తన ప్రియుని కరువుతీరా కౌగిలించుకోవాలని ఆమె ఉబలాటం! తన మీద ఎంత ప్రేమా, ఎంత విశ్వాసమూ లేనిదీ ఆ అమాయకుడికి, లోకం చెప్పిన చెప్పుడు మాటలమీద అంత ఆగ్రహం వస్తుందా అని ఆమె భావన. ప్రేమ సూచకములా - ఆ కంచీ దెబ్బలకు ఆమె శరీరం ఉప్పొంగి పోతోంది- కాని ఆ అపూర్వమైన అనుభవంలో ఆమె బదులు చెప్పలేక నిశ్చేష్టమై తన్ను కట్టివేసిన కొయ్యగుంజలాగే కొయ్యలా నిలబడి వున్నది పెంచెలి.

మౌనం అర్థాంగీకార సూచకమా? తన ప్రశ్నకు జవాబు చెప్పకుండా, చేసిన తప్పు ఒప్పు కొంటోంది!

అనుకొన్నాడు రొబ్బడు. వాడి కసి తీరడం లేదు. తానింకా పెండ్లాడని వీళ్లే, ఆ పిల్లమీద తా నంత తీవ్రమైన అధికారం చెలాయించవచ్చునా అనే యోచన మనస్సుకు తట్టలేదు ఆ పెళ్ళి కొడుక్కి, ఒక సంవత్సరంగా తనతో కపట స్నేహం చేసి మోసగించిందని అతనికి శరీరం భగ్గున మంటలెత్తి పోతోంది! అందులో పోలీసు సూపరెంటు దొర దగ్గర నౌకరీ చేస్తుండే మనిషి తాను, అతనికి వీరావేశం విజృంభించడానికి ఇంకా ధూపం ఎందుకూ?

పెంచెలికి కట్టిన కట్లు విప్పాడు! ఆమె దేహం అప్రయత్నంగా అతని పాదాల మీద పడిపోయింది- కాని, ఆ క్రోధమూర్తికి జాలి ఏదీ?

''చావు లంజా!'' అని తన శక్తి కొద్దీ దాని వీపు మీద ఒక్క పిడిగ్రుద్దు గుద్దాడు రొబ్బడు. తన కనుగ్రుడ్లలోని ఎరుపురంగుతో దీటయిన రక్తం ఆమెనోట బళ్ళున ఒక గ్రుక్కెడు కక్కుకొనే టప్పటికి అతనికి ఈ ప్రపంచం తెలిసింది.

''ఓసీ! ఇంత మోసమా! చెప్పుకో, నీ దిక్కున్న చోట చెప్పుకో! నా కాపెళ్ళీ వద్దు, ఆ గుర్రమూ వద్దు, ఆ సంబరమూ వద్దు. ఈ సూపరెంటు దగ్గర నాకీ నౌకరీకూడా పనిలేదు. ఇప్పుడే లేచిపోరాను మా వూరికి'' అని పై మీద గుడ్డవేసుకొన నోటి వెంట నురుగులు కక్కుకొంటూ ఆ క్షణమే లేచి చక్కా పోయాడు రొబ్బడు.

సాయంత్రం అయిదుగంటలయింది. అప్పటికి చల్లబడింది ప్రచండ సూర్యబింబం పెంచెలికి స్పృహ కలిగింది. లేచి కూర్చుంది. నలువైపులా చూచుకొంది. నలువైపులా చుచుకొంది. నెత్తురు మరకలు ఆమె గుండె చెదరగొట్టాయి. ఆమె లేచి నవ్వింది మామా....మామా... అని పిలిచింది. పెద్ద ఏడుపు ఏడిచింది. సూర్యాస్తమయం కాబోతోంది. పెంచెలి వీధిలోకి పోయింది.

విరబోసుకొన్న జుట్టు, చిరిగిపోయిన రవిక, గాట్లుపడ్డ దేహం! బూడిదలో పొర్లాడిన నెత్తురుమరకల చీర! వికృతాకారం! వికటాట్టహాసం! వెర్రిచూపులు! కారణం లేని ఏడుపు- ఆహా! ఇక మూడురోజులకు మెడలో మంగలసూత్రధారణ చేయించుకోవలసిన పెండ్లికూతురా ఆ అవతారం!

వీధిలో తిరిగే కుక్కలు మొర్రో అని ఆమె వెంట బడ్డాయి. తనని కరవమని వాటి నోటికే తన చేతులందిస్తుంది. పెంచెలి. వీధుల్లో ఆడుకోనే పిల్లలు చిన్న చిన్న రాళ్ళు తీసి ఆమె మీద రువ్వుతూ దూరంగా పోయి కేకలు పెట్టుతున్నారు. తన తల పగలగొట్టుమని పెద్ద పెద్ద బండలు తీసి ఆ పిల్లల కివ్వబోతుంది. వచ్చే పోయే మోటారు కార్ల కిందా, బండ్ల క్రిందా పడిపోవాలని రోడ్డులో వంకరవంకరగా నడుస్తుంది. కాని అవి అన్నీ ఆమెను తప్పించుకొని పోతున్నాయి.

సంజచీకట్లు విరిశాయి. పెంచెలి వికృతాకారం మరీ భయంకరమయింది. ఆమె ఇంకా పోతూనే వుంది. తన వూరికి పొయ్యే దారిలో రాయుడి పశువుల కొరం దగ్గరికి వచ్చింది. పెద్ద నవ్వు నవ్వింది. పిచ్చిపాట పాడింది. ఆ కొతం చుట్టూ తిరిగింది. కానుగచెట్టు కిందికి పోయింది. మామా అని దాన్ని గట్టిగా కౌగలించుకొంది. కళ్ళు మూసుకొంది. పెద్దంగా ఏడిచింది. ''మామా, రా' అంటుంది. 'నేమూ వస్తా' అంటుంది ఇటు అటూ పరువులెత్తింది. ఇటు అటూ రెండు మాలగద్దలు పశువుల కొరం మీద వాలాయి. వాటెని చూసింది. పెద్ద వెకిలినవ్వు నవ్వింది 'మామా' అంటు కింద తూలి పడిపోయింది.



# మాదిగ అమ్మాయి

చలం

నా భార్యకి పెళ్లయిన ఎనిమిదేళ్లలో, ఆరో గర్భం తెప్పించి, అత్తవారింటికి పంపి, ఆమె ఎట్లావుందో చూద్దామని డిశంబరు శలవలకి వాళ్ల పల్లెటూరు నీతోనన్నా చెప్పకుండా వెళ్లిపోయినాను అట్లాంటి పల్లెటూరు చూస్తే, ఇంతవరకు మనం ఈ లోకం ఎక్కడ వున్నాము, యేం చేస్తున్నాము, బతుకుతున్నామా, శ్లేష్మంలో ఈగల్లాగు కాయితాల కట్టలమధ్య పడి ఆఫీసులో మరణవేదన పడుతున్నామా? - అనే సందేహం కలుగుతుంది నిర్మలమైన ఎండుగడ్డి వాసనా, చేల పచ్చని రంగూ, పిట్టల స్వేచ్ఛగల అరుపులూ, పువ్వుల కొత్తరంగులూ, చెట్ల నవనవా, గడ్డి యెత్తుదనం, అన్నీ పూర్వజన్మంలో, విడిచిపెట్టి మరిచిపోయిన బంధువుల వలె ఒక్క నిమిషంలో మనని చేరి అల్లుకుంటాయి. అన్నిటికన్నా, ఈ పల్లెటూరు కన్యల నేవళం ఉత్సాహం యెక్కువైన సంగతులు. అయ్యో! ఈ ముప్పై ఐదేళ్ళూ ఆఫీసు కుర్చీలోనూ నవారు మంచంమీద, వ్యర్థంగా గడిపానే! ఇట్లాంటి ప్రపంచం చేతికందే దూరంలో వుండగా, అనుకుని ఒకరాత్రల్లా కంటిమీద రెప్పవెయ్యకుండా దుఃఖించాను ఆ పిల్లలు! నున్నటి చర్మం కింద బలిసిన కండల్ని యెక్కడంటే అక్కడ కదల్చడానికి శక్తిగలవాళ్ల వలే కనబడతారు. గడ్డితో మెత్తనైన కాలిబాటని - వెనక మోటరా? బైస్కిలా? యేదివచ్చి మీదపడుతుందో అనే భయం లేకుండా నడుస్తోవుంటే, ఆఫీసు 'రిమైన్‌డర్ల' సంగతి యోచిస్తున్నా- కళ్ల ఎదుట సిరస్తారు మొహం తాండవమాడుతున్నా - గున్నలవలె, పెరిగి, స్వేచ్ఛగా ఆ బలాన్నంతా యేం చేసుకోవాలో తెలీక బాధపడుతున్నట్టు నడిచే కన్యల్ని చూసేటప్పటికి, అవ్యాజంగా అంతరాళంలోంచి చేతులు కాళ్లమీద వెయ్యాలని కోర్కె గలుగుతుంది; నున్నటి చలువరాతిమీద మెత్తని మొహమల్ పరిస్తే దాన్ని తాకాలని పించేటట్లే, చక్కగా మాలిష్ చేసిన, మంచి జాతి గుర్రం మెడమీద కొట్టాలనిపించినట్లే, హంసవన్నె పావురాల వీపుమీద దువ్వాలనిపించినట్లే... మొహాలు అందంగా వుండకపోవచ్చు, నగలేం లేకపోవచ్చు - సన్నని తెల్లని వుప్పాడ చీరెలూ, పరజాల వంటి బనారసు చీరెలూ కట్టకపోవచ్చు; జుట్టు దువ్వకపోవచ్చు; కానీ మెడ దగ్గర్నించి పాదం వరకు ఆ కనుచూపుని జార్చే ఆ వంపులే చాలు; నడిచేటప్పటికి ఆ నడుము క్రింద మార్పులే చాలు; తెల్లగా లేకపోతేనేం! ఆ వొంటిమీద శుభ్రమైన మెరుగే చాలు; పనిచేసి వొళ్లు కొంచెం మోటైతేనేం? పాదాలు కాయలు కాసి పగిలి వుంటేనేం? ఇంకో విశేషం, మొగవాణ్ణి చూడగానే పరొగెత్తి దాక్కోరు, తలుపులోంచి తొంగి చూడరు, పలకరిస్తే సిగ్గుపడుతూ వినబడీ వినబడకుండా సణుక్కోరు, మాటాడిస్తే యేం తప్పో యెవరే మంటారోనని, మనమూ భయపడక్కర్లేదు. దానిమ్మపండు పగిలినట్టు గుండ్రని బుగ్గలు తెరిచి, తెల్లని పళ్ళు కనబరుస్తో, నిమిషానికి నిష్కారణంగా పదిసార్లు నవ్వుతారు. నిన్ను చూసే అనుకోవచ్చు; కానీ అది వూరికే వారిలో ప్రవహిస్తున్న సృష్టి ఆనందమనుకుంటా. ఈ కాంతిలో, ఈ గాలిలో యింత ఆరోగ్యంగా బతికి వున్నామనే వుత్సాహమనుకుంటా అవుదూడ చూడు, మెల్లిగా

నడుస్తో యిటుచూసి చంగున వుత్సాహంతో తోకెత్తి గంతేసి చిక్కకుండా యేడిపిస్తుంది వాళ్ళ నవ్వుకీ, కళ్లలోని వెలుగుకీ అదే తార్కాణం ఆ కళ్లలోని విచిత్రమైన చంచలత్వం, సూర్యాస్తమయ తీక్షణం వల్లనో, విశాలవక్షపు సౌందర్యభారం వల్లనో నిర్ణయించుకోవడం కష్టం వంట వాసనల్లో, పిల్లల యేడుపుల్లో నగల కోసం మర్యాదల కోసం పడే తగాదాలలో, సిరద్దారు తిట్లల్లో, పార్టీల లంచాలలో, చచ్చిన నా రసికభావం అంతా ఒక్కసారిగా, మొదటి సాయంత్రమే తీవ్రంగా మేలుకుంది పిండివంటలు తింటే కలిగే వుత్త సాధారణ కామమనుకోకు. యేదో గదిలో రహస్యంగా ఒక్కదాన్ని లంకించుకుని తొరతొరగా నాలుగు నిమిషాల్లో తృప్తిపడి అయిపోయిం తరువాత దాని మొహం చూడలేనంత అసహ్యపడి, తలుపుతీసి, యెవరూ లేకుండా యిటూ అటూ చూసి యెవరిదోవన వారు తప్పించుకొని పోవడం కాదు చెప్పనా? నా హృదయంలోని, ఆనాటి వాంఛ, చెప్పగలనా! చెరువులో కలువలు చప్పుడు కాకుండా విచ్చేటప్పుడ, వుదయించే చంద్రుడి కిరణాలు ఆ వొడ్డునించి తరగల్లో తేలి, ఈ వొడ్డుకు ఈదేప్పుడు, ఆలస్యమైన ఆవుని పిలిచే గొల్లదాని కేక మా చెవులకి తగిలే వేళ, ముడిలో యిమడక చల్లగాలిలో కదిలే జుట్టు మెడకి చక్కిలిగింతలు పెడుతోవుండగా, గుండ్రని బలువైన రొమ్ముని నాకు పక్కగా ఆనించి, చిరునవ్వుతో సగం మూసిన కళ్లతో నా వంక చూస్తో కూచోవాలి నా ప్రణయ ప్రేయసి -

యిట్లాంటి కోర్కె అక్కడ సహజంగా కలుగుతుంది జీవమున్న ప్రతి మానవుడికీ. దాన్ని ఎంత ప్రయత్నించినా అణుచుకోలేక పోయినాను. నాకు మర్యాదలంటే చాలా యిష్టం, అల్లరీ అపవాదూ చాలా అసహ్యం; స్వభావం పిరికి; అవును! మనవూళ్ళో యిట్లాంటి వూహలు కలిగేవే కావు ఏదో పనిచేసుకోవడం, పడుకోవడం, భోజనంతోపాటు ఆ మొక్కు తీర్చుకోడం, తోటి గుమస్తాలతో తిరగడం, సంతృప్తిగానే వుండేది డబ్బు బాధ తప్ప యింకో బాధ యెరగను కానీ ఆ గాలిలో అట్లాంటి సుందరమైన ఆలోచనల్ని అణుచుకోవడం నా తరం కాలేదు. నా తరమే కాదు, నన్ను పుట్టించిన ఈశ్వరుడితరం కాదు. ఈ భార్యాభర్తల యధావిధీ, అభ్యాసపూర్వకమైన నీతిని ఏర్పరచిన దౌర్భాగ్యుల తరం కాదు.

కోనసీమ చూశారుకాదూ! ఈవేపు కాలవా, ఆవేపు యింద్రసభ వంటి తోటా, మధ్య రోడ్డూ, ఆ వుదయం మంచుబొట్లతో సింగారించుకున్న తోట అందాన్ని కొత్త సూర్యుడు యేటినీళ్లకు చూపించి నవ్వుతున్నాడు. గలగలమని తూములోంచి పడే నీళ్లని పోలిన నవ్వు నా హృదయంలోంచి దూసుకుపోయింది. ఎవరితోనో ఒక్కొక్కమాటఅనడమూ, గుక్క తిప్పలేకుండా నవ్వడం, అట్లానే రోడ్డమధ్య నుంచుని విన్నాను కొంచెం సేపట్లో పాట మొదలుపెట్టింది. ఒక ముక్క పాడడం, ఆవుకోలేక, ఆపుకోలేక నవ్వడం; ఆమె ఎన్నడన్నా విచారమనేది ఎరుగునా? ఏ విచారం ఆమెకి జీవితంలో కలిగినా ఈ ఆనంద ప్రవాహంలో తృణాగ్నివలె ఆరిపోదా అనిపించింది. ఆ ఉదయ కాంతిలో, నూతన పుష్పాల్లో, నీళ్ల నిర్మలత్వంలో, పక్షుల ప్రేమగానాల్లో ఆ నవ్వూ సహజంగా కలిసిపోయింది. ఆ నవ్వుతో గాలీ, పువ్వులూ, కొబ్బరిచెట్లూ వూగినట్లయింది పదిహేను నిమిషాల తర్వాతగావును, ఒక ముసలి సాహెబుతో నవ్వుతో మాట్లాడుతో పాడుతో తోట చెట్లలోనించి నడిచి వొచ్చి నాకు కనబడ్డది. ఆమెకి యిర్వై యేళ్లు దాటి వుంటాయి ఎర్రని చీర కట్టింది. తోటకీ రోడ్డుకీ మధ్యవున్న కాలవ దగ్గరికి వొచ్చి, దాటడానికి తొడలపైకి చీరనెత్తి దిగింది. నేను చూస్తున్నానన్న లక్ష్యమే ఆమెకి లేనట్టుంది. అటువంటి శరీరచ్ఛాయని నేనెక్కడా చూడలేదు. ఆమె రవికె వేసుకోలేదు. చీర పమిట వృక్షాన్ని కప్పుతోంది ఆమె వొంటిరంగును చూడగానే నక్షత్రపు కాంతితో మెరిసే నల్లని అమావాస్య నాటి ఆకాశపు నల్లని తేజస్సు స్ఫురించి తీరుతుంది ఆ ప్రకాశం ముందు మంచువలె తెల్లనైనదనీ, బంగారు

వలె పచ్చనైనదనీ, మనము చదివిన వర్ణనలు హేళనగా తోస్తాయి  చిన్న దుమ్ముపలుకు మీద పడినా ఆ బలిసి నిగనిగలాడే నునుపు మీద పడి జారిపోతుంది  ఎండ ఆమె భుజంమీద పడి ప్రతిఫలించి జారి యిటూ అటూ తిరిగి వొదలక అల్లరి చేస్తోంది. ఆ బుజాల వంపులు వున్నాయి, మహాప్రభూ! గుండ్రంగా నున్నగా తలుచుకుంటే మనసంతా వాంఛతో వుడికిపోతుంది  చేతులు తిమ్మెర్లు యెత్తి లాక్కుపోతాయి  ఆమె తొడల ముందువేపు నల్లగా వున్నాయి. కాని లోపలికి తిరిగిన కొద్దీ ఆ నలుపు మెరుగెక్కువై, నేవళ మధికమై ఆ నునుపుమీద చూపు నిలవలేక ధగధగలాడే తెలుపేమో అనిపిస్తుంది

యింటి గుమ్మంలోకి వచ్చేటప్పటికి పెద్ద కడుపూ, సన్నని చేతులూ, మెడా, దించుకుపోయిన దవడలతో, నా భార్య ''ప్రొద్దున్నే ఎక్కడికెళ్లారు?'' అని -

అడగడం వినిపించుకోక, వెంట వచ్చి యింకా నాకు కనబడుతోనే వుంటుందేమోననే భయంతో లోపలికి పరిగెత్తాను. నా భార్య అందమైన స్త్రీలలో లెక్క మన వూళ్లో. కళాశాస్త్ర ప్రకారం, కుల ధర్మ శాస్త్ర ప్రకారం అన్ని లక్షణాలూ వున్నాయి  ఆ కడుపు లేనప్పుడు అందమైన ఆ పిడికెడు నడుమే. కాని అన్నీ పిడికెడే అయితే యెట్లా భరించడం? మళ్లీ ఈ నా భార్య పతివ్రతా తిలకం. ఆ మనిషిని చూస్తే వుమ్మి వేస్తుంది, అనుకుంటా  ఆమె కోసం నా భార్యను ఆ రాత్రే గొంతు పిసకడం అవసరమైతే ఆ పని చేసేవాణ్ణే  అంత పిచ్చెక్కింది  ''నీ జీవితంలో గవర్నరయ్యే జాతకం వుంది దాన్ని ఈ అమ్మాయి కోసం వొదులుకుంటావా?'' అంటే వెంటనే సంతకం చేసేవాణ్ణే.

ఇంట్లో కాలు నిలవక మళ్లీ మధ్యాహ్నమే బైలుదేరాను, కాని వాన అడ్డం వచ్చింది. వాన పోయి యెండకాసిన సాయంత్రాలెంత అందంగా వుంటాయి  రోషంతో యేడ్చి నవ్విన స్త్రీల ముఖాలవలె! రోడ్లమీద నీళ్లు మడుగులు కట్టాయి. చెట్లూ, పిట్టలూ నీటి చుక్కల్ని విదిలించుకుంటున్నాయి. సంతోషంగా గాలి అన్నిచోట్లకీ అతివేగంతో పరుగెత్తుతోంది, ప్రైవేటు టీచరునుంచి తప్పించుకున్న కుర్రవాడులాగ, ఆమెని మళ్లా చూడాలనే కోర్కె తీవ్రమయింది  ఆమె స్నేహమే లభిస్తే, ఇంకేం కావాలి నాకు జీవితంలో? నా చెయ్యిని ఆ నున్నతనంమీద, ఆ గుండ్రనితనంమీద, ఆ మెరుగుమీద, రాయగలిగితే! నా తలపులు వంకర పోయినాయి  నా వేళ్లు ఆమెతో మధ్యాహ్నం కొబ్బరి చెట్ల కదిలే నీడల క్రింద, ప్రవహించే చల్లని నీళ్ల వొడ్డున గడ్డిమీద, నీళ్లతో బలువైన గాలి ఆమె పైట చెరగును కదలిస్తోవుండగా, నాకై ప్రేమతో నిండిన ఆమె కళ్ళ పక్క చూపులతో పరవశుణ్ణయి -- యింక ఆ అనుభవం తరవాత యెన్నాళ్లు గుమస్తా పని చేస్తేనేం? శిరద్దారు తిడుతోవుంటే -

''నిర్భాగ్యుడా, జీవితం అంటే, రసమంటే, ఆనందమంటే నువ్వేం యెరుగుదువు?'' అని నా మనసులో నేను గర్వపడవచ్చు కదా?

మళ్లీ ఆ తోట కెదురుగా నుంచున్నాను  చడీ చప్పుడూ లేదు. అరగంటైన తర్వాత నా గజయాన యెక్కణ్ణించో వొస్తోంది రోడ్డుమీద నించి  పల్లెటూరువాళ్లతో మాట్లాడ్డం యెంతసేపు! యేం మాట్లాడితేనేం స్నేహమయింది. చిన్న మాటలు చిన్న నవ్వులైనాయి.

''ఇక్కడంతా బురద, తడి అట్లా నుంచోండి'' అని, వాళ్ల తోట పక్కనవున్న ఫ్యాక్టరీ వరండామీదికి తీసుకువెళ్లింది  అక్కడ నుంచుని మాట్లాడాము ఏమిటో అక్కర్లేనివన్నీ  కొమ్మమీద కూచుని సల్లాపాలాడుకునే చిలకల మాటలకి అర్థముండాలా! అంత దగ్గిరగా నుంచోటమే చాలు. ఆ మొహంలోని ఆలోచన చూస్తేనే చాలు. వుండుండి నా వంక కొంచెంగా కళ్ళెత్తి చూడటం, గోడపక్కనించి వొంగి రోడ్డుకేసి భయంతో చూడటమూ, బుజంనించి కిందికి జారిన పమిటెని సర్దుకోడం, ఇవి చాలవూ!

''రోడ్డుమీద వెళ్ళే వాళ్ళందరూ మనని చూసి యేమనుకుంటున్నారో? ప్రజల నాలికలు మంచివి కావు. ఇట్లా రండి'' అని గోడ పక్కగా నన్నూ నుంచోపెట్టింది.

''మొదట మీరు టపా సాయేబనుకున్నా, అతను తరచూ ఇట్లా వెడుతోవుంటాడు లెండి, బ్రహ్మలా. '' అని కలకలమని నవ్వింది. ఆ నవ్వు నా హృదయంలో ప్రవేశించి ఆ సాహేబు విషయమై నేను పడుతున్న ఈర్ష్యావస్థని మింగి విజృంభించి నన్ను వశపరుచుకుంది. యేం చెయ్యను? ఆ నవ్వు నెట్లా నాదిగా చేసుకోడం! ఆ నవ్వే పెదవుల్ని ముద్దుపెట్టుకున్నా, వొణికే కంఠాన్ని చేత్తో స్పృశించినా, ఆ వూగే హృదయాన్ని అదుముకున్నా, తృప్తి కలుగుతుందా? కాని మధ్య సాహేబు ఒకడు వచ్చాడు కద! వాణ్ణి చిత్రవధ చేసి చీల్చి, కాల్చి, నలిపి....

''ఎందుకండీ నాతో యింతసేపు మాట్లాడుతున్నారు, మీ పనులన్నీ చెరుపుకుని?''

''నీమీద సరదా గనక!''

''నామీద ఏం సరదాండి! బీదవాళ్లం. మంచి బట్టలా, నగలా చూడండి. ఈ నల్లదనం, ఈ మోటు తనం!''

నా దగ్గిరగా చేతులు జాచింది. వాటిని అక్కడే గట్టిగా పట్టుకుని తాకి రాసి నా చేతుల్ని వాటిమీద నున్నగా జార్చి. . ''ఇప్పుడే కదులు, తాకు'' అనిపించింది గాని... యేమంటుందో! అట్లనే అనేకసార్లు ఆ పది నిమిషాల్లో ఆశ గలిగింది మళ్లీ భయపడి వూరుకున్నాను.

ఆ ఆశతో తల తిరిగి నేను తాకినట్లే అయ్యేది నా మనసు. ''అంతే యిట్లా ఆలోచిస్తోనే వుంటావు. యెవరో వస్తారు! కాలం అయిపోతుంది ఏం భయంలేదు ధైర్యం చెయ్యి'' అంటోంది హృదయం. కాని సాహసం కలగలేదు. రోడ్డుమీద వాళ్లు వొస్తే ఎట్లా? ఇందాక తలుచుకున్న తోటా, నీళ్ల జ్ఞాపకం వచ్చి -

''అది మీ తోటేనా?'' అన్నాను.

''తోట చూస్తారా! రండి'' అని -

నన్ను సంతోషంతో వెంటబెట్టుకుని ముందు నడిచింది. నడుస్తోవుంటే ఆ పిరుదులు కదలడం, ఆ పక్క వొంపుల నున్నదనం, యేం చెయ్యను? యింతకాలం యెక్కడ బతికాను నేను? అనిపించింది.

''గండుచీమలు, యిట్లారండి''

చప్పున నన్ను పక్కకు లాగింది. కావలిసేనా?

యిద్దరం దట్టమైన మందారమొక్క వెనక నుంచున్నాము. రెండు పువ్వులు కోసి తలలో పెట్టుకుంది. తలలో వేళ్లు పెట్టుకోవడానికి చేతులెత్తితే సాగిన ఆ కండరాల వుబుకు, ఆ గట్టితనం! యింక అన్ని అనుమానాలూ, భయాలూ యెగిరిపోయినాయి. ఆమె చేతులు వంచగానే రెండు చేతులతో ఆమె రెండు జబ్బలూ గట్టిగా పట్టుకున్నాను. వాటి గట్టిమాంసం నా వేళ్లకి యెదురుతిరిగింది. యెంత గట్టిగా వొత్తినా వెచ్చగా, నున్నగా, గట్టిగా... నువ్వెప్పుడన్నా అనుభవించావో లేదో ఆ సౌఖ్యం! ఈ పాయికాడి భార్యలందరూ చేతుల్లో యెక్కడో అణిగి, వొంగి నలిగిపోతారు. గాఢమైన మొహంతో గట్టిగా కావిలించుకోగానే, ''ఉస్, కస్, అబ్బా నొప్పి, అబ్బా అక్కడ వొద్దు, అబ్బా వొదలండి'' అని

వొదలగానే వెధవ వెకిలి నవ్వుతో చచ్చు సిగ్గు ప్రయత్నించి కుళ్లు మాటలతో ''మరీని! వూరిఖే! ఏమిటా మోట సరసం! అబ్బా, ఎహ'' అంటే -

నీ ప్రాణ మెట్లావుంటుందో ఆలోచించుకో గట్టిగా, గర్వంగా, బలంగా, చేవగా -

యేం చెప్పను! యెంత చెపితే అర్థమౌతుంది? ఆ ఐదు నిమిషాలు ఎట్లా వున్నానో! ఏమైనానో! ఆమె వొదిలించుకోవాలని పెనుగులాడిన కొద్దీ నేనాక్రమించుకున్నాను చేతులు జారిపోతున్నాయి నా బలం యెందుకూ కొరగాకుండా పోతోంది ఆమె వొంటినుంచి సహజమైన నైసర్గికమైన వాసన నా తల తిప్పేసింది ఆ నిమిషాలకు బదులు నిరంతర జీవనం, దేవత్వం యిచ్చినా నాకు వొద్దు మనం కొని భద్రంగా వాడే ఆ సాహేబుల బుడ్లలోని ఆ కుళ్ళు అత్తరు నూనె లెందుకు? భద్రంగా ఆకులో చుట్టి పొడుం పొట్లంతోపాటు జేబులో పడేసుకుని, బజారునించి అరగంట బేరం చేసి, అర్ధణాకు కొని తెచ్చుకునే చెన్నపట్నపు రైలు కంపు దవనం వాసన యెందుకు? గజకుంభాల్లోని మదపు వాసనా, బలిసి శుభ్రమైన ఆవుల్నించి వొచ్చే వుత్తమ గోరోజన పరిమళమూ, వాన కురిసినప్పుడు పచ్చని గడ్డిలోంచి పన్నీరు పువ్వుల్లోంచి కొత్తగా తవ్విన మటిట పెళ్లల్లోంచి వొచ్చే సౌరభం, కస్తూరి మృగపు అద్వితీయ గంధం, అన్నీ తలపునకు వొచ్చాయి నాకు, ఆమె సన్నిహితంలో ఆమె నన్ను తోసేసి తప్పించుకుని, కోపం తెచ్చుకుని -

''నన్ను తాకకండి'' అని నుంచుంది నా మొహంలో ఆశ్చర్యాన్నీ నిరాశనీ చూసిందేమో! ఒక్క అడుగు వెనక్కివేసి, అటు తిరిగి నవ్వుతో కొట్టు దగ్గరికి పరుగెత్తింది. చిన్న ఆవు పెయ్యి పరుగును పోలిన ఆ అందమైన వేగాన్ని చూస్తో వెనకనే వెళ్లాను. దగ్గిరగా రానిచ్చి నన్ను అనుకున్నట్టుగా వొంగి

''నేను అట్లాంటి మనిషిని కాదండీ''

అని గోముగా అంది. మళ్లీ నవ్వింది విచిత్రంగా. నేను నుంచున్నాను. నా తల తిరుగుతోంది. కళ్లు మూతలు పడుతున్నాయి. లోకం మీది నిర్లక్ష్యం ఎక్కువవుతోంది. ఆమె కళ్లు నన్ను చూసి నవ్వుతున్నాయి. ఆ దేహమే పెద్ద నవ్వు -

''ఈ గదుల్లోనుండి .. రాత్రైతే సరి. యిద్దరిద్దరు (నవ్వుతో) పో . తారు . ఛీ ఛీ. . వీళ్లకి సిగ్గు ... అభిమానం . యేమీ లేవు.''

నాకు ఒకటే ఆశ్చర్యంగా వుంది యెవరీ వ్యక్తి? ఇది అంతా కపటమా, అమాయకమా?

''మీ వంటివారు నన్నూ అట్లంటిదాన్నే అనుకుంటారు. నేను యెన్నడూ ఎరగను. మర్యాదస్తుల మండి. మీతో యిట్లా మాట్లాడగానే చులకనై నట్టున్నాను. అదుగో మళ్లీ యేం? చేతులూరుకోవూ? ఎవరనుకున్నావు? అక్కడే ఆగండి. చెపుతూ వుంటే! తెలీటంలా?''

నా కళ్లలో నిరాశో దిగులో ఏదో చూసింది గావును ఆమెని వొదిలి ఏమి చెయ్యడానికీ తోచక దూరంగా నుంచున్న నా వెర్రి తనాన్ని చూసి దగ్గిరగా వచ్చి తనకేం తెలీనట్టు ఎక్కడో చూస్తో తన గట్టి రొమ్ము పక్కగా నా భుజానికి నల్లని మెరిసే చేతిని నా తెల్ల షర్టుమీద నించి అడ్డంగా జేబు దగ్గరికి పోనిచ్చి మోకాలుతో నా కాలుని అదిమి -

''రాత్రికి బియ్యానికి ఏం లేదు యీమన్నాయిస్తే...'' అంది. నా ప్రాణం చివుక్కుమని మొహం తిప్పేశాను.

ఆ స్వప్నమంతా ఆ వొక్కమాటతో మట్టిపాలయింది. ఎంత 'రొమాన్సు' ఎంత సృష్టి సౌందర్యాన్ని, భావించుకున్నానో అంత నీచత్వమూ నా మనసు విరిచింది. ఇంత సౌందర్యమూ, యిట్లాంటి పనుల్లో ఉపయోగపడుతోందా - అనుకున్నానుగానీ, ఆమె మొహం చూస్తే మాత్రం, మనుష్యుల రక్తం పీల్చి

కొవ్వొక్కి నగలలోను, మేడల్లోను, తృప్తిబడే పట్టణపు పిశాచుల రక్తమేనని విశ్వసించలేకపోయినాను. ఇంత నా మనసు చివుక్కుమన్నా ఆమెని వొదిలి వెళ్లాలని బుద్ధి పుట్టడం లేదు. నిజంగానే రాత్రి భోజనానికి డబ్బు అవసరమేమో పాపం! అని అనుకుంటో వుండగానే, రోడ్డుమీదనించి ముసలామె వచ్చి మా యిద్దర్నీ చూసింది.

''ఏమిటే చేస్తున్నావిక్కడ? ఈయనెవరు?''

ఇదేమిటి? తనని బలవంతం చేస్తున్నానని చెప్తుతుందా? నన్ను వెక్కిరించి నవ్వుతుందా? అక్కడికి యెందుకు వెళ్లానా, అనుకొని భయపడుతున్నాను. పొట్లాటా, ఆమె భర్తా, గుంపూ మా అత్తవారి దాకా తెలీడం, మాదిగదాన్ని - నాకు వొణుకు పుట్టింది.

''ఏం లేదు, తోట చూస్తానన్నారు'' అంది.

ముసలిది కోపంతో -

''మొగాళ్ళతో నీకేం పని? పద ముందు; తోటలు చూస్తాట్ట!''

అమ్మాయి సంశయిస్తోనుంచుంది.

''నడుస్తావా? మీ అయ్యతో చెప్పి వీపు చీల్పించనా?''

''కోప్పడకమ్మా? ఈయన అట్లాంటి మనిషి కాడు''

ఆ మాటతో ఏమనుకుందో, ఏ మర్ధమయిందో, ఆ ముసిలిది తగ్గి నడవడం మొదలుపెట్టింది.

''పెద్ద మనుషులు, కనపట్టం లేదూ? అన్యాయంగా ఆగ్రహిస్తున్నావు'' అంది మళ్ళీ.

''సరేలే. కానీ యింట్లో బియ్యం లేవు పోయి సంపాయించుకురా. పెద్దమనిషితో మాట్లాడుతుంటే కడుపు నిండుతుందా? పెద్దమనుషులు! అందరూ పెద్దమనుషులే!''

అనుకుంటో వెళ్లింది.

''మా అమ్మ''

''నిజంగా మీకు తిండి లేదా? ఈ తోటా...''

''మక్తా. అంతా నష్టమేనండి ఈ యేడు...''

జేబులోంచి ఐదు రూపాయల నోటు తీసి ఇచ్చాను.

''ఇట్టా లోపలికి రండి''

''నేను వెడతాను''

''ఇప్పుడు రారా? ఎప్పుడొస్తారు?''

''నేను రాను''

''ఏం?''

''ఎందుకు! నాకేం పనిలేదు''

''ఈవేళ పనివుండే వచ్చారా?''

నాకు కొపం హెచ్చుతోంది.

''నువ్విట్లాంటి దానివనుకోలేదు''

''ఎట్టాంటిదాన్ని?''

''సామ్ముకు గడ్డి తినేదానివి''

పెదిమ కొరుక్కుని, కళ్ళు తళతళమంటో నాకేసి చూసి తలవొంచుకుంది అంతా నిశ్శబ్దం

''ఐతే సొమ్మెందుకిచ్చారు?'' కంఠం వొణుకుతోంది

''మీకు తిండి లేదుగా!''

మాట్లాడకండా నుంచుంది వొంచుకుని వున్న కళ్లల్లోంచి రెండు చుక్కలు పమిట యెత్తు మీద పడి చిందాయి. కోకిల వూరికే ఆత్రుతతో కూస్తోంది. నీళ్లతో నిండిన గాలి వీచింది సూర్యుడి చివర కాంతి యెర్రగా ఆమె చేతులమీద పడుతోంది. ఆమె తల్లో పువ్వు చుట్టూ జుట్టు వుంగరాలు మూగాయి మళ్లీ ఆమె అందం, ఆమె మొహం, నన్నాకర్షిస్తున్నాయి ఆ విచారాన్ని నేనొట్టేసేపు 'రెసిస్టు' చెయ్యలేను అప్రయత్నంగా నా పెదవులు ఆమె కళ్లను వోదారుస్తున్నాయి. ఆమె హృదయాన్ని జయించానని ఆశపడుతూ వుండగా, నన్ను డబ్బుడిగిందే, అనే అహంభావానికి కలిగిన గాయం నన్ను అమితంగా బాధపెడుతోంది వెళ్ళేట్టు కదిలాను.

''సరే వెడుదురుగాని, ఒక్కసారి ఇట్టారండి. మీతో ఒక్కమాట చెప్పాలి''

''ఇక్కడ చెప్పరాదూ?''

''కాదు రండి''

''ఇక్కడ చెపుదూ?''

వూరుకుంది.

''భయమా!'' అంది. ఆ కంఠంలో ''ఛాలెంజి'' నేను గ్రహించలేకపోయాను

''సరే, పద''

తలుపుతీసి గదిలోకి వెళ్లి, గడియ వేసింది ఎవరు వొస్తారో, తలుపు తడతారో అని నాకు సిగ్గేసింది కానీ పైకేమీ కనపరచ దలుచుకోలేదు ఆ గదిలో మూల మంచమూ, దానిమీద జంపకానా, మురికి తలగడా, మూల పెద్దకుండా, కిందంతా బీడీ పీకలూ వున్నాయి.

''ఏమిటి?''

చిరునవ్వుతో, నా దగ్గిరగా వస్తో, పమిటని చమత్కారంగా దానంతట దాన్నే జారనిచ్చి, నా చేతిని పట్టుకుని తన రొమ్ముమీద ఆనించుకుంది. ఆ గదీ, ఆ పక్కా, ఎవడో కాల్చివేసిన ఆ బీడీ పీకలూ, అడ్డపడ్డాయిగాని, లేకపోతే లోహం వలె నిగనిగ మెరిసే, ఆ వెచ్చని గట్టి వక్షంమీదనించి నా చెయ్యి తిరిగి వొచ్చునా? గర్వంగా పైకి తిరిగి, కొవ్వెక్కి వున్న ఆ సౌందర్యాన్ని చూడనా? ఆ చుట్టుపక్కల తీరైన గుండ్రని వొంపుతో కలకలలాడే ఆ మెడనీ, పొట్టనీ, చేతుల్నీ చూడనా? ఆ దృశ్యంతో నా జన్మానికి కావలసిన సౌందర్యమంతా పొందాననిపించింది.

''వొద్దు'' అన్నాను కష్టంతో చెయ్యితీసేసి.

''మీరెందుకు నన్ను తాకారు యిందాకా!'' అని కళ్ళతో పోట్లాడింది, వెక్కిరించింది, సవాలు చేసింది.

''నీకు డబ్బు దొరికిందిగా! ఇంక నాతోనేం పని?''

''అంత నీచురాల్ని కాదు''

మళ్లీ కన్నీళ్ళు కళ్లల్లో నిండాయి ఆ పెదవి లోపలికి పోతోంది ఏం చెయ్యను? ఇంక నా మనసు స్వాధీనం తప్పుతోంది. వెళ్ళబోయినాను చెయ్యి జాచి నా నోటు నా చేతులో పెట్టి మూసింది చెయ్యి జాచినప్పటి భుజం దగ్గరి గొప్పతనం నా కాళ్లనీ, కళ్లనీ ఆపింది

''మరి రాత్రి భోజనం?''

కళ్ళతో కాల్చేట్టు నా వంక చూసింది

''నామీద కోపమా?''

మా వంటి నీచులకి కోపం వొస్తే నేం లెఖ్క!''

''అదుగో కోపం!''

''నాకేం కోపం లేదు వెళ్లండి''

''ఈ నోటు తీసుకో''

''డబ్బు వుచితంగా తీసుకునే గతికి రాలేదు''

''అట్లా తీసుకోవడం కంటే అన్యాయమా?''

కొంచెం వూరుకుంది.

''నీ స్నేహితుణ్ణి, నీకు యిస్తున్నాను. బహుమతి యిస్తున్నాను. పాపం నువ్వు పస్తు పడుకున్నావనే దిగులుతో - తీసుకో''

అని ప్రేమతో ఆమె చెంపమీద చెయ్యేసి, ముఖం పైకెత్తి చూశాను. ఆమె చప్పున రెండు చేతులూ మొహం మీద పెట్టుకుని యేడ్చింది. ఆ తుపాను వొస్తుందని ఎదురుచూస్తోనే వున్నాను ప్రతి కన్నీటి చుక్కనీ, తడి అవుతున్న కనురెప్పల్ని ముద్దులతో తుడిచి, పక్కన కూచుని అడిగాను

''ఎందుకు ఏడుస్తావు?''

చాలాసేపు చెప్పక తిప్పలు పెట్టింది కానీ నాతో యేదో చెప్పాలనే వుద్దేశంతోనే వుందని నాకు తెలుసు.

''నేనా డబ్బడిగింది నా కోసమనుకున్నారా? నా వృత్తి, నా జీవనం అదే, కానీ నా కిష్టమా?. . నన్ను నా మేనత్త కొడుక్కి యిచ్చి పెళ్లి చేశారు. మొదటినుంచీ మా యింట్లో మాకీ తోటవల్ల వచ్చే ఆదాయం కన్నా సుఖంగా బతకడం మామూలు ఇప్పుడాలోచిస్తే ఆ పై ఖర్చు మా అమ్మ సంపాయించేదేమోనని అనుమానం. నాకు బుద్ధి తెలిసినప్పట్నించి మేము అలివిగాని అప్పుల్లో వుండేవాళ్లం, ఎవళ్లెవళ్లో రహస్యాలు మాట్లాడటం, వెళ్లడం, ఏవో కాయితాలూ, తగాదాలూ, జరుగుతోనే వుండేవి. ఒకరోజు రాత్రి నాతో ఏం చెప్పకుండానే అమ్మ నన్ను వెంకయ్యకి వప్పచెప్పింది. వెంకయ్య మా కులం వాడే అదేదో దేశంలో లేసుల వర్తకం చేసి డబ్బు సంపాయించాడు. అతనికి మేము ఏడువందలు బాకీ. నేను నిద్రపోతుండగా వొచ్చి పట్టుకున్నాడు. చప్పున లేచి అరిచాను. కాని నాన్ననిగూడా తీసుకుని అమ్మ యెక్కడికో వెళ్లింది అమ్మ చెప్పిన మాటకి యెదురాడటం నాన్న కెన్నడూ లేదు

నా కట్లాంటిది కొత్త అప్పుడు ఏమీ అర్థంగాక వాణ్ణి తోసి ఈ తోటంతా పరిగెత్తాను . వాడు వెనకా నేను ముందూ ఆ వెన్నెట్లో ఈ చెట్లల్లో యెట్లా పరిగెత్తానని! అదే చీకటైతే వాడికి దొరికేదాన్నా! చివరికి ఆ పుల్లరేగి పొద వెనుక మగరుస్తున్న నన్ను పట్టుకుని కిందపడేశాడు అప్పటికి నా వూపిరి చివరవరకు పోట్లాడాను ఇంక శక్తిలేక అతనికేసి చూసోకాళ్ళూ చేతులూ వేళ్లాడేసి పడుకున్నాను

ఏమనుకున్నాడో యేమో నా తలని కిందనేసి బాది మీద వుమ్మేసి, అమ్మనీ, నాన్నని తిడుతో బెదిరిస్తో వెళ్లిపోయినాడు. కదిలే శక్తిలేక అక్కడే పడివున్నాను, బట్టన్నా సరిగా వొంటిమీద లేకుండా. అరగంటలో అమ్మ వచ్చి నన్ను కొట్టడం ప్రారంభించింది వాడికి లోబడ్డందుకనుకుని, వాడు నన్నేం చెయ్య లేదని అరిచాను. ఆ మాట అనేటప్పటికల్లా మరీ కొట్టింది ''ఆ ఐదువందలూ ఎవరు తీరుస్తారు. నీ మొగుడొచ్చి రక్షిస్తాడా'' అని మళ్లీ కొట్టింది ఏం రాత్రి అబ్బా అది మర్నాడు రాత్రి వాడు వొచ్చాడు. నన్ను తాకితే చంపుతానన్నాను. అమ్మ నన్ను యింట్లోంచి వెళ్లగొట్టింది నా మొగుడు రంగూను వెళ్లాడు, కనుక నాకు దిక్కులేదు

అప్పుడే ఈ ఫ్యాక్టరీ కడుతున్నారు కూలీకి కుదిరాను ఒకనాడు ఆ మేస్త్రీ చిల్లర లేదని కూలీ ఇవ్వడం ఆలస్యం చేసి చీకటి పడ్డదాకా వుంచాడు నాకు భయమేసింది, వెళ్లాలనిపించింది, కానీ ఈ డబ్బులు తీసుకువెళ్లకపోతే తిండి లేదు. నన్ను మొండి గోడల మధ్య పట్టుకున్నాడు వాడి నెత్తిమీద రాయి విసిరిగొట్టి పరిగెత్తాను. వాడికి దెబ్బ తగిలిందో, చచ్చాడో అని రాత్రంతా పోలీసు వాళ్ళు వస్తారనే భయపడుతోనే వున్నాను ఆ రాత్రి తిండి లేదు. భయం, ఎక్కడెక్కడో తిరిగాను. మర్నాడు చెట్టుకింద పడుకుని వుంటే నాకు తెలిసినదొకత్తె వడ్లమరలోకి పనికి తీసికెళ్లింది వెళ్లిన రోజునుంచి, ఆ మరాయన బ్రాహ్మడు నన్నోగాదిగా చూడటం, నన్ను వృధాగా పలకరించడమూ, చూసి యెంతో భయమేసింది ఇంక ఈ మొగాళ్లనించి తప్పించుకోలేనా? ఈ అందం నాకెక్కడ దాపరించింది? బైటికి వెడితే మొగాళ్ళు నా వంక తేరిబార జూడటమే. ఇదివరకు నాకా చూపుల అర్థం తెలీలేదు. తురకాళ్ళు వాళ్ల ఆడవాళ్లకి బురకాలెందుకు వేస్తారో అప్పుడర్థమయింది నాకు. కొందరి చూపులు, తాకడం కంటే కూడా, ఇంకేమో చెయ్యడం కన్నా కూడా అసహ్యంగా, దుర్భరంగా వుంటాయి. ఒక్కొక్కరు నా వంక చూస్తే, యెదురుగా వెళ్ళి మొహంమీద వుమ్మేయా లనిపించేది. ఆ మరలో వారానికొకసారిగాని కూలీ ఇవ్వరు. ఆ వారం రోజులూ నన్ను తీసికెళ్ళిన మనిషి దగ్గర బదులు చేసి తిన్నాను ఆఖరు రోజున మర రాత్రి పనిచేస్తున్నది రమ్మన్నాడు. రాత్రులు వీల్లేదన్నాను. రాకపోతే నీ జీతం అసలివ్వను పొమ్మన్నాడు. దీని అప్పెట్లా తీర్చను? భయపడుతూనే వెళ్లాను తక్కిన మనుషులెవరూ రాలేదు. ఆయన వొచ్చి నా చెయ్యి పట్టుకున్నాడు. నేనట్లాంటిదాన్ని కాదన్నాను. నన్ను ఫ్యాక్టరీలోకి లాక్కెడుతున్నాడు. నేను మాలదాన్ని, నువ్వు బ్రాహ్మడివి ఇది తగదన్నా వినలేదు పైగా ఐదు రూపాయలు చేతిలో పెట్టాడు. అరిచినా చుట్టూ ఎవరూ లేరు. వాళ్ల యిల్లొకటే అక్కడ. దీపం తలుపులోంచి కనబడుతోంది. చప్పున చెయ్యి వదిలించుకుని పరిగెత్తాను. ఆయన తల్లీ భార్యా వున్నారు. ఏడుస్తో వాళ్ల కాళ్లముందు పడ్డాను.

''ఛీ. ఛీ. మాలదానివి పొమ్మ''ని లేచారు.

''ఈ మాలదాన్ని పట్టుకునే మీ కొడుకు సంగతేమిటి?'' అన్నాను.

ఆ మహాతల్లి కత్తిపీట విసిరివేసింది. ఆయన ఇంతలో నా కోసం వచ్చాడు. వాళ్ల ముందే వాళ్లిద్దరిముందే, నన్ను పట్టుకోబోయినాడు కత్తిపీట తీసి వాడిమీద విసిరివేశాను ఏమయిందో! పరిగెత్తాను. అర్ధరాత్రి పోలీసులు పట్టుకున్నారు. ఆ బ్రాహ్మడి మొహం తెగిందట. పైగా వెండిగిన్నె యెత్తికెళ్ళానన్నారు. ఆ రాత్రికైదులో మకాం. మర్నాడు ఒక ఇన్‌స్పెక్టరు ప్రశ్నలడిగాడు నేను జరిగింది చెప్పాను. వాళ్ళేదో మాట్లాడుకుని నన్ను మళ్లీ తాళం వేశారు ఆ కైదూ, ఆ పోలీసులూ, నాకు భయంగా వుంది. దిక్కు లేదు, నన్ను చంపుతారో యేమో! ఇంకెన్నడన్నా వొదులుతారో లేదో! ఎప్పుడూ గాలిలో, చెట్లకింద తిరిగే నాకు ఆ కొట్లు యెట్లా వుందని! చావనన్నా చస్తాను కాని ప్రతి

నిమిషమూ వూపిరి బిగపట్టి ప్రాణాలు బిగించే ఆ కొట్టులో కూచోలేను ఆ సాయంత్రం ఇన్స్పెక్టరు కాళ్లమీద పడి యేడ్చాను నన్ను వొదలమని ఆ రాత్రి పోలీసు అతను నా గదికి వచ్చి బలవంతం చేశాడు నన్ను వొదిలిపెట్టడం తన చేతుల్లోనే వుందనీ, వొప్పుకుంటే మర్నాడు పొద్దునే ఇన్స్పెక్టరుతో చెప్పి వొదిలిస్తానన్నాడు ఏమైనా సరే, ఏ పాపం చేసైనా సరే, బైట పడాలనిపించింది. కాని నేనెంత వొప్పించినా సిగ్గు తిరగబడ్డది ఆ రాత్రి నేరం వొప్పుకొమ్మని నన్ను కొట్టారు కదా! బాబూ! మళ్ళీ న్యాయమంటారు, ప్రభుత్వమంటారు, దేవుడంటారు, అబలల్ని రక్షిస్తాడంటారు, దేవుణ్ణి యెన్నిసార్లు పిలిచానో దెబ్బలు తిందో! ఎందరెందర్నో కాపాడాడుకదా! ఎందరో పాపాత్ముల్ని రక్షించినవాడు నన్ను రక్షించలేదేం? ఇంక దేవుడి మాట విని పాపం చెయ్యకుండా నేనెందుకు వుండాలో పోనీ, నేనేమన్నా తప్పు చేస్తే దేవుడికి కోపం రావచ్చు. ఏం చేశానని నాకన్ని కష్టాలు? నా మానం కాపాడుకున్నందుకే కదా, నా కన్ని తిప్పలు? అక్కణ్నించి తప్పించుకోవొచ్చుననే ఆశ కూడా వుంది నాకు లోకంమీద, మనుషులమీద, నా మీదా అసహ్యం పుట్టింది మాట్లాడకుండా పడివున్న నన్ను తన ఇష్టమొచ్చినట్టు చేసిపోయినాడు వెళ్ళేటప్పుడు అతని చెయ్యి పట్టుకుని 'నన్ను మరీ తప్పకుండా వొదులుతావు కద' అన్నాను తల వూగించి పోయాడు ఇంక నా సిగ్గునేం చెప్పను? అతని తరువాత యింకోడు ఎందరో! అట్టానే బిగుసుకుని పడివున్నాను నేను కదలక పోతే 'ఏం మాట్లాడవేం, కదలవేం' అని ఎక్కడెక్కడో గుద్దారు ఆ రాత్రితో నాకున్న అభిమానమూ, ధర్మబుద్ధీ, లోకంలో విశ్వాసమూ పోయినాయి లోకమంతా డబ్బే, డబ్బు కోసమే వుంది. ఎట్లనూ మాబోటివాళ్లం శీలాన్ని కాపాడుకోలేము. ఎట్లనూ పోతున్న శీలాన్ని, దాచుకోవాలని చూసి ఈ బాధలెందుకు, వచ్చే డబ్బుని వదులుకోడమెందుకు? తెలివి తక్కువ ఎంత మోసం చేస్తే అంత సుఖపడతామని రూఢి చేసుకున్నాను మీకేం అదృష్టవంతులు. డబ్బడిగిన మాత్రాన చీదరించుకుంటారు మర్నాడు నా తండ్రికి కబురంపించి నన్ను వప్పగించారు. ఆనాటినించి నన్ను వెంకయ్య వుంచుకున్నాడు. నగలిచ్చాడు, బట్టలిచ్చాడు, తాగించాడు! కడుపునిండా బువ్వపెట్టాడు. అమ్మ దెబ్బలనించి తప్పించాడు. ఇంకో మొగుణ్ణి నావేపు కన్నెత్తకుండా చేశాడు, ఆయన బతికివున్నన్నాళ్ళూ. నా మొగుడు కోపం వస్తే అతని నోరు మూసి మళ్లీ రంగం పంపాడు - ఆయన చచ్చాడు. తరువాత యేం చెయ్యను? నేను రెండు రూపాయలు తీసుకొస్తేనేగాని యిల్లు గడవదు. గొప్ప బతుక్కి అలవాటు పడ్డాము, వెంకయ్య ధర్మాన. సొమ్ము తీసుకొస్తేనేగానీ అమ్మ వూరుకోదు తిరగబడ్డానా మళ్లీ దేశాల పాలు. అక్కడా మొగాళ్లు ఇంతే! ఎక్కడా తప్పదు నా జీవితానికి! ఈ అందమే నాకు శత్రువు. ఈ బతుకు తప్ప నాకు శరణ్యం లేదు. ఇప్పటికీ డబ్బు అడగడం ఎంతో కష్టంగా వుంటుంది. కాని ఏం చెయ్యను? మీరు చెప్పండి



# బంగారమ్మ కమతం

సి. ఎస్. రావు

పెళ్ళైన మరునాటి సాయంత్రానికి, సీతాలుని వెంట తీసుకుని ఊళ్ళోకొచ్చేశాడు భీమయ్య. ఎకాయకీని మాలపల్లిలోకి తీసుకెళ్ళి,గొంతెమ్మ గుడిపక్కనున్న గుడిశల్లోని మూడో గుడిశలోకి తీసికెళ్లాడు సీతాలుని.

''యిదే మన గుడిశ మా బాబు నాకిచ్చి పోనాది'' అన్నాడు భీమయ్య

సీతాలు గుడిశ నలుమూలలకి. పైకప్పు వైపూ చూసింది. చాలాకాలంగా ఎవరూ ఆ గుడిశలో వుంటూన్నట్లు అనిపించలేదు. పైకప్పు అంతా చింపిరి గుడ్డలా వుంది. బూజు అన్ని మూలల్లోనూ నివాసమేర్పరచుకుంది. చుట్టూ వున్న గజమెత్తు మట్టిగోడలు బెల్లులు వూడి గజ్జికుక్కల్లా వున్నాయి. గుడిశ చిన్నదే అయినా ఒకరోజు బాగుచేస్తేనే గానీ వుండటానికి వీల్లేనట్లుంది సీతాలు కంటికి

'నచ్చలేదేటి?' అన్నాడు భీమయ్య

'నచ్చకపోడవేటి? యించక్కా వుంటేను, బూజు, దుమ్ము దులిపి గోడలు మెత్తుకుంటే యించక్కుంటాది అంది సీతాలు భీమయ్య తృప్తి కోసం

ఊరైతే, కొత్త పెళ్లి కూతురొచ్చిందని ఈ పాటికి అమ్మలక్కలు చుట్టూ మూగేవారే. మాలపల్లి కావడంతో ఆడ మగ పనుల్లోకి పోతారు కాబట్టి ఎవరూ రాలేదు సీతాలుని చూడ్డానికి.

'సరేలే. ఆనకొచ్చి సుబ్బరం చేసుకుందారి బేగినడు మా కాపుకి అగుపడి దండపెట్టుకొద్దారి' అని వూళ్లోకి నడిపించాడు సీతాలుని భీమయ్య.

వూళ్ళో కెళ్లాలంటే చెరువుగట్టునే నడిచి రామాలయం దగ్గరనుంచి పెద్ద వీధిలోకి మళ్లాలి. పెద్ద వీధిలో రామాలయానికెదురున్న లోగిళ్ల వరుసలో మొదటి లోగిలే. ఆ వూరికి పెద్దలోగిలి. అది రెండు మండువాల లోగిలి. లోగిలి వీధికి చేర్చే వుంది. రెండు పెద్ద గచ్చురుగులు, అరుగులమీద లావుపాటి స్తంభాలు. సింహం నోరులా రకరకాల నగిషీలతో సింహద్వారం. చూడ్డానికి కెంతో గంభీరంగా హుందాగా వుంది.

'యిదే మా కాపు లోగిలి'

'బాగున్నాది. ఈ యేలప్పుడు కాపింటి కాడుంటడా? పొలవెళ్లడూ?''

'కాపంటే మగకాపనుకున్నావేటి? మా కాపు ఆడకాపు'

'ఆడ కాపా?'' అని సాగతీసింది సీతాలు.

'యేటనుకుంటున్నావేటి? ఆడ కాపా అని సాగదీత్తన్నావ్ బంగారమ్మగోరి కమతవంటే వూరో

మొత్తానికే పెద్ద కమతం మా ఆడకాపు కబురంపితే, పెసిడెంటైనా, యమ్మెల్యే గోరైనా వొచ్చి వాలాల్సిందే ఎలక్షన్స్‌లో మా కాపు సందాయిస్తే, యమ్మెల్యేగోరి కళ్ళు తిరిగిపోయేలా యిత్తది అని తన కాపు గురించి ఘనంగా చెప్పుకొని, దొడ్డిగుమ్మం దగ్గరికి తీసుకెళ్లి, 'అమ్మగోరూ, అమ్మగోరూ' అంటూ తలుపు తట్టాడు భీమయ్య

'ఆ' అన్న సమాధానం ఎక్కడో నూతిలోంచి వచ్చినట్టు వినిపించింది రెండు నిముషాల్లో దొడ్డి తలుపు తెరిచి, లోపలికి రండి అని చెప్పి లోపలికి దారితీసింది

బంగారమ్మ వెనకే భీమయ్య, భీమయ్య వెనకే సీతాలు లోపలికెళ్ళారు. ధాన్యం కొట్లను ఆనుకుని వున్న వరండాల్లో గొలుసుల వుయ్యాల్లో కూర్చుంది బంగారమ్మ. ఎదురుగా వున్న సీతాలుని ఎంతో పరిశీలనగా చూసింది సీతాలు అందం, వయసు బంగారమ్మ మనసులో ఈర్ష్యను పుట్టించినా దిగమింగి, పెదవుల చివరనించి, చిలకలాంటి పెళ్ళాన్ని తెచ్చుకున్నావురా మొత్తానికి'' అంది బంగారమ్మ ఎంతో ఆదరంగా

చెట్టంత భీమయ్య సిగ్గుపడి, మెలికలు తిరిగిపోయాడు. మనసు మాత్రం గర్వంతో రంకెలేసింది. సీతాలు చూపులు బంగారమ్మమీంచి నేలమీదికి వాలి, ఓరగా భీమయ్యను పరకాయించాయి.

బంగారమ్మగారు నిజంగానే బంగారం. ఆమె రంగు బంగారం, వళ్ళంతా బంగారం, యిల్లంతా బంగారం, ఆమెగోరి అందంముందు తన అందం ఏపాటిది? అనుకుంది సీతాలు

''తీసికెళ్ళి మన గొడ్లసావిడి, చింతలదొడ్డి అన్నీ చూపించరా నీ పెళ్ళానికి'' అంది బంగారమ్మ

భీమయ్య పెరట్లోకి తీసుకెళ్ళి, చుట్టూ చప్టా వున్న పెద్ద నూతిని, దూడలు నీళ్లు తాగడనికి కట్టిన సిమెంటు కుండీని అవలీలగా ఇరవై పశువులకు సరిపోయేట్టు వున్న గొడ్ల సావిడిని చింతల దొడ్లోని పెద్ద పనసచెట్టుని, చెన్నంగి కొబ్బరి మొక్కల్ని, సంపెంగ చెట్టుని, మల్లె పందిరిని ఇంకా రకరకాల మొక్కల్నీ సీతాలుకి చూపించాడు. కొత్తగా కాపురానికొచ్చిన భార్య సొంత యెస్టేటు చూపిస్తోన్న జమీందారులా వెళ్ళబోశాడు భీమయ్య ఆ క్షణంలో.

పక్షులు గూళ్ళోకి చేరే వేళయింది చింతచెట్టుమీద వాలిన పక్షులు కిలకిల్లాడుతున్నాయి. చెట్లమీద కాకుల గోల పెరిగింది దొడ్డి గుమ్మాన పది గొడు గేదెలను గొడ్ల సావిట్లోకి తోలుకొచ్చాడు చిన పాలేరు మరిడయ్య

భీమయ్య గేదెల్ని చూడగానే నీళ్లట్టేనాక కట్టేదారి, కుండికాడకి తోలుకురా' అని పెద్ద బాల్చీతో కుండీలోకి నీళ్లు తోడటం మొదలెట్టాడు గేదెలు కుండీలో నీళ్లు తాగి సావిట్లోకి చేరగానే భీమయ్య వెళ్లి కట్టేశాడు సీతాలు కొత్త లేకుండా చీర కచ్చా పోసుకుని, దూడముందు శుభ్రం చేసి గడ్డి వేసింది.

ఇంతలో బంగారమ్మ అక్కడికొచ్చి 'నువ్వు రెండు రోజులు పెళ్లి చేసుకుందుకు కెడితే వాటొంక సరిగ్గా చూసేవాడే లేకపోయాడ్రా నువ్వు పాలు పితికి తెచ్చినట్టు, మరిడయ్య పితికితే యిచ్చేవికావు నువ్వు వచ్చేశావు యింక నాకు బెంగలేదు'' అంది.

సీతాలు తన పక్కనుండగా, బంగారమ్మ అలా పొగుడుతూ వుంటే, 'నే లేకపోతే ఈ కమతం ఒక్కరోజు నడవదు.. ఏటనుకుంటున్నావో' అన్నట్టు చూశాడు భీమయ్య సీతాలు వైపు.

బంగారమ్మ మెప్పుకి ఉబ్బిపోవడమే భీమయ్యకి తెలుసు కానీ, తన గురించి తాను ఆలోచించుకునే తెలివి లేదు. తన తండ్రి ఆ కమతంలోనే కరిగిపోతూ ఆ కమతాన్ని పెంచాడు. తనని ఏడేళ్ల వయసులో ఆ కమతంలో చేర్చి, దారి చూపించాడు నీ గురించి నాకింక బెంగలేదన్నట్టు భీమయ్యకు తొమ్మిదేళ్ళు నిండకుండానే కన్నుమూశాడు. ఏడేళ్ల వయసులో దూడల్ని కాయడానికి ఆ కమతంలో చేరి, రాత్రి

మెతుకులు పొద్దున్న, పొద్దున మెతుకులు రాత్రి తిని కాయకష్టంతో కాయాన్ని గట్టి పరుచుకుని పాతికేళ్లవాడయ్యాడు భీమయ్య. కవతం అంతకు రెండింతలయింది కానీ భీమయ్య గుడిశ భీమయ్య తండ్రి నాడెలా వుందో ఈనాడూ అలాగే వుంది అంతే వుంది ఎటొచ్చి పాడడిపోయింది. అయితే భీమయ్యకి మిగిలినది మాత్రం బంగారమ్మ మెప్పు అదే భీమయ్యకి తృప్తి

కానీ ఇప్పటి పరిస్థితి వేరు భీమయ్య ఇప్పుడు వంటరివాడు కాదు సీతాలతనికి తోడుందీనాడు నిజానికి సీతాలు తనకి బరువు కాదు సీతాలైనా, ఇంకో ఆడదైనా, అత్తింట వున్నా పుట్టింటవున్నా వళ్లు వంచి పనిచేసి పొట్ట నింపుకుంటారు కానీ ఒకళ్ల కొకళ్ళు బరుగా వుండరు ఆ మాలపల్లిలో అయినా యే మాలపల్లిలో అయినా.

కానీ సీతాలు వచ్చినారోజు గడవడానికి కూడా భీమయ్య దగ్గర నా అన్నది ఏమీ లేదు. అందుకే నోరు తెరిచి బంగారమ్మని అడక్క తప్పలేదు భీమయ్యకి

'అమ్మగోరా! మరి మేమెల్తావడీ కాసిన్ని బియ్యం ఇప్పించండి' అన్నాడు భీమయ్య మొగమాటపడిపోతూ.

బంగారమ్మ నవ్వుకుంది. పాతికేళ్ల మగాడు, తమ కమతాన్ని యావత్తూ నడిపేవాడు. తన ముందు చేతులు జోడించి, ధర్మం కోసం నిలబడ్డం చూస్తే ఆమెకు తృప్తి అంతేకాని ఇన్నాళ్ళూ వాడు పడిన కష్టమే ఈ కమతం అంతకు రెండంతలు కావడానికి కారణం అన్న ఆలోచనగానీ, తనిచ్చేది ధర్మం కాదు, వాడికి రావలసిన దాంట్లో ఓ తృణం అన్న భావం గానీ బంగారమ్మకి కలగలేదు అలాటి ఆలోచ్చే కలిగితే ఆ కమతాలు అంతగా పెరగవు.

''ఇప్పుడు బియ్యం పట్టుకెళ్లి ఎప్పుడు వండుకుంటారు? అది ఎలా వండుతుంది? కుండా మండా ఏమన్నా వున్నాయా ఈ పూటకు యిక్కడే తినండిద్దరూ రేపటినుంచి వండు కుందురుగాని లెండి - ముందు గేదెల పాలు పితుకు, అని భీమయ్య అంగీకారం కోసం ఎదురుచూడకుండానే లోపలికి వెళ్లి పాలచెంబులు పట్టుకొచ్చి యిచ్చింది బంగారమ్మ.

భీమయ్య పాలు పితకడం అయిపోయాక బంగారమ్మ కొత్త దంపతులిద్దరికీ నూతి చప్టా పక్కనున్న సపోటా చెట్టుకింద ఆకులేసి భోజనాలు వడ్డించింది అనుకోని అతిథులు కావడంతో ఎప్పుడూ అలవాటు లేకపోయినా ఇద్దరికీ వేడన్నమే వడ్డించింది. భీమయ్య, సీతాలు తృప్తిగా భోంచేశారు. ఆకులెత్తి పెంట గోతిలో పారేసి, చేతులు కడుక్కుని పైమీదున్న తువ్వాలుతో భీమయ్య, చీరకొంగుతో సీతాలు చేతులు తుడుచుకున్నారు.

బంగారమ్మకి వాళ్లిద్దరికీ తాంబూలం ఇద్దామన్న ఆలోచన కలిగింది. మరుక్షణంలోనే ఎందుకులే లేనిపోనివి అలవాటు చేసి పాడుచెయ్యడం, అనుకుని ఆలోచన మార్చుకుంది.

ఒక ముతక పంచచాపు, ఆకుపచ్చ రంగు బొద్దంచు నేత చీర పట్టుకొచ్చి, 'యిద్దరూ కట్టుకోండి' అని చెప్పి ఎత్తి వాళ్ల చేతుల్లో పడేసింది బంగారమ్మ

ఎలక్ట్రిక్ దీపాల వెలుగులో బంగారమ్మ కట్టుకుని జరీ అంచు చీర, ఆమె వంటిమీద మరీ అందంగా అగుపించింది సీతాలుకి. అంచు ధగధగ మెరుస్తోంది.

అట్టాంటి చీర యిచ్చుంటే ఇప్పుడే ఓ పాలి కట్టుకుని బంగారమ్మగోరి గ్నాపకంగా దాసుకునేదా న్ననుకుంది సీతాలు

'పెళ్లి చేసుకుని తను సీతాలుతో రాగానే బట్టలెట్టింది. .తనంటే ఎంతభిమానవో బంగారమ్మకి' అనుకున్నాడు భీమయ్య

బంగారమ్మకు నమస్కారించి భీమయ్యా, సీతాలు 'వెళ్లొస్తాం' అని చెప్పి బయలుదేరారు దొడ్డిగుమ్మందాకా సాగనంపి తలుపు లేసుకుందుకు వాళ్లిద్దరూ వెనకే బంగారమ్మా వెళ్లింది వాళ్లిద్దరూ పక్కపక్కల్లే నడుస్తూ వుంటే వాళ్ల ఈడు జోడు చూసి, బంగారమ్మ మనసు ఎందుకో బాధపడింది భీమయ్య తన చేయి దాటిపోతున్నాడనుకుంది. వాళ్లని బయటికి పంపి తలుపేసుకుని లోపలికొచ్చి మంచంమీద నడుం వాల్చింది

వంటరిగా రాత్రివేళ మంచంమీద పడుకున్నప్పుడు మనసులో అణగివున్న నిజమైన రంగులు కళ్లముందు కదులుతాయి కామోసు తన పెళ్లిరోజు గుర్తుకొచ్చిందామెకి, అప్పటికి తన వయసు పద్దెనిమిది ఆయన వయసు నలభై; రెండో పెళ్లివాడు అయినా, ఆస్థి కోసమని ఇరవై రెండేళ్ల తేడాదేముందిలే, వయసు నలభై అయినా, మనిషి ముప్పై లోపువాడిగా వుంటాడు అని తన తండ్రి తనని ఆయనకిచ్చి పెళ్లిచేశాడు. ఆ పెళ్లి వెనకనున్న ఆశ, తన సుఖంకంటే అంత ఆస్థికి పెత్తందారు కావాలన్న తన తండ్రి కోరికే ననిపించింది ఆమెకి. తన తండ్రి అంచనా కంటే ముందే ఆయన కన్నుమూశాడు పోయేవాడు పోక తన కొక మగనలుసుని వదలి మరీ పోయాడు. వాడి కోసమని, తన తండ్రిని కూడా దూరంగా వుంచి, వాడ్ని ఆ ప్రాంతం ఎం.ఎల్.ఏ చిట్టి బాబంతటి వాడిని చెయ్యాలని, చిట్టిబాబు కమతం కంటే తన కమతాన్ని పెద్దది చేయాలని, తాను ఆడదే అయినా, నోటి మంచితనంతో, చాకచక్యంతో భీమయ్య ఆసరాతో మగవాడిలా బండి దొర్లించుకోస్తోంది తను.

తన కాపరానికొచ్చేసరికి తన వయసు పద్దెనిమిది. భీమయ్య వయసు పదిహేను అప్పటికింకా కుర్రవాడిగానే వుండేవాడు తన భర్తతో మహాచేస్తే యేడేళ్ళు కాపురం చేసిందేమోతను పాతికేళ్లు నిండకుండానే దాంపత్య జీవితం ఆఖరి పేజీలోకి వచ్చేసింది అప్పటికి భీమయ్య నిండుగా తయారయ్యాడు ఇరవై రెండేళ్లవాడే అయిన పాతికేళ్ల వాడిలా బలంగా వుండేవాడు. భర్తపోగానే తన తండ్రి తత్వం తనకి బాగా తెలుసుగాబట్టి 'భీమయ్య చూస్తాడులే వ్యవసాయం. అంతకి అవుసరమైతే నీకు కబురు చేస్తాను' అని చెప్పి తండ్రిని తెలివిగా సాగనంపింది తను. ఈ తాపత్రయమంతా తన వొక్కగా నొక్క కొడుకుని పైకి తేవాలనీ, వూరికీ, ఆ చుట్టుపక్కల వాళ్లకీ మోతుబరి చేయాలని. అందుకే అన్ని కోర్కెలను తుంపుకుని కన్నకడుపు కోసం బతకడం అలవరుచుకుంది

భీమయ్య కూడా ఎంతో నమ్మకంగా, సొంత వ్యవసాయంలా భావించి ఆ కమతాన్ని శక్తికొద్దీ పెంచాడు. బంగారమ్మ కమతానికి భీమయ్య అండచూసి వూళ్లోవాళ్లకి కళ్లు కుట్టేవి.

ఆడదై వుండీ కమతాన్ని ఎంత సక్కగా నడుపు కొత్తందో చూశావా మావా? అన్నాడు కూడా. ఓసారి మునసబు - బంగారమ్మ పొలం నుంచి యింటికి వస్తోన్న ధాన్యం బళ్లను చూసి

'దాని గొప్పేం వుండయ్యా ఎప్పుడేనా పొలంలో కడుగెట్టిందా యేవన్నానా? అడుగో ఆ భీమయ్యగాడు దొరకబట్టి నెట్టుకొత్తంది. అట్టా తోడు దొరికితే ఎన్ని ఎగసాయలేనా సెయ్యేచ్చు? అన్నాడు చౌదరయ్య.

ధాన్యం బళ్లముందు నడుస్తూ, ఆ మాటలు విన్న భీమయ్య యింటికెళ్లగానే బంగారమ్మకి వూళ్లోవాళ్లనుకుంటూన్న మాటలు చెప్పాడు అంతక్రితమే బంగారమ్మకి ఆ నోటా ఈ నోటా యిలాటి మాటలు వినపడుతూనే వున్నాయి.

పోనీలేరా! ఎవళ్ళేడుపు వాళ్లది ఆడదాన్ని, మొగ దిక్కులేని దాన్ని నువ్వు నమ్మకంగా దొరికావు నాకు నా మాట మీదే ఈ కమతమంతా నడుస్తోంది నీ మాటకి నేనెప్పుడూ అడ్డు చెప్పలేదు. అందుకే వాళ్లందరికి మనల్ని చూసి ఏడుపు ఏడిచేవాళ్లు ఏడుస్తూనే పోతారు. మనం బాగానే వుంటాం.

అని కలుపుగోలుగా మాట్లాడి, భీమయ్యన్ని మరింత సన్నిహితుడ్ని చేసుకుంది బంగారమ్మ. మెప్పు మనిషికి ఏనుగంత బలాన్నిస్తుంది భీమయ్య మరీ విజృంభించాడు రాత్రింబగళ్లు పొలాన్నంటి పెట్టుకుని, రకరకాల ఫలసాయాన్ని తీయడం మొదలెట్టాడు చెరకు వేసి ఫ్యాక్టరీకి తోలేవాడు కూరగాయలు పండించి పట్నానికి తోలుకెళ్లి అమ్మేవాడు చేలమీద పంటున్న రోజుల్లో పొలంలోనే పడుకునేవాడు కాళీ రోజుల్లో ఎప్పుడో వచ్చి, గొడ్లసావిట్లో గడ్డి పరుచుకుని నడుంవాల్చి, కోడి కూయకముందే, మళ్లీ కూలీలను లేపుకుని పొలం మీది కెళ్లిపోయేవాడు. దీనికంతకీ ప్రతిఫలం బంగారమ్మ నోటంట ఓ తియ్యని మెప్పు

భీమయ్య సామర్థ్యం, నిజాయతీ విశ్వాసం, వీటికితోడు వాడి వయసు చూస్తూ వుంటే ఆమె మనసు కాస్త అల్లరి చేయడం మొదలెట్టింది, వాడు తనకు తోచినట్టు మలచుకుందుకు వీలుగా ఓ మట్టిముద్దలా అనిపించాడు ఆమెకి. దాంతో తనకి తెలియకుండానే మనసులో కోరికలు మొలకెత్తాయి. వేళ్లు పాకాయి. చివురించాయి. వాటిని అలా కూడా లొంగదీసుకుంటే చచ్చేదాకా తన దగ్గరే కుక్కలా పడివుంటాడు అనుకుంది. ఈ కవంతం కోసమే పుట్టిన వరలా తనకి వుపయోగపడతాడనిపించిందామెకి

ఆ వేళ వర్షం కురుస్తోంది. వ్యవసాయపు పనుల రద్దీ అంతగా లేని రోజులవి బాబు పట్నంలో చదువుకుంటున్నాడు తను వంటరిది భీమయ్య గొడ్ల సావిట్లో ఓ గొడ్డులా వళ్లు మరచి నిద్రపోతున్నాడు. బంగారమ్మ మనసుని అదుపులో పెట్టుకోలేక పోయింది వంటరితనం, వాతావరణం, అందుమాటులో వున్న, తన చెప్పుచేతుల్లో వున్న మనిషి - అన్నీ కలిసి ఆమెను ముందుకు నడిపించాయి.

తెలివి ఏ మూలనుంచో 'చులకనైపోతానేమో. ఊళ్లో పొక్కితే, ఎవరి కోసం యింత చేస్తున్నావో, ఆ పసివాడు తలెత్తుకు తిరగలేడు సుమా' అని వారించింది

చుట్టూ వున్న ప్రహరీ, ఈ లకంత మండువా లోగిలి దాటి ఈ రహస్యం బయటకెలా వెడుతుంది? ఇలాంటి లోగిళ్లలో, ఇలాంటివి ఎన్ని జరిగినట్లు తను వినలేదూ. నేనింకా నిగ్రహం గలదాన్ని గాబట్టి, ఇన్నాళ్ళు బిగబట్టుకు బతికాను' అనుకుని గొడ్లసావిడి వైపు నడిచింది బంగారమ్మ

'భీమయ్యా, భీమయ్యా' ముట్టుకోకుండానే లేపింది బంగారమ్మ.

'ఏవండీ!'

'యినప్పెట్టె గదిలో ఏదో చప్పుడౌతోందిరా, ఓసారి వచ్చి చూడు'

భీమయ్య కర్ర తీసుకుని, బంగారమ్మ వెనకే వెళ్లి తలుపు గొళ్లెం తీసి లోపలికెళ్లాడు, బంగారమ్మ కూడా లోపలికెళ్లి లైటు వేసింది.

చుట్టూ చూసి 'ఎవరూ లేరండి?' అన్నాడు భీమయ్య.

వాడి మెలితిరిగిన కండల్ని చూస్తూ మనసులో తీయని వూహల్ని నెమరువేసుకుంటున్న బంగారమ్మ వాడన్న మాటలికి ఉలిక్కిపడింది తన మనసులోని కోరికని ఎలా చెప్పాలో తెలియక - ఈ పక్కనున్న పడక గదిలోంచేమోరా నడు చూద్దాం' అంటూ తనే దారి తీసింది పడకగదిలోకి.

లైటు వెలుగులో మల్లిపువ్వులాంటి తెల్లని పాన్పు నిలువుటద్దాలూ, చిత్రమైన పక్షిలా పైన ఫేను తీయని సువాసనలు - ఒక్క క్షణం గొడ్లసావిట్లో బతికే భీమయ్యని వుక్కిరి బిక్కిరి చేశాయి.

'దార్లో పడుతున్నాడు' అనుకుంది బంగారమ్మ.

పాన్పువైపే కన్నార్పకుండా చూస్తున్నాడు భీమయ్య భీమయ్య అలా చూస్తున్నది పాన్పుకింద ఎవరైనా నక్కి-రేమోనని! కానీ బంగారమ్మ మాత్రం పాన్పును చూసి భీమయ్య చలించాడనుకుంది మనసు తన అధీనం తప్పి పురకలు వేస్తోంది. వాడే చొరవ చేస్తే బాగుండుననుకుంది కానీ వాడి వాలకం చూస్తే అంతటివాడిలా అగుపించలేదామెకి. అందుకే తనే తెగించింది నోరు తెరిచి 'ఆ పక్క-మీద పడుకోవాలనుందేవి(ట్రా?' అంది బంగారమ్మ

భీమయ్య వులిక్కి-పడి ఆమె ముఖంలోకి చూశాడు ఆమె నిబ్బరంగా అతని కళ్లల్లోకి కొంటెగా చూసింది వాడు తల వంచేసుకుని 'అదేంటమ్మగోరూ! అట్టా అంటారు?' అని బయటికి దారితీశాడు.

అప్పటికే బయటికి పోయే గుమ్మానికి అడ్డుగా వున్న బంగారమ్మ 'పడుకోవాలని వుంటే పడుకో, తప్పులేదులే - వానగాలి, ఈదురంగా వుంది. కష్టపడేవాడు సుఖపడటం తప్పు కాదులే' అంది.

భీమయ్యకి తల దిమ్మెక్కి-నట్టయింది. ఆ కమతమే ప్రపంచం అనుకుని బతుకుతున్న భీమయ్యకి ప్రపంచంలోని ఇతర విషయాలు అంత త్వరగా, పూర్తిగా అర్థం కాలేదు.

'లోనెవరూ లేరుకానండ, తలుపేసుకు తొంగొండి' నేను సావిట్లోనే తొంగొని వుంటాగా భయంలేదు తొంగోండి' అని, చరా గొడ్ల సావిట్లోకి పోయాడు భీమయ్య.

కాస్సేపు బంగారమ్మ వళ్లంతా వుడికిపోయింది. మంచం మీద పడి అస్థిమితంగా, అటూ ఇటూ దొర్లింది. వాడిని చేతకాని చవట అని తిట్టుకుని, చివరికి సొమ్మసిల్లి నిద్రలోకి జారుకుంది.

తెల్లవారేక వాడిని చూస్తే సిగ్గేసింది బంగారమ్మకి మనసు స్థిమితపడ్డాక 'వాడు చేతకాని చవటగాబట్టి సరిపోయింది గానీ, రాత్రి తను కాలు జారితే, అలుసైపోదును. వాడి అమాయకత్వమే నన్ను కాసింది' అనుకుంది.

అంతేకాని వాడి నిగ్రహం, నిజాయితీ ఆమెకు తట్టలేదు.

ఏదోవిధంగా, మనసులో మొలకెత్తిన కోరికలను, కన్నకొడుకుమీదున్న మమకారంతోను, కమతాన్ని పెంచాలన్న ఆకాంక్షతోను, తుంచేసుకుని రోజులు దొర్లించుకుంటూ వచ్చింది

కానీ భీమయ్య పెదతల్లి మాటమీద పెళ్లిచేసుకుని, ఈవేళ పెళ్లాన్ని వెంటబెట్టుకురావడంతో, మళ్లీ తన మనసులో ఎందుకో గందరగోళం బయలుదేరింది అర్థం కాని ఆలోచనలు తలెత్తాయి

నల్లకలువలాంటి సీతాలు వాడిపక్క-న వుంటే, తన మనసులో ఏదో కోపం సీతాలుమీద ద్వేషం పుట్టుకొచ్చాయి. ఇన్నాళ్ళూ తన చెప్పుచేతల్లో కీలుబొమ్మలా పడివున్న భీమయ్య వాడినుంచి తాను పొందదలచిన సుఖం ఈవేళ పరాధీనమై పోయినట్లనిపించింది. అంతేకాకుండా వాడికీ సంసారం ఏర్పడింది. పిల్లా జెల్లా కలుగుతారు, ఈ కమతంమీద మమకారం శ్రద్ధ తగ్గిపోతాయి. సంపాదనలో పడతాడు. సుఖం మరుగుతాడు. ఇంక భీమయ్య ఇదివరకటి భీమయ్యలా వుండడు తన కమతానికి తనకి. ఇలాంటి ఊహలన్నీ బంగారమ్మ మెదడులో ముసిరాయి

అనుమానం పుట్టకే పోవాలి కానీ, పుట్టిన అనుమానం పెరిగిపోవడానికి ఎంతోకాలం అక్క-రలేదు. కొత్తగా పెళ్లయిన వాడు ఆవడంతో పొలం కాస్త ఎండెక్కా-క వెళ్లేవాడు భీమయ్య ఎంత రాత్రయినా, గొడ్లసావిట్లో గొడ్డులా పడుండటం మానేసి మాలపల్లిలోకి పోయి శీతాలుతోటే పడుండేవాడు. వాడిమీద అనుమానాలను పెంచుకొని, చిన్న పాలేరు మరిడయ్యను వాడిమీద నిఘా వేసింది బంగారమ్మ అదను చూసుకొని, చిన్న పాలేరు, వూళ్లోవాళ్లు అభాండాలు దొర్లించారు. భీమయ్య తన కమతంమీద నుంచి సొమ్ము చేసుకుంటున్నాడన్న చెప్పుడు మాటల్ని సులువుగా నమ్మింది.

దాంతో ఇదివరకటిలా భీమయ్యని మెచ్చుకోవడం తగ్గించింది బంగారమ్మ సూటీపోటీ మాటలు విసరడం మొదలెట్టింది ఆమె అనుమానం బలపడ్డానికి, వూళ్లోవాళ్ల మాటకి విలువ ఏర్పడ్డం కోసం అన్నట్టు, సీతాలు సంపాదనతో గుడిశ బాగు చేసుకున్నారు ఇద్దరూ పట్టి మంచం కొనుక్కున్నారు వాళ్లు సీతాలు ముచ్చట కోసమని, భీమయ్య అప్పుడప్పుడు తెల్లచొక్కా తొడుక్కోవడం మొదలెట్టాడు

దాంతో ఆ కమతాన్ని భీమయ్య మింగేస్తున్నాడనుకుంది బంగారమ్మ కాని ముఖాముఖిని వాడితో తగవు పెట్టుకోలేదు తగవు పెట్టుకుని వాడిని దూరం చేసుకుంటే ఆ మాత్రం ఆసరగా కూడా దొరకదని బంగారమ్మకి బాగా తెలుసు

సీతాలు కారణంగా వాడు తనకి దూరమైపోతున్నాడే అన్న బాధతో లేనిపోని అనుమానాలు వాడిపై పెంచుకుని మానసికంగా మరీ దూరం చేసుకుంటోంది బంగారమ్మ భీమయ్యని అలా ఒక ఏడాది గడిచింది కానీ భీమయ్య వెనుక బంగారమ్మకి ఎంత దగ్గరలో వున్నాడో ఇప్పుడూ అంతే చిన్నతనంనుంచీ ఛీత్కారాలకీ, ఈసడింపులకి అలవాటుపడ్డ భీమయ్యకి బంగారమ్మ సూటిపోటీ మాటలు అంతనొప్పనిపించలేదు అందుకే వాడు ఎప్పటిలాగే వాడి పని చేసుకుపోతున్నాడు

ఓరోజున పెరట్లో సపోటా చెట్టుకాడ నిలబడ 'కాసింత పుల్లని పచ్చడేదైనా ఇప్పించడమ్మగోరూ' అన్నాడు భీమయ్య.

'యేం? పులుపుమీద మనసయ్యిందా' అంది వెటకారంగా బంగారమ్మ

'కాదండా. సీతాలు నోళ్లోసుకున్నాదండా?' అన్నాడు సిగ్గుపడి పోతూ.

ఎండిపోయిన పాత చింతకాయ పచ్చడి, కొబ్బరి చిప్పలో పెట్టి ఇచ్చింది వాడికి

సీతాలు నీళ్లోసుకుందన్న మాట విన్న తరువాత తను అనుకున్నట్టే భీమయ్య తనకి ఇంకా దూరమై పోతున్నాడనుకుంది బంగారమ్మ తన కొడుకు కోసం తానెంత తాపత్రయపడి ఆస్తిని పెంచుతోందో వాడూ వాడి సంతానం కోసం సంపాదించ మరుగుతాడు. తన కమతాన్ని వాడి కోసం వాడుకుంటాడు నిక్షేపంగా ఈ కమతం కోసమే బతుకుతున్నట్టు బతికే వాడికి, బతుకు రుచి చూపించింది సీతాలు. సీతాలే వాడ్ని తనకి దూరం చేసింది. దీనికంతటికీ కారణం సీతాలే. ఇలా తనలో తాను వూహించుకుంటూ సీతాలుమీద పీకలోతు కసి పెంచుకుంది బంగారమ్మ.



ఆనాడు అట్ల తదియ. అంతకు రెండు రోజులనుంచీ ముసురట్టింది. లేకపోతే అట్లతద్దినాడు వూళ్లోని కన్నెపిల్లలందరూ రామాలయం పక్కనే వున్న చింతట్టుకి వుయ్యాల వేసుకుని పోటీలు పడి వూగుతూ వుండేవారీ పాటికి. అవిగేదలు ఈనే రోజులు. చాలా గేదెలు ఆ ప్రాంతంలో ఉండ్రాళ్ళ తదియ అట్ల తదియ అట్ల తదియ మధ్య ఈనుతూ వుంటాయి.

రాత్రి పది గంటల వేళ, కూరగాయలు అమ్ముకొని పట్నంనుంచి తిరిగి వచ్చాడు భీమయ్య బంగారమ్మకి డబ్బు వప్పజెప్పి 'ఎల్లొత్తానండమ్మగోరా' అన్నాడు

'గొడ్ల సావిట్లోకెళ్లి గేదెల్ని చూశావా?'

'ఏటట్టా అంటున్నారు?'

'మన వంకర కొమ్ముల గేది ఈన మోపుకొచ్చి నట్టుందిరా మధ్యాహ్నంనుంచి సరిగ్గా గడ్డి ముట్టుకోవడం లేదు. కత్రాట సుట్టూ తిరుగుతోంది ఒకసారి చూసిరా?'

భీమయ్య గొడ్ల సావిట్లోకెళ్ళి గేదెని చూసొచ్చాడు అది ఈనమోపు కొచ్చిన మాట నిజమే కట్రాట చుట్టూ అలంగం తిరుగుతోంది

'నిజమేనండీ ఈ మాపుకీ ఈనేత్తదనుకుంటాను!' అన్నాడు

'మరి నువ్వు ఇంటికెళ్లి వెచ్చగా పడుకుంటే దాని గతేంగాను నీ చేతులతో నువ్వు పెంచిన గేదది 'పుట్టిన దూడకిగోళ్లు తీసేవాడు లేక, చూసేవాడు లేక. బంగారమ్మగేదె మాయతినేసింది పాలివ్వడం లేదు' అని వూళ్ళోవాళ్ళ చెప్పుకుంటే నీకు మాత్రం సిగ్గుచేటు కాదట్రా? నేనొంటరిదాన్ని నాకెవరున్నారింక?' అంది బంగారమ్మ వాడ్ని రెచ్చగొట్టి తన పబ్బం గడుపుకోవాలన్న ఆశతో.

'అది కాదండమ్మగోరా? అవతల సీతాలు కూడా వట్టి మడిసి కాదు. పొద్దుటేలకే కాతంత బర్ధకంగా వున్నాది యిక దానికి మాత్రం ఎవరున్నారు సెప్పండక్కడ? అన్నాడు భీమయ్య తను వెళ్లక తప్పదన్న ధోరణిలో

'అదేమిట్రా అలా అంటావు ఊరుకాక మాలపల్లి అయితే మాత్రం, అంత అవుసరమైతే కబురే తేరా ఎవరూ? ఆడది కష్టపడతావుంటే చూస్తూ వదిలేస్తారా? ఎవరో ఒకరు కబురుచేస్తే అప్పుడెడుదువుగానిలలే ముందు నోరులేని ఆ గేదె సంగతి చూడు' అంది బంగారమ్మ

సీతాలుమీద కొండంత మమకారమున్నా బంగారమ్మ అన్న మాటలు సబవనిపించి, గొడ్ల సావిట్లోకి వెళ్లిగేది ఎప్పుడీనుతుందా; ఎప్పుడు ఇంటికి పోదామా అని ఎదురుచూస్తూ కూర్చున్నాడు భీమయ్య.

బంగారమ్మ ముందు మండువాలో వీధి గుమ్మానికి పక్కగా వున్న పడక గదిలో వెచ్చగా పడుకుంది గేది కట్రాట చుట్టూ నిలకడ లేకుండా అలంగం తిరుగుతోంది. భీమయ్య మనసు అస్థిమితంగా అటు సీతాలు గురించి ఇటు గేది గురించి ఆరాట పడుతోంది.

రాత్రి పన్నెండు గంటలయింది. ఎవరో 'బంగారమ్మ గోరా, బంగారమ్మగోరా!' అని అరుస్తూ వీధి తలుపు తడుతున్నారు.

బంగారమ్మ రెండు మూడు కేకలు విన్న తరువాత లేచి వీధి తలుపు తీసి 'ఎవరే?' అంది.

''నేనండమ్మా! మరియమ్మని. భీమయ్య పెళ్లాం కష్టపడతన్నాదండి సందటేలనుంచి పురుడు రావడం లేదు. ఆచారిగోరింటికెడితే రెండు సిన్నాల కస్తూరి మింగించమన్నారు. ఊళ్లో ఓ సిన్న మెత్తె దొరికినాది. భీమయ్య వుంటే ఏడకేనా యెల్లి యింకో సిన్నం తెత్తాడేమోనని వచ్చాను - దాని కాళ్లు సల్లబడ్డాయి అమ్మగోరా. అంతా కంగారు పడుతున్నారు మాలపల్లిలో, ఎవరికీ నిద్దర్లు లేవు మాపిటేలనుంచి'' అని చెప్పింది మరియమ్మ గుక్క తిప్పుకోకుండా.

''ఊళ్లో వుంటే మాలపల్లిలోకి ఎందుకు రాడే. నేనిక్కడ కట్టేస్తానా. వాడి పెళ్లానికి అవతల అలా వుంటే పట్నానికి కూరలు అమ్ముకురాడానికెళ్లాడు. ఏ సినిమానో చూస్తూ ఆగిపోయాడేమో రాత్రికి. రాగానే పంపుతాలే నువ్వెళ్లు'' అంది బంగారమ్మ.

మరియమ్మ వెళ్లిపోయాక తలుపు వేసుకుని పడుకుంది బంగారమ్మ భీమయ్యకీ వార్త చెప్పనే లేదు ''సీతాలు అడ్డు తొలగిపోతే వాడు మళ్లీ తన మనిషి. తన కమతం కోసమే బతికే మనిషి అవుతాడు అనుకుంది బంగారమ్మ

'సీతాలు పీడ ఈ నాటితో విరగడైపోతుంది దేవుడు తనకి మేలు చేస్తే, సీతాలుకి కీడు చేస్తే' అనుకుంటూ నిశ్చింతగా నిద్రపోయింది

అంతేకాని రాత్రి వాడికి కబురొచ్చిన సంగతి, ఆ విషయం వాడికి తను చెప్పని సంగతి వాడికి తెలిస్తే

ఏమౌతుందన్న ఆలోచన రాలేదామెకి అటువంటి పరిస్థితే వస్తే పదిమందిలో తన మాటేనెగ్గుతుందన్న నమ్మకం కామోసు బంగారమ్మకి అందుకే హాయిగా నిద్రపోగలిగింది

తెలతెలవారుతోంది పెరట్లో చింతచెట్టు మీది కాకులు గొంతు చించుకుని అరుస్తున్నాయి భీమయ్యకి మాత్రం రాత్రంతా నిద్రా లేదు మనశ్శాంతీ లేదు కానిగేది ఈనలేదు. అలసిపోయి అదీ పడుకుంది

'యేరా, ఈనలేదా గేదె?''

'లేదండమ్మగోరా! ఓ పాలి యింటికెల్లొత్తానండి అవతలెల్దా వున్నదో? యింకాసేపట్లో సిన్న పాలేరొత్తాడు కదండీ అవసరమైతే కబురంపండి?''అని చెప్పి మాలపల్లికి బయలుదేరాడు భీమయ్య.

భీమయ్య యించుమించు పరుగెత్తాడు మాలపల్లి చేరుకున్నాడు మాలపల్లెలోకి అడుగుపెడుతూ వుంటే గుండెలు కొట్టుకుంటున్నాయి వాడికి 'సీతాలు కెట్టా వున్నాదో' అనుకున్నాడు

గుడిశ దగ్గరయింది. గుడిశముందు జనం మూగారు 'పురుడొచ్చేసిందేమో!' అనుకున్నాడు

మరీ చేరువయ్యాడు గుడిశకి

'సీతాలు మనల్ని వదిలి ఎల్లిపోయింది రోయ్'' అంటూ బావురుమంది ఓ ముసలిది. ఏ సంబంధ బాంధవ్యాలూ లేకపోయినా అక్కడ నలుగురాడాళ్లు ఏడిచారు

''అరదరాతిరేల నీకోసరమని బంగారమ్మ గోరింటికొచ్చాను నువ్వు పట్టానికెల్లావని, రాగానే పంపుతానని సెప్పింది నువ్వు పట్టంనుంచి బేగా వచ్చినా నూపందేది యింకో సిన్నవెత్తు కత్తూరి దొరికినా బతికేది సీతాలు'' అంది మరియమ్మ ఏడుపును ఆపుకుంటూ

నిన్న అరదరేతేల నేను పట్నంలో వున్నానా? ఇంకో సిన్నవెత్తు కత్తూరి లేక సీతాలు సచ్చిపోనాదా? అనుకున్నాడు తనలో తనే భీమయ్య. సీతాలు శవం పక్కనే కూర్చున్నాడు. బావురు మంటాడనుకున్నారంతా కానీ ఎందుకనో వాడికి ఏడుపు పైకి రాలేదు వళ్లంతా వేడెక్కి పోయింది నిద్రలేని కళ్లు మరీ ఎర్రబడ్డాయి

తనకీ బంగారమ్మన్నా, బంగారమ్మ కమతమన్నా ప్రాణంతో సమానం అందుకే బంగారమ్మ తన ప్రాణమైన సీతాలును బలిగొంది అనిపించింది వాడికి

పదే పదే 'లేనోడి పెళ్లాం ప్రాణం కన్నా గొప్పోళ్ళ గేది ప్రాణానికి యిలువెక్కువన్నమాట' అనుకున్నాడు

సీతాలుకి అంత్యక్రియలు చేసి ఆరోజంతా గుడిశలోనే తిండి లేకుండా మంచంమీద బోర్లా పడుకున్నాడు. అంతా ఓదార్పు మాటలేవో చెబుతున్నారు. కాని వాడికవేవి వినపడటం లేదు. ఇరుగుపొరుగువాళ్లు కాస్త గంజేనా తాగమన్నారు కాని పచ్చి మంచినీళ్ళేనా ముట్టుకోలేదు గుండెలు వుడికి పోతున్నాయి వాడికి

బంగారమ్మమీద పగ, కోపం రాబందుల్లా రెక్కలు విప్పుకుని వాడి గుండెలో విహరిస్తున్నాయి

మరునాడు పొద్దున్నే దిగాలపడి, దొడ్డిగుమ్మాన బంగారమ్మ యింట్లోకెళ్లి, గొడ్లసావిడి దగ్గర నిలబడ్డాడు గేది ఈనింది దూడ, గేది క్షేమంగా వున్నాయి. చిన్నపాలేరు దగ్గరున్నాడు. పలకరింపుగా గేది అరచింది. బంగారమ్మ కంటే నయం అనుకున్నాడు భీమయ్య

బంగారమ్మ లోపలినుంచి వచ్చి వొక్క క్షణం చలనం లేకుండా వుండిపోయింది. 'నాకు తెలిసిందిరా సీతాలు నిన్ను దూరంచేసి పోయిందట! నేనే నీకు కబురంపుదామనుకుంటున్నాను యేం చేస్తాం దేవుడు

మంచి వాళ్లని ఈ భూమ్మీద బతకనివ్వడు ఆయన్ని చూడు. యాభై ఏళ్లయినా నిండకుండా ఎత్తుకుపోయాడు. నేనేం చేసాను చెప్పు పుట్టెడు దుఃఖాన్ని దిగమింగీ, నిలదొక్కుకు బతుకుతున్నాడు అంటూ ఓదార్చ బోయింది బంగారమ్మ

కొంతమంది తెలివి మాట నేరుపుతోటి మనిషిని మోసగించడానికే వుపకరిస్తాయి కామోసన్నట్టు బుద్ధిగా విన్నాడు భీమయ్య మాటల్ని

కాని వాడు మనసులో అనుకున్నాడు.

నీ మొగుడుకి యాభై ఏళ్లు నిండాక చావొచ్చింది. అప్పటికి సగం కాలం అనుభవించాడు అన్ని సుఖాలు అనుభవించాడు రెండు పెళ్లిళ్లు చేసుకున్నాడు. కానీ నా సీతాలుకి ఇరవై ఏళ్ళినా నిండలేదు. అప్పుడే దానికి ఈ భూమ్మీది నూకలు నిండుకున్నాయి. నీ మొగుడుకి మందులు తక్కువై, వైద్యం లేక చావు రాలేదు. కాని నా సీతాలుకి ఓసిన్నం కస్తూరి దొరికితే బతికేదట. ఏమైనా నువ్వే సంపేసేవు నా సీతాలుని, నువ్వే సంపేసావు' అనుకున్నాడు మనసులో.

''ఏడవకురా, ఏం చేస్తాం చెప్పు. సీతాలునంటే తెచ్చి నీకివ్వలేను గానీ, ఈ కమతం అంతా నీది. నేనుండగా నీకే లోటు రానివ్వను. యేడేళ్ల వయసునుంచీ ఈ కమతంలో పెరిగావట. నే కాపరానికొచ్చినప్పటినుంచి నన్నంటిపెట్టుకున్నావు. అది మధ్యలో వచ్చింది. మధ్యలోనే పోయింది. యింక వున్నది చూసుకుని బతకాలి గాని దాంతోపాటే మనం పోలేముగా?' అని ఓదార్చింది బంగారమ్మ.

కళ్ళు తుడుచుకుని 'యింక అంతేనండి. పొలం పోయి వత్తానండి' అని చెప్పి బయలుదేరాడు భీమయ్య.

తిండి తిని వెళ్లమందామనుకుంది బంగారమ్మ. యికెక్కడికెడతాడులే? ఎప్పటికైనా దేనికైనా యింక యిక్కడికి రావలసినవాడేగా. ఆకలైతే వాడే వస్తాడు అనుకుని వూరుకుంది.

భీమయ్య పొలం చేరుకున్నాడు. మకాం ముందు పడివున్న తుమ్మ దుంగమీద కూర్చున్నాడు. సాయంత్రం దాకా ఎవరితోనొ మాటామంతీ లేకుండా, ఎదురుగా గుబురుగా పెరిగివున్న చెరుకుతోటని చూస్తూ కూర్చున్నాడు. చేతిలో వున్న కత్తి మొనతో తుమ్మదుంగమీద నాట్లు వేస్తూనే - వున్నాడు. నాట్లు పడిన చోట దుంగరూపు చెడి బాగా నలిగిపోయింది. గొగ్గి గొగ్గిగా తయారయ్యింది.

బంగారమ్మమీద కసి, కోపం, పగ అతని నరనరాల్లోనూ లావాలా వుడుకుతున్నాయి ఒకే ఆలోచన - పగ ఎలా తీర్చుకోవాలి? ఏం చేయాలి? ఏం చేయడానికి పాలుపోలేదు వాడికి. సందచీకటి కమ్ముకుంటోంది. చెరుకుతోటలోకి నడిచాడు. కొంతదూరం నడిచి చుట్టూ చూసుకున్నాడు. తన చేతులతో పెంచిన చెరుకుతోట తనకంటే యెత్తు పెరిగి, తననే జడిపిస్తుంది అనిపించింది వాడికి. కాస్త మందుకు నడిచాడు. ఒక చెరుకాకు చేతికి గీసుకుని రక్తం చిమ్మింది.

వాడికి పిచ్చికోపం వచ్చింది. తన చేతిలోని కత్తితో ఒక్కొక్క చెరుకుగడనే నరకడం మొదలెట్టాడు కసిగా. ప్రతి చెరుకుగడలోనూ బంగారమ్మ కనిపించింది. ఆమె మాటల తీపి స్రవించింది. చేతికందినంత మేర నరుక్కుంటూ పోయాడు.

కాని వాడి కసి, పగ చల్లారలేదు. కత్తినేలకేసి కొట్టి 'దీని తల్లి సిగతరగ - యింకా దీనికాడ పూడిగం నాకెందుకు, నేనొక్కడ్నీ ఏట్టాగో అట్టా బతుకుతాను' అనుకుని యెక్కడికో వెళ్లిపోయాడు భీమయ్య.

పచ్చటి బంగారమ్మ కమతం ఎండుముఖం పట్టింది.



# ముత్యాల చెరువు

## ఐ.వి.ఎస్. అచ్యుతవల్లి

ప్యాసింజరు దిగుతూనే స్టేషన్ నలుమూలలా కలయ చూశాను వెంకన్న కాని సూరయ్య కాని వచ్చినట్లు లేదు. బహుశా నేను వస్తున్నానని వ్రాసిన వుత్తరం అంది వుండదు నాన్నగారికి లేకపోతే బండి యెందుకు పంపరు? అవతల లైన్‌మీద ఒక మైలు పొడుగున గూడ్సు ట్రయిన్ వుంది అది కదిల్తే కాని నేను కదలడానికి వీలుండదు పట్టాలు దాటి అవతల సన్న కంకర గుట్టలు దిగి, సన్నని కాలిదారమ్మట నడిస్తే విష్ణుపురం వస్తుంది అక్కడ జట్కాయైనా రెండెడ్లబండియైనా, కట్టించుకుని మావూరు పోవచ్చును పెట్టె బెడ్డింగు వున్నాయ్ ఆలోచిస్తూ నిద్రగన్నేరు చెట్టు క్రింద నిలబడ్డాను

''బండికీ సామాను పట్టేదా సిట్టెమ్మా!'' అన్నాడు పోర్టరు పోలాయ్

''నువ్వున్నావుటోయ్! కనపళ్ళేదేం! మావాళ్లెవరూ వచ్చినట్లు లేదే!'' అన్నాను

'వున్నానండి, 'టీ' తాగి వొద్దామనుకున్నంతలో బండి రాటం పోటం కూడా అయిపోనాది మీ రొక్కరే వచ్చారాండీ! ఇంకెవరూ దిగనేదల్లే వుంది. ఉత్తరం రాపిచ్చలేదుండీ!'' అన్నాడు పోలాయ్.

'వ్రాశానోయ్! అందలేదులా వుంది సరే పద, అన్నాను ఇంతలో ఏదో బండి వస్తున్నదిగాబోల్ను, సిగ్నల్ ఇచ్చారు

''వుండండమ్మా! ఈ బండి చూసుకోని వస్తాను' అన్నాడు ఆ బండి రావడం వెళ్లడం జరిగింది ఒక్కరూ దిగలేదు

'ఏం టేసనులే! ఒక్కరూ దిగరూ, ఒక్కరూ ఎక్కరు, అదే బెజవాడ అవితే, ఓహ్' ఏం సందడేం సందడి! ఎక్కేవోరూ, దిగేవోరూ - చేతినిండా పనే! జేబుల్నిండా డబ్బులే!' అన్నాడు పోలాయ్, పెట్టె బెడ్డింగ్ నెత్తికెత్తుకుంటూను

'అక్కడమట్టుకు పని అంతా నీకొక్కడికే తగుల్తుందిటోయ్! ఇక్కడ నయితే నయం కాదూ! నీకు పోటీయే లేదు కదు!'

'ఏం నయమండీ! నాల్రోజులకోపాలన్నా బేరం తగల్దు!'

'ఇప్పుడు నేను దిగలేదుటోయ్! సరేకాని ఈ 'గరుడాచలం' ఇవ్వాళ కదలదేమిటి!' అన్నాను నడుస్తూను

'అది రేపు మద్దేలదాకా ఈడనే పడుంటది. దాన్నేం వేసుకుపోతదంట!' అన్నాడు. మేమిద్దరమూ గూడ్సు పెట్టెలమధ్యనుంచి దూరి పట్టాలు దాటి నెమ్మదిగా నడుచుకుంటూ విష్ణుపురం జేరేము. విష్ణుపురం స్టేషనుకి షుమారు ఫర్లాంగు దూరం వుంటుంది. బస్టాండు దగ్గర నా సామాను దింపేసి నే నిచ్చిన రూపాయి పుచ్చుకొని వెళ్లిపోయాడు పోలాయ్ మా వూరికి నాలుగు రూపాయలడిగాడు జట్కావాలా

'అదేంటోయ్! పోయినసారి రెండు రూపాయలే కదూ! రెట్టుకు రెట్టూ పెంచావేమిటి?' అన్నాను

'ఏం చేసేదమ్మగోరూ! నాల్రోజులాయి ఒకటే వర్షం పడటం నించి రోడ్లన్నీ గండిలడ్డాయ్! అదేూ ఈ బండి డాముదాకానే పోతది అక్కడ్నించీ నడుచుకుపోవాల్సా!' అన్నాడు

''సర్లే! మరేం చేయనూ'' అన్నాను, జట్కా ఎక్కి కూర్చుంటూ, ఇక్కణ్ణించీ మా వూరు డాము దాకా సన్న కంకర రోడ్డు వుంది డాము దగ్గర్నించీ వూరుదాకా మట్టిరోడ్డు సుమారు రెండు ఫర్లాంగులుంటుంది ఆ మట్టిరోడ్డు రేగడి బెడ్డలవటం నించీ ఏమాత్రం వర్షం కురిసినా మెత్తబడిపోయి దిగబడిపోతూ వుంటుంది ఎండకి ఎండిపోయినప్పుడు ఆ మట్టి అంతా పశువుల తొక్కిడి మూలంగా గట్టిపడిపోయి గతుకులు గతుకులుగా వుంటుంది. ఆ గతుకుల రోడ్డుమీద గుర్రంబండైనా సరే కుదుపుతూ ఇంటికి వెళ్లేసరికి, వళ్లంతా ముద్దయిపోయి మూడు రోజులదాకా మామూలు మనిషి కావటానికి సావకాశం వుండకపోతుంది నాలుగు రోజుల ఏకవర్షానంతరపు ఎండేమో, ఆ కొత్తా మబ్బు విడిచిన ఎండ చితచితలాడిస్తోంది. బండి డాము సమీపించింది. ముందు దారి అంతా బందబందుగా కనుపిస్తోంది, నేను జట్కాదిగా. వాడు గుర్రాన్ని విప్పి పక్కనున్న తుమ్మచెట్టుకి కట్టేసి, అడుగున వలలో వున్న పచ్చగడ్డిని దానిముందు పడేసి నా పెట్టె, బెడ్డింగు నెత్తికెత్తుకున్నాడు వాడు ముందర నడుస్తోంటే, వాడు వేసిన అడుగులోనే నేను కూడా అడుగువేస్తూ నడుస్తున్నాను ఇంకా వూరు కనుచూపు దూరంలో వుండగానే నా దృష్టి వూరి పొలిమేరనున్న మా చెరువుమీద పడింది. చెరువు నిండుగా ఎన్నెన్నో తామరాకులూ, తామరాకులనిండా వర్షపు తుంపర్ల వల్ల కలిగిన నీటికణాలు ఆ ఎండలో తళ్లుతళ్లుమంటూ దేవతలు ఆకాశం మీంచి మంచి ముత్యాలు కురిపించేరా అన్న భ్రాంతిని కలిగిస్తోంది నల్లని, సన్నని పొడుగాటి కాళ్లతో నీటికొంగలు ఆ ఆకునుంచి ఈ ఆకుమీదకీ, ఈ ఆకుమీదనించి ఆ ఆకుమీదికీ తేలిపోతూ నడుస్తూ తమ పొడుగాటి మెడని చాచి, తమ ముక్కులతో నాచులోకి పొడుస్తూ దొరికిన పురుగుల్ని తింటున్నాయి. తెల్లగా అరవిరిసిన తామరపూలు జన్మకారకమైన జలతరంగాల జల్లదనం కన్న, తమ బాహువుల కందని ప్రియ బంధువు యొక్క వెచ్చదనమే తమకి ఎక్కువ సౌఖ్యకారకమైనట్లుగా తమ మనసుల్లోని అనురాగాల స్వచ్ఛతనంతా, తమ ధవళరేకల వొంపుల్లో నింపుకుంటూ, నీలాకాశంలోని తీక్షణ ప్రతాపునివంక ఆహ్వానపురస్కారంగా అరమోడ్పు కన్నులతో చూస్తున్నావా అన్నట్లు అలలమీద చిరుగాలికి తలలూపుతూ నిలిచివున్నాయి! నేను గబగబ నడిచి, చెరువును నాకరువుతీరా చూసి కాళ్లూ, చేతులూ ముఖమూ కడుగుకొని మా ఇంటికి వెళ్లాను. ఇంటిలో నాక్కావల్సిన వాళ్లందరూ చుట్టూ చేరి కుశల ప్రశ్నలు అడుగుతూ గొడవ చేయడం మొదలెట్టారు కాని, నాకేదో వెలితిగా అన్పించింది ఫలానా అని చెప్పలేని మూగబాధ నా గుండెల్ని పిండసాగింది కాస్సేపటికి మా నాన్నగారు పొలంనించి వొచ్చారు.

''జట్కా వేసుకు వచ్చావామ్మా! ఉత్తరం అందింది. కానీ, ఏం చెయ్యను? పాలేళ్లకి ఎక్కడా ఖాళీలేదు. ఈ వర్షాలనించి దాళవా కుప్పలన్నీ నాశనమయి పోయాయి. అటుచూస్తే ఏ పనికైనా కుడిభుజంలా పనిచేసే ఆదెయ్య మతిబోయి తిరుగుతున్నాడు'' అన్నారు.

''ఆదెయ్యకి ఆరోగ్యం బాగాలేదా నాన్నా?''

''ఏం బాగు తల్లీ! ఆ ముత్తి పోయిం దగ్గర్నించీ వాడికి మతే లేదు. ఇవ్వాళో రేపో అన్నట్లున్నాడు. నీకు చెరువు కట్ట మీద కనపళ్లేదా?'' నిర్ఘాంతపోయాను. కారణం తెలియకుండానే కడుపులో మెలి దిరుగుతున్న ఆ వ్యక్తి బాధ వ్యక్తమయ్యింది.

''ముత్తి చచ్చిపోయిందా! ఎల్లా చచ్చిపోయింది నాన్నా! ఎప్పుడు చచ్చిపోయిందీ!''

''ఆర్నెల్లవ్వొస్తోంది పాపం!''

ఆర్నెల్లయిందన్నమాట! నాకుత్తరమేనా వ్రాశారు కాదేం? అవును, ఎందుకు వ్రాస్తారు? వాళ్ల దృష్టిలో ఒక పాలేరు కూతురు చనిపోవడం సర్వసామాన్య విషయం నా దృష్టిలో దానికి విలువ కట్టలేని సంఘటన. జీవితంలో ఒక ఆప్తమిత్రురాల్ని, నేను పుట్టినది మొదలు ఇప్పటివరకూ నాకు ఎవ్వరూ ఇవ్వలేనంత మానసికానందాన్ని ప్రసాదించిన స్నేహశీలిని నేను ఎల్లా మరచిపోతాను? ఒక వ్యక్తి జన్మించడం అందరికీ ఆహ్లాదకరం కానట్లే, మరొక వ్యక్తి మరణించడం అందరికీ దుఃఖ కారణం కాదు జనన మరణ, సుఖ దుఃఖాలు అనే వాటిని ఎవళ్ళ బంధు పరిధుల్లో వాళ్లే అనుభూతిని జెందుతారు నా గదిలో కెళ్లి మౌనంగా కూర్చున్నాను ముత్యాలు! మంచి ముత్యాలు! తన స్నిగ్ధ స్నేహ వల్లరులతో నా మనస్సుని బంధించిన ముత్యాలు! అప్పుడే నూరేళ్లు నిండాయా? నాతో ఒక్కమాటా చెప్పకుండా ఎందుకని పోయావు? నన్నెవరితో కబుర్లు చెప్పుకోమంటావు? నాకొచ్చే పిచ్చి సందేహాలకి జవాబులింకెవరు చెప్తారు?

''చిట్టీ! అల్లానే కూర్చుండిపోయావేం? స్నానం చేసి బట్టలు మార్చుకోమ్మా'' అన్నది వదిన

''ముత్యాలకేం జబ్బు చేసిందమ్మా! వొదినా''

''జబ్బా లేదు, పాడు లేదు చెరువులో పడి చనిపోయింది''

కిటికీలోంచి చెరువుకేసి చూశాను తామరపూలన్నీ కలకల్లాడుతూ నన్ను చూసి నవ్వుతున్నాయి

''చెర్లోపడి ఎల్లా చచ్చిపోయిందొదినా! దానికి ఈదడం వచ్చునే!''

''అయ్యో వెర్రిపిల్లా! చావాలని పడినది ఈదుకుని గట్టుమీదకు వస్తుందా! రామ్మా! స్నానం చేసి బట్టలు మార్చుకుందువుకాని''

నాకు ఏ పని చేసుకోబుద్ధవడం లేదు నా శరీరమూ మనసూ కూడా అచేతన మౌతోంది. నా అంతస్సు గతించిన సుందర స్వప్నాల జాలంలోకి జారిపోతోంది నేను చెదిరిన మనస్సుని కూడా తీసుకుందుకు ప్రయత్నించడం లేదు ఈ శకలాల్ని అల్లానే పరిభ్రమించనిస్తున్నాను.

'సిట్టీ!'

నా అంతరంగంలో తొలిసారిగా పిల్చిన ముత్యాలు గొంతు సన్నగా విన్పించింది నేను వెనక్కి తిరిగి చూశాను

''నిన్నో పాలి ముట్టుకోనిద్దూ! ఏం!'' నా కళ్లల్లోకి దీనంగా చూసింది ముత్తి అది నాకు గజం దూరంలో నించుని వుంది దేవతా విగ్రహం ముందు భక్తురాలిగా నిలబడింది అది

''ఇల్లావచ్చి కూర్చో!'' అన్నాను అక్కడ్నే కూర్చొంది. నెమ్మదిగా చేయిచాచి నా చేతికున్న గాజుల్ని తడిమింది.

''ఇల్లా పక్కన కూర్చోమంటే అంతదూరంగా కూర్చున్నావేం?''

''వోరన్న సూత్తారు''

''చూస్తే!''

''ఏం నేరనట్టు మాటాడుతావే! చూత్తే ఇంకేమన్నా వుందా! ఇద్దర్నీ నిలేసి తంతారు పెద్దోళ్ళు! నవ్వింది. ఆ నవ్వు చంద్రవంకలా కన్పించింది నాకు చెరువుగట్టు మీద కూర్చున్నదాన్ని కాళ్లు నీళ్లల్లో జారేశాను కాళ్లకేదో చుట్టుకుంది దబుక్కున కాలుపైకి లాగుకున్నాను "సన్నగా పొట్లకాయలా నల్లగా

చారలు చారలుగా వున్న పాము నీళ్లలా ఈదుకుంటూ పోయింది

''అమ్మో! పాము నిష్కారణంగా చచ్చిపోదును'' అన్నాను భయంగా

''అవ్వేం చేస్తయ్ బురదకట్టెలు! ఆటిన్ని సంపుతె బోలెడు పాపంట. అవి ముందు జన్మలో ఋశులంట''

''అవేం పూలు ముత్తీ!'' అన్నాను. చెరువుగట్ల వారమ్మటే, సన్నటి కాడకి అరకు చుక్కల్లాంటి ఆకులున్నాయి వాట్లకి వూదారంగులో అరచేయియంత పూవులున్నాయి

''తెలవ్వా! తూటుపూలు అయ్యి?''

''ఆ గడ్డి అంతా తుంగేనా!''

''తుంగెందుకవుద్ది! అల్లిగడ్డి!'' నా పాదాల్ని నెమ్మదిగా ముట్టుకొని, మళ్లీ కణకణలాడే నిప్పుల్ని ముట్టుకున్నంత త్వరగా చేయి తీసుకుంది

''ఎందుకంత భయం'' నవ్వాను.

'ఏం లేదు'

''ఇక్కడ పల్లెటూరవటం నించి ఇట్లాంటి పిచ్చిలున్నాయి. కాని, అదే మా బస్తీలో ఇల్లాంటివేం లేవు తెలుసా? నీలాంటి వాళ్లంతా మా పక్కనే కూర్చుంటారు మేమంతా కలిసి మెలిసి వుంటాం నాతో చదువుకుందుకు, ఆడుకుందుకు మా ఇంటికి వస్తారు. మేమంతా ఒక గదిలోనే కూర్చుంటాం. మరి మా పెదనాన్నగారు ఏమీ అనరు. తెలుసా!''

''ఆల్లంతా అదురుట్టమంతులు! మా సినబావ కొడుకు బత్తీలో సదువుతున్నాడు గదా! ఆడి సావాసపోళ్లు బామ్మర్లే మనూరు సూటాన్ని కొచ్చేరు మరిగంటే నేను కాపీ కాచిస్తే తాగేసినారు కూడా ఆళ్లు'' ఎంతో ఆనందంగా చెప్పింది.

చెరువు మీదకు వ్రాలివున్న ఈతమట్టల చివర్ల ఎన్నెన్నో పిచ్చికగూళ్లు వున్నయ్. ఎండవేళ పిచ్చికలు లేవు కాబోల్ను, కాకులు ఆ గూళ్ళల్లో ముక్కులతో పొడిచి ఆ పిల్లల్ని తింటున్నాయి. ఆ బాధకి ఆ పిల్లలు కిచకిచమంటున్నాయి.

''వోహ్! ఏం సొద! మీ జిమ్మడ'' లేచి నుంచుని రాళ్లుచ్చుకుని కొట్టేసింది ఆ కాకుల్ని ముత్తి.

నేను చెరువు నిండుకూ వున్న తామరపూలని చూస్తూ కూర్చున్నాను.

''సిట్టీ! మీ బత్తీలో బయస్కోపు లుంటివి గదా! మరిగంటే నువు రోజూ సూత్తావా?''

''రోజూ చూస్తే చదువో! ఎప్పుడయినా మంచి పిక్చరు వొచ్చినప్పుడు చూస్తాను''

''మంచియ్యంటే, అయ్యి పంచరంగుల్లో వుంటయి అయ్యేనా?''

'ఊ' అన్నాను. అంతకన్నా వివరంగా ఎల్లా చెప్పాలో నాకు తెలీలేదు.

ఇంటికి వచ్చేద్దామని లేచి నించున్నాను.

''అప్పుడే వెళ్లిపోతవా?''

''కాఫీ వేళయింది కదూ!''

''రేపు వొత్తావా?''

''రోజూ వొస్తున్నాను. నువ్వు మాత్రం కన్పడటం ఇదే మొదటిసారి ''

''అవును రెండారాల కింద పెద్దమ్మ సెప్పింది అమ్మాయిగారొత్తారని''

''నువ్వు మా ఇంటికి వచ్చావా! నాకు కనపళ్ళేదేం?''

''రాకేం!! మొన్నోపాలి 'వులవల బత్తా' బాగు చేయడానికి వచ్చాము నేనూ సూరయ్య పెళ్ళాము ఆయేల నువ్వు సావిట్లో కొచ్చినట్లే వొచ్చి మళ్ళీ గదిలోకి పోయినావు. ''మెరుపు తీగలాగుంది సిట్టెమ్మ' అన్నది సూరయ్య పెళ్లాం

''ఉహూ అల్లాగా!''

''అప్పట్నించీ నీతో మాట్లాడాలని ఒకటే మణుసునాకు'' నేను దాని భుజంమీద చేయివేసి 'పద పోదాం! నేను రోజూ వొస్తాను నువ్వుకూడా రోజూ రా! ఏం'' అన్నాను. ముత్యాలు నాకేసి చూస్తూ నించుండిపోయింది. కాస్సేపటికి తమాయించుకుని దాని భుజంమీది నా చేయి తన చేతుల్లో పుచ్చుకుని కాసేపు అల్లానే పట్టుకుని వదిలేసింది అప్పుడు వచ్చేటప్పుడు ఒక పాత సిల్కు చీర ఇచ్చి వచ్చాను ఎంతో సంబరపడింది.

మళ్లీ సంవత్సరం.

ఊడ్పులు మొదలయినాయ్! ముత్యాలు కెక్కడా తీరుబాటు లేదుకాబోల్ను కనిపించడం లేదు. నేనొక్కర్తినే నా స్థానంలో కూర్చున్నాను.

''ఎప్పుడొచ్చావ్ సిట్టీ?''

వెనక్కి తిరిగి చూశాను

''నేనొచ్చి పదిహేను రోజులవుతున్నదిలే! ఎక్కడా దర్శనాలు లేవే తమరివి?''

''వూడ్పులకిగూడెమెల్లాం. నిన్న సాయంత్రమే వొస్తి!'' నా పక్కనే కొంచెం దూరంలో కూర్చుంది.

''మనూరిలో పని లేదా?''

''ఎందుకు నేదు! ఇక్కడంటే కూలీ తక్కువ సిట్టీ! గూడెంలో మడుసులు తక్కువ. రొండు రూపాలు ఇత్తన్నారు. ఈ పది రోజులూ పొయ్యిలోకీ, కడుపులోకీ ఇచ్చి, రెండు రూపాలు ఇచ్చీరు''

''ఈ వారం రోజులుగా ఒకటే వర్షంగా! మీరెలా పనిచేవారు?'' ఆశ్చర్యపోయాను.

''బలేదానివే! వోన లేకపోతే ఎక్కడూడ్పమంటావ్! ఆ వోనదేముడు సల్లంగా సూత్తేనేకందా! మన కడుపులోకి బువ్వ వచ్చేది? ఇంత సదివావ్ ఈ మాత్రం తెల్దేటి?'' పక పకా నవ్వింది.

నేను దానికేసి చూశాను. దృఢంగా ఆరోగ్యవంతంగా వుంది. కాలి వ్రేలి మొదలు, నుదురుదాకా నల్లగా నిగనిగలాడుతూ మెరుస్తూనే వుంది. పది రోజుల నిరంతర శ్రమవల్ల కలిగే ఆయాసం కించిత్తూ స్ఫురించలేదు నాకు. పది రోజులూగా మోకాలి లోతు బురదలో, పైన సన్నటి వర్షపు జల్లుల్లో తడుస్తూ పనిచేసిన మనిషల్లె లేదు. అయిదారుగురు పరిచారికలు కనిపెట్టుకుని వుండి, మెత్తని ముఖమల్ తివాసీలమీద అడుగు వేయించని రాజకుమారి మృదుత్వంతో వున్నది. కొంచెం వర్షంలో తడిస్తే జలుబు చేస్తుంది నాకు. తల భారం, జ్వరం, వెలిపొచ్చేస్తుంది. కొంచెం చెరువులో కాల్లాడించుకుంటే చాల్ను, కాలివ్రేళ్ల మధ్య నున్న చర్మం పలచబడి వొరిసి మంటలు పుడ్తుంది. నేనదే అన్నాను ముత్యాలుతో

''ఒసే మీరు రోజల్లా అల్లా తడుస్తే రోగాలూ రావూ!''

''రోగాలెందుకు వస్తయ్యి! ఆకాశరాజూ భూదేవి మాలచ్మీ మమ్మల్ని దీవించరేంటి? అయినా ఈ

పనులున్నాన్నాళ్ళూ మేం పొడన్నాలు తింటాంగందా?''

''పొడన్నమంటే!''

''వార్పు అంతా ఓ గిన్నెలో ఒగ్గేసి, కడుపు పట్టినంతా, వొ(రనంజుకొని మామూలు అన్నమే, తినేస్తాం! బలం వుండక ఏమవుద్ది?'' 'అన్నం తింటాం' అని గర్వంగా చెప్తోంటే ఆశ్చర్యపోయాను

'మరి రోజూ తినరేం' అన్నాను. 'పాటు' లేనప్పుడు ఎక్కణ్ణించి వస్తయ్ గిన్నెలకి గిన్నెలు గింజలు? ఇప్పుడు అయితే పని చేయించుకుండే వోళ్లు ఇవ్వాల గింజలు. వండుకోవడానికి కంపా కర్రా పడేత్తారు. దరిజాగా తినేత్తాం రోజూ రమ్మంటే ఎల్లా వస్తాయ్? పని లేకుండా గింజలిచ్చే దరమదేవత లెవరుంటారు సిటీ!''

'మరి గింజలు లేనప్పుడేచేస్తారు?''

'చోళ్లో, కొ(రలో, నూకలో, ఏయి చవగ్గా దొరికితే అయ్యి కొనుక్కుని జావలా కాచుకొని తాగుతాం. రెడ్డిసీ మోళ్లకి జొన్నలు చవగ్గా దొరుకుతాయి అయి పిండి ఇసరుకొని రొట్టెలేసుకుంటారు. అన్నమయితే గడ్డనాగవుతుంది'' అంది.

నాగు ఆ రోజు అన్నం సయించలేదు నేను తిని మా(త్రం ఏం లాభం?

రెండు పూటలా కమ్మని పెరుగుతో భోజనం, రెండు పూటలా ఏదో వొక పానీయం కాకుండా ఫలహారాలు జావనీళ్లతో (బతుకుతున్న ముత్యాలు చేసే పనిలో ఎన్నో వంతు చేస్తాను? ఆరు శీల కారం అవలీలగా దంచి పెడ్తుంది ముత్యాలు. అరసోలకారం దంచుకుంటే చేతులు మంటలు పుడ్తాయ్! నేను తినే తిండి ముత్యాలుకి లభిస్తే ఇంకా ఎంత పని చేస్తుందో! ఆహారం ఎక్కువయి ఆయాసం మాకయితే, సరయిన పోషక పదార్థాలు కొనుక్కోలేని ఆర్థిక అసమర్థత వల్ల నీరసించి పోతున్నారు వాళ్లు నా అన్నానికి సరిపడ్డ ధాన్యం నేను నేల దున్నుకొని, వూడ్చుకుని పండించుకోలేను నేను. వాళ్లు వాళ్ల అన్నానికే కాకుండా, కొన్ని వేలమంది పొట్టలూ, పెట్టెలూ నిండటం కోసం, వాళ్ల పొట్టల్ని చిలక్కొయ్యలకి వేలాడేసి (శమిస్తున్నారు. వాళ్లకన్నా నేనెక్కువదాన్ని ఎల్లా అవుతాను?

'వొత్తాను సిట్టీ! మరిగంటె నేను వూడ్పుకి గూడేనికి పోయినానని మీ నాన్నోరికి కోపంగా వుంది. కాస్త నువ్వు సదరాలి!'

'చెప్తాలే! అయినా నువ్వు వూడ్పులకి వెలితే ఆయనకెందుకీ మధ్యని?'

'నీకెం తెల్దు సిట్టీ! మా బాబు మీ కమతంలో పాలికున్నాడు గందా! అందుగురించి ఆడివోళ్లంతా మీ కమతం వూడ్పులోకి రావల్సుంటది'

'అయితే మరెందుకు రాలేదు?'

'ఏం చేయను సిట్టీ! నాన్నగారు పదణాలు, ముప్పావులా ఇత్తన్నారు. గూడేన్ని రూపాన్నరా రొండూ ఇత్తన్నారు. ఇక్కడ మడుసులెక్కువ, పని తక్కువ. అక్కడ పనెక్కువ, మడుసులు తక్కువ. దాంతో కూల్డబ్బులు నాలుగెక్కువిత్తన్నారు'

'అవును మరి! మీకెక్కడ నాలుగు డబ్బులెక్కువ దొరికితే అక్కడే పనిజేస్తారు. దానికి కూడా మా ఆజ్ఞేనా?'

'మేమున్నాంగా మీ చేలో వొంగాల్సినోళ్లం. డబ్బులెక్కువ అని ఆశపడి అట్టాపోయినాను ఇప్పుడు మీ నాన్నగారికి కోపం వచ్చి మా బాబుని పనిలోంచి తీస్తనన్నారు కొత్త సాలులో రెండు నెల్లాయి జేత్తన్నాడు. వూడ్పులూ అవ్వొస్తున్నాయి ఇప్పుడాడ్ని పనిలో కెవురు పెట్టుకుంటారు?'

మీకు ఇప్పటికొచ్చే గింజలు తీసుకొని, ఇంకోళ్ల కమతంలో జేరకూడదా?'

'మద్దెలో వోరెట్టుకుంటారు? దమ్ములు జేయకముసుపే కాగితాలు రాసుకుంటారుగా! అందులో పని పూర్తికాకుండా మానిపించినోళ్లి అసలెట్టుకోరు మేము ఈ సాలంతా తిండి లేకుండా మాడిపోవాలి!'

'చెప్తాలే' అన్నాను

'నీకు తెలియదు లేమ్మ! తండ్రి తండ్రే! కూతురు కూతురే! ఉత్త దొంగ వెధవలు. వీడు మొన్న వడ్లు మరెట్టించుకుని, తవుడు అంతా మనకియ్యకుండా అమ్ముకున్నాడు ఆ ముత్తి ఏమో దొంగముండ, మనకి రాకుండా గూడేనికి పోయింది. నా సొమ్ము తింటూ వూళ్లు ఏలమన్నా వీళ్లని 'పాలె'కి పెట్టుకుంటా!'

'ఈసారికి క్షమించండి నాన్నగారూ. పాపం, ఏటికేడాదీ తిండి లేకుండా చేసినవాళ్లమవుతాం'

'నా తల్లి, నా తల్లి, బంగారు తల్లి. నీ కడుపు నిండాలమ్మ. నీ పాదాలకు మొక్కుతా' అన్నాడు ఆదెయ్య

'ఏదో బుద్ధి గడ్డి తిన్నది బాబులూ. మేం తవుడు అమ్ముకోనేదు బాబయ్యా. కోళ్లకి ఏసుకుందుకుని ఇంట్లో అట్టే పెట్టుకున్నాం. ఎవళ్ల కొచ్చిందో తెగులు. గుడ్లు పెట్టడానికొచ్చిన రెండు కోళ్లనీ ఏసుకపోయారు బాబయ్యా. మీ పశువుల నోట్లో మట్టి కొట్టాలని చూస్తే మాకు కలిసివత్తదా' అన్నది ముత్తి

'నువ్వు కోళ్లని పెంచుతున్నావా?'

'లేదు సిట్టీ. మొన్న ఆరు రూపాలెట్టి 'పరూ' కొచ్చిన పెట్టల్ని కొన్నాను. ఎవరో నూక్కుపోనారు అళ్ల జిమ్మడ. పోన్లే ఏం చేత్తాం! నేను కట్టపడలేదు అనుకుంటా. నా కచ్చిరాలేదుండీ ఆ పెట్టలు'

'పోన్లే, నా దగ్గర రూపాయలున్నాయ్. మళ్లీ కొనుక్కో కోడిని'

'వద్దులే సిట్టీ, నాకచ్చిరాలేదు. తవుడు బత్తా తెచ్చి మీ పాకలో పడేత్తాను'

'మీరు ధాన్యం మరెట్టించుకున్న తవుడు మాకెందుకు?'

'మీ నాన్నారు సాలుకి పదేను బత్తల దాన్నెవు మా బాబుకి జీతాలకింద ఇత్తారు. అయ్యి ఆడించుకున్న సిట్టూ, తవుడూ, మీకే ఇయ్యాల, మేం వాడుకోకూడదు. గొడ్లున్నవోళ్లయితే అడిగి తీసుకుంటారు'

'మీరు అమ్ముకుంటే మీకు నాలుగు డబ్బులెక్కువొస్తాయి గదా! లేకపోతే 'మర' వాళ్లకే ఆ చిట్టూ తవుడూ ఇచ్చేస్తే వాళ్లు మీ ధాన్యం వూరికే మరబెడ్తారు గదా!''

'అలా కామందు లూరుకుంటారండీ!' అన్నది ముత్తి. కుటుంబంలో ఒక్కడు పాలేరుగా వున్నాడంటే వాడి కుటుంబం అంతా వాళ్లకే సేవ చెయ్యాలి. వాళ్లకే ఇంకో చోట కూలి డబ్బులెక్కువ దొరికినా పోకూడదు. అందరూ కామందుల ఇళ్లల్లోనే వూరికే పనిచెయ్యాలన్నంత నిరంకుశత్వం ఇంకా ఇంకా గ్రామ సీమల్ని వదల్లేదు.

'ఏమిటి దాన్నలా రాసుకు తిరుగుతావ్! నీకు చిరాకెయ్యదూ!' అంటుంది మామ్మ.

'చిన్నప్పట్నించీ దీనిని దరిద్రపుగొట్టు లక్షణాలేనండీ అత్తా! చిన్నప్పుడు ఇది దీన్నెత్తుకునే 'నరిసి' దగ్గరే అన్నం తింటానని మారాం చేసేది, మీకు జ్ఞాపకం వుందో లేదో కానీ' అంటుంది అమ్మ. నిజ లక్షణాలు దరిద్రపు గొట్టువే కాబోల్సు. నాకేం?

క్రితం సంవత్సరం నేనొచ్చేసరికి చెరువుకి ఏం దోషం తగిలిందో ఏమిటో! కలకల విరిసే తామరపూలన్నీ తలవాల్చేసాయ్. ఆకులన్నీ వాడి పోయాయ్. నాకు చెరువు అంతా నిర్జీవమైపోయినట్లు తోచింది. విచారంగా వుంది నాకు.

'తామర అంతా అల్లా చచ్చిపోయిందేమిటే ముత్యాలూ?'

'అరిగె బియ్యం కడిగారు కాబోల్ను ఎదవ సచ్చినోళ్లు. తామర దుంపంతా సచ్చిపోనాది!' అంది ముత్యాలు. దానికి ఎన్ని విషయాలు తెలుసు? దానికి తెలుసున్న విజ్ఞానంలో నాకెన్నో వంతు తెలుసు?

'అరిగె బియ్యం అంటే ఎల్లా వుంటాయ్!' అన్నాను.

'నీకేటి తెల్దే, అయి, నువ్వెప్పుడూ సూడినేదేటి? అయ్యి ఓదాన్నెవే! మినుముల్లా నల్లగా ఇంకాత్త పొడుగ్గా వుంటాయి. ఎంత సన్నగా వుంటయ్ అనుకున్నవ్ సిట్టీ! ఆ బత్తాలో సూది ఏత్తే అడుక్కిపోతది. ఓపాలి ఏటయిందో తెల్సా, మీ వోళ్ల పిల్లలు దాగుడుమూత లాడుకుంటున్నారు. అందులో ఓల్ల పిల్లడు, అరిగెలు దాచుంచిన పాణకలమో దిగాడు. మెల్లంగ అడుక్కు జారిపోయి ఊపిరాడక సచ్చిపోనాడు'

'ఆ అన్నం తింటారా మీరు?'

'తినక! అయ్యి బియ్యం అపటానికి బోలెడు చాకిరి చేయాల! ముందరో సాలి దంపాల, మళ్లీ తిరగట్లో ఏసి ఇసరాల!'

నేను మళ్లీ చెరువుకేసి చూశాను. చెరువు దిగులుగా వుంది. నాకు కళ్లమ్మట నీళ్లొచ్చాయి.

'సిట్టీ! నీ దాస అంతా సెరువుమీదే వున్నది కామాలు. దంబిడీ ముఖం పెట్నావు, నువ్వు మళ్లీ వచ్చేసరికి ఈ సెరువు నిండా మనుపటికన్న ఎక్కువ పూలుండేట్లు చేత్తాను. దిగులు పడమాక, పాలేన్ని పెద్ద చెరువులో బోలెడు దుంపలుంటయ్. నాలుగు తెచ్చి పడేత్తాను'

'ఏటేటే! ఈరురాలు బయిలెల్లిందెహ! తామర దుంపలు నువ్వు తెచ్చి ఏత్తావా? బతుకుదామనా సద్దామనా!' అన్నాడు సూరయ్య దాని మాటలు విన్నాడు కాబోలు.

'తామరపాతు తేనే పానం పోతదా!' అన్నది.

'వెనకా ముందు ఎవరూ లేనోరు, సచ్చే ముసలోళ్లు, ఎయ్యాల ఇత్తనం. ఎవురు పడితే ఆరు ఎయ్యకూడదు. వేత్తే మూడ్రోజులు తిరగకుండా సత్తారు. శాపం వున్నదట' అన్నాడు సూరయ్య.

'ప్చ్! ఇంక ఈ చెరువు ఇల్లా వుండాల్సిందే అన్నమాట!' నీళ్లు కారిపోయాను.

'మా లావు సెప్పావులే! అదేందో నేనూ సూత్తాను. ఇయ్యాల సత్తే రేపటికి రెండు' అన్నది ముత్తి బింకంగా.

'నువ్వు సావటం ఖాయం. నిన్ను నమ్ముకోనున్న ఆ ముసలాడ్ని ఏటి సేస్తావ్! సెర్లో పూలు ఆకులూ లేనంత మాత్రాన్ని వొచ్చిన లోటేటి! వోరన్న ముసలాడు దొరికితే అణ్నట్టుకొని ఏయిద్దాం' అన్నాడు సూరయ్య. నాకు నిజంగా భయం వేసింది.

'ఒసే ముత్యాలూ నువ్వుగానీ తామర దుంప తెచ్చేవ్! తెజోకుస్మా! నాకు ఇప్పుడే ఎంతో బావుంది చెరువు. నిర్మలంగా వున్నయ్ నీళ్లు నాకు. నేను వొచ్చినప్పుడల్లా నువ్వు కనబడితే చాల్ను. చెరువు ఎల్లావున్నా ఫరవాలేదు'

'నేను ఏటవుతాను సిట్టీ! అదేదో ముసలాడిమాట సెప్పాడు. ముసలాళ్లు సావక బతుకుతారా! ఆడేసినా సత్తాడు ఏయకపోయినా సత్తాడు. ఏసి సచ్చాడు. కనక ఇన్నాళ్లూ సెరువు కలకల్లాడినాది'

'నామీదొట్టే ముత్యాలూ! నువ్వు మాత్రం తేబోకు'

'నాకు మాత్రం పానాలమీది తీపి వొదులుద్దేటి సిట్టీ, కొకెంత బాగుందనుకున్నావ్! కట్టుకోని 'పెద్దింటమ్మ తిరణాలకు పోతే అంతా నావొంక చూసే వోరే!' మాట మార్చేసింది ముత్తి

'నువ్వంత బాగుంటావు మరి. చూడరా?'

'మాటలు నేర్చావులే బాగ! మరి ఎల్లకాలం సదువేనేటి! పప్పన్నం ఎప్పుడు పెడతావు?'

'నేనొక్కదాన్నేనా పెట్టాల్సింది? మరి నువ్వెప్పుడు చేసుకుంటావు?'

'అక్కడికెల్లాక చేసుకుంటాను' ఆకాశం చేసి చేయి చూపించింది

'ఛీ! ఏం మాటలు ముత్యాలూ! నాకెంత కష్టంగా వుందో తెల్సా!' నాకు కళ్లమ్మట నీళ్లొచ్చాయి

'ఎంతభిమానం నీకు నేనంటే సిట్టీ! మరేం చేయను చెప్పు! మరి మా అయ్య నేను 'సీతయ్య'ని చేసుకుంటానని కొప్పనేదు. కులపోళ్లూరుకోరు అంటాడు. నాకయినా ఆడికయినా ఒకటే పానంగా వున్నోళ్లం. ఎదవ కులాలు! మమ్మల్ని సంపుతాయి. సంపనీ ఏం జేత్తాం!' నిర్లిప్తతగా అంది.

'మరి మీరూ మీరూ ఒకటి కాదా!'

'సీతయ్య వాళ్లు కిరస్తానం పుచ్చేసుకున్నారు. మేం పుచ్చుకోలేదు. ఆడి చుట్టాలంతా బత్తీల్లో పదువుకోని వుద్దోగాలు సేత్తున్నారు. మరిగంటే సీతయ్య నన్నుకూడా సదివింతన్నాడు. మరి మేమంటే ఆళ్లిళ్లల్లో ఇస్తరేయం. ఇంక ఎలా ముట్టుకోటం? ఇటు జూడబోతే మా అయ్య ముసిలాడు. ఒంటిగాడు. ఏం జేయాల్లో తోయకుండా వుంది' ముత్తి దిగులుగా అంది., అంత దిగులూ మనసులో దాచుకునే పైకి నిండుగా సముద్రాన్ని కలవబోతున్న నదీ ప్రవాహంలా జిల్లు జిల్లు మంటూ వుందన్నమాట ముత్యాలు!

వొచ్చేటప్పుడు మరీమరీ చేతిలో చేయివేసి చెప్పాను. తామరదుంప తేవొద్దని. తేనని చెప్తూనే కళ్లమ్మట నీళ్లెట్టుకుంది ముత్యాలు!



కిటికీలోంచి చెరువుకేసి చూశాను. ఆ తామర పూవుల్లో, ఆకుల్లో, ఆ పూల రేకల చివర్లలో, ఆకుల మధ్యని, సన్నని ఈనెల్లో అంతటా, నాకు ముత్యాలే వేల రూపాల్లో కన్పించింది. తప్పకుండా తామరదుంప ముత్యాలే వేసి వుంటుంది. ఆ దోషం కొట్టే చచ్చిపోయింది. దాని రక్తబిందువుల్ని నింపుకున్నాయి కనుకనే ఆ పూలకి అంత అందమొచ్చింది.

'నేను నీకు కనబడతానే వున్నాను సిట్టీ! ఎందుకంత బెంగపడతావు?' అన్నట్టు ముత్యాలు గొంతు విన్పించింది. దాని రుణం, ఈ చెరువుకి, ఇంత శాశ్వత సౌందర్యం చేకూర్చిన నా ముత్యాలు రుణం ఎల్లా తీర్చుకుంటాను?

ముత్యాలూ! నీ స్నేహ సౌరభంతో నా మనస్సంతా నిండిపోయిందే? ఎల్లా మర్చిపోతాను? నా మనస్సులో కలిగే సందేహ తోరణాలు ఎవరు విప్పుతారు? నన్నర్థం చేసుకుని నా మాటలు నాకే విప్పిచెప్పే దేవతవు. నా మీద ఎందుకు అలిగావు? నీమీద బెంగతో కుమిలిపోతున్నానని చెప్పితే వీళ్లంతా నన్ను పిచ్చిదాని క్రింద జమ చేస్తారు కదా! నిజంగా పిచ్చిదాన్నయితే ఎంత బాగుణ్ను! తెలిసీ తెలియని అవస్థ కన్న, అయోమయావస్థ వేల రెట్లు మెరుగు కదూ!'

'ఇంకా అల్లానే కూర్చున్నావుటే ఆ కిటికీలో! లేచి స్నానం చెయ్యి వేగం! అంతా నువ్వొచ్చావని

చూడటానికొస్తే అల్లా చీకిరి గంపలా కూర్చుంటావేమిటే! ఖర్మ' అన్నది మామ్మ.

'అది చిన్నప్పట్నించీ అంతేనండి, అత్తా! వొట్టి మట్టిముద్ద. ఏమిటో ఆలోచిస్తోంటుంది ఎప్పుడూనూ' అని వంత పాడింది అమ్మ.

'ఇప్పుడొచ్చిందో, లేదో అప్పుడే సాధింపు మొదలెట్టారా దాన్ని' నాన్నగారి కంఠం విన్పించేసరికి నా ప్రాణం లేచొచ్చినట్టు అన్పించింది.

'నాన్నగారూ! మనూరి చెరువు పేరేమిటండీ!' అన్నాను.

'పేరేమి లేదమ్మా ఏం?'

'ముత్యాల చెరువు అందామా దాన్ని!'

'అనుకోమ్మా! దానికేం?'

'అవును, ముత్యాల చెరువు అంటే బాగుంటుంది. నా ముత్యాలు, తన జ్ఞాపకం కోసరం, చెరువంతా తామరలతో నింపిపోయింది. అందుకనే తామరాకుల మీద నిలచిన నీటి బిందువులు ముత్యాలల్లే మెరుస్తాయి!'

'అల్లా అయితే చిన్న బోర్డుమీద వ్రాసి అక్కడ పెట్టిద్దామా నాన్నగారూ!'

'నీకు నువ్వనుకోవమ్మా చాల్ను. ఎవరైనా వింటే నవ్విపోగల్రు!'

నవ్వుతారట. ఎందుకు నవ్వుతారు? నాకు కోపం వచ్చింది.

'నాకు నేనే అనుకుంటాలేండి నాన్నగారూ. ఏ మంత్రిగార్నో పిలిచి మీటింగు చేయించి, నామకరణోత్సవం చేయించగలిగే స్తోమత నాకు లేదుగా!'

'ఏమిటే! వెధవ సొద! ఇదేం తిరుపతా, శ్రీరంగమా! ఇంతోటి పుష్కరిణికి పేరు కావాలిట! పేరు! పట్టుమని పది కొంపలు లేవు! చదవేస్తే వున్న మతి పోతోంది దీనికి. అందుకే మహాప్రభూ! దీన్నెవరికో దారినపోయే దానయ్యకిచ్చి మూడు ముళ్ళూ పడేయించండి అని మొత్తుకుంటుంటే వింటున్నారా?' అంటూ అమ్మ మొదలెట్టింది.

నాకు మటుకు తిరుపతీ శ్రీరంగం పుష్కరిణులకన్నా నా ముత్యాల కోనేరే ఎక్కువ అని వాళ్లకి చెప్పినా తెలీదు. చెప్తే అర్థం చేసుకునే వ్యక్తి, నక్షత్రాలకి జతగా ఆకాశం మీదుంది.



# పేడ పురుగులు కాటేస్తాయి ఖబడ్దార్!

కప్పగంతుల మల్లికార్జునరావు

భార్యాభర్తలే అయినా, వరలక్ష్మి సింగన్నల స్వభావాలు, ప్రవృత్తులు పరస్పర విరుద్ధాలు.

సింగన్నది పాతకాలపు పాలేరు బుద్ధి. పొగాకు తుంపు కోసం పాతిక కావిళ్ళు నీళ్ళు మోస్తాడు. అరకాయ సారాయి కోసం కామందులకు ఆరునెలలు వెట్టిచాకిరిచేయ సిద్ధపడే ప్రవృత్తి. వాటికోసం కామందుల చుట్టూ కుక్కలా తిరుగుతాడు.

కుక్కలా చూచినా, అతడిని ఊళ్లో కామందులంతా 'మంచివాడని, నమ్మకస్తుడ'నే పొగడు తుంటారు. విని వినీ ఆ పొగడ్తలకు బానిస అయిపోయాడు. వూరకే చాకిరి చేసి, వాళ్ల దయతల్చి విదిలించే ఎంగిలి మెతుకుల్ని, పొగడ్తలనీ తింటూ బతుకు వెళ్లతీయడం అలవాటు చేసుకున్నాడు సింగన్న. అలా ఎప్పుడూ పెద్దవాళ్లని ఆశ్రయించి బతుకుతుండటంవల్ల అతనికి లభించిన స్థిరాస్తి తాగుడు.

కాపురానికొచ్చిన కొద్దిరోజుల్లోనే మొగుడి 'వూరికుక్క' బుద్ధిని, అతడిని ఉపయోగించు కొంటున్న వాళ్ల కుట్రని వరలక్ష్మి కనిపెట్టేసింది. ఆమెది చిన్నతనంనుంచి స్వేచ్ఛా ప్రవృత్తి తనమీద తనకు నమ్మకం జాస్తి. ఎవర్నీ లెక్కచేయని స్వభావం. డబ్బుకన్నా నీతిని గౌరవించే తత్వం.

మొదట్లో భర్తకు తిరుగుబాటు తత్వాన్ని బోధించబోయింది. ఊళ్లో కామందులు తెలివిగా అతడి శక్తిని ఎలా దోచుకుంటున్నారో వివరించింది. అయితే సింగన్న - భార్య వాళ్లను తిట్టే కొద్దీ - యింద్రులు, చంద్రులు అని పొగిడి పారేయటంతో, వరలక్ష్మికి కోపం వచ్చింది. సత్యాగ్రహం చేసి భర్తను లొంగదీసుకోవాలనుకొంది. కానీ అతడి పెళ్లాం కన్నా, ఆ 'పేరాసైట్' బతుకే ముఖ్యమని తెల్సుకొన్నాక, వూరి పెద్దలు అతనికి చేసే అన్యాయాన్ని తలుచుకుని మండిపోయింది. ఊళ్ళో ఆసాములంటే అసహ్యం, కచ్చతో ఆమె గుండె నిండిపోయింది.

''మంచితనముంటే సేతకానితనం కాదర్రా. ఎర్రోడిని సేసి నీ కట్టాన్ని దోసిళ్ళతో దోసేత్తన్నారు. ఇంత మన్నుదిన్న మనిసివి - సీ - నువ్వొ వో మూడిమేనా?'' అంటూ చీదరించుకొంటూనే ఏడ్చింది.

ఎలా తెల్సిందో ఏమో వరలక్ష్మి భర్తను ''నువ్వొ వో మూడిమేనా?'' అన్నట్లు వూళ్లో పెద్దలకు తెల్సి సింగన్నను ఎగతాళి పట్టించారు.

''ఏరా సింగాయ్. నీ కొత్త పెళ్లాం నిన్ను కొజ్జావాడని అందిటగా?''

''కత్తిలాంటి పిల్లరోయ్ నీ పెళ్లాం. కాస్త కనిపెట్టి వుండు''

మొగుడి అసమర్థతను, మంచితనాన్నీ, ఎన్నిసార్లు తిట్టినా, వరలక్ష్మికి సింగన్నమీద రోజురోజుకి ప్రేమా, జాలీ పెరిగాయే కానీ వీసమంత ఎత్తు అసహ్యం కలగలేదు.

అతడిని మార్చాలి. తన సంసారాన్ని చక్కదిద్దుకోవాలి. ఇదీ ఆమె తాపత్రయం.

మొగుడు తెచ్చే ఎంగిలి మెతుకుల మీద ఆధారపడి బతకడం అసహ్యమనిపించింది పొగాకు కోతలకు వెళ్లింది. సింగన్న అదేమిటి అని అడగలేదు. పైగా, వూరివాళ్లను ఆశ్రయించినట్లే భార్యనూ ఆశ్రయించి అప్పుడప్పుడూ రూపాయి అర్ధా పట్టుకెళ్లి తాగడం ప్రారంభించాడు. ఏరోజుకారోజు అతడికి డబ్బు ఇవ్వకూడదనుకునేది వరలక్ష్మి. కానీ అతను దీనంగా అడిగేసరికి బలహీనం ఆవహించేది, లొంగిపోయేది.

పొగాకు కోతలయ్యాక బేర్నీలకు గ్రేడింగుకెళ్లింది ఆ తర్వాత మూడు మైళ్ల దూరంలో వున్న పొగాకు కంపెనీలో కూలీకి వెళ్లింది. మంచి పనిమంతురాలుగా అన్నిచోట్లా పేరు పొందింది

పొగాకు సీజన్ అయిపోతే ఆ ప్రాంతాలలో కూలీలకు పని అంతగా వుండదు. సీజన్‌లో కుటుంబమంతా కష్టపడి సంపాదించిందాంతో కాలక్షేపం చేస్తారు కొందరు. మరికొందరు వరినాట్లకు పమున్న ప్రాంతాలకు వలసలు పోతుంటారు.

వరలక్ష్మికి ఈ రెండు మార్గాలు అసాధ్యమైనవే. సింగన్నను వూరు పోనివ్వదు. వరలక్ష్మి సంపాదించిందాన్ని అతడు మిగలనివ్వలేదు.

యిక మిగిలిన మూడో మార్గం దొంగతనం. ఆ వూరి మాలపల్లెలో అలా బతికేవాళ్లను వేళ్లమీద లెక్కపెట్టవచ్చు. వాళ్లని అందరికీ తెల్సుకనుక వోకంట కనిపెట్టే వుంటారు.

వరలక్ష్మి రక్తంలో దొంగ స్వభావం అణువులో ఆరుకోట్ల అంశమైనా లేదు. అంచేత ఆమె పనిలేని రోజుల్లో పొలం గట్ల వెంబడి గడ్డి కోసేది. పేడకళ్ళు ఎత్తి పిడకలు చేసేది.

అయితే అది అసలే మెరక ప్రాంతం. అందులో ఆ ఏడు వర్షాభావం. ఎంత గడ్డి కోస్తే మోపు అయ్యేను? పొట్ట సగమైనా నిండేను?

ఆ రోజు ఆమె పొలం గట్టున దోకుడు పారతో గట్టి దోకుతున్నది. వర్షంలేని పొలం గట్టుమీద గడ్డిపోచలు పేదవాళ్ల పొట్టల్లా, నేలను అతుక్కుపోయి వున్నాయి. దోకిదోకి వరలక్ష్మి చేతులు నొప్పులు పుట్టేయి. అలుపు వచ్చింది. అవతల చూస్తే అరమోపు గడ్డి కాలేదు. అమ్మితే వచ్చిన డబ్బుల్తో ఏం కొనటం? బియ్యం, వుల్లిపాయి, మిరపకాయి, చింతపండు, కట్టెపుల్లలు...

కట్టెపుల్లల ఆలోచన రాగానే వ్యధాభరితమై నీరసపడ్డ ఆమె మనస్సుకు ఎన్నడూ లేని వో వూహ వచ్చింది.

అటు పొలం- యిటు పొలం! ఎటు చూచినా ఎండిపోయిన పొగవేళ్ళ గుట్టలే. గుప్పెడు పొగకట్టెలు తీసుకుపోతే కట్టెల ఖర్చు కల్సిరాదూ?

వొకర్ని యాచించడం అసహ్యించుకునే వరలక్ష్మి, తీవ్రమైన అభిప్రాయాలు కలదిగా, విక్కచ్చి మనిషిగా, పనిమంతురాలిగా పేరుపడ్డ వరలక్ష్మి క్షణంసేపు అవసరానికి, ఆకలికి తల వంచింది.

గట్టుదిగి చేలో కాలుపెట్టింది. అల్లంత దూరంలో వున్న కొట్టం వైపు నడవసాగింది...

ఆ కొట్టం దాని చుట్టూ చాలామేరకు వున్న భూమి, ఆ వూళ్లో చాలా పెద్ద రైతుగా పేరుబడ్డ రాఘవయ్యది. ఆయనకు కొట్టంవైపు వచ్చే వ్యవధి వుండదు.

ఆ సమయంలో ఆయన ఏకైక పుత్రుడు కొట్టంలో నవారుమంచంపైన, మెత్తటి పరుపుమీద పడుకొని ఇంగ్లీషు నవలను చదువుతూ, మంచి రసఘట్టంలో మునిగివున్నాడు.

అతని పేరు మాధవ్

రాఘవయ్య తండ్రి సామాన్యరైతు అరక పట్టుకొని పొలం దున్నేవాడు రాఘవయ్య హయాంలో

ఆ అరకను మరొకరి మెడకు కట్టి, చన్నకోలు పుచ్చుకొని పైపై అజమాయిషీ చేసేదాకా వచ్చింది

మాధవ్ తాత కష్టానికి, తండ్రి అజమాయిషీకి కాని వారసుడు కాదు వారిద్దరూ సంపాదించిన అపారమైన ఆస్తికి మాత్రం వొక్కగా నొక్క వారసుడు

చన్నకోలు పుచ్చుకున్న దగ్గరినుంచి రాఘవయ్యకు అన్నీ గొప్ప గొప్ప ఆలోచనలే. కొడుకును కలెక్టరును చేయాలన్నది అందులో వొకటి

''కలెక్టరు కారులో తిరుగుతాడు కాని అరక పట్టుకొని దున్నుతాడ్రా? మెత్తటి తివాచీలమీద నడుస్తాడు కాని మట్టిలో తిరుగుతాడా?'' అంటూ ఆయన మాధవ్‌ను చిన్నతనంనుంచి పొలం పనులకు దూరంగా పెంచేడు

ఒకటో క్లాసు దగ్గర్నించి మాధవ్ చదువు పెద్ద పట్నాలలో, ఖరీదైన కాన్వెంట్ స్కూళ్లలోనే. వయసుతోపాటు అతను చదివే క్లాసులు, క్లాసుల్తోపాటు అతని ఆలోచనలు, అలవాట్లూ, వూహలూ పెరిగేయి అతనిప్పుడు చదువుతున్న కాలేజీలో పెద్ద మేధావిగా పరిగణింపబడకపోయినా, అతను చాలా రోజులుగా ఆ వూళ్లో గొప్పవాడుగా, కాబోయే కలెక్టరుగా, వూరికి పేరు తెచ్చే 'దొరబాబు'గా పరిగణింపబడ్తూనే వస్తున్నాడు. అతను ఎవరికీ అర్థంకాని రీతిలో ఇంగ్లీషులో మాట్లాడుతుంటే వినేవాళ్లకు భయం వేస్తుంటుంది.

అతనింకా కాలేజీలో చదువుతున్నా కలెక్టరయిపోయినట్లే వూళ్లో ప్రవర్తిస్తుంటాడు. కలెక్టర్ని ప్రజా సేవకుడిగా అతను వూహించుకోడు. పెద్ద చక్రవర్తి అన్న భావనే. అంచేత చక్రవర్తి అమ్మ మొగుడంత హుందాగా అతను ప్రవర్తిస్తాడు. సాధారణంగా ఎవ్వరితో మాట్లాడడు. మాట్లాడితే ఇంగ్లీషులోనే. అతనికిప్పుడు తెలుగు తెల్సో లేదో చెప్పడం కష్టం.

ఆ సంవత్సరంతో అతని డిగ్రీ చదువు అయిపోతుంది. వెంటనే కలెక్టరు వుద్యోగంలో చేరిపోవాలా, లేక అమెరికా పోయొచ్చి కలెక్టరు ఉద్యోగంలో చేరటమా అన్న అనుమానం వచ్చిందతని కామధ్య. తండ్రికి రాస్తే ముందు కలెక్టరు వుద్యోగంలో చేరమని రాసేడు. అతనికి మాత్రం అమెరికాకి పోయొచ్చాక కలెక్టరవుదామని వుంది.

ఈ సమస్యను తేల్చిపారేసుకొంటేనే కాని అతనికి శాంతి వుండదు. అంచేత ఏదో శెలవులిస్తే ఊరికొచ్చేడు. అయితే అతనికా వూరు వస్తే ఏమీ తోచదు. నక్సలైట్ కాంపులో చిక్కుబడ్డ పారిశ్రామికవేత్తలా గిజగిజలాడిపోతాడు

అంచేత సాయంకాలం కాగానే అతను దర్జాగా ఇంగ్లీషు పుస్తకాలు పట్టుకొని పొలం వైపు పోవడం పరిపాటి. అతను ఊళ్లో దిగగానే రాఘవయ్య కొట్టాన్ని ఫైవ్‌స్టార్ హోటల్‌లో రూమ్‌లా తయారుచేయిస్తాడు. గొప్పవాళ్ల అలవాట్లు ఆయనకి తెల్సు కనుక ఆ ఏర్పాట్లు కూడా అవే జరిగిపోతాయి.

ఇప్పుడూ అలానే వచ్చాడు. నవల మాంచి రసవత్తర ఘట్టంలో వుండగా సూర్యుడు అస్తమించేశాడు. అక్షరాలు మసకకావడంతో చికాకు పడి లేచాడు పరుపుమీది నుంచి, పాలేరును కేకేయబోతూ వరలక్ష్మి రాకను గమనించాడు.

హీరోయిన్ హీరోని కాదని వెళ్తున్న ఘట్టంలో అతని నవలా పఠనానికి బ్రేక్ పడింది. ఇప్పుడా హీరోయిన్ తిరిగి వస్తున్నట్లు, తాను హీరో అయినట్లు క్షణకాలం భ్రమలోపడ్డాడు. వరలక్ష్మి నడకలో హీరోయిన్ నడకలో వయ్యారాలని ఊహించుకొంటూ ఆమెనలాగేచూస్తున్నాడు

నిజానికి వరలక్ష్మి ఏ ఏంగిల్‌లో నుంచి చూచినా కూడా అందగత్తె అని చెప్పడానికి వీల్లేదు అయితే అదేం చిత్రమో, చిన్నతనం నుంచి సరైన తిండి బట్టి లేకపోయినా ఆమె అవయవాలన్నీ మంచి పొంకంగా ఆకర్షణీయంగా ఉంటాయి

రోజూ చూచేవాళ్ళకి ఆ ఆకర్షణ మోటుగా కన్పిస్తుంది కాని సినిమాల్లో, పుస్తకాల్లో, రోడ్లమీద నాజూకు ఆడవాళ్ళని చూట్టానికి అలవాటు పడ్డ కళ్ళకు ఆమె మోటుతనమే గొప్ప ఆకర్షణ

''బాబయ్యా పొయ్యిలో నోమోపు కట్టెలిప్పించండి ''

మాధవ్‌కు ఆమె మాటలు విన్పించాయో లేదో చెప్పటం కష్టం. అతను ఇంకా భ్రమలోనే వున్నాడు అంచేత ఇంగ్లీషు నవల్లోని హీరోయిన్ పేరుతో ఆమె పిలుస్తూ దగ్గరకు నడిచాడు.

ఇన్నాళ్ళయినా ఊళ్ళో వరలక్ష్మి దగ్గర ఎవరూ అలాంటి సాహసాలు చేయలేదు. మగాళ్ళంతా పవిత్రులయినారు భయం కొంత, ''కొన్నాళ్ళు చూద్దాం'' అని కొంత

''ఏంటి బాబయ్యా అట్టా సూత్తరు? పొగకట్టేలడగతన్నా ''

''డు యు వాంట్ మి టు కిస్!'' అంటూ అతడామె రెండు భుజాలు పట్టుకొన్నాడు ఆవేశంతో

మరో సమయంలో అపుతే చాచి చెంప పగలగొట్టేదే. కానీ మాధవ్ మాటలు, చేతలు, వేషం సినిమాల్లో మనుషులివిగా ఆమెకు చిత్రంగా వున్నాయి.

''కొంటిమీంచి సెయ్యి తియ్యండి ముందు'' అంటూ అతడి చేతిని బలంగా విదిలించి కొట్టింది.

మాధవ్ అప్పటికి స్వాప్నిక స్థితినుండి బయటపడ్డాడు ఇంగ్లీషు నవలలో హీరోయిన్‌లా కాకపోయినా, శరీర పొంకంతో ఆకర్షణీయంగా కన్పించింది వరలక్ష్మి. ఆకలి చావు చావడానికి సిద్ధంగా వున్నవాడికి, సిద్ధాన్నం కన్పించినట్లు ఆమె మీదికి వురకబోయాడు.

చెయ్యి కలుక్కుమంది దాంతో ఆమె చేతిని విదిలించి కొట్టిందన్న స్పృహ వచ్చింది అహం దెబ్బతింది పరీక్షగా చూచాడామెను.

మురికిగుడ్డలు - మట్టి చేతులు చేతిలో దోకుడు పార - శరీరంనిండా ఆకలి కప్పుకొని వున్నది. గడ్డి దోక్కొనే మాలది!

''సీకటి పడిపోతన్నది. గుప్పెడు పొగాకు కట్టెలు...''

ఇప్పటికి మాధవ్‌కు దాని ఘోష అర్థమయింది తోసేసిన చేతితోనే దాని శరీరంమీద మురికి బట్టల్ని వలిపించే మార్గం తోచింది.

ఊళ్లో మోతుబరి తండ్రి - కాబోయే కలెక్టరు - అమెరికా వెళ్లే యువకుడు - వూళ్లోవాళ్ల చూపే భయం, గౌరవం - ఈ భావాలన్నీ కల్సివచ్చి అతడి నెత్తినెక్కి స్వారీ చేయసాగేయి.

''పొగాకు కట్టెలు కావాలంటే... అలాగే యిస్తా. అయితే వొక్కో కర్ర ఖరీదు'' ముద్దు నభినయం చేసేడు. ''రాత్రంతా యిక్కడే వుంటే ఆ గుట్ట కట్టెలు ఇస్తా ఏమంటావ్?''

వరలక్ష్మి వెంటనే ఏమీ అనలేదు. కాని అతను యిందాకటి మనిషి కాదని మాత్రం గ్రహించింది.

''మాలముండా, ఎవరనుకున్నావే నన్ను? నా చెయ్యి యిసిరి కొట్టే దమ్మొచ్చిందా నీకు? వుండు నీ పని చెప్తా -

అపుడతన్ని చూసిన వాళ్లకి రాఘవయ్య దాష్టీకం గుర్తుకొస్తుంది

కానీ వరలక్ష్మికి తిరుగుబాటు గుర్తుకొచ్చింది తన వ్యక్తిత్వాన్ని తడుముకొంది

''నేను మాల్దాన్నేనండీ అయితే నన్ను పట్టుకొన్న నువ్వెవడివండీ? వరలక్ష్మి సంగత్తెలీదేంటి మనకు?''

''స్టాప్'' చిరాగ్గా అన్నాడు మాధవ్ ''ఏంటే నీ సంగతి ముష్టిముండా? మహో నీల్గుతున్నావు? నా ముద్దు ఖరీదెంతో తెల్సా? మూడు లక్షలు నా ఖరీదెంతో తెల్సా? ముప్పై లక్షలు.

అతనిలోని అహాన్ని ధనగర్వం కెక్కించ్చింది. మత్తెక్కిపోయింది పేడ పురుగును పట్టుకొన్నట్లు ఆమెను పట్టుకోబోయాడు

పేడపురుగు పామై కాటేసింది అతడి పళ్లు కదిలేయి, బుసలు కొట్టే వంతు యిప్పుడు పేడ పురుగుది.

''ముట్టి నంజకొడకా. నీ డబ్బెంతసేసు? నువ్వెంత సేసు? కట్టంముందు నీ డబ్బంతా కలిపిన బలదూర్. నీ మొగానికి ముండలు కావల్సి వచ్చారేం? వరలచ్చిమి అంటే ఏటనుకొన్నావో? ఆ పొగాకు గుట్టలో పడుకోబెట్టి కాల్చిపారేస్తా ఖబడ్దార్''

కల్టెక్టరుబాబుకు పళ్ళతోపాటు బుర్ర కూడా తిరిగిపోయింది. ఊళ్ళో తనంటే భయపడి గౌరవించే తన ఊళ్ళో వో మాలది - యిదేమిటి? ఏ శతాబ్దం ఇది? ఎక్కడున్నాడు తాను?

అతను కాస్తంత తేరుకునేసరికి వరలక్ష్మి గట్టుచేరి గడ్డిమోపు కట్టుకొంటోంది.

అహంకారం - పగలుకి ధైర్యాన్నిచ్చాయి. పెద్దగా అరిచాడు.

''ఎవర్రా అక్కడ? దాని దగ్గర ఆ గడ్డిమోపు లాక్కోండి చేనుగట్టుమీద గడ్డంతా కోసుకు పోతోంది. పట్టుకొని పెడరెక్కలిరిచి కట్టేయండి''

అప్పుడతన్ని చూచిన వాళ్లకు కల్టెక్టరు ఛాయ గుర్తుకురాదు. అనాదిగా వున్న భూస్వాములు, వాళ్లు సృష్టించిన వ్యవస్థ యొక్క ప్రతిబింబం గుర్తుకొస్తుంది.

తెలుగులో వున్న అతని కేకలకి చుట్టుపక్కల పొలాల్లో వాళ్లంతా గుమిగూడేరు. కల్టెక్టరుగారి ఆజ్ఞల్ని సగం సగం అమలు జరిపే రెవిన్యూ ఇన్‌స్పెక్టర్లలా అతని ఆదేశాలని అమలు జరిపేరు.

పగలస్తమానం కష్టపడి వరలక్ష్మి కోసిన గడ్డిపరకల్ని అతికష్టంమీద లాక్కోగలిగారు. ఆమెను బతిమలాడి యింటికి పంపేశారు.

''ఆ గడ్డిని గొడ్లకెయ్యండి. నో. నో. మాలముండ కోసిన గడి- మన గొడ్ల కెయ్యొద్దు. కాల్చి మసి చేయండి. ఏటో పారనూకండి''

నవనాగరికతను మేకప్ చేసుకొన్న భూస్వామి (న్యూ) రూపం అది!



తెల్లారేసరికి వూళ్లోవాళ్లు వరలక్ష్మి పేరుకు ముందు 'దొంగ' అన్న బిరుదు తగిలించి మాట్లాడుకోసాగేరు. గొడ్లు పొలాలకెళ్ళే వేళకి వూరి వెట్టి, మున్సబుగారినుంచి కబురు తేనే తెచ్చేడు. పంచాయితీ.

సింగన్న భార్య చెప్పింది విని గజగజా వణికిపోయాడు.

పెద్దోళ్లతో తగాదాలొద్దే. దొంగతనం వొప్పేసుకో. ఆరి కాళ్ళా ఏళ్ళా పడి సిచ్చలెకుండా సేత్తా.

''నీ.. మగాడివి కాదంట్రా నువ్వు? నీతి, నిజాయితీ, ధైర్యం వున్నోళ్లు వొక్కమారే సత్తారు. నీలాంటి పిరికోళ్లు పెతి నిముషం సత్తూనే వుంటారు. మాలోళ్ళూ మనుసులేనని ముక్కు గుద్ది సెప్పొద్దాం పదరా ..''

పంచాయితీలో జంకూ గొంకూ లేకుండా జరిగిన కథంతా చెప్పింది , కల్లెక్టరుబాబును కడిగి పారేసింది.

''ఈ మాలముండకన్నా 'రంభ' దొరక్క? దొంగముండ ఎన్ని అబద్ధాలు చెప్తోందో చూడండి'' రాఘవయ్య పళ్లు పటపట కొరికేడు.

''మున్సబు బాబూ! తిట్టడం ఆరికే కాదు, నాకూ సేతవ్. కాత్తంత మరియాదగా...''

మర్యాదలు నాకు నేర్పుతావంటే లం ..

తెనీకపోతే నేరుపుతారా నం....

రాఘవయ్య గుండె బేర్నీలో రాక్షసిబొగ్గు అయింది. శరీరం పొగాకుకాడలా కమిలిపోయింది. వరలక్ష్మి అంతగా తెగించినా మాట్లాడలేదంటే మున్సబు మహిమ అది. ఆయనె లేకపోతే ఆ క్షణంలో హత్యలు జరిగిపోయేవి.

మున్సబు భారీ మనిషి. శరీరం, మనసు, గుణం, ధాతృత్వం - అన్నీ భారీవే. మంచితనానికి మారు పేరు. కోపం వస్తే ప్రళయకాల రుద్రుడే.

అచ్చుమయిన పెద్దమనిషిగా అతడిని వూరు ఏనాడో గుర్తించింది. అతని తీర్పులు నిక్కచ్చిగా, నిష్పక్షపాతంగా వుంటాయి. తీర్పు ఇచ్చే ముందు బాగా ఆలోచిస్తాడు. యిచ్చాక ఊరికది శాసనమే.

వరలక్ష్మి చెప్పినదంతా విన్నాక అతనికి ఆమె మాటమీద నమ్మకం ఏర్పడింది. అయితే అవతల సాక్ష్యం బలంగా వుంది. చదువూ, సంస్కారం వున్న మాధవ్ మాటల్ని కూడా తేలిగ్గా కొట్టేయటానికి వీల్లేదు.

''మున్సబూ, తొందరగా తేల్చేయవయ్యా, దాన్తో నాకేంది?''

''వరలక్ష్మీ నువ్వు చెప్పిందంతా నిజమనటానికి సాక్ష్యాలేమైనా వున్నాయా?''

''బగమంతుడే సాచ్యం''

''అలాగంటే ఎలా? పొగాకు కర్రలు నువ్వు దొంగిలిస్తుండగా చూచామని ముగ్గురు సాక్ష్యం చెప్పటానికి సిద్ధంగా వున్నారు.''

''ఆ సాచ్చీకమేమిటో సూద్దాం, సెప్పమనండి''

ముగ్గురు మనుష్యులు తాము స్వయంగా చూచినట్లు సాక్ష్యం చెప్పేరు.

''మున్సబు బాబూ! ఆళ్లు మూగా? ఆడా? నేక...''

''మున్సబూ! అది కల్లు తాగిన కోతయ్యా. కళ్లు మూసుకుపోయి మాట్లాడుతోంది''

''నేపోతే ఏంటి బాబూ! ఒక్క ఆడకూతురు ఆళ్ల పొలాల్లో నుంచి పొగకట్టెలు దొంగిలించుకు పోతుంటే నలుగురు మగాళ్లు సూత్తా నిలబడ్డారా? ఆడే నన్ను పట్టుకొని నిలువునా సీల్చేయవచ్చునా!''

పాయింటే మరి!

''సరేనండి బాబూ. దొంగతనం సేయలేదని నేను తలస్నానం సేసొచ్చి తడిబట్టల్తో ఆంజనేయ స్వామి ముంగల పెమానికం సేత్తా. ఆ బాబులు నలుగురు కూడా అట్టాగే సేయమనండి సూద్దాం''

''పైసాయిస్తే పది ప్రమాణాలు, వొంద అబద్ధాలు! దాంతో ఏందయ్యా మున్సబు నువ్వే తేల్చేయి ముందు''

''ఏం తేల్చను బావా? వరలక్ష్మి చెప్పిందే సబబుగా వుంది మనవూరు ఆచారం కూడా అదేగా?''

అయితే మాధవ్ తడిగుడ్డల్తో ప్రమాణం చెయ్యాలంటావ్?

''మనిషి తీర్పుకు అలవికాని కేసుల్ని భగవంతుడి తీర్పుకు వదిలేయడం ఆ వూళ్లో ఆచారమే కాని, మున్సబుకి ఆ అవసరం ఎన్నడూ కలగలేదు.

''తప్పదు'' - అది తీర్పు

వరలక్ష్మి భగవంతుడిని నమ్మి విశ్వాసంతో సిన్సియర్‌గా ప్రమాణం చేసింది రాఘవయ్య అండ్ కో వాళ్లక్కూడా భగవంతుడిపైన విశ్వాసం వుంది అయితే వాళ్లు దేముళ్లకు దేముడు, కలియుగ ప్రత్యక్ష దైవం అయిన తిరుపతి వేంకటేశ్వరస్వామికి లంచమిస్తామని మొక్కుకున్నారు. యింకేం?

మంత్రిగారి అండ చూసుకుని ఆఫీసర్లు బాహాటంగా లంచాలు తీసుకొన్నట్లు, పెద్దదేముడి అండ చూసుకొని చిన్న దేముడిముందు ప్రమాణాలు చేసి బాహాటంగా బోలెడు అబద్ధాలు చెప్పేరు.

ఆంజనేయస్వామి విగ్రహం వులకనూ లేదు పలకనూ లేదు తీర్పు యివ్వలేదు అబద్ధాలాడిన వాళ్ల తలల్ని నాలుగు వక్కలు చేయలేదు.

అంతటి ఆంజనేయస్వామి యివ్వలేని న్యాయాన్ని వరలయ్మికి మానవమాత్రుడు మున్సబు ఏమివ్వగలడు పాపం?

★ ★ ★

మర్నాటినుంచి 'దొంగ వరలక్ష్మి'ని ఎవరూ పొలం గట్టు తొక్కనివ్వలేదు. గడ్డి దోకే వీలు లేదు. మాల పల్లెలో కూడా వెలే

సింగన్న చేత పని మాత్రం మామూలుగానే చేయించుకొంటున్నారు. అయితే ఎంగిలిమెతుకులు విదిలించడం లేదు పైగా ''నీకేరా! నీ పెళ్లాం వుందిగా?'' అని పొగడసాగేరు. అలా రాఘవయ్య ప్రతీకారం, ఆకలి రూపంలో సింగన్న గుడిసెలో తిష్టవేసింది

పొగాకు సీజన్ వచ్చింది వెళ్లింది. వరలక్ష్మికి మాత్రం ఎక్కడా కూలి చిక్కలేదు. సింగన్న కూలికి సిద్ధపడ్డా లాభం లేకపోయింది.

అప్పుడతనికి భార్య కొత్తల్లో చేసిన బోధనలు గుర్తుకొచ్చాయి.

''మరోవూరు దేనికైనా పోదామే''

''పోయి?'' సింగన్న దగ్గర జవాబు లేదు

పిచ్చి నాగన్నా లోకంలో డబ్బున్నవోళ్లంతా వొక్కటే. ఏడికి బోయినా పేదోళ్ల బతుకులు పెత్తందారీల సేతల్లోనే వుంటాయి. పారిపోయినా ఆ రాఘవయ్య ఎంతబడడని ఏడుంది? నిలబడి పోరాడాలి''

''అయితే ఏం సేద్దామంటావే?''

వొక్క క్షణం ఆలోచించి దృఢ స్వరంతో అంది వరలక్ష్మి

''దొంగతనం''

సింగన్న భయంతో నీరుకారిపోలేదు.

''అవును. అదే మంచి మారగం'' అన్నాడు ఆలోచనగా!

★ ★ ★

కాలేజీకి వెళ్లేడన్న మాటేకాని మాధవ్ మనసులో పగ చల్లారలేదు వరలక్ష్మి.. వరలక్ష్మి.. బలవంతంగానైనా సరే దాన్నోసారి అనుభవిస్తే కాని...

శెలవులిస్తూనే యింటికొచ్చి వరలక్ష్మిని గురించి వాకబు చేశాడు

''ఆ మాల్లంజ.. దాని కొజ్జా మొగుడు యిప్పుడు తెగించార్రా పొలంలో పచ్చాకుని, ఎండుకట్టెల్ని, గొడ్డు గోదాముల్ని బతకనివ్వడం లేదు. సమయం కనిపెట్టి దాని పొగురుకు నేను ఆపరేషన్ చేస్తాలే. నక్సలైట్ అని యిద్దర్నీ బొక్కలో తోయిస్తే పీడ వదులుతుంది. నువ్వు మాత్రం దాని జోలికి పోకు.

తండ్రి హెచ్చరిక మాధవ్‌మీద పని చెయ్యలేదు. కోరిక ప్లస్ ప్రతీకారం అతడిని తొందర పెట్టింది తన ఈడు వాళ్లతో తెలుగులో మాట్లాడటం ప్రారంభించి స్నేహాలు చేశాడు పట్నవాసం కబుర్లు చెప్పి, ఆ మజాల రుచులు కాస్త కాస్త చూపించి మాయ చేసేడు. కుర్రకారును చుట్టూ చేర్చుకొని యువనాయకుడయ్యాడు.

పొగాకు సీజన్ అయిపోయింది మళ్లీ. ఆకును కంపెనీలకేసి, రైతులు స్వంత ఖర్చుల్తో డబ్బుకోసం కంపెనీలచుట్టూ తిరుగుతున్నారు. రాఘవయ్య కూడా ఆ పనిమీదే వెళ్ళేడు. ఆ రాత్రికి రాడు

మాధవ్ స్నేహితుల్తో సర్దాలు చేసుకుంటూ రాత్రిళ్లు కొట్టంలోనే గడుపుతున్నాడు.

అర్ధరాత్రి ఇంకా కాలేదు. వూరు మాత్రం నిద్రపోయి చాలాసేపయింది. కొట్టంలో క్లబ్బు వాతావరణం, స్నేహితులు మజామజాగా...

ఎద్దుల పాకల్లో గొడ్ల అరుపు. అంతలో ఎండు పొగాకు కట్టెల గలగల చప్పుడు.

మాధవ్ కళ్లముందు వరలక్ష్మి బింబం! పగ - కోరిక - ప్రతీకారం.

''ఒరేయ్, ఆ దొంగముండ వచ్చింది. పట్టుకొంటే ఈ రాత్రికి మజా మజా. కాలాన్ని ఈక్వల్‌గా షేర్ చేసుకొందాం ఆల్‌రైట్''

నలుగురు నాలుగు వైపుల్నించి ముట్టడించారు

పొగకట్టెల్ని మోపుకడ్తున్న వ్యక్తి ఎవరో వస్తున్న అలికిడి కాగానే మోపు నెత్తుకొని పరుగెత్తేడు. నలుగురూ వొక్కసారి ''దొంగ దొంగ'' అని అరిచేరు. దొంగ గట్టు తట్టుకొని కిందపడ్డాడు. చుట్టుపక్కల కొట్లల్లో జనమంతా చేరి దొంగను పట్టుకున్నారు.

ఎవరో తెచ్చిన లాంతరు వెలుగులో దొంగమొహం చూచారంతా.

వరలక్ష్మి కాదు, సింగన్న!



వరలక్ష్మిని పట్టుకొంటే వో సర్దా చేసుకొందామనుకున్నారు. సింగన్నను చూచాక మాధవ్‌కు మరో 'సర్దా' చేద్దామన్న వూహ వచ్చింది.

'సర్దా' అని మాధవ్ స్నేహితుల్తో చెప్పిన ఆ ఆలోచన వెనుక ప్రతీకారం వుంది. అంటరానివాళ్లుగా పరిగణింపబడుతున్న ఆ వర్గంపై తరతరాలుగా పెంచుకొన్న మిగతా ముగ్గురు స్నేహితులకి సులభంగానే నచ్చింది

ఎవరో వూళ్లోకెళ్లి ''దొంగ చిక్కేడ''ని చెప్పి జనాన్ని పోగేసుకొచ్చారు మరికొందరు వెళ్లి పెట్రోమాక్సు లైట్లు, డప్పులవాళ్లను, మంగిలిని, గాడిదతో సహా చాకలిని పిల్చుకొచ్చారు.

యిదంతా చూసేసరికి సింగన్న ధైర్యం కొండెక్కింది

''తప్పయిపోయింది బాబయ్యా! ఇంకెప్పుడూ సేయను నన్ను కాపాడండి నాయన్లారా'' ప్రాధేయపడ్డాడు

''యిన్నాళ్లు దొంగిలించినవి కక్కుతావ్రా?''

''దొంగకూడు తింటున్నప్పుడు తియ్యగావుంది కాదురా నా కొడకా ఇప్పుడు చూడరా అసలు తీపి''

వాళ్లనీ వీళ్లనీ ప్రాధేయపడి లాభం లేదనుకొన్నాడేమో. మాధవ్ కాళ్లు పట్టుకొన్నాడు. ఎలాగైనా దొరబాబు దొరబాబేనని వాడి భ్రమ!

''ఒరేయ్. అట్లాగే వదిలేస్తాంగానీ వో పని చేస్తావురా?''

''సెప్పండి దొరా''

''నీ పెళ్లాం - అదే ఆ రోజు అంత నీలిగి గొడవ చేసిందే - ఆ లంజనోసారి యిక్కడికి పిలిపించు. ఈ రాత్రి ఇక్కడ మా దగ్గర.. ''

''బాబూ...''

సింగన్న చెంప ఛెళ్లుమంది.

''కోపం వచ్చిందట్రా కొజ్జాలంజాకొడకా? నీ పెళ్లాం పతివ్రతగా వుండాలి. మా సొమ్ము నూక్కోపోతుండాలి. మేము ఏమీ అనకూడదు. వూళ్లో నీ పెళ్లామే కాదురా హీరోయిన్. మేమేం గాజులు తొడిగించుకోలేదు.

మాధవ్ ఆ రాత్రి జరగబోయే కొలువులకి ప్రారంభోత్సవం చేశాడు. చప్పట్లు కొట్టేరు. డప్పులు మోగేయి. మంగలి సింగన్న తలని గుండు చేశాడు. చాకలి గుండును సున్నంతో, పసుపు కుంకుమలతో అలంకరించాడు. రెక్కల్ని విరిచికట్టేరు. వేపమండల్తో అలంకరించబడ్డ గాడిదమీద వెనుక ముఖం చేసి కూర్చోబెట్టేరు. అంతా అయ్యాక ఎవరో వచ్చి సింగన్న గుడ్డల్ని పీకి పారేశాడు.

ఎటు చూచినా అరుపులు, సంతోషంతో కేరింతలు, కేకలు, పశుత్వం.

డప్పుల శబ్దం లయబద్ధంగా వుద్రేకాన్ని రెచ్చగొడ్తోంది.

అర్ధరాత్రి అకస్మాత్తుగా వచ్చిన ఈ సంబర ధ్వనికి వూరు వులిక్కిపడి లేచింది. పెట్రోమాక్సు లైట్ల వెలుగులో కొలువుల సందడి పొలాల్ని వదిలి గ్రామ ప్రవేశం చేసింది. తలుపులు తెర్చుకొంటున్నాయి. జనం బయటి కొచ్చి సంబరాన్ని చూస్తున్నారు.

అందరి దృష్టీ సెంట్రల్ పాయింట్ మీదే. ఆ సెంట్రల్ పాయింట్ దేముడు కాదు, దేవత కాదు. దయ్యం కాదు.

మనిషి! అనాది మనిషి! అణగదొక్కబడ్డ మనిషి! వుక్కు చట్రాల్లో బంధింపబడ్డ మనిషి! దిగంబరుడైన మనిషి! మనిషి మనిషే మనిషి!

ఆకస్మాత్తుగా వీరంగం ఆగిపోయింది.

వరలక్ష్మి పూనకం వచ్చినదానిలా అరుస్తూ కొలువుల మధ్య వుంది. సింగన్నను చూడగానే వుద్రేకం చల్లారి ఏడుపొచ్చింది. ఏడుస్తూ కట్లు విప్పబోతే ఎవరో వెనక్కి లాగి పట్టుకొన్నారు.

ద...ద...ద్దద్దద్ద... శ్శరభ శ్శరభో శరభ!

వరలక్ష్మి పట్టుకొన్నవాళ్లని విదిలించికొట్టింది. వీరవిహారం చేస్తూ మాధవ్ ముందుకొచ్చింది.

''ఛూ!'' కాండ్రించి వుమ్మేసింది. సిగ్గులేదురా నీకు! మగాడివైతే నామీద పగ తీర్చుకోరాదె. అది సేతగాక అమాయకుడు ఆడిమీదనా తీర్చుకంటున్నావ్?''

మాధవ్‌కు తల కొట్టేసినట్టయింది. అహం పొంగింది

''కొజ్జా లంజాకొడుకు, బికారీ లంజకొడుకు, దొంగనాకొడుకు. వాడిమీద నాకు పగేమిటి! ఎంట్రుక ముక్క వాడూ, నువ్వూ. డబ్బు పారేస్తే నీలాంటి లంజలు వందలు... వేలు. . ఆ కొజ్జా లంజకొడుక్కి పెళ్లాన్ని అదుపులో పెట్టడం చాతకాక నీకింత పొగరొచ్చింది. నా దగ్గరికొస్తే కొమ్ములు తీస్తా. దా దావే''

నవ్వులు! చప్పట్లు! కేకలు! ఓహోలు! ఆహాలు! ఇహిహీలు!

ఆ గంద్రగోళంలో వరలక్ష్మి అన్నదేమిటో ఎవరో విన్పించుకోలేదు జనోత్సాహం అరుస్తున్న వరలక్ష్మిని వెనక్కి నెట్టేసి ముందుకు సాగిపోయి మునసబుగారింటిముందు ఆగిపోయింది

మునసబు ఆ సాయంకాలం చివరి బస్సుకి బస్తీకెళ్లాడు. రెండ్రోజుల్దాకారాడు. మాధవ్ వుత్సాహం తాత్కాలికంగా కప్పబడింది. ఆ రోజు తన అభియోగానికి యివాళ మున్సబుకు ప్రత్యక్ష సాక్ష్యం చూపాలనుకున్నాడు. ముద్దాయి సిద్ధం - న్యాయమూర్తి లేడు.

అంతలోనే అతనికి ఆంజనేయస్వామి గుర్తుకొచ్చాడు. మున్సబు అంతటివాడు తీర్పివ్వలేక చివరికి ఆశ్రయించింది ఆయన్నేగా? ముద్దాయి ఆ రోజు ఆ రాతినే ఆశ్రయించింది. యివాళ తనూ ఆ రాతినే ముద్దాయికి శిక్ష విధించమంటే?

జనం వుత్సాహంగా గుడి దగ్గరికి నడిచేరు. పూజారిని లేపి గుడి తలుపులు తీయించారు.

''స్వామీ! వీడు చేసిననేరం యిప్పటికే వూరంతా తెల్సింది. దేముడివి కనుక నీకెప్పుడో తెలిసుండాలి. వీడు, వీడి పెళ్ళాం పచ్చి దొంగలు. పచ్చటి పొలాల్ని ధ్వంసం చేసే విషక్రిములు. ఎండుకట్టైనా మిగిలించని పరమ కిరాతకులు. మా పొలంలో రాత్రి దొంగతనం చేస్తుండగా పట్టుకొన్నాం. అడుగో దొంగ. వాడు దొంగిలించిన పొగాకు కట్టెల మోపు వాడి దగ్గరే వుంది వీడికిప్పుడే శిక్ష విధించాలో చెప్పు స్వామీ''

స్వామి మాట్లాడలేదు.

''పోనీయ్ స్వామీ శిక్ష నేను వేస్తాను. నువ్వు ఆశీర్వదించు''

జనం అలాగే నన్నట్లు చప్పట్లు కొట్టేరు.

''వీడి నేరానికి శిక్ష - స్వామి ఎదుట సజీవదహనం''

దేముడు ఆశీర్వదించాడో లేదో కానీ జనం మాత్రం వెర్రి ఉత్సాహంతో అరిచారు. ఈలలు వేశారు. తప్పెట్లు కొట్టేరు.

సింగన్నను గాడిదమీద నుంచి పొగపేళ్లతో సహా దింపి, దేముడి ఎదుట దిగంబరంగా నిలబెట్టేరు. గర్భగుడిలోని దీపం ప్రమిదను తీసుకొచ్చారు. దేముడు చీకట్లో కళ్లు మూసుకొన్నాడు.

సింగన్నకు నూనెతో తడిపిన గుడ్డల్ని కట్టేరు. దీపం ప్రమిదతో గుడ్డల్ని వెలిగించబోతున్నాడు.

వరలక్ష్మి హఠాత్తుగా మాధవ్‌ముందు ప్రత్యక్షమయింది. ఒక చేతిలో దోకుడు పార, మరో చేతిలో కొడవలి. అర్ధనగ్నం కాదు దాదాపు పూర్తి నగ్నమూర్తి.

పోలేరమ్మా, అంకాళమ్మలను చూచినట్లు బెదిరేడు మాధవ్.

''ఒరేయ్ నా మొగుడు కొజ్జా నువ్వు ముండలు కావాల్సిన మగాడివి యిప్పుడు సూపించరా నీ మగతనం నా మొగుడి బట్టలిప్పడం కాదు నీ బట్టలిప్పు మూడంకెలనేలోగా యిప్పాలి మగాడివైతే. నేకపోతే ..''

ఒకటి - రెండు - జనం గుళ్లో దేముడిలా గుడ్లప్పగించి చూస్తున్నారు శక్తి స్వరూపిణిలా వరలక్ష్మి వుద్రేకంతో ఊగిపోతోంది.

''మూడు'' వూరి కడుపును చీల్చుకొని వచ్చినట్లుందా కేక!

ఆ రెండక్షరాలతోపాటే కొడవలి పైకి లేచి కిందికి వాలింది.

రక్తం - కొడవలంతా రక్తం.

కాని మాధవ్ మెడ తెగలేదు, గుండె కొట్టుకోవటం మానలేదు. ఐతే బీజాలు తీసేసిన ఆంబోతులా గిలగిల్లాడిపోతున్నాడు.

వరలక్ష్మికుక్కూడా అప్పటిగ్గాని ఏం జరిగిందో తెలియలేదు. తెల్సేక కాళికలా నవ్వింది.

''నీకన్నా, నాకన్నా ఈ కొడవలి తెలివయిందిరా నీ లాంటివోడి మెడ కోసం నాబమేటి? మగాడివని కదూ యిర్రయీగావ్. యిప్పుడు సూసుకో

మాలోళ్లం... బీదోళ్లమనేగా నా మొగుణ్ని కొజ్జాను, నన్ను నంజను చేసేవ్. యిప్పుడు నువ్వు కొజ్జావి... డబ్బుపెట్టి పెళ్లాన్ని కొన్నా ఎదవముండే అది. యిక పోయి నీ డబ్బుని వాటేసుకు పడుకో పో...''

రక్తసిక్తమైన కొడవలితో మొగుడి బంధాలని కోసి పారేసింది. ఇద్దరూ చెయ్యి చెయ్యి పట్టుకొని వెళ్తున్నారు.

అప్పుడు తెలివొచ్చింది జనానికి, పట్టుకోబోయేరు.

అయితే ముందు కాలాన్ని పట్టుకోటం ఎవరి తరం?

భవిష్యత్తును బంధించడం ఎవరికి సాధ్యం! ?

('స్వాతి', జూలై 1978)



# సూర్యుడు తలెత్తాడు

## ఆచార్య కొలకలూరి ఇనాక్

నేటి తెలుగు దేశంలో అదొక మారుమూల పల్లె. కుగ్రామం. రావడంటే మనిషికాదు, మర.

సూర్యుళ్లా పొలంలో పొడిచి, ఇంట్లో కుంకుతుంటాడు. చేనుకి చెమటతో స్నానం చేయించి, నెత్తరుతో బొట్టు పెడుతుంటాడు. పంట చేను పసి పాపల ముత్తయిదుతే పైరును అస్తారుబస్తంగా చూసుకొంటాడు.

రావడి ముఖం ఊరు చూళ్ళేదుం. పల్లె చూళ్ళేదు పిల్లలు చూళ్ళేదు. పెళ్లాం చూళ్ళేదు. సూర్యుడు చూళ్ళేదు, పొలం చూసింది.

వంగి పని చేయడం, తల వంచుకు నడవటం, ముఖం దాచుకుని నిద్రపోవడం అతడి రివాజు.

రావడి మాట పొలం కూడా విన్లేదు. నిశ్శబ్దం అతడి దినచర్య. జీవిత చర్య

గుండె గుహలో రాక్షసుడు దాచి పెట్టిన పసివాడి కేక ఒకటి వుంది. బైటికి వినిపించదు. నలుగురంటే రావడి గుండె కూడా చప్పుడు చేయదు.

రావడి కళ్లలో నీళ్లు లేవు. ఎరుపు లేదు. ఏడుపు రాదు. కోపం రాదు. రాయి ఎండకూ, చలికి వేడిగా చల్లగా కాదు. రాయి కూడా కాదు, దూది.

రావడి శరీరాన్ని పంచ భూతాలు బతికుండా పంచుకుంటున్నాయి. ఏం పొరపాటు జరిగిందో ఎముకలు మిగిలాయి. మరేమయిందో అవి కదులుతున్నాయి.

ఇంటికి వచ్చేసరికి పల్లెంతా గుబగుబలాడుతూ వుంది. సీత కల చచ్చిపోయింది ఉరిపోసుకుని. ఎవడో చేయి పట్టుకున్నాడనీ, చెప్పినా వినలేదని- జనం చెవులు కొరుక్కుంటున్నారు.

రావడు ఆ రాత్రి మామూలుగా నిద్రపోయాడు. ఉదయుం పొలంలో సూర్యుడు.

రావడు భూమి బిడ్డ. ఆ ఎకరం పొలం అతడి యావదాస్తి.

కాళ్లు కడుక్కుని కూటికి్కూచుంటే వచ్చి వడ్డించే కూతురి కాళ్ళూ చేతులూ కనబళ్ళేదు. కూడురాలేదు లేదు అన్న మాటన్నా వినబళ్ళేదు. రావడదేం పట్టించుకోలేదు. నిద్రపోయాడు.

పొయిలో పిల్లి లేవడం లేదు గింజలున్నట్టే వుంది పిల్లే ఉన్నట్టు లేదు.

లేచిపోయిందని, లేపుకు పోయాడని రెండు మాటలు. పిల్ల దొంగ సొత్తు కాలేదన్న నమ్మకం రావడికేముంది?

ఆ మాటకే వస్తే రావడికి ఏం నమ్మకాలున్నాయసలు?

కొండల్లో ఇళ్లు కట్టారని, పొలాలు ఇస్తున్నారని చాలామంది పల్లెవాళ్ళు వెళ్లిపోయారు రావడు పోలేదు

పొలం పోవడానికి బయలుదేరి ఇంటిముందు నెత్తురు మడుగులో పడివున్న కొడుకును చూశాడు దెబ్బలు! గుండె ఆడుతూ వుంది చావడు మొండి ఘటం గట్టి ప్రాణం

జనం పోగయ్యారు, ఊళ్లో వాళ్లతో పెట్టుకోవద్దురా అంటే వింటాడా? ప్రాణాలకు తెచ్చుకున్నాడు ఓపిక ఉన్న వాళ్లు ఏడుస్తున్నారు చేతనయినవాళ్ళు ఏమన్నా చేస్తున్నారు

రావడు మాత్రం అక్కళ్ళేడు సూర్యుడితోపాటు పొలంలో తిరుగుతున్నాడు

ఇంట్లో దీపం కొండెక్కించి, కంట్లో దీపం ముసుగులో దాచి, కుక్కి మంచం కబుర్లు వింటున్నప్పుడు గాజుల చప్పుడు, మట్టెల మోత!

ఈ చప్పుడు తనకు తెలుసు తనదే తన నెత్తురుదే! తన గుండెదే!

రావడు నిద్ర లేచాడు సూర్యుడు అర్ధరాత్రి బయటికి వచ్చాడు

ఎదురుగా కూతురు! నిండు చూలాలు! కాళ్ళు పట్టుకొంది. తల నిమిరాడు.

ఆ రోజు ఉదయం స్యూరుడు ఇంట్లో ఉదయించాడు. రాత్రి పొలంలో అస్తమించాడు

పల్లెకు పోయే సరికి ఇల్లు రవందాడిగా ఉంది పసిగొంతు ఏడుపు. ఆడ గోల. మగ పిల్లాడు తల్లి పోయింది

రావడు మనవణ్ణి చూశాడు కూతుర్ని చూశాడు. మనవణ్ణీ కూతుర్నీ చూశాడు ఉదయం అస్తమయం చూశాడు.

మనవణ్ణి పెంచటమన్న మహాయజ్ఞంలో పసివాణ్ణి బలిపశువును చేస్తున్నాడు రావడు.

'ఈడు జచ్చిందాకా నువ్ జ్వేట్లు లేవంటూ పక్కింటి గొడ్రాలు మనవణ్ణి మారెమ్మ ఎత్తుకు పోయినట్లు ఎత్తుకుపోయింది

ఆవు, కొట్లు, పొడుపు, చంపు అనే అరుపులు దూరంనించి వినిపించాయి. కర్రలు, కట్టెలు, బొంగులు పుచ్చుకున్న మనుషులు పొలాలకడ్డంపడి వస్తున్నారు

పందిని చంపుతున్నారు కాబోలుననుకొన్నాడు రావడు రొప్పుతూ రోస్తూ నురుగులు కక్కుతూ కొడుకు పరుగెత్తుకొస్తున్నాడు. ఏటుకందలేదు పొలం వచ్చాడు. తండ్రిని చూశాడు కాళ్లమీద పడ్డాడు

పడ్డవాడు లేవలేదు కర్రలు లేవనివ్వలేదు

ఏటుమీద ఏటు రావడానికీ నాలుగు తగిలాయి అది మనిషి ఆకారం కాదని మట్టి ముద్దనీ రుజువు అయిందాకా కర్రలు ఆగలేదు.

ఆపైన మనుషులు ఆగలేదు. కాళ్లు కదిలాయి కొడుకు వళ్లంతా నెత్తురు. రావడి బట్టలమీద నెత్తురు. సూర్యుడి చేతుల్నిండా నెత్తురు

రావడి కళ్లలో ప్రాచీన గంగ, పాతాళ గంగ బుడబుడలాడినట్లు అయింది చెమ్మ! తడిసొన, వాన! కుండపోత! కన్నీరు! నెత్తురు! నెత్తుటి కన్నీరు! కన్నీటి నెత్తురు! చిత్రం! రావడి కళ్లల్లో నీళ్లు.

తీరుబడిగా గోయి తవ్వాడు తీరికగా కొడుకును పడుకోబెట్టాడు ముఖం తుడిచాడు మట్టివేశాడు పూడ్చాడు.

ఈ శవం మంచి ఎరువు పొలం బాగా పండుతుంది. ఊరు తింటుంది పీనిగకూడు.

చాలా రోజులు సూర్యుడు పొలంలోనే పుట్టాడు. అక్కడే చచ్చాడు పల్లె వల్లకాడుగా, ఇల్లు శవం పెట్టెగా వుంది.

రావడు పొలంలో పాక వేసుకొన్నాడు. మూడు బొంగులు, మోపుగడ్డి.

ముంతా, మూకుడు, చట్టి, పిడత, కుండ, సామాన్లు, నరాల్లో చలి, వణుకు, ఎముకల్లో నిప్పు, మంట, రావడి జబ్బులు

కర్మసాక్షి నడినెత్తిమీద కబుర్లు చెబుతుంటే చింతయ్య వచ్చి చావు కబురు చల్లగా చెప్పాడు. 'ఈ పొలం నాది''

''ఎట్టా?'' అనాల్సింది రావడు, అన్లేదు.

''ఏందీ?'' అంటూ చూడాల్సింది, చూళ్ళేదు.

మౌనం.

ఎప్పుడో తీసుకొన్న అప్పు వంద రూపాయలు. వేలు దాటింది. వేలు ముద్రలు దాటింది. కోర్టుకు పోయింది. స్టాంపుకు ప్రాణం వచ్చింది. నడిచి పొలంలోకి వచ్చింది.

నిలబళ్ళేక పోయాడు. కూలబడ్డాడు. కూర్చోలేకపోయాడు. వాలిపోయాడు. నేలను వాటేసు కున్నాడు. బిడ్డల్ని, బంధువుల్ని, తల్లిని, తండ్రిని వాటేసుకున్నట్టు పొలాన్ని కౌగిలించుకున్నాడు

నోట్లో దుమ్ము.

చింతయ్య వాణ్ణి పొలంలోంచి అవతలకి ఈడ్చాడు.

తన వొంట్లో వున్న నెత్తురూ చెమటా పీల్చుకొన్న పొలం కాలు కదపకుండా కూర్చుంది.

కొడుకును పొట్టన పెట్టుకుని నోరెత్తకుండా వుంది.

కర్మసాక్షి మాత్రం వీపు చరుస్తున్నాడు.

రావడు పుట్టడమే తలక్రిందులుగా పుట్టాడు. పెరగడం తలవంచుకుని పెరిగాడు. వయస్సు పైబడ్డ కొద్దీ తల నేలకు దగ్గరయింది. ఇప్పుడు నేల పాలయింది.

నమ్ముకొన్నందుకు వళ్ళంతా నోరంతా బురద రాసి నేల కనికరించింది.

మెల్లగా కొర్చుని, మోకాళ్లమీద చేతులు పెట్టుకుని , నడుం పట్టుకొని, వెన్నెముక రాసుకుని రావడు నిలబడ్డాడు

వంగి చేసే పని లేక రావడు నిలబడ్డాడు.

నిలబడుతుంటే వెన్నెముక కరకరలాడింది. పెటపెటలాడింది. మూలిగింది. అరిసింది.

వంగిపోయిన తల లేవటానికి మొండికేసింది. బిగిసింది. పట్టింది. మెల్లగా సడలింది. తిరిగింది. తలను నిలబడనిచ్చింది.

కళ్ళు పూర్తిగా విప్పాడు. ఎదురుగా చూశాడు. కళ్ళు బైర్లు కమ్మాయి. చుట్టూ చూశాడు. గబగబా చూశాడు అన్ని దిక్కులుచూశాడు.

ఎంత సంతోషం. నేల, నింగి, దిగంతాలు భూమి ఎంత అందమయిందీ, ఎంత విశాలమయిందీ - ఈ భూమ్మీద తాను పుట్టాడు. పెరిగాడు. ఎంత అదృష్టం.

పీల్చిన గాలి - గుండె బంధువు - ఎంత హాయిగా వుంది!

నడిచాడు అడుగు వేస్తే కాలికెంత బలం ఎంత ఆనందం ఇంతకాలం తాను కోల్పోయిందేమిటో రావడికి తెలియడం మొదలయింది

తన పొలం వైపు చూశాడు వళ్లు స్వాధీనం తప్పుతూ వుంది పల్లెలో పేరుకు ఇల్లుంది

వారం పాటు సూర్యుడు రాత్రీ, పగలూ ఆ యిల్లు వదల్లేదు ఈ వారం రావడి కంటి మీద కునుకు లేదు

ఆరోజు ఉదయం రావడు ఊరుచెరువు గట్టుమీద పుట్టాడు పుట్టీ పుట్టక ముందే సూర్యుడు ఊరు చెరువులో పడి తనుకులాడుతున్నాడు ఎవడీ సూర్యుణ్ణి కాపాడేది?

ఉదయం కాంతిలో చెరువుమీంచి రావడు ఊరంతా పరికించాడు

వింత - కొత్తగా కనిపించింది.

చిత్రం - అసహ్యం పుట్టింది.

విచిత్రం - కసి

చీకటి పడింది. జేబులో అగ్గిపెట్టె చేతికి తగిలింది గలగల లాడింది తీసి గీశాడు ఆ వెలుతురులో రావడి ముఖం కనబడింది. ఇది మునుపటిది కాదు.

కుంకిన సూర్యుడు రావడి ముఖంలో అర్ధరాత్రి పుట్టాడు. ఎర్రగా మంటగా జ్వాలగా ముఖం. స్యూరుడు మండిపోతున్నాడు.

అగ్గిపెట్టె గట్టిగా పట్టుకొని రావడు గావుకేక పెట్టాడు చెరువు ప్రతిధ్వనించింది. మాట వినబళ్ళేదు. చిత్రం. రావడు మాట్లాడుతున్నాడు

చెరువుగట్టు దిగి ఊళ్ళోకి పోతూ అరిచాడు

''ఈ బతుకు లిట్టా తగలబడ్డానికి ఈల్లేదు ఈ బతుకులిట్టా తగలబడ్డానికి ఈల్లేదు ఈ బతుకులిట్టా తగలబడ్డానికి ఈల్లేదు''



# సబ్బు

## పులికంటి కృష్ణారెడ్డి

పంపునీటి స్నానమంటే పడిచస్తాడు రమణ!

రమణకు ఇల్లు ఉంది. రమణకే గాదు - ఆ ఊళ్లో అందరికీ యిండ్లు వున్నాయి. అయితే రమణ ఇల్లు మాత్రం ఆ ఊరంత! రమణ యింటితో పోలిస్తే ఆ ఊరంతా గోరంత!

ఆ యింట్లో తినడానికి - కూర్చుని కమ్మగా రేడియో వినడానికి - స్నానానికి పానానికి- నిద్రకు భద్రతకు వేరువేరుగా ఒకదానికంటే మరొకటి అందంగా - గదులున్నాయి. అందులో స్నానాలగది అమరికలే వేరు ఆ గదిలో నిర్భయంగా - ముచ్చటపడితే నగ్నంగా - తొట్టి స్నానంతో తనివి తీర్చుకోవచ్చు. వానజల్లులాంటి పన్నీటి జల్లు పైన పడుతుంటే - ఆనందంతో వంకర్లు తిరిగిపోవచ్చు. ధారాపాతమైన కొళాయి నీటి కింద జలకాలాడవచ్చు!

అయితే కూడా పంపునీటి స్నానమంటే పడి చస్తాడు రమణ!

ఊరిముందర బావి వుంది. అది నడబావి. నడబావిలో పాతాళగంగ ఉంది. రెండు విద్యుత్ మోటార్లు ఒకదానితో ఒకటి పోటీపడి ముక్కుతూ మూలుగుతూపాతాళగంగను పంపుద్వారా పైకి తెస్తాయి

ఆ నీళ్ళంటే మహాయిష్టం రమణకు!

బావికి ఇద్దరిని ఊరు ఉంది. అద్దరిని వాడ ఉంది. ఊరిలోను వాడవలోను మనుష్యులే వున్నారు. మనుష్యులంతా ఒక్కటేనని మహాత్ముని అడుగుజాడల్లో నడిచిన మహితాత్ములు గొంతెత్తి ఘోషిస్తూనే వున్నారు అలాంటి మహితాత్ముల్లో మహితాత్ముడు ఆ గ్రామ పంచాయతీ ప్రెసిడెండు పెద్దిరెడ్డి. అప్పుడప్పుడు ఆ గ్రామ పంచాయతీ కార్యాలయంముందు ఆ మహితాత్ముడు మీటింగులాంటిది జరిపి 'జనులేమిటి?. . హరిజనులేమిటమనమంతా ఒకటి... జైబోలో మహాత్మాగాంధీకి! అని గొంతు చించుకుంటూ ఉంటాడు. అప్పుడు అందరూ ఆకాశం కూలి పడేటట్లు చప్పట్లు కొడతారు

అయితే మాటలు మాటలే చేతలు చేతలలే!

మాటకు చేతకు మనువు కుదరని రోజులివి!!

అందుకే - ఊరిలోని వాళ్లు జనులని, వాడలోని వాళ్లు హరిజనులని వ్యవహరింపబడుతూనే వున్నారు.

జనులు నీళ్లు తాగుతారు. హరిజనులు నీళ్లు తాగుతారు జనులు హరిజనులు కలిసి నడబావి నీళ్లే తాగుతారు. నడబావి పంపునీళ్లు ఉరవళ్లు పరవళ్ళు మీద పారుతూంటే పైనీళ్లు జనులు తాగితే కిందినీళ్లు

హరిజనులు తాగుతారు మాసిన గుడ్డల్ని పిండుకొంటుంటారు. కాయకష్టంతో చెమటోడ్చిన శరీరాలను కడుక్కొంటుంటారు

పారే నీటికి అంటు లేదని రాజీ పడతాయి ఇరుపక్షాలు

ప్రతిరోజు ఆ ఊరి పడమటి దిక్కున ఒకానొక కొండకొన కొమ్మున నిలబడతాడు సూర్యుడు పంపునీటి కాలువవైపు ఆశగా చూస్తూ వుంటాడు. పడుచుదనం గడుసుదనంతో పరాచికాలాడు కుంటూ స్నానాలు చేస్తూ ఉంటుంది తడిగుడ్డల్లోని సొగసుతోనేమో? సూర్యుడు తన్మయుడై నిలబడిపోతాడు అతని మొగం అరుణరాగ రంజితమై వుంటుంది. ఆనందం వెల్లివిరిసి పడమటి దిశనంతా ప్రభావితం చేస్తూ వుంటుంది. వాడికి 'కర్మసాక్షి' అని ఎవరో నామకరణం చేశారు. ఎందుకలా చేశారో తెలియదు కానీ - నిజంగా వాడు కర్మసాక్షి అయివుంటే - ఆ కాలువ దగ్గరే చూపులు మళ్లించేవాడు. అక్కడ ముడతలు పడిన దేహాలు... వీపునంటుకొన్న కడుపులు .. నిలబెట్టి కోసినా ముందుకు రక్తపుచుక్కలేని శరీరాలు - చెమటను నీళ్లతో కలుపుకొంటుంటాయి. ఈ దృశ్యమే వాడికంట పడివుంటే - నిజంగా ఆ నీళ్ళతో కన్నీళ్లను కలిపేవాడేమో?

వాడికి ఆ మాత్రం ఓపిక లేకనేమో? గుటుక్కున గూట్లో పడతాడు

పంపునీటి కాలువ దగ్గర పడుచుదనం నిర్భయంగా జలకాలాడుకొంటుంది

ఆ సమయం ఆడవాళ్లకని కేటాయించబడింది. అందుకే ఆ సమయంలో ఓ మగపురుగు మెదలమన్నా మెదలదు.

రమణకు ఈ సంగతి తెలియదు.

ప్రెసిడెంటు పెద్దిరెడ్డి కొడుకు రమణ! పెరిగింది మురిపాలక మూటల సందుల్లో! చదువుకొంటున్నది నాగరికత వొళ్లు విరుచుకుంటున్న పట్టణాల్లో - సాధారణంగా వేసవి సెలవులు గడిపేది నీలగిరి కొండల్లాంటి ఎత్తయిన కొండల్లో -

అందుకే- ఆ పల్లెలోని పంపునీటి కాలువ పరిస్థితి - ఆ గ్రామస్థులు అనుసరిస్తున్న పద్ధతి - రమణకు తెలియవు.

అనుకొన్నట్లుగా ఆ ఏడాది వేసవి సెలవులు గడపడానికి రమణ పల్లెలోనే దిగాడు. ప్రెసిడెంటు పెద్దిరెడ్డిగారి కొడుకు వేసవి సెలవులు గడపడానికి పల్లెకు రావడం - ఆ పల్లెకంతా సంబరం!

ఒకనాటి సాయంకాలం వ్యాహాళికని బయలుదేరిన రమణ ఊరికి ఉత్తరంగా నిలబడ్డాడు. చుట్టూ కోతకు వచ్చిన పొలాలు. పైరుగాలి కలగాపులగంగా పరిమళాలు నింపుకుని రివ్వున వీస్తూ ఉంది శూన్యంవైపు. రకరకాల ఆకారాలతో మేఘాలు వినిర్మల నీలాకాశాన్ని 'కాన్వాస్'గా వాడు కొంటున్నాయి. ఊర్పిడికాలం వెచ్చని తలపులతో రైతుల ఏలపాటలు విచ్చలవిడిగ పొగలు పడు తున్నాయి. తోకలు పైకెత్తి అలమందలు పరుగుమీద యింటిముఖం పట్టాయి. పైకి లేచిన గోధూళి సంజ వెలుగులోత కలిసి కుంకుమ వెదజల్లినట్లుంది ఆనందానుభూతితో రమణ తాడు విడిచిన మేకపిల్లలా గంతులు వేస్తున్నాడు

సహజత్వం ఎప్పటికీ సహజంగానే ఉంటుంది తెచ్చిపెట్టుకోవడం తెచ్చి పెట్టుకున్నట్టుగానే వుంటుంది.

రమణ గుండె ఈ సత్యాన్ని ఇప్పటికీ గుర్తించగలిగింది.

'పొద్దు గూట్లో పడింది కనుచీకటి ఆవరిస్తూ వుంది. రమణ తిరుగుముఖం పట్టాడు. కొత్త

అనుభూతుల్ని నింపుకొన్న మనసు - రమణను గనిమలమీద తైతక్కలాడిస్తూ వుంది పరుగులాంటి నడకతో అతడు పడుతూ లేస్తూ నడుస్తున్నాడు

ఆనందమే రూపమెత్తినట్లుగా పరవశించి పరుగుతీస్తున్న రమణ - 'ఠకీ' మని ఆగిపోయాడు.

రమణ కండ్లు యింతింతలైనాయి వింతగా చూస్తున్నాయి. గుండె దడదడలాడుతూ వుంది. తనకు తెలియకనే తనలో ఏదో వేడి ప్రవేశించింది. కాలు ముందుకు పడమన్నా పడలేదు.

ఎవరో ఓ సుందరి! విరిసీ విరియని కుసుమం!! పంపునీటి కాలువలో జలకాలాడుకొంటూ వుంది నగ్నంగా.

రమణ ప్రయత్నంమీద చూపుల్ని స్వాధీనంలోకి తెచ్చుకోగలిగాడు ఒక్కటంటే ఒక్క నిముషం చుట్టుపక్కల కలియజూశాడు. ఎవ్వరూ కనిపించలేదు తేలికగా నిట్టూర్చి తీరికగా ఆ సుందరివైపు దృష్టి మరల్చాడు.

ఊరకే వస్తే ఊరంతా నాదేనన్నారట!

ఊరిస్తున్న సొగసులు వారించేవాళ్ళు లేకపోయేసరికి - వయసులోని కళ్లు జుర్రుకుంటున్నాయి అందినంత మేరకు!

ఆ సుందరి- గొంతుక్కూర్చుంది నగ్నంగా! మోవిని కాస్త పైకెత్తింది అందంగా! కండ్లు మూసుకొని ముంతతో నీళ్లు ముంచి ముంచి పోసుకొంటూ ఉంది హాయిగా!

చీకటి చిక్కబడుతూ వుంది.

అక్కడున్నది తానొక్కతేనన్న అభిప్రాయంలో ఆ సుందరి మునిగి వున్నది.

అందుకే పంపునీటి కాలువలో నిర్భయంగా మునుగుతున్నది.

ముంతలో నీళ్లు ముఖంమీద పడి - విశాల నేత్రాలతో వియ్యమంది - నును బుగ్గలపై జారి - వక్షస్థలితో వగలుపడి - కటిస్థలితో కబుర్లాడి - కలువలో కలిసిపోతున్నాయి - చిలిపిగా.

'ఆ ముంతలో నీళ్లుగా మారిపోతే?'

ఉన్నట్లుండి కలిగిన కోరికతో కొంకర్లు తిరిగిపోతున్నాడు రమణ.

'ఆడది వొంటరిగా - అందులో నగ్నంగా స్నానం చేస్తూంటే వుండటం మహాపాతకం. ఇప్పుడు కాకపోయినా యిక కాసేపటికి ఆ అమ్మాయి కండ్లు తెరుస్తుంది. ఎదురుగా నువ్వుంటావ్! కసిరినా కసరవచ్చు. కాండ్రించి ఉమ్మినా ఉమ్మవచ్చు. లేదా - కదిలీ మెదల్లేకుండా కుంగిపోవచ్చు. వెళ్లిపో, ఆ పరిస్థితి ఎదురుగాకముందే వెళ్లిపో!' గుండెల కింది పొరల్లోనుండి ఏదో సందేశం గొంతులో కొట్లాడుతూ వుంది.

'పాపమూ లేదు. పుణ్యమూ లేదు. మళ్లీ మానవ జన్మ - ఎవరు చూశారు. అందిన అవకాశాన్ని జారవిడుచుకోవడం వెర్రితనం. అనుభవించగలిగినంతవరకు అనుభవించు. కోరిక కాళ్లకు సంకెళ్లు వేస్తూ వుంది.

విచిత్రమైన స్థితిలో ఇరుక్కొన్నాడు రమణ!

తపస్వినిలా కళ్లు మూసుకుని- ముంతలో నీళ్లు ముంచుకుని - సావకాశంగా మొగాన కుమ్మరించుకుంటూనే ఉందా సుందరి!

నిడుపాటి వెంట్రుకలు నీళ్లు పడటంతో చెదిరాయి ఒంటిమీద పాయలు కట్టి పాలరాతిమీద

జాలువారుతున్న నీలి నీటి సెలయేళ్ళులా భ్రమింపజేస్తున్నాయి మోకాళ్లను ముద్దిడుకుంటున్న చన్దోయి కన్దోయిని కవ్విస్తూ వుంది.

తంబురకు తలను ఆనించి - భక్తి పారవశ్యంతో కనులు మూసి, రాగాలాపన చేస్తూ మవిని పైకెత్తి మురళీకృష్ణ కోసం తపిస్తున్న మీరానా? లేక అనుకోని రీతిగా ప్రాణం పోసుకున్న అజంతా శిల్పమా?!

రమణ గుండె మాట్లాడేసరికి గొంతు 'ఓహ్' అనింది.

సుందరి అదిరిపడి కండ్లు తెరిచింది!

తాను కలలో గూడా ఊహించలేని పరిస్థితి ఉలిక్కిపడింది సిగ్గు- భయము- అసహ్యాము- అన్నీ కలిసినా ఏమీ చేయలేని నిస్సహాయ స్థితిలో కండ్లు మూసుకుని వుంది. తల మోకాళ్ల సందున అమాంతంగా తల దాచుకొనింది. రెండు చేతులూ మోకాళ్లను పొదివి పట్టుకున్నాయి తాకితే తల్లడిల్లుతూ ఒళ్లు ముడుచుకునే అంతర్దామరలా ఆ సుందరి క్షణక్షణానికీ ముడుచుకపోతూ వుంది.

అయితే కండ్లు తెరిచిన ఆ ఒక్క క్షణంలోనే కనుపాపలు రమణను ఫోటో పట్టేశాయి

ఓ మగవాడు తనని నగ్నంగా చూస్తున్నాడనుకొనేసరికి ఆ అమ్మాయి గిలగిలలాడిపోతూ వుంది అతని కంటపడనంత దూరం పరుగెత్తుకుపోవాలని మనసు పరితపిస్తూ వుంది.

చీరందుకోవాలి, కట్టుకోవాలి. ఆ తరువాత కదా పరుగెత్తాలి! ఎలా చేయాలి? ఎటూ తేల్చుకోలేక కుప్పగా కూర్చున్న ఆ సుందరి కుతకుత ఉడికిపోతూ వుంది. పంపునీటి కాలువలో నీళ్లు గోర్వెచ్చనయ్యాయి

ఇంచుమించు అదే స్థితిలో ఉన్నాడు రమణ!

అతడి నోరు తడబడుతూ ఉంది. ఏదో అడుగుదామన్న తపన. మాటలు దొరకడం లేదు. పెదవులు తడారిపోతున్నాయి. దొకరని మాటల్ని వెదుకుతూ తడారిపోతున్న పెదవుల్ని తడుపుకుంటూ మెలికలు తిరుగుతున్నాడు.

'ఎవ్వరీ అందాల రాశి! ఇంతటి ముగ్ధ మోహన సౌందర్యం ఈ పల్లెటూళ్ళో ఎలా ఊడిపడింది? అడిగితే! ఎలా అడగాలి? అయ్యో! యిప్పటికే తాను ఏమనుకుంటూందో?'

రమణ నిట్టూరుస్తున్నాడు పంపునీటి కాలువ పరిసరాల్లో గాలి వేడెక్కింది. ఆ వేడి సుందరి తడి ఒంటికి వెచ్చగా సోకుతూ వుంది.

'ఛీ! ఏం పాడు మనిషో? కాస్తయినా యింగితజ్ఞానం ఉండక్కర్లా?? అలాగే నిలబడి మిడిగుడ్లతో మింగేసేటట్లు చూస్తున్నాడే! నోటి నిండుకు నీళ్లు పోసుకుని తుపుక్కున ఉమ్మేదామన్నంత కోపం వచ్చిందా సుందరికి. అయినా కనుపాపల్లో పట్టేసిన ఫోటో 'నిజం చెప్పు! నా మొగం చూసి చెప్పు! నువ్వనుకొన్నట్లు చేయగలవా?' అని గుచ్చిగుచ్చి అడుగుతూ వుంది.

అందానికి వయస్సుకు ఎప్పుడో ఒప్పందం కుదిరినట్టుంది. ఆ సుందరి అనుకొన్నట్లు చేయలేకపోయింది.

చీకటి చిక్కబడింది. ఆకాశంలో చుక్కలు మొలిచాయి.

పంపునీటి కాలువ దగ్గర పాటించవలసిన నియమిత కాలం దాటిపోతూ ఉంది ఎవరో ఎద్దుల్ని అదిలిస్తూ అటువస్తున్న శబ్దం చెవిన బడింది. ఉలిక్కిపడ్డాడు రమణ. ఆ దృశ్యం ఎవరికంటనయినా పడితే? అమ్మో? ఇంకేమైనా ఉందా? అసలే అవి పల్లెకొంపలు!

ఎద్దుల మెడల్లోని చిరుగంటలు నాదాలు దగ్గరవుతున్నాయి. అడుగుమీద అడుగు పడినట్లుగా

అడుగుల సవ్వడి ఆ జవ్వని చెవుల్లో పడింది మెల్లగా కండ్లు తెరచి మోకాళ్ల సందుల్లో నుండే చూచింది

రమణ మెల్లగా ముందుకు కదిలిపోతున్నాడు

చూడకూడదనుకొంటూనే చూస్తూ ఉండిపోయిందా సుందరి అతడు కనుమరుగయ్యేసరికి ఎగిరిపడి లేచింది. ఆదరాబాదరా చీరందుకొని ఒంటికి చుట్టుకొనింది లేడిపిల్లలా ఉరికింది - రమణ మనస్సు మాత్రం పంపునీటి కాలువ దగ్గరే పడిగాపులు కాస్తుందే!

ఆనాటినుండే పంపునీటి స్నానమంటే పడి చస్తున్నాడు రమణ

ఇంతకాలంగా రమణ నాలుగ్గోడల మధ్యనే కూర్చున్నాడు పుస్తకాల దొంతర్లను ముందు పేర్చుకున్నాడు. అదే లోకం అనుకొన్నాడు అయితే లోకంలో అంతకంటే తీయనైనది - అనుభూతిని ఆనందాన్ని ఇవ్వగలిగేది - మరేదో ఒకటి వుందని అనుభవానికి వచ్చేసరికి అతడు నాలుగ్గోడల మధ్య యిమడలేక పోయాడు

ఆ రాత్రి డాబామీద ఆరుబయట మంచం వేయించుకున్నాడు మెత్తటి పరుపైన తెల్లటి దుప్పటి - వెల్లికిలా పడుకొన్నాడు. మనసును పంపునీటి కాలువ దగ్గర వదలివచ్చిన సంగతి అతనికి తెలియలేదు. మనసులేని కట్టె ఎంత ప్రయత్నించినా పడక పొందలేదు. లేచి కూర్చున్నాడు.

ఎదురుగా వయ్యారాలు పోతూ ఆ నగ్నసుందరి!

తూరుపుకొండలపైన రెండు బారల ఎత్తులో నిలబడి నెలవంక. . తోటలో విరిసిన మల్లెలు.. సుందర స్థాయిలో మారుతం - పరవశంతో రమణ పట్టు తప్పిపోతున్నాడు

మెల్లగా పైకి లేచాడు రమణ. ఆ నగ్న సుందరిని అలానే నిలబెట్టి వెన్నెలతో పోటీపడగల తెల్లటి చీరను కట్టాడు. పట్టి నడిపించుకుని వచ్చి పట్టెమంచంపై పక్కన కూర్చోబెట్టుకున్నాడు. కురుల తడి ఆర్చాడు. మెడమీద కాస్త వదులుగా నిడుపాటి జడ అల్లాడు. ఆ నల్లటి జడలో తెల్లటి మల్లెలు తురిమాడు. చందమామతో పోటీపడుతున్న ముఖారవిందములో కందిపప్పంత బొట్టు పెట్టాడు. లేచి నిలబడి - కాస్త వెనక్కు జరిగి - వివిధ కోణాల్లో మార్చిమార్చి ఆమె అందాన్ని విలోకించాడు

ముగ్ధమోహనంగా వెలిగిపోతున్న ఆ సౌందర్యరాశిని వదిలిపెట్టలేక వాటేసుకున్నాడు.

ఊహ ఎంత తీయనిది!

రెండు చేతుల మధ్య నలిగిపోతున్న దిండువైపు దీనంగా చూశాడు రమణ. వాస్తవం ఎంత చేదుగా వుంటుంది ఆ రాత్రి రమణకు కంటిమీద రెప్ప పడలేదు.

అక్కడ వాడలో గుడిసె. గుడిసె ముందు కుక్కిమంచంలో తండ్రి. పక్క నేలమీద చిరిగిన ఈతాకు చాప. చాపమీద అమ్మ. అమ్మపక్కన సుందరి. చంద్రుడు - చకోరాలు- మల్లెలు ముల్లెలూ - ఆ ప్రాంతానికే నిషిద్ధం.

''ఏమే? అట్లా నసుగుతుండావ్? నిద్రగాన పట్లేదా?'' ప్రక్కలో నసుగుడు పోరు పడలేక అమ్మ అడుగుతూ వుంది కూతుర్ని.

''అమ్మా! అయ్య అవసరం నీకు లేదు నీ అవసరం అయ్యకు లేదు. అందుకే వొళ్లు తెలియకుండా నిద్రపోతున్నారు. కానీ ఎవరవసరం వాళ్లదమ్మా''

'అవసరం' అవసరాన్ని గుర్తించిన ఎవరైనా ఎవరికైనా చెప్పదగిన సమాధానమేముంది. అయితే ఈ దేశంలో తల్లికి కూతురు అలా చెప్పకూడదు.

అందుకే ఆ సుందరి నోరు విప్పలేదు ఆమె కూడా మనిషే కాబట్టి ఊహలు తప్పలేదు.

ఆ సుందరి కనుపాపల్లో పట్టుకొన్న ఫోటోను తీసి ముందు పెట్టుకొనింది. నొక్కు నొక్కుల జుట్టు కొసదేలిన ముక్కు నవ్వితే సొట్టలు పడే బుగ్గలు అంత పొడుగూ అంత పొట్టీ కాని మితమయిన ఎత్తు - ఎంత అందంగా ఉండాడు? అతని ముందే కదూ? తనకు తెలియకనే తన అందాన్నంతా ఆరవేసింది! ఆ గడియ అలానే శాశ్వతమైపోతే?

'అమ్మో! ఎంతాశే నీకు? ఎర్రంగా బుర్రంగా వుంటే మాత్రం అంతో యింతో సదువుకోమంటే కూడా - జాతీ నీతీ మర్చిపొయ్యేదేనా? జాగర్త. . మక్కెలిరగదన్నేస్తాం!'' ఒక్కరు గాదు, ఇద్దరు గాదు, ఊరూరుగా తనమీద విరుచుకపడుతున్నారు

'అమ్మో!' అని అరుస్తూ తల్లిని బల్లిలా కరుచుకొనిందా పిల్ల!

''ఏం పాడు కల్లో? ఏం పీడో! బిడ్డ బిత్తరపోతావుంది'

ఆ తల్లి మనసు తల్లడిల్లింది. ఆ పిల్లదాన్ని లేచి కూర్చోబెట్టింది. గుక్కెడ నీళ్లు గొంతులో పోసింది. మళ్లీ పడుకోబెట్టి అందీ అందని పాత దుప్పటిని అంతంతమాత్రంగా కప్పింది పొరకను కాళ్ల దగ్గర పెట్టింది - పాడు కలలు రాకూడదని!

అయినా ఆ సుందరికి ఆ రాత్రి పడకపొందితే ఒట్టు!

తెల్లవారింది. తెల్లవారింది మొదలు అనుకొంటూనే వుందా సుందరి అందరి కంటే ముందుగా కాలువకు వెళ్లి రావాలని అనుకొంటూ వుండగానే పొద్దుకుంకింది. చీకటి పడుతూ వుంది. కాలువకు వెళ్లిన వాళ్లు ఒక్కొక్కరుగా తిరిగి వస్తున్నారు. కాలువకు బయలుదేరేసరికి పంపునీటి కాలువ దగ్గర పలుచబడింది ఆమె అక్కడికి చేరేసరికి నిర్మానుష్యమయింది.

ఈ సంగతి ముందుగానే తెలిసినట్లు రమణ కూడా అప్పుడే అక్కడికి వచ్చాడు

ఆ సుందరి గొంతు కూర్చుంది - నగ్నంగా మాత్రం కాదు. కూర్చుని ఓ బండమీద బట్టలు ఉతుకుతూ వుంది. ఉతుకుతూ వుందన్నమాటే కానీ - ఊపిరంతా ఎక్కడో వుంది. పనిమీద లేని కన్నులు తమ పని చేసుకొంటున్నాయి.

రమణ గుడ్డలు విడిచి కాలువ గట్టున పెట్టాడు కాలువలో దిగాడు. పంపునీళ్లు పడేచోట ఆడుకొంటున్నాడు పట్టణంనుండి ప్రత్యేకించి తెచ్చుకొన్న సబ్బు విదేశీ సబ్బు!! కండబట్టిన ఒంటిపై పోరాడి నురుగుగామారి కాలువలో తేలిపోతూ వుంది. పరిమళాలు వెదజల్లుతూ వుంది

ఆ సుందరి అతడిని చూసీ చూడనట్లు చూస్తూనే వుంది. గుండెల్లో కూడా పలుకొంటున్న కోరికల్ని గొంతులోనే అణచుకొంటూ వుంది. అతడు గమనించనప్పుడు ఆ నురగను తీసుకొంటూ వుంది. వాసన చూస్తూ వుంది. ఆశగా! మోచేతులకు పాదాలకు రుద్దుకుంటూ ఉంది ఆప్యాయంగా.

సబ్బు నురగతో ఆమె పొందుతున్న అనుభూతిని రమణ ఓ కంట గమనిస్తూనే వున్నాడు అందుకే ఆ కాలువ నీటినంతా సబ్బు నురగమయం చేస్తున్నాడు. పంపునీటితో అతడు పరాచికాలాడుతుంటే సబ్బు నురగతో ఆమె దోబూచులాడుతూ ఉంది ఆ పరిసరాలు యౌవన సౌరభంతో ఎగిరెగిరి పడుతున్నాయి

రమణ స్నానం ముగించాడు. బట్టలు తొడుక్కున్నాడు. అడుగుమీద అడుగ్గా ఆమెను సమీపిస్తున్నాడు.

ఆ సుందరి అతడి రాకను గమనించింది. ఎగిరిపడి లేచింది కాలికొద్దీ పరుగెత్తాలనుకొనింది. కానీ కాళ్లాడలేదు. ఎటూ కదల్లేక తలవంచుకొని నిలబడింది

రమణ అల్లంత దూరంలో ఎదురుగా నిలబడ్డాడు. అంతసేపు చన్నీటిలో స్నానమాడినా అదోరకమైన వేడితో వొళ్లు కాలిపోతూ వుంది చిన్నగా తెపమాయించి గొంతు సర్దుకున్నాడు. కొసరి కొసరి మాటల్ని కూడపలుక్కున్నాడు

''ఎవరమ్మీ నువ్వు?''

ఉలిక్కిపడింది సుందరి. ప్రెసిడెంట్ పెద్దిరెడ్డి కొడుకు అడుగుతున్నాడు చెప్పడానికి సిగ్గు, చెప్పకపోవడానికి భయం. గుండెలు గుబగుబమంటున్నాయ్. ఎట్లో శక్తినంతా కూడదీసుకునింది.

''రావుడి కూతుర్ని'' మాట పెగలలేక పెగిలింది

''రావుడి కూతురివా?'' వత్తి పలికాడు రమణ.

''అవును''

శ్రుతిచేసి ఉంచిన తంబుర అందమైన తంబుర ఎవరో లయజ్ఞాన విహీనుడు మీటితే అపశ్రుతి పలికింది.

''పేరు?''

''వరాలు''

రమణ తల దిమ్మెక్కిపోయింది.

'ఇది పల్లెటూరి సౌందర్యం కాదే!' అని ఆశ్చర్యపడిన రమణ ఆ అమ్మాయి మరీ అడుగంటిన జాతినుండి అని వినేసరికి మరింత ఆశ్చర్యపడ్డాడు.

వరాలు గమనిస్తూనే వుంది.

ఆ ముందటి రోజు అతగాడి కాలు కదలమన్నా కదలలేదు. ఈరోజు కాలు నిలదొక్కుకున్నా నిలచేటట్లుగా లేదు. ఎంతలో ఎంత మార్పు?

రమణ వెనక్కు తిరిగాడు. మెల్లగా ముందుకుసాగాడు.

వరాలు పెదవులు వంపులు తిరిగాయి. ఆ వంపుల సందుల్లో వచ్చీరాని ఓ చిరునవ్వు.

పిండిన బట్టల్ని ఓ బుట్టలో వేసుకొనింది వరాలు. బుట్టను తీసి చంకన వేసుకొనింది. వరాలు కూడా బయలుదేరింది. ఆ పూటకు వాళ్లిద్దరు విడిపోయారు - రమణ ఊరివైపు - వరాలు వాడవైపు!

-

ఆ ముందటినాటి అనుభూతుల్ని కడవకివతల కావలిబెట్టి - తాను మాత్రం యింట్లో అడుగుపెట్టి - కంచంలో చేయి పెట్టినట్లు పెట్టి- గుట్టుగా డాబాపై కెక్కాడు రమణ. అదే పట్టెమంచం అదే మెత్తడి పరుపు... అవే వెన్నెల వెలుగులు... అవే మల్లెల మత్తులు... అయినా మనసు నిండా చీకటి! ఆగిన రైలెక్కడానికి ఆతురతపడుతున్న ప్రయాణీకుల్లా తలను చుట్టి ఆలోచనలు. పడక పొందక లేచి కూర్చున్నాడు.

ఎదురుగా వరాలు!

గుడ్డలుతుక్కొంటున్నట్లు ఉతుక్కొంటూ అదోరకంగా చూస్తూ ఉంది

''ఎందుకమ్మా అలా చూస్తున్నావ్?''

''మీరెందుకట్లా ఆలోచిస్తా వుంటారు?''

''ఆలోచించడం లేదు ఆవేదన పడుతున్నాను''

''ఎందుకూ?''

''దేవుడెందుకిలా చేశాడా? అని ''

''మన చేతగాని తనాన్ని దేవుడిమీద రుద్దడం తప్పు కదూ?''

''మరి దీన్నేమనాలి?''

''ఏమనాలంటారు? దేవుడు బురదలో తామరల్ని పూయించడం లేదా? ముళ్ల సందుల్లో గులాబీలను తొడిగించడం లేదా? అవి పూజకు ఉపయోగింపబడటం లేదా? మనుషుల మధ్య కులాల అడ్డుగోడల్ని దేవుడు కట్టలేదు ఒకనాటి అవసరంతో వాటిని మనమే కట్టుకొన్నాం అవసరం లేదనుకున్నప్పుడు పడగొట్టాలి ఏం? అనుకొంటే మీరా పని చేయలేరా?'' వరాలు నిలదీసి అడుగుతున్నట్లుంది

''అవును. కొట్టాలి! దుమ్ముదుమ్ముగా పడగొట్టాలి!'' ఆవేశంతో అంటున్నాడు

''ఏం సినయ్యా? ఏందో కొట్టాలగిట్టాలంటుండావే? ఎవుర్నబ్బా?''

ఉలిక్కిపడి ఈ లోకంలో పడ్డాడు రమణ

ఎదురుగా పుల్లయ్య తాత. పాల గ్లాసు పట్టుకొని నిలబడి ఉన్నాడు

''అన్నం కూడా సరిగ్గా తిన్లేదని అమ్మ అల్లాడిపోతా వుంది మణుసుండక తెచ్చినా! ఈ పాలట్లా గొంతుల్లో పోసుకో నాయినా!'' బ్రతిమాలాడు పుల్లయ్య

''అక్కడ పెట్టిపో తాతా!'' పుల్ల విరిచినట్లనేసరికి పుల్లయ్య తాత గ్లాసు నక్కడ పెట్టి వెళ్లిపోయాడు

రమణ పాలు త్రాగలేదు సరికదా - ఆ రాత్రి నిద్రకూడా పోలేదు.

పొద్దు పుట్టింది. పుట్టిన పొద్దు కుంకింది. ఆ రోజు మాత్రమే కాదు. వరుసగా పది రోజులు - పొద్దు పుట్టింది. పుట్టిన పొద్దు కుంకింది.

ఈ పది రోజులు సందకాడ సద్దుమణిగిన వేళ పంపునీటి కాలువ దగ్గర వీళ్లిద్దరి సందడే! ఇద్దరి గుండెల్లో పెద్ద పెట్టున అలజడే!!

పదకొండో రోజు కూడా తెల్లవారింది.

రమణ ఓ నిర్ణయానికి వచ్చేశాడు.

తన నిర్ణయంతో తండ్రి స్వయార్జితం అల్లుళ్ల పరం కావడం ఖాయమని తెలుసు

అయినా అతడు విద్యార్థిగా వర్ణాంతర వివాహాలపై ఇచ్చిన ఉపన్యాసాలు. . ఎందరో మహాత్ములు చేసిన త్యాగాలు అతన్ని ముందుకు నెట్టుతున్నాయి తాను చదువుకొంటున్న కళాశాలలో ఓ హరిజన కుర్రవాడు, ఓ రెడ్ల అమ్మాయి కళ్లెదుటే పెళ్లి చేసుకొన్నారు. కాలేజీ కాలేజీగా అతడి నభినందించింది. ప్రభుత్వం పారితోషికమిచ్చి ప్రోత్సహించింది చదువు పూర్తయితే ఉద్యోగావకాశాలా? సరేసరి!

తన నిర్ణయాన్ని నిమిరి వదిలాడు రమణ.

పురులు విప్పి నాట్యమాడుతూ వుంది నిర్ణయం గుండెల్లో!

ఆ రోజుకూడా పొద్దు కుంకింది, సద్దుమణిగింది.

పంపునీటి కాలువ ఇద్దరి సందడితో సంబరాలు పోతూ వుంది.

తన నిర్ణయాన్ని వరాలు చెవిని పడవేద్దామని రమణ తహతహపడుతున్నాడు పంపునీటి కాలువ సబ్బు నురగతో మిసమిసలాడుతూ వుంది.

అంతలోనే కూడపలుక్కొన్నట్టుగా ఊళ్ళోనుండి కొంతమంది వాడలోనుండి కొంతమంది యువకులు అక్కడ ఊడిపడ్డారు

రమణ వాళ్లను చూసి ఉలిక్కిపడ్డాడు. రమణను చూస్తున్న వాళ్ళు అందరూ ఒకరి మొగమొకరు చూసుకొంటున్నారు వరాలు తన పని తనదన్నట్టుగా వుంది

జిల్లా స్థాయిలో కబాడీ పోటీలు మరో పది రోజుల్లో నిర్వహింపబడపోతున్నాయి ఊరిలోని వాడలోని యువజన సంఘ సభ్యులు ఆ పోటీలో పాల్గొనడానికి తయారవుతున్నారు ఆడిన తరువాత స్నానమాడటానికి వచ్చారు. ఆడవాళ్ల కోసం కేటాయించిన కాలం దాటి పోయింది కదా? అని..!

ఓ నిముషం కాలువ గట్టున నిలబడింది యువతరం.

ఏదో ముచ్చటపడి రమణ వేళకాని వేళ పంపునీటి స్నానానికి వస్తే పగటి పూట పని తీరక గుడ్డలు పిండుకోవడానికి వరాలు వచ్చి వుంటుందని యువతరం చూపులతోనే సర్దిచెప్పుకొనింది. ఆపై కేరింతలు కొడుతూ కాలువలో పడింది పైనీళ్లలో ఊళ్లోవాళ్లు పడితే కింది నీళ్లల్లో వాడలో వాళ్ల పడ్డారు. పంపునీటి కాలువ దగ్గర కోలాహలానికి కొదువ లేకపోయింది.

ఒళ్లో యువకులు రమణతో కలశారు. సువాసనల్ని వెదజల్లుతున్న సబ్బును తెగ మెచ్చుకుంటు న్నారు రమణ చేతుల్లోనుండి ఆ సబ్బును లాక్కున్నారు. నిముషాలమీద చేతులు మారిపోతుందా సబ్బు. హుషారుగా పైనీళ్లల్లో స్నానాలు సాగుతుంటే సబ్బు నురగ తెట్టెలు గట్టి జోరుగా తేలిపోతూ వుంది.

దర్జాగా చూస్తూ నిలబడ్డాడు రమణ.

క్రింది నీళ్లల్లో స్నానం చేస్తున్నదీ కుర్రవాళ్ళే!

ఆ కుర్రవాళ్ళు సబ్బు నురగను రెండు చేతులతో జవురుకొంటున్నారు. తలకు ఒంటికి మార్చిమార్చి రుద్దుకుంటున్నారు. కొందరు దోసిటపట్టి ఊపిరి, ఎగపీల్చినంతవర కెగపీల్చి ఆ వాసనతో పరవశిస్తున్నారు. మెలికలు తిరిగిపోతున్నారు. సబ్బు రుద్దుకుంటున్న వాళ్లవైపు అదే పనిగా చూస్తున్నారు. ఆ చూపుల్లో ఆశ ఉంది. అభ్యర్థన ఉంది. అయితే గమనించే వాళ్ళెవరు?

అలవాటు మేరకు ఆ సబ్బు నురగను దోసిటబట్టింది వరాలు. వంచిన తల ఎత్తకుండానే ఒక కంట గమనిస్తూనే ఉంది. అక్కడ జరుగుతున్న జల క్రీడల్ని!

క్రింది నీళ్లను చూసి పై నీళ్లు పగలుపడుతూా వళ్లు విరుచుకొంటున్నాయి. ఒళ్లు విరుచుకుంటూ పగలబడి నవ్వుతున్నాయి - నురుగులు కక్కుతూ!

దోసిటబట్టిన సబ్బు నురగను విసిరి నీళ్లల్లో కొట్టింది వరాలు!

వాడలోని యువకులు తమ ఆశల్ని ఆ నీళ్లల్లోనే కలిపారు. కలిసికట్టుగా కాలువ పక్కన పుట్టమీద పడ్డారు. తలా పిడికెడు మట్టినందుకున్నారు. పై నీళ్లల్లో పరిమళాలు పోయే సబ్బు! క్రింది నీళ్ళల్లో పనికిరాని పుట్టమట్టి!!

యువకులు స్నానాలు ముగించారు.!

ఊళ్లోని యువకులు పరిమళాలు పోయే సబ్బుతో! వాడలోని యువకులు ప్రకృతి ప్రసాదించిన పుట్టబట్టితో! ఆ తరువాత వాళ్లు విడిపోయారు. ఊళ్లోని వాళ్లు ఊరివైపు, వాడలోని వాళ్లు వాడవైపు.

ఆ సమయం కొసమే ఎదురుచూస్తున్న రమణ గొంతు సర్దుకొన్నాడు.

''వరాలు నిన్ను నేను పెళ్లాడుతాను''

ఆ మాట చెవిన పడటంతో ఒక్కసారి తల పైకెత్తింది వరాలు ఒక్కచూపు విసిరింది వరాలు. నరనరాలను తాకిందా చూపు

''ఎందుకలా చూస్తున్నావ్?'' సందేహంగా అడిగాడు రమణ

చూడాల్సినట్లు చేశారు కాబట్టి చూస్తున్నా!''

''నేనేం చేశాను?''

''ఎవురు చేసింది వాళ్లకు తెలిస్తే ఏ బెడదా వుండేది కాదు''

ఇదో ఈ అడ్డ మాటలు మాని అడిగిందానికి బదులు చెప్పు''

అసహనం అడుగుపెడుతూ వుంది రమణ మాటల్లో తెగేదాకా లాగకూడదనుకొనింది వరాలు. సూటిగా అడగడానికే తలపడింది

''అక్కడ పోతుండేవాళ్లెవురు?''

''ఊళ్లోవాళ్ళు''

''ఇదో యిటుపోతూండే వాళ్లెవురు?''

''వాడలో వాళ్లు''

''వాళ్లూ వీళ్ళూ అందరూ మనుషులే గదా?''

''అవును''

''అయితే వాళ్లకిచ్చిన సబ్బు నీళ్లకెందుకివ్వలేకపోయారు?''

''వాళ్లగడలేదు కాబట్టి''

''అడుక్కోమంటే ముస్టెత్తుకోవడం బాబూ! కాయకష్టం జేసి బతికే జన్మాలు ముష్టికిష్టపడవు''

''అంటే?''

''అంటేనే బాబూ! మణుసులంతా ఒకటే. అయితేగూడా కొందరికి లాక్కొనే సాతంత్రం వుంటే- మరి కొందరికి అడుక్కునే అర్హత కూడా వుండదు బాబూ!''

''ఆ .!?''

''అవును బాబూ! వాడలోని కుర్రాళ్ళ తపన గమనించారా మీరు? ఎంగిలి మెతుకుల కోసం ఎగబడే కుక్కల్లా మీ ఒంటిమీదనుండి జారిపడిన సబ్బు నురగకోసం ఎలా ఎగబడ్డారో వాళ్లు. అసలు మీరెక్కడ చూడగలుగుతార్లే? ఈ వారం పదిరోజులనుండి తమరు చూస్తూనే వున్నారు ఆ సబ్బు నురగతోనే నెంత సబర పడిపోయానో? అయినా ఒక్కనాడైనా 'ఇదో! యిందమ్మీ సబ్బు! ఆ నురగతోనే ఎందుకట్లా సతమతమై పోతావ్?' అని మనసారా ఒక్క మాటనలేకపోయారు ఈ మాత్రం గుండెలేని మనిషి పెండ్లి చేసుకొంటాడా బాబూ పెండ్లి?''

వరాలు వశం తప్పింది.

రమణ తల దిమ్మెక్కిపోయింది.

ఓ సబ్బు నురగ తెట్టె! గడ్డిపోచ అడ్డుపడితే అంతవరకు ఆగి వుండింది. అప్పుడు ముందుకు సాగింది. నీటిపైన తేలిపోతూ వుంది అలా అలలమీద తేలిపోతూ పోతూ కొద్దికొద్దిగా కరుగుతూ పూర్తిగా నీళ్లల్లో కలిసిపోతూ వుంది

''అసలు మీ మనసుల్లో మురికి తరతరాలుగా పేరుకుపోయింది ఆ మురికిని కడగాలంటే ఈ సబ్బులు పనికిరావు మనుసుల్ని కడిగే సబ్బులు తయారుకావల దీనికింకా చాలాకాలం పడుతుంది బాబూ! చాలాకాలం పడుతుంది?''

ఒక్క క్షణం ఆగింది వరాలు

మరొక్క క్షణం వాళ్ళిద్దరి మధ్య మౌనం.

''అంతవరకు ఎదురుచూసే ఓపికుంటుందా బాబూ?''

ఎత్తిపొడిచింది వరాలు

రమణ తల వాలింది?

ఒక్క ఊపులో తడి బట్టల బుట్టను చంకన వేసుకొని వరాలు వాడవైపు సాగింది



# ఎన్‌కౌంటర్

తిరుమలశ్రీ

సూర్యుణ్ణి ఎవరో కత్తితో పొడిచిన కారణంగా పశ్చిమాద్రి ఎర్రబారి పోయింది.

ప్రభుత్వం విధించిన కర్ఫ్యూలా దిగంతాలలో చీకట్లు క్రమంగా ప్రాకుతున్నాయి

సమాజపు అట్టడుగు తరగతికి చెందిన బడుగు జీవాల బంధిఖానాలాంటి మురికివాడలో...

పేవ్‌మెంటుమీది దేవుడి గుడిలా ఇరుకుగా వున్న ఓ గుడిసె..

ఆ గుడిసెలోంచి .

గుక్కపట్టి ఏడుస్తూన్న పసిపిల్ల గొంతు... చెడిపోయిన ఫ్యాక్టరీ సైరన్‌లా ఆగకుండా వినిపిస్తూనే వుంది.

ఏడుపు ఎవరు ఏడ్చినా... ఎన్నో రకాలు...

ఏ రకపు ఏడుపు ఎందుకోసమో చెప్పడం కష్టం కాదు.

ప్రస్తుతం ఆ పసిదాని ఏడుపు - ఆకలి గోడు అని స్పష్టమవుతూనే వుంది

అయితే -

స్పష్టం కానిది - ఆ ఏడుపును ఎలా ఆపాలా అన్నదే!

దాని వొళ్లో పెట్టుకుని నిస్త్రాణగా మంచం కోడుకు జారగిలబడిపోయింది ముత్యాలు.

గోడుగోడున ఏడుస్తూన్న ఆ పసిదాని గొంతు ఆ తల్లి చెవిలో పడుతూనే వుంది.

కాని, పసిదాని క్షుద్బాధను ఎలా అరికట్టాలా అన్నదే ఆమె వూహకు అతీతంగా ఉన్నది

నిరాశామయమయిన మనసుతో, అసహాయతతో అశ్రుతర్పణం చేస్తూ నిస్పృహగా చంటిదాన్ని జోకొట్టడం మినహా ఏమీ తోచడం లేదు ఆమెకు. రెండు రోజులుగా పసిదానికి పాలు లేవు

తల్లి కడుపులో మేతపడితే పిల్ల కోసం పాలు చేపుతాయి.

కాని, మూణ్ణాళ్లుగా టీ నీళ్లతో గడిపేస్తోంది ముత్యాలు. స్తనాలు వొట్టిపోక ఏమవుతాయి? పిల్లదాని ఆకలిబాధ చూడ్లేక ఎక్కడో కాస్తంత పంచదార అడిగి తెచ్చి నీళ్లలో కలిపి రెండు రోజులుగా ఆ తీపి నీళ్లతోటే పసిముండకు నోరు తడుపుతోంది.

అభం శుభం ఎరుగని పసిగుడ్డును మోసగిస్తున్నానన్న సంగతి ఆమెను కలచివేస్తూనే వుంది. కానీ, గత్యంతరం ఏది?

ఆరోజు ఆ చక్కెర నీళ్ళు కూడా కరువయి పోయాయి.

అందుకే కాలే కడుపుతో పిల్ల పెట్టే గోల

దానికితోడు వుదయం నుంచీ పెట్టిపోయే జ్వరంతో మూసిన కన్ను తెరవకుండా పడి వుంది పిల్ల

ఒంటిమీద చేయి వేస్తే కాలిన పెనంమీద వేసినట్లుందే తనకు తెలిసిన వైద్యమేదో చేయబోయింది గాని ఫలితం కనిపించలేదు ఉండుండి పెద్ద పెట్టున వులిక్కిపడటమే కాక, పెద్దపెట్టున గుక్కపట్టి ఏడుస్తోంది పిల్ల

కన్నులు జలపాతాలవుతూంటే మూర్తీభవించిన దైన్యంలా కళ్ళు మూసుకుని వుండిపోయింది ముత్యాలు అయితే.

బ్యాక్‌గ్రౌండ్ మ్యూజిక్‌లా వినిపిస్తూన్న ముసలిదాని సణుగుడు ముత్యాలు బుర్రను కుమ్మరి పురుగులా దొలిచేస్తోంది

అరవైఏళ్ల ముసల్ది - ముత్యాలు అత్తగారు - నేలపైన చింకి చాపమీద, కడుపులో కాళ్ళు పెట్టుకుని ముడుచుకుని పడుకుంది.

వెన్నుకు అంటుకుపోయిన కడుపుతో, బడుగు దేహంతో, కడుపులో ప్రేగులు చేస్తూన్న ఆర్తనాదాలకు తట్టుకోలేక, మాట్లాడే ఒపిక లేకపోయినా, ఎలాగో వోపిక చేసుకుని విధిగా సణుగు తూనే వుంది కోడలిమీద.

ఆరోజు ముసలిదానికి కనీసం టీ నీళ్లు కూడా కరువయ్యాయి. ఆ రెండు రోజులుగా ఏ పొరుగింటి పుల్లమ్మో, ఇరుగింటి ఎల్లమ్మో కాచుకున్న టీలో ఓ చుక్కతో నాలుక తడుపుకునేది. ఆరోజు ఆ ఆశా లేకుండా పోయింది'.

ఆకలి బాధ, అసహాయతా, తమ పొటుకు తమను గాలికి వదిలేసి తన సౌఖ్యం తాను చూసుకున్న స్వార్థపరుడైన కొడుకుమీద కోపం - అన్నీ కలగాపులగమై కోడలిమీద పగగా మారాయి ముసలి దానికి

ఎలాగో వోపిక చేసుకుని కోడల్ని దుమ్మెత్తి పోస్తూ, ఆ విధంగా తన కసి తీర్చుకోవాలని తాపత్రయపడుతోంది ఆ ముసల్ది, ఆకలి బాధ తీర్చుకోలేకపోయినా

'ఆడది చేతకానిదైతే మగాడు వూరి తిళ్లకు ఎగబడక ఏం చేస్తాడు? చేసుకున్న పెళ్లాం జాణ అయితే ఎంగిళ్ల అవసరం మొగుడికి ఎందుకు కలుగుతుంది? నా కొడుకును నాకు కాకుండా చేసింది ముదనష్టపుది. ముసలిదాన్ని ఆకలితో మాడ్చి చంపితే మహాపాపం చుట్టుకుంటుంది. పుట్టగతులు లేకుండా పోతాయి...

- ఏదేదో సణుక్కుంటూనే వుంది ముసల్ది. వోపిక లేకపోయినా తెచ్చుకుని మరీ.

అవన్నీ చెవిలో పడుతున్నా బుర్రకు ఎక్కడం లేదు ముత్యాలికి కారణం ఆ బుర్రలో మొగుడే మెదులుతున్నాడు.

ముత్యాలు మొగుడు జోగులు వూరి చివర ట్రావెలర్స్ బంగళాలో వాచ్‌మాన్‌గా పనిచేస్తున్నాడు.

మ్రింగడానికి మెతుకులు చాలకపోయినా, వున్న పెళ్లాం చాలనట్టుగా, ఓ వుంపుడుగత్తె కావాల్సి వచ్చింది వాడికి.

మబ్బు తునకల మధ్య చందమామలా, చింపిరి గుడ్డల్లో, చిక్కడిపోయిన అందం ముత్యాలిది చక్కని దుస్తులు కడితే మేకప్ లేకుండానే సినిమా తారలను తలదన్నే సహజ సౌందర్యం ఆమెది.

అయితే ముసల్ది అన్నట్టు జాణతనం ఎరుగని ముత్యాల్ని మోసగించి మరో నెరజాణను మరిగాడు జోగులు

ఆరంభంలో వుపేక్షించినా, పెళ్లాం మౌనాన్ని అలుసుగా తీసుకుని ఇంటికే తీసుకొచ్చిన మొగుడిమీద తోక త్రొక్కిన త్రాచులా లేచింది ముత్యాలు

ఫలితంగా - కాపురం దానింటికాడే పెట్టేసాడు జోగులు పెర్మనెంటుగా ఇంటికి రావడం మానేశాడు

ముత్యాలు ఏడ్చింది

చంటిపిల్లను చూపించి మొత్తుకుంది.

ముసల్ది శాపనార్థాలు పెట్టింది

ఎందరో ఎన్నో విధాలుగా చెప్పి చూశారు.

ప్రయోజనం లేకపోయింది

గుండె బండ చేసుకుంది ముత్యాలు.

పసిదాన్ని చూసుకుని మనసు వూరట పరుచుకుంది

అత్తను అండగా తలచుకుంది.

అక్కడా, ఇక్కడా పాచి పని చేసుకుంటూ తెచ్చిన తృణంలో ఆ మూడు పొట్టలూ నింపుకోవాలనుకుంది.

అయితే -

వయసులో వున్న ఆడది .. అందునా ఇంతో, అంతో అందంకల ఆడది. . గుమ్మం దాటి స్వేచ్ఛగా, సురక్షితంగా మనగలిగే అదృష్టం ఈ దేశానికి ఇంకా అబ్బని కారణంగా, ప్రతి చోటా చుక్కెదురే అయింది ముత్యాలుకి'

మొగుడు వదిలేసిన పెళ్లాం అంటే బజారున పడ్డ ఆడదానితో సమానం లోకానికి, అందుకే ముత్యాలి అగచాట్లు అధికం అయ్యాయి.

దాంతో చేసిన చోట చేయకుండా కొత్త చోట్లు వెదుక్కోవలసిన అగత్యం పట్టింది.

మగ జనారణ్యంలో మగువ స్థానం ఏమిటో స్పష్టంగా తెలిసి వచ్చింది ముత్యాలికి.

ఫలితంగా - పస్తులు ఆరంభమయ్యాయి.

మూడు రోజులనుంచీ ప్రేగు తడవక పోయేసరికి ముసలిదాని గోల ఎక్కువయిపోయింది.

పసిపిల్లతో సమానంగా అత్తను చూసుకుంటూన్న ముత్యాలుకి, ముసలిదానిమీద కోపం కంటే జాలే కలిగింది - ఆ వయసులో పట్టెడు మెతుకులకు పుట్టెడు అవస్థ పడుతున్నందుకు. కొడుకు దగ్గరకెళ్ళి వాణ్ణి బ్రతిమాలి ఇంటికి తీసుకురమ్మంటూ ఈ మధ్య కోడల్ని పోరుతోంది అత్తగారు.

కాని, అలా చేయడానికి ముత్యాలికి మనసు వొప్పడం లేదు. అందుకే ముసలిదానికి కోపంగా వుంది.

అటు కొడుకునీ, ఇటు కోడలినీ మార్చి మార్చి శాపనార్థాలు పెడుతోంది ముసల్ది

తప్పంతా తనదేనన్నట్లు తిట్ల వర్షం కురిపించే అత్త ప్రవర్తన మనసును గాయపరచినప్పుడు మాత్రం 'నువ్వూ ఆడదానివేకదా, అత్తా!' అంటూ లోలోపలే బాధపడేది ముత్యాలు. ఆ మాత్రం అర్థం చేసుకోలేవా అన్నట్లు -

కాసేపటికి ఇటు పసిబిడ్డా, అటు ముసలి అత్తా సొమ్మసిల్లినట్లు పడిపోయాడు పిల్ల ఏడుపూ, అత్త సణుగుడూ ఆగిపోయాయి.

జ్వరంతో ప్రేలిపోతూన్న పిల్ల వొళ్లు చూస్తుంటే భయం అధికమయింది ముత్యాలికి పిల్లను ఎవరికి చూపించాలో, ఏం చేయాలో తెలియలేదు డాక్టర్ దగ్గరకు తీసుకువెళ్లడానికి పైసలు కావాలి. ఏం చేయాలో తోచలేదు ఆమెకు.

జోగులు ఇల్లు విడిచి అప్పటికి మూణ్ణెల్లయింది.

పిల్లదానికోసం అహం చంపుకుని భర్త దగ్గరకు వెళ్లాలనుకుంది.

అప్పటికే బాగా ప్రొద్దుపోయింది.

జోగులు పనిచేసే ట్రావెలర్స్ బంగళా ఎక్కడో వూరి చివర వుంది.

ఆ రాత్రప్పుడు అంత దూరం, అందునా వొంటరిగా వెళ్లడానికి భయంగానే వుంది. అయినా గత్యంతరం శూన్యం.

పిల్ల పరిస్థితి తెగింపును కలిగించింది ఆమెకు.

చటుక్కున లేచి నిలుచుంది. బట్టలు సర్దుకుంది.

ముసలిదాన్ని లేపి, ''నేనిప్పుడే వస్తాను. పిల్లను కాస్త చూసుకోవే అత్తా!'' అంది.

అర్థమయిందో లేదో గాని మగతలోనే చిన్నగా మూలిగింది ముసల్ది.

తడికె తలుపు దగ్గరగా వేసి గుమ్మం దాటింది ముత్యాలు, కాటుకలా వున్న చీకటిలో అడుగుపెడుతూ.

ముత్యాలు బయటకు వచ్చిందో లేదో సన్నగా తుంపర ఆరంభమయింది.



రెండవ ఆట సినిమా మొదలయి అరగంట అయింది.

అంతసేపూ బేరాల కోసం చూసి చూసి చేసేది లేక ఖాళీ రిక్షాతో తిరుగుముఖం పట్టాడు రాజు.

రోడ్లమీద జనం పలచబడ్డారు.

ఇంటిముఖం పట్టిన రిక్షా కుర్రాళ్లు కొందరు గొంతెత్తి పాడుతూన్న సినిమా పాటలు వుండి వుండి వినవస్తున్నాయి.

కొంత దూరం వెళ్ళాక రిక్షా ఆపాడు రాజు.

జేబులోంచి బాగా నలిగిపోయిన నోట్లు, చిల్లర పైసలూ తీసి లెక్క చూసుకున్నాడు.

లెక్క పూర్తి అయ్యేసరికి ఎక్కడలేని నీరసమూ వచ్చేసింది అతనికి. ఓ క్షణం తల పట్టుకుని వుండిపోయాడు.

బండి అద్దెకే అయిదు రూపాయలు బొర్రు వస్తున్నాయి. ఇక గంజినీళ్ల మాటేమిటి!

రోజు అద్దెలో ఒక పైసా తక్కువయినా వచ్చి బూతులు ఆడతాడు రిక్షా వోనర్. మర్నాటినుంచి రిక్షా ముట్టుకోవద్దంటాడు. రిక్షావాళ్ల కాయకష్టంతో వొళ్లు పెంచుకుని, బొజ్జ భారం చేసుకునే ఆ భారీ కాయానికి పేదవాళ్ల బాధల అర్థం కావు. నోరు విప్పితే బూతులు తిట్టడం మాత్రం వచ్చును.

ఆ అనుభవం అప్పుడప్పుడు రాజుకూ అవుతూనే వుంటుంది. కాలే కడుపుతో, తూలే శరీరంతో రోజంతా రిక్షా త్రొక్కినా టీనీళ్లకు కూడా మిగలదు ఒక్కోసారి. కొడుకు రెండు రూపాయలు తెస్తాడు. పిల్లలకు గంజినీళ్లు కాచి పొయొచ్చునని ఎంతో ఆశతో ఎదురుచూసే రాజు తల్లికి తరచు నిరాశే ఎదురవుతూ వుంటుంది అటువంటప్పుడు సిగ్గుతో తలవంచుకుంటాడు రాజు.

రిక్షా అద్దెకు సరిపడా అయినా సంపాదించలేని రోజున కూడా యజమాని ముందు తలవంచుకుంటాడు అతను - అవమానంతో, అసహాయతతో.

అలాంటప్పుడు పట్టరాని ఆగ్రహం కలుగుతుంది రాజుకు - యజమానిమీద కాదు, ఎందుకూ కొరగాకుండా పోయిన తన చదువుమీద... పెట్టెలో పెట్టి పూజిస్తున్న డిగ్రీ కాగితం మీద!

డబ్బు మళ్లీ జేబులో పడేసుకుని, నిస్సత్తువగా త్రొక్క నారంభించాడు రాజు. అతని బుర్రలో గతం రిక్షా చక్రాల్లా తిరిగింది.

రాజు తండ్రి ఏదో ఆఫీసులో సూపర్‌వైజర్‌గా పనిచేసేవాడు. అతను హఠాత్తుగా బస్ యాక్సిడెంట్‌లో పోవడంతో కుటుంబం నిరాశ్రయంగా రోడ్డున పడింది.

అప్పటికి రాజు ఎం.ఎ ఫైనలియర్‌లో వున్నాడు. చెల్లెలు టెన్త్ చదువుతోంది. తమ్ముడు సెవెన్త్ చదువుతున్నాడు.

గత్యంతరంలేక కొన్ని ఇళ్లల్లో పాచి పనికి కుదిరింది రాజు తల్లి. తన కడుపు కట్టుకుని పిల్లల్ని పెంచసాగింది.

రాజు ఎమ్మే ఫస్ట్‌లో పాసవడంతో ఉద్యోగమే దొరికినంత సంబర పడిపోయారంతా. అయితే రెండేళ్లకుగాని వారి కలలు ఇంకిపోవడం జరగలేదు. ఎక్కడికి వెళ్లినా సిఫార్సు, సొమ్ములూ తప్ప అర్హతలన్నీ వున్నందుకు సిగ్గు పడటమే కాక విచారించదగిన పరిస్థితి ఏర్పడింది. క్రమంగా అది చేతకానితనంగా భావించి తల్లికి ముఖం చూపించడానికి కూడా మనస్కరించని స్థితికి వచ్చాడు రాజు.

కుటుంబ పరిస్థితి కూడా రానురాను సంకటంగా పరిణమించడంతో చేసేది లేక రిక్షా అద్దెకు తీసుకుని తొక్క నారంభించాడు. తన విద్య, అర్హతలను దాచిపెట్టి రిక్షావాలగా రూపెత్తాడు రాజు. తాను పోస్టు గ్రాడ్యుయేట్ అన్న నిజం తెలిస్తే ఆ రిక్షా కూడా దొరకదని తెలుసు. అందుకే ఆ విషయం దాచిపెట్టాడు. ఆరంభంలో కొద్ది రోజులు ఆ విషయం తల్లినుంచి దాచగలిగినా, చివరకు ఒక రోజున దొరికిపోక తప్పలేదు. ఆనాడు ఆ తల్లి పడిన బాధ ఇంతా అంతా కాదు. రిక్షా త్రొక్కడంలో తప్పులేదనీ, అది నైచ్యం కాదనీ, అదీ ఒక గౌరవనీయమైన, స్వేచ్ఛాయుతమైన పని అనీ తల్లికి నచ్చచెప్పడానికి ఎంతో కష్టపడవలసి వచ్చింది అతను. ఏది ఏమైనా పరిస్థితులతో రాజీ పడక తప్పలేదామెకు. చెట్టంత కొడుకు అంత చదువూ చదివి చివరకు రిక్షా తొక్కుతున్నాడంటే- ఆ చేదు నిజాన్ని ఏ తల్లి భరించగలదు!

ఏదో లారీ ఎదురుగా రావడంతో ఆలోచనల్లోంచి బయటపడి, బండి పక్కకు తప్పించాడు రాజు. అతని మనసులా భారంగా, పెద్దగా చప్పుడు చేసుకుంటూ వెళ్లిపోయింది లారీ.

ఇప్పుడు తక్కువయిన సొమ్ములతో యజమానిని ఎలా ఎదుర్కోవాలో తెలియక బెంగ పట్టుకుంది రాజుకు - బేరాలు దొరకలేదని నిజం చెప్పినా నమ్మడతను. డబ్బులు వాడేసుకుని అబద్ధం చెబుతున్నాడనుకుంటాడు. కొందరు అలా చెయ్యడం అబద్ధం కాదు, అందుకే నిజం చెప్పినా నమ్మడు అతను.

కొందరిలా ప్రయాణీకుల్ని ఎక్స్‌ప్లాయిట్ చేయడం రాజుకు ఇష్టం వుండదు. పేద వారనిపిస్తే అసలు రేటుకు తక్కువే తీసుకుంటాడు కూడాను. అంతేకాదు, అవినీతి పనులకు తన రిక్షాను వుపయోగపడనివ్వడు.

ఆలోచనలలో మునిగిపోయి నెమ్మదిగా రిక్షా త్రొక్కుతున్న రాజుకు చినుకులు

ఆరంభమయినట్టుగాని, తాను మురికివాడ మీదుగా వెళుతున్నట్టుగాని స్పృహే లేదు. . ఆమె రెండు, మూడు సార్లు పిలిచిన పిలుపు కూడా చెవిలో దూరలేదు.

ఆమె ఎదుటికి వచ్చి నిలుచుని, ''నిన్నే, అన్నా! రిక్షా కడతావా?'' అని అడగడంతో అప్పుడే స్పృహలోకి వచ్చాడు రాజు ఆమెవంక ప్రశ్నార్థకంగా చూశాడు.

చినుకులు అంతకంతకూ పెద్దవి కావడంతో తడుస్తోందామె. అసలే నీరసంతో నోట్లోంచి మాట బయటికి రావడం లేదు దానికితోడు ఆకలితో రోజంతా రిక్షా త్రొక్కి త్రొక్కి ప్రొద్దుటనుంచీ టీనీళ్లతోనే వున్నాడేమో, నీరసంతో చెవులు సమ్మె చేస్తున్నాయి, మనసు పరాకు చెందింది.

చీకట్లో ఒంటరిగా వున్న ఆడమనిషిని చూసి అనుమానంగా అడిగాడు. ''ఎక్కడికి వెళ్లాలి?'' అంటూ.

''ఊరవతల టి.బి దగ్గరకు ఎళ్లాలన్నా!'' అంది ముత్యాలు

''అక్కడేం పని?'' అన్నాడు అనుమానం పెరగడంతో

''మా మావ అక్కడ పని చేస్తన్నాడు పిల్లకు వొళ్లు తెలీని జొరంగుంది. బొగ్గి మావను తీసుకురావల. డాక్టర్‌కి సూపించాల'' అంది ముత్యాలు గబగబా ఆ రాత్రప్పుడు వూరి చివరకు అతను బేరం కట్టడేమోనన్న భయంతో తన కష్టం చెప్పుకుందామె.

అస్పష్టంగా కనిపిస్తోన్న ఆమె రూపము, గొంతులో నీరసము, మాటలలో ధ్వనించిన నిజాయితీ చూసి బేరం వొప్పుకున్నాడు రాజు.

'ఎంత' అని కూడా అడక్కుండా ఎక్కి కూర్చుందామె.

'ఇంత అవుతుంద'ని అతనూ చెప్పలేదు.

తనలాంటి పేదవాళ్లన్నా, కష్టాల్లో వున్న వాళ్లన్నా ఇట్టే కరిగిపోతాడు రాజు.

అందుకే వర్షం అధికమవుతూ వున్నా లెక్కచేయకుండా, లేని వోపికను తెచ్చుకుని పెడల్ వేశాడు.

పేదవాడి బ్రతుకులా భారంగా కదిలింది రిక్షా.



ఆరోజు ట్రావెలర్స్ బంగళా సందడిగా వుంది.

ఉన్నత పోలీసు అధికారులు అక్కడ మకాం వేశారు.

పొరుగూర్లో రెండు రోజులుగా గొడవలు జరుగుతున్నాయి... ఒక హరిజన బాలికను ఇద్దరు అగ్ర కులస్తులు రాక్షసంగా రేప్ చేసిన కారణంగా రెండు తెగల మధ్య గొడవలు రేగాయి. తీవ్రమయిన ఆందోళన జరిపినందుకు హరిజనవాడ రాత్రికి రాత్రి తగలబడిపోయింది.

ఆ అల్లరులను అదుపులో పెట్టే నిమిత్తం పట్టణంనుంచి పోలీసు బలగం వచ్చింది. ఉన్నతాధికారులు క్యాంప్ వేశారు. వాళ్లు ఆ టి.బి.లో విడిది చేశారు రెండు రోజులుగా.

బక్కగా వుండే రాజకీయ నాయకుడు పదవి రాగానే దుక్కలా తయారయినట్లు - సన్నగా ఆరంభమైన తుంపర కాస్తా క్రమేపీ పెద్ద వర్షంగా మారిపోవడంతో వాతావరణంలో ఎంతో మార్పు వచ్చింది. వర్షం వస్తూ వస్తూ చలిని కూడా వెంటబెట్టుకొచ్చింది

అయినా అధికారులకు బాధలేదు చలిని చార్జ్ చేసేందుకు బుడ్లున్నాయి

చలిని మింగేందుకయితేనేమి, అలవాటు తప్పిపోకుండా నైతేనేమి చుక్క జోరుగా వేసుకున్నారంతా

ఒక చుక్క గొంతు దిగడంతో మరో చుక్క అవసరమయింది

క్షణాలలో ఏర్పాట్లు జరిగిపోయాయి. వాచ్‌మన్ జోగుల్ని చక్కని చుక్క కోసం వూళ్లోకి తరిమారు

వర్షం అధికం కావడంతో వూర్లోకి వెళ్లిన జోగులు అక్కడే చిక్కడిపోయాడు. పైగా 'సర్కారులు' విడిచిన చుక్క కొంత గొంతులోకి దూరడంతో, వుంపుడుకత్తె వొళ్లో వాలిపోయాడు వాడు.

వర్షం పెరుగుతుంటే, చలి గిలిగింతలు పెడుతూంటే, చుక్క కోసం వెళ్లిన వాచ్‌మాన్ ఎంతకూ తిరిగి రాకపోయేసరికి అసహనానికి గురయ్యారు అధికారులు.

''డామిట్! ఏమయ్యాడు వీడు?'' అన్నాడు ఎస్.పి అసహనంగా

''దార్లో దేన్నో రేప్ చేసి తొంగున్నాడేమో!'' అంటూ తన విట్‌కి తానే పెద్దగా నవ్వాడు డి.ఐ.జి

అంతా శ్రుతి కలిపారు.

''వర్షం మూలాన ఎక్కడో ఆగిపోయి వుంటాడు సార్! కాస్త తెరిపివ్వగానే వచ్చేస్తాడు'' అంటూ సర్దిచెప్పాడు ఇన్‌స్పెక్టర్

విసుగ్గా వాచ్‌లు చూసుకున్నారంతా. అంతలోనే బయట అడుగుల చప్పుడు వినిపించడంతో ఆత్రంగా గుమ్మంవైపు చూశారంతా చెవులు రిక్కిస్తూ.

ఇన్‌స్పెక్టర్ వరండాలోకి వెళ్లాడు చూడ్డానికి.



రిక్షా ట్రావెలర్స్ బంగళాని చేరుకునేసరికి త్రొక్కుతున్న రాజే కాక, లోపల కూర్చున్న ముత్యాలు కూడా పూర్తిగా తడిసిపోయింది.

నలుప్రక్కలనుంచీ జోరుగా కొట్టే వర్షానికి ఆ ముసలి రిక్షా ఆమెకు పూర్తిగా కాపుదలను ఇవ్వలేకపోయిందేమో, రిక్షా దిగేసరికి ముద్దయిన దుస్తులు ముత్యాలు వొంటికి అతుక్కుపోయాయి.

ఆమె ఇబ్బందిని గమనించి తన చూపుల్ని ఎటో త్రిప్పుకున్నాడు రాజు.

''కొంచెంసేపు ఆగావంటే మా మావ నడిగి డబ్బులు తెచ్చిస్తానన్నా'' అందామె.

చేసేదేముంది అన్నట్టు 'సరే'నని తలూపాడు రాజు, ''అదో, ఆ చెట్టు క్రిందుంటాను'' అంటూ జోరుగా కురుస్తూన్న వర్షాన్ని తట్టుకునేందుకు టి.బి. ఆవరణలో వున్న రావిచెట్టు వైపుకు రిక్షాతో పరుగెత్తాడు.

పరుగులాంటి నడకతో గబగబా బంగాళా వరండాపైకి చేరుకుంది ముత్యాలు.

ఒంటికి అతుక్కుపోయిన దుస్తులలో అప్పుడే చేసిన మైనపు బొమ్మలా వుంది ఆమె. అజంతా శిల్పాన్ని జ్ఞప్తికి తెస్తున్న ఆమె అందాలు... బహిర్గతమవుతూన్న శరీరపు వొంపు, సొంపులూ... ట్యూబ్‌లైట్ కాంతిలో వింతగా మెరుస్తున్నాయి.

బయట మెరుపు మెరిసింది. నిషాలో నిండిన ఇన్‌స్పెక్టర్ బుర్రలో నక్షత్రాలు వెలిగాయి

దారితప్పి భువికి దిగివచ్చిన దివిజాంగనలా అనిపించింది ముత్యాలు అతని కళ్లకు.

ఆమె శరీరానికి అతుక్కుపోయాయి అతని కళ్లు. ఆమె శరీరమంతా ఆబగా తడిమేస్తున్నాయి అతని చూపులు.

ముత్యాలు అతన్ని చూళ్లేదు. తలవంచుకుని ముద్దయిన చీరెను పిండుకుంటోంది.

''వచ్చేసింది సార్! అప్సరస!'' అంటూ ఎక్సైట్‌మెంటుతో అధికారులకు అనౌన్స్ చేశాడు ఇన్‌స్పెక్టర్

అధికారులంతా ఒక్క అంగలో వరండాలోకి వచ్చారు.

అతుక్కుపోయిన ముత్యాలు దుస్తుల్లో ఏదో వెతుక్కున్నారు

తొంగి చూసే యవ్వనం..

తడిసిన సొంపులు .

కవ్విస్తున్న సొంపులు ..

వాళ్లకు వెర్రెక్కించాయి.

గుండెలు ఓ క్షణం లయ తప్పాయి

చటుక్కున తలెత్తిన ముత్యాలు వారిని చూసి వులిక్కిపడింది. తడిసిన రవికెలోంచి తొంగిచూస్తున్న యవ్వన గిరులకు అప్రయత్నంగా చేతులు అడ్డుపెట్టుకుంది. భీతహరిణిలా వారివంక చూసింది.

బలవంతంమీద ఆమెమీంచి చూపులు తిప్పుకున్నారంతా.

ఇన్‌స్పెక్టర్ లోపలినుంచి పంచె, తువాలు తెచ్చి ఆమెకిస్తూ, ''పాపం .. బాగా ముద్దయి పోయినట్టున్నావ్. లోపలికొచ్చి బట్టలు మార్చుకో'' అన్నాడు.

బెదురుగా చూసిందామె.

ఆమె చూపుల్లోని సంశయాన్ని గమనించి ''ఫరవాలేదు. గదిలోకివెళ్లి బట్టలు మార్చెయ్'' అన్నాడు డి.ఎస్.పి.

తటపటాయించిందామె.

''మా మావ ..'' అంటూంటే చలికి గొంతు వణికింది.

''వణికిపోతున్నావ్. పొడిబట్టలు కట్టుకో'' అన్నాడు ఎస్.పి.

డి.ఐ.జి. మాట్లాడలేదు. అతని ఆకలి చూపులు ఆమె అందాన్ని ఆబగా జుర్రేసుకుంటున్నాయి

అంతా పెద్ద మనుషుల్లా కనిపిస్తున్నారు. వారిచేత అన్నిసార్లు చెప్పించుకోవడం సబవుకాదు అనుకుందామె.

అయితే - వారినుంచి వస్తోన్న ఏదో వింత వాసన ఆమెను భయపెడుతోంది.

కానీ ముద్దయిన శరీరం చలితో కొంకర్లు పోతోంది. నీరసానికి చలి తోడు కావడంతో తట్టుకోవడం కష్టంగానే వుంది.

మావ ఏ మూలనున్నాడో తెలీదు.

నలుగురు పెద్దబాబులు... మంచివాళ్లలాగే వున్నారు.

మావకూడా లోపల ఎక్కడో వుంటాడు.

మనసు నిబ్బరించుకుంది ముత్యాలు.

బిడియంగానే ఇన్‌స్పెక్టర్ ఇచ్చిన పొడి బట్టలు అందుకుంది. అతను చూపించిన గదిలో ప్రవేశించి తలుపు మూసుకుంది

ఆ బంగలా బడా బాబులకు ఆశ్రయమిస్తూంటుందని ముత్యాలికి తెలుసు

అయితే, ఆమెకు తెలియనిదల్లా - ఆ గదిలో తలుపు మామూలుది కాదనీ, బయటనుంచి కూడా తెరవడానికి వీలయ్యే కొత్త రకందన్నదే!

తలుపువైపు వీపుపెట్టి గబగబా తడిచీరెను విప్పేసింది ముత్యాలు

★ ★ ★

రెండు నిముషాల తరువాత ఆ గది తలుపు మెల్లగా తెరుచుకుంది

డి ఐ జి చప్పుడు చేయకుండా దొంగలా లోపల ప్రవేశించాడు - వరుసలో మొదటివాడుగా!

★ ★ ★

ఓ గంట తరువాత -

వరుసలో చివరివాడుగా గదిలోంచి బయటకు వచ్చాడు ఇన్స్పెక్టర్.

''మైగాడ్! అది చచ్చినట్టుంది సార్!'' అన్నాడు కంగారుగా

అంత నిషాలోనూ అదిరి పడ్డారంతా

ఒక్క పరుగులో ఆ గదిలో ప్రవేశించారు.

నగ్నంగా, నిర్జీవంగా బెడ్మీద పడివుంది ముత్యాలు!

ముక్కు దగ్గర చేయిపెట్టి చూశాడు ఎస్.పి.

''గుడ్గాడ్! నిజంగానే చచ్చిపోయింది!'' అన్నాడు కించిత్తు భయంగా.

''పూర్ డెవిల్! అంత అర్భకురాలనుకోలేదు! ప్చ్!!'' అని పెదవులు చప్పరించేశాడు డి.ఐ.జి.

''ఇప్పుడేం చేద్దాం?'' అన్నాడు ఇన్స్పెక్టర్ భయాన్ని కప్పిపుచ్చుకోవడానికి ప్రయత్నిస్తూ. .

ఎస్పి., డి.ఐ.జి వంక చూశాడు.

అంత నిషాలోనూ పోలీసు బుర్ర పనిచేస్తున్నట్టుంది... ''శవాన్ని సర్వెంట్ క్వార్టర్ వెనుక పడెయ్యండి. వాచ్మెన్ తిరిగిరాగానే పీకదాకా పట్టించి గుడ్డలు వూడదీసి శవంమీద పడెయ్యండి వాణ్ణి. మిగతా సంగతి తెల్లవారేక చూసుకుందాం'' అన్నాడు డి.ఐ.జి ఏమాత్రం తొణక్కుండా.

''ఎక్సలెంట్ అయిడియా సార్!'' అంటూ మెచ్చుకున్నారంతా.

ఓసారి ముత్యాలి శవంవంక చూశాడు ఇన్స్పెక్టర్.

అంతవరకూ నలుగురూ ఏ శరీరంతో ఆడుకున్నారో- ఆ శరీరం ఇప్పుడు చలన రహితంగా పడివుంది.

అసంకల్పితంగానే ఎక్కడో అంతరాంతరాళాల్లోంచి బహిర్గతం కాబోయిన నిట్టూర్పును బలవంతంగా అణచివేసి, ముత్యాలు శవాన్ని చేతుల్లోకి ఎత్తుకున్నాడు ఇన్స్పెక్టర్.

★ ★ ★

గొప్పోడి ఐశ్వర్యంలో అంతకంతకూ పెరిగిపోతూన్న వర్షపు తాకిడికి రావిచెట్టు క్రింద తలదాచుకున్న రాజుకు తట్టుకోవడం కష్టమయింది. లోపలికి వెళ్లిన ప్యాసింజర్ ఎంతసేపటికి తిరిగి వచ్చే సూచనలు కనిపించడం లేదు.

ఓ క్షణం ఆమెపట్ల అనుమానం పొడసూపింది గాని, వెంటనే ఆ ఆలోచనను త్రుంచేశాడు - ఆమె రూపము, ప్రవర్తన ఆమె అటువంటి స్త్రీ కాదని చెప్పడంతో వర్షం పెరిగిన కారణంగా భర్త

ఆమెను ఆపి వుండొచ్చుననుకున్నాడు

తాను కూడా ఆ బంగళాలో తలదాచుకోవడం మంచిదనిపించింది రిక్షాలోంచి దిగి బంగళావైపు పరుగెత్తాడు.

వరండాలోకి చేరుకున్నాడేగానీ, వర్షపు జల్లు మీద పడుతూనే వుంది. అందువల్ల మూసివున్న తలుపులకు దగ్గరగా జరిగి గోడవారగా నిలుచున్నాడు.

అందుకే- పోలీసు అధికారులు తమ అకృత్యాన్ని ఎంత గోప్యంగా వుంచాలనుకున్నా వారి పలుకులన్నీ రాజు చెవులలో పడనే పడ్డాయి

తాను విన్నదాన్ని ఆకళింపు చేసుకోవడానికి కొంత సమయం పట్టిందతనికి - ఆ సమాచారాన్ని ఏ విధంగా అన్వయించుకోవాలో, తానప్పుడేం చేయాలో నిర్ణయించుకునే లోపునే, మూసిన తలుపులు తెరుచుకున్నాయి

ముత్యాలు శవాన్ని మోసుకొస్తూ రాజు దృష్టిలో పడ్డాడు ఇన్‌స్పెక్టర్.

అంతవరకు రాజులో ఏమాత్రం సందేహం, తటపటాయింపు వున్నా ముత్యాలు శవం చూడటంతో అవి పటాపంచలయిపోయాయి.

''ఆగు!'' రాజు అరుపు ఆ బంగళాలో మార్మోగింది.

ఇన్‌స్పెక్టర్ ఉలిక్కిపడి చూశాడు.

''ఆమెకేమయింది?'' రాజు ప్రశ్న వురుములా తాకింది.

''చచ్చింది!'' నిర్లక్ష్యంగా అన్నాడు నిషా పూర్తిగా దిగని ఇన్‌స్పెక్టర్.

''లేదు మీరే చంపేశారు!'' దెబ్బతిన్న బెబ్బులిలా గర్జించాడు రాజు.

''షటప్!'' అంటూ అరిచాడు ఇన్‌స్పెక్టర్.

''ఎవరు నువ్వు? ఇక్కడికెందుకొచ్చావ్?''

ఆ గొడవకు అధికారులంతా అక్కడికి వచ్చారు.

''ఈమె నా రిక్షాలో ఇక్కడికి వచ్చింది. పిల్లకు జ్వరంగా వుందని, ఇక్కడ పనిచేస్తున్న తన భర్తను పిలుచుకు వెళ్లడానికి వచ్చింది. కాని... కాని... మీరు చేసిందేమిటి?... పెద్ద మనుషులుగా చెలామణి అయ్యేమీరు ఈమెపైన అత్యాచారం జరిపి హత్యచేశారు!''

రాజు ఒక్కో పలుకూ ఏకులా గుచ్చుకుంటూంటే తాము తెలుసుకున్న ఆ కొత్త సమాచారానికి నిశ్శబ్దంగా ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు ఆ అధికారులు.

బయట వర్షం మొత్తికొడుతోంది.

ఇన్‌స్పెక్టర్ చేతుల్లో ముత్యాలు శవం బరువెక్కుతోంది.

ఆమె బ్రతికున్నప్పుడు తన బరువంతా ఆమెపైన పడేసి ఆమె శరీరంతో ఆడుకున్న ఇన్‌స్పెక్టర్‌కి - ఇప్పుడు నిర్జీవమైన ఆమె శరీరం బరువుగా అనిపిస్తోంది.

ఆ శరీరంలో ప్రాణం వున్నప్పుడు దానితో ఎంత ఎక్కువసేపు ఆడుకుందామా అని వువ్విళ్ళూరిన ఇన్‌స్పెక్టర్- ఇప్పుడు దానిని ఎంత త్వరగా వదిలించుకుందామా అని చూస్తున్నాడు.

రాజు తన దారికి అడ్డు నిలవడంతో నిస్సహాయంగా అధికారులవంక చూశాడు.

''ఇంత ఘాతుకానికి తలపెట్టిన మిమ్మల్ని వూరికే విడవను పదిమందినీ పిలిచి భరతం పట్టిస్తాను '' ఆవేశంతో ఊగిపోతున్నాడు రాజు

అంతవరకు పేదలకు సమాజంలోని సోకాల్డ్ పెద్దలవల్ల జరిగిన, జరుగుతూవున్న అత్యాచారాలన్నీ అతని కళ్ళముందు గిర్రున తిరగడంతో అతన్ని వుద్రిక్తుణ్ణి చేశాయి

రానున్న ప్రమాదాన్ని సులువుగానే పసిగట్టారు అధికారులు అంత నిషాలో కూడా

కన్నులతోనే భాషించుకున్నారు

అధికారుల కనుసన్నలను అర్థం చేసుకున్న ఇన్స్పెక్టర్, ముత్యాలు శవాన్ని మెల్లగా క్రిందకు దించాడు

లోపలికి వెళ్లి పిస్టల్‌తో తిరిగి వచ్చాడు

ఒక అమాయకపు పేద యువతికి జరిగిన అన్యాయాన్ని సహింపజాలక ఆవేశంలో తల మునకలు వేస్తూన్న రాజు జరుగబోతున్నదేమిటో గ్రహించేలోపునే పిస్టల్ ప్రేలడమూ, బులెట్ అతని కడుపులో దూరడము జరిగిపోయాయి.

అతని ఆర్తనాదం వురుముల్లో కలిసిపోయింది.



మర్నాడు స్థానిక దినపత్రికల్లో వెలువడిన ఈ దిగువ వార్త పఠితల్ని స్తబ్దుల్ని చేసింది.

''గత రాత్రి... వూరి శివార్లలో వున్న ట్రావెలర్స్ బంగళావద్ద రాజు అనే ఉగ్రవాది ఓ హరిజన యువతిపైన అత్యాచారం జరిపి ఆమెను హత్య చేయడమేకాక .. అదే బంగళాలో క్యాంపుచేసిన వున్నత పోలీసు అధికారులపైన మెరుపుదాడి జరపడంతో పోలీసులు ఎదురుకాల్పులు జరపవలసి వచ్చింది . ఆ 'ఎన్‌కౌంటర్' లో అతను మరణించడం జరిగింది...''



# ఇరుకు

## చిలుకూరి దేవపుత్ర

''అనంతపురం హాస్పిటల్లో రంగనాథం అడ్మిట్ అయ్యాడు'' అన్న వార్త తాడిపత్రి అంతా పాకిపోయింది. దాంతో తాడిపత్రికీ, అనంతపురానికీ ఉన్న రోడ్డుకు సగం ఆయుష్షు మూడింది. అతన్ని పరామర్శించి రావడానికి బంధుమిత్రులంతా ఒకటే ప్రయాణాల్లో పడ్డారు. అతడు నాకు చిరకాల మిత్రుడూ - ప్రస్తుతం ఒకే హైస్కూల్లో సహోపాధ్యాయుడూ అవటం చేత నేనూ అనంతపురానికి వెళ్లాను.

వాడికి ఏ జబ్బూ లేదనీ, తిండి కాస్త తగ్గించడమే మంచిదనీ, ఆ మరసటి రోజే డిశ్చార్జి అయిపొమ్మని అన్నారట డాక్టరు. ఎలాగూ ఇంత దూరం వచ్చాను కదా మా సొంత వూరు వెళ్లి మా అమ్మానాన్నలని చూసి వస్తే బావుంటుందనిపించింది నాకు. ఆ మాటే రంగనాథంతో చెప్పేసి గబగబ హాస్పిటల్ మెట్లు దిగేసి వరండాలోకి వచ్చాను

నెత్తురుతో తడిసిన ఓ మనిషిని స్ట్రెచర్ మీద తీసుకెళుతున్నారు ఆస్పత్రి ఉద్యోగులు. వాళ్ల వెనకాల ఓ ఆడమనిషి ఏడుస్తూ వెళుతోంది. బహుశా ఆమె గాయపడ్డ వ్యక్తి భార్య అయ్యుంటుంది. గ్రామ కక్షల కారణంగా విరోధులెవరో అతడ్ని పొడిచారుట ఆ విషయం అక్కడ గుమికూడిన వాళ్ళు మాట్లాడుకుంటున్నారు ఇలాంటి దృశ్యాలు చూస్తే మనుషుల మీద విరక్తి కలుగుతుంది నాకు. మనుషుల మధ్య, దేశాల మధ్య రగులుకుంటున్న కక్షలూ, యుద్ధాలూ ఎప్పటికీ పోవేమోనని దిగులేస్తుంది

వరండా దిగి అటుపక్కగా వెళ్లి వేపచెట్టు నీడన నిలుచుని సిగరెట్టు వెలిగించాను. నాకు ఎదురుగా ఓ డజను రిక్షాలున్నాయి వాటి తాలూకు డ్రైవర్లు చెట్టుకింద హాయిగా కబుర్లు చెప్పుకుంటూ కూచుని వున్నారు

''ఏవయ్యా హరీ బావున్నావా? ఏవిటి విశేషం'' అంటూ వెంకటేశ్వర్లు పలుకరించేసరికి ఆలోచనల్లోంచీ తేరుకున్నాను. అతనిది మా పక్క ఊరే. దూరపు బంధుత్వం కూడా వుంది. నేను వచ్చిన పని మూడు ముక్కల్లో చెప్పేశాను.

''మా అమ్మాయిని డెలివరీకి చేర్పించాను'' అన్నాడు వెంకటేశ్వర్లు. నేనతన్ని ''విశేషమేమిటి?'' అని అడగకనే చెప్పినందుకు చాలా సంతోషం వేసింది.

ఎందుకో.... మాటాడుతూ ఉన్న నేను హాస్పిటల్ వరండాలోకి చూశాను. అక్కడ సుబ్బులు వస్తూండటం కనిపించింది. ఎడమ భుజం మీద మూడేళ్ళ పిల్లవాడిని వేసుకుని రెండు చేతులతోనూ పట్టుకుని నడుస్తూ వుంది. పిల్లవాడు నిద్రపోయాడేమో తల బుజానికి ఆన్చి వుంది అసలు సుబ్బులు అక్కడ కనిపించడమే ఆశ్చర్యంగా వుంది నాకు. ఆమె ఇక్కడికి యెప్పుడొచ్చిందో

కనుక్కోవాలనిపించింది అయితే, ఎదురుగా వున్న వెంకటేశ్వర్లు ఏమనుకుంటాడోనని నాలోని మర్యాదస్తుడు నన్ను అడ్డుకున్నాడు

చూస్తున్నట్టే ఓ రిక్షా ఎక్కి వెళ్లిపోయింది సుబ్బులు నన్ను చూడలేదు కానీ, చూసుంటే కనీసం ఒక్క మాటయినా మాటాడకుండా వెళ్లిపోయేదా!

''మావయ్యా! సుజాతకి కాఫీ తేవాలిట'' అంటూ వెంకటేశ్వర్ల మేనకోడలు వచ్చి పని పురమాయించే సరికి ఆయన వెళ్లిపోయాడు చివరి దమ్ముని లాగేసి సిగరెట్టును అవతలకు గిరవాటు పెట్టి, నేనూ ఓ రిక్షాలో బస్టాండుకు బయల్దేరాను.



ఆరోజు సంత అవటం వల్లనేమో బస్టాండు మరీ రద్దీగా వుంది మా వూరు వెళ్లాల్సిన బస్సు అప్పటికి ఇంకా రాలేదు. వాచీ చూసుకున్నాను మూడు గంటలయింది. సూర్యుడు మబ్బుల్లో వున్నా చెమటలు పట్టేస్తున్నాయి ఒళ్లంతా ఇంత ఉక్కగా వుందంటే రాత్రికి వాన వస్తుందేమో! అనిపిస్తోంది

''ఇదే ఊరు పోతుందయ్యా!'' ఓ ఆడగొంతు వినిపించింది తిరిగి చూడకుండానే చెప్పాను ''ఉరవకొండకు పోతుందమ్మా!''

కొత్తపల్లికి పోయే బస్సు ఎప్పుడొస్తుందయ్యా!'' అదే గొంతు అడిగేసరికి తిరిగి చూశాను... సుబ్బులు!

''ఇంకా కొంచెం సేపటికి రావొచ్చు సుబ్బులు!'' అన్నాను. అంతటితో ఊరుకోవాలని పించలేదు. ''ఏం సుబ్బులూ! ఆస్పత్రికెందుకొచ్చావు? కుర్రాడికి జ్వరమా?'' అని అడిగాను

నేను వేసిన రెండు ప్రశ్నలకీ ''అవు'' నన్నట్టు తల వూపింది నా వేపు చూడకుండానే.

''ఇప్పుడు నయమయిందా?''

''ఊ!'' అంది సుబ్బులు.

''అదిగో సుబ్బులూ! మన వూరికి వెళ్లాల్సిన బస్సు వచ్చేస్తోంది!'' అప్రయత్నంగానే సుబ్బులుకు చెబుతున్నందుకు నాకే ఎలాగో అనిపించింది. విలువైన టెర్లిన్ దుస్తుల్లో, మర్యాదస్తుడుగా అవుపించే నాకూ, మాసిపోయి, అక్కడక్కడ చిరుగుల్తో వున్న బట్టల్లో సరిగ్గా దువ్వుకోని జుత్తుతో ఉన్న సుబ్బులుకీ మధ్య నాగరికత అంత అంతరాల్ని ఏర్పరచింది మరి.

బస్సు వచ్చి నిలబడటం తోటే డోర్ వద్ద ముసిరారు ఎక్కవలసినవారు. ఐదు నిమిషాలు ఆ రద్దీని ఛేదించడానికి కొంత పోరాడక తప్పింది కాదు. ఏమైతేనేం-నాకూ ఓ సీటు సంపాయించి, ఆడవాళ్ల సీట్లలో కిటికీ పక్కనుండే సుబ్బులుకీ ఓ సీటు జేబురుమాలుతో రిజర్వు చేశాను.

సుబ్బులు వచ్చి తన సీటులో కూచుంది

తమకు సీటు ఉంచినందుకు కృతజ్ఞతగా నవ్వుతుందనుకున్నాను. ఊహూ... నేనేమైనా అతిగా ఆశించానేమో!

అరగంటలో బస్సు బయల్దేరింది.

సుబ్బులు కిటికీలోంచి ఎటో చూస్తోంది. పిల్లవాడికి పాలు ఇస్తోందేమో కొంగుని నిండుగా కప్పుకొని వుంది

పదేళ్ల క్రితం చూసిన సుబ్బులుకీ ఇప్పుడు చూస్తున్న సుబ్బులుకీ లేశమాత్రమైనా పోలిక వుందా!

ప్రఖ్యాత శిల్పి తీర్చిదిద్దిన శిల్పంలాగు ఉండేది సుబ్బులు ఆమె ఎంత నలుపో, ఆ నలుపులో అంత కాంతి పొంగుతుండేది నవ్విందా? ఆషాడమాసపు మేఘాల మెరుపుకి పిల్లకాలువ చప్పుడు నేపథ్యం పలికినట్టు అనిపించేది

మా ఊళ్లో పీర్ల పండగనాడు చూడాలి ఒక్కో కుర్ర వెధవ తప్ప తాగి సుబ్బులు మెచ్చుకోలు కోసం గుణోసే తీరు ఒక్కొక్కడు కళ్లకి నల్లటి చలవద్దాలు పెట్టుకొని, తలకి అరలీటరు ఆముదం దట్టించి నీటుగా దువ్వి, విచ్చుకున్న గొడుగుల్ని ఎత్తి పట్టుకొని మెడలో బంతిపూల దండలు వేసుకొని, కాళ్లకు గజ్జెలు కట్టుకుని, సారా కైపులో ఎగురుతూ వుంటే బాగా పెంచుకుని వున్న గిరజాల జుట్టు లయగా ఎగిరేవి అదంతా సుబ్బులు చూస్తోందన్న తలంపు మరింత కైపు పెరిగేది వాళ్లకి నిజానికి సుబ్బులు వాళ్ళెవర్నీ చూడటం లేదనీ, చూస్తున్నది మా రామచంద్రుడిని ఒక్కణ్ణేనని చాలామందికి తెలీదు

మా రామచంద్రుడికి సుబ్బులంటే ఎంతిష్టమో.. ''ఒరే, ఆ పిల్ల మాల ఇండ్లలో పుట్టకుండా వుంటే - వానాలి, వానెక్క. . ఎప్పుడో మీసం మీద పూలేసుకుని పెండ్లి చేసుకుని వుందునురా! ఇప్పటికైనా నాకేం అభ్యంతరం లేదు కానీ.. మా నాయన ఒక్కమాట అనని... ''యాడన్నా పొడైపోరా నాకేం పట్టదు.. అని. వెంటనే పెండ్లి చేసుకోనూ!'' అన్నాడు ఓరోజు మా రామచంద్రుడు.

''అట్లా అంటాడని కలలు కంటూ ఉండు సరిపోతుంది ఒరే రామచంద్రిగా! మీదేం పెద్ద ఎక్కువ కులం కూడా కాదు లేవోయ్! ఏదో బ్రామ్మలో, కాపో, కమ్మో అయ్యుంటే ఏదోలే అనుకోవచ్చు'' అని సన్నగా చురుకు వేశాను

''నోర్మయవోయ్! మా కులమంటే నీకు తక్కువగా కనబడుతోందా? . బాపనోళ్లకీ, కాపూ, కమ్మలకీ కొమ్ములు మొలిచినాయా?'' అన్నాడు కాస్త ఉడుక్కుని.

''మీ కులానికి కొమ్ములేం రాలేదు కానీ... చూస్తూ చూస్తూ మీ నాయన ఒక మాల నీకు కట్టబెడతాడా . మంచి ఆస్తుల్నీ, కట్నాల్నీ తెచ్చే కులమింటి పిల్ల యాడుందా అని రెండేండ్లనుంచి దుర్భిణీ వేసి చూస్తున్నాడు గదా? పోనీ ఓ పని చేద్దాం. నువ్వు సుబ్బుల్ని చేసుకుంటాను అంటే పట్నంలో నాకు మంచి మిత్రులున్నారు. వాళ్ల సాయంతో మీ ఇద్దరికీ రిజిస్టరు పెళ్లి జరిపించే పూచీ నాది సరేనా!'' అన్నాను. వాణ్ణి ఆ రకంగా సుబ్బులుతో పెళ్లికి రెడీ చేయించాను. సుబ్బులుకి కూడా ఈ విషయం తెలిపాము. సరేనంది సుబ్బులు.

సరిగ్గా అదే సమయంలోనే మాల వీధిలో సుబ్బులు మేనమామ నర్శిమ్ముడు పంచాయతీ పెట్టాడు. తన కొడుక్కి సుబ్బుల్నిచ్చి పెళ్ళిచెయ్యాలని. ఆ పంచాయితీలోని పెద్ద మనుషులకి అప్పటికే సారా బాగా తాగించాడు నర్శిమ్ముడు. దాంతో పెద్ద మనుషులు నర్శిమ్ముడి మాట సరైందని తీర్పు చెప్పారు. అంతే. . ఒక్క వారం తిరిగేసరికి నర్శిమ్ముడి కొడుకుతో సుబ్బులు పెళ్లి జరిగిపోయింది మా రామచంద్రుడు ఈ దెబ్బనుంచి ఓ ఆర్నెల్లకి కాని కోలుకోలేకపోయాడు.

మూడు సంవత్సరాల క్రితం సుబ్బులుకి కొడుకు పుట్టాడు. అదే నెలలోనే సుబ్బులు భర్త చెట్టుమీదనుంచి పడి చనిపోయాడు సుబ్బులు దురదృష్టవంతురాలు కాకపోతే మా రామచంద్రుడునే పెళ్లి చేసుకునే వుంటే ఆమె బ్రతుకు ఎంత మారిపోయుండేదో అనిపిస్తుంది



కొత్తపల్లి వచ్చేసింది.

నేను బస్సు దిగాను. రద్దీని దాటుకుంటూ బస్సు దిగే ప్రయత్నంలోనే ఉంది సుబ్బులు.

మా కొత్తపల్లి రోడ్డుకు ఏడు ఫర్లాంగుల దూరం వుంది సూర్యుడి కిరణాల్లో తీక్షణత లేదు .రువు బాగా ముదిరి వుండటంవల్ల చేలన్నీ బోసిపోయి వున్నాయి.

నన్నూ, సుబ్బుల్నీ దించిన బస్సు వెళ్లిపోయింది.

రెండు మూడు అడుగులు ముందుకు వేశాను. పెద్దపెట్టున ఏడుపు వినిపిస్తే తిరిగి చూశాను. ుబ్బులు ఏడుస్తోంది. దారి పక్కనే వున్న దాని చెట్టుకిందే కూలబడి పిల్లవాడిని ఒళ్లో పెట్టుకుని ుడ్చేస్తోంది. నాకేం పాలుపోలేదు. అసలేమయింది సుబ్బులుకి! ఇంతవరకూ బావుందే!

''ఏం సుబ్బులూ ఏమయింది పిల్లాడికి?''

''నా పిల్లాడు పోయెనే ... నా బంగారు కొండ సచ్చిపోయె గదమ్మో! ఇంగెట్లాగమ్మో నేను బతికేది?'' అంటూ బిగ్గరగా ఏడుస్తోంది సుబ్బులు.

నేను దిమ్మెరపోయి చూస్తున్నాను

ఒళ్లోని కుర్రాడు చలనరహితంగా ఉన్నాడు.

''ఎప్పుడు చనిపోయాడు? బస్సు దిగాక చనిపోయాడా సుబ్బులూ?'' నా ప్రశ్నలు ఆమెకేమీ వినబడ్డం లేదు. ఎదను బాదుకుంటూ ఒకటే ఏడుస్తోంది.

మళ్లీ గొంతు పెంచి అడిగాను.

లేదన్నట్టు తనను ఊపింది - ఏడుస్తూ చెప్పింది సుబ్బులు...

''ఆస్పత్రిలోనే సచ్చిపోయినాడు సామీ!''

నేను షాక్ తిన్నాను ఆ మాటకి.

''మరి నాకు బస్టాండులో కానీ, బస్సులో కానీ, ఈ విషయం చెప్పలేదేం సుబ్బులూ?'' అన్నాను ఆందోళనతో.

పెద్దపెట్టున ఏడుస్తూనే చీలిపోతున్న కంఠంతో చెప్పింది సుబ్బులు, అస్సలు విషయమంతా - వారం రోజులనుంచి ఈనికి అగ్గిమాదిరి జరం వచ్చింది సామీ! నిన్న పొద్దున బతకడేమోనని అనుమానం వచ్చి ఆస్పత్రిలో జేర్పిస్తి. అయినా... ఈ పొద్దుటికి ఈనికి ఆయస్సు సెల్లిపోయింది సామీ! నా బంగారుకొండ సచ్చిపాయెనే అని. నాకెంత దుక్కం వస్తున్నా ఏడ్సలేదు సామీ... ఆస్పత్రిలో ఏడిస్తే నర్సులూ, డాకటేర్లు తిడ్తారని బయం... ఆస్పత్రి బయటికి వచ్చినాక ఏడ్సుదామనిపించింది కానీ! ఆడ ఏడిస్తే రిక్షాకు డబ్బులెక్కువ అడుగుతారేమోనని ఏడుపు బిగపట్టుకున్నా.... బస్సుకాడ ఏడిస్తే పీనుగుతో బస్సులోకి ఎక్కనియ్యరని ఆడా ఏడుపుని అనుసుకున్నా.... యింక నా వల్లకాదు సామీ- కరువుతీరా నా సిట్టి తండ్రి కొసరం ఏడుస్తా. . నా నాయన నాకి, దూరమైపాయె, నాకేం ఉంది.. సామీ! నేనింక ఊర్లోకి రాలేను నా సేత కాదు నువ్వే మాలగేర్లో సెప్పుసామీ! నీకు పున్నెముంటుంది...!! అంటూ చేతులెత్తి మొక్కుతూ వుంది సుబ్బులు.

నేనొక్కడినే ఊరిదారి పట్టాను. అంతకన్నా ఏం చేయాలో తెలీక.

(ఆంధ్రసచిత్ర వారపత్రిక
18-12-1987)



# మాన్యాలం

## పి. నాసరయ్య

అది సెప్టెంబరు నెల. పగలు పన్నెండు గంటలు సూర్యుడు మండిపోతున్నాడు పొలాల్లో వున్న జనాలమీద మంటలు కురిపిస్తున్నాడు భయపడిపోయిన గాలి ఎటుపోయిందో అసలు లేనట్టే వుంది వుక్క ఒకటే వుక్క. చెమట దారలు గట్టిగారుతోంది

పచ్చిగడ్డి కోస్తున్న జనాల శరీరాలు దొరువుల్లో మునిగొచ్చినట్టు తడిసిముద్దయ్యాయి, ఆడ మగా భేదం లేదు అందరి బట్టలు ఒంటికి అతుక్కుపోయున్నాయి.

పచ్చగడ్డి మోపుల్తో బారులు కట్టి వస్తున్న వాళ్లను చూస్తుంది మోపుల్తో పరుగెత్తు కొస్తున్న ట్టున్నాయి బండిమీద మోపులేసి వాటిమీద కూర్చుని వస్తున్న వాళ్లు మూటముల్లె కట్టుకోని తీర్థయాత్రలనుండి తిరిగొస్తున్నట్లున్నారు.

ఆ పూట భర్తకు అన్నం పెట్టడం ఆలస్యమయ్యింది ఆరోగ్యమ్మకు. కొడవలిపట్టి ఆలస్యంగా ఆదరాబాదరా వెళ్లింది గడ్డి కోసుకురావడానికి పరుగులాంటి నడక ఆలస్యమైపోయిందే అనే ఆందోళన క్షణాల్లోనే చేరుకొంది చేనుకు కొయ్యడం మొదలెట్టింది చేతిలో కొడవలి గట్టుమీద గడ్డి ఇదే ఆమెకు కనబడుతున్నదల్లా తొందరలో చెయ్యెక్కడ తెగుతుందో అనే ఆలోచన రావడం లేదు.

ప్రక్కచేను చుట్టూ తిరుగుతూ పైరు బాగోగుల్ని చూచుకుంటున్నాడు మోహనరావు అగ్రకులంవాడు అమితంగా ఆస్తిపాస్తులు వున్నవాడు, తక్కువ కులం వాళ్లు తన్నేమీ చెయ్యలేరని ధీమాతో వున్నవాడు.

ఒంటరిగా గడ్డి కోసుకుంటున్న ఆరోగ్యమ్మను చూడగానే అతని మనస్సులోకి ఏదో పాడు ఆలోచన పుట్టుకొచ్చింది. చుట్టుపక్కల ఎవ్వరూ లేరు. ఎక్కడో దూరంగా మాదిగ సుబ్బారావు కౌలు పొలం చుట్టూ తిరుగుతున్నాడు. చూపంతా పైరుమీదె. ఆలోచనంతా పైరు బాగోగులమీదె.

చేనుచుట్టూ తిరుగుతూ ఆరోగ్యమ్మ దాపునవున్న గట్టుకు వచ్చాడు మోహనరావు ''ఏంటే ఆరోగ్గాం ఇప్పుడొచ్చావ్?'' అంటూ దగ్గర కొస్తున్నాడు వస్తున్న వాణ్ని చూచింది కీడును శంకించింది. లేచి నిలబడింది. చుట్టుపక్కల పారజూచింది. దగ్గర్లో ఎవరూ లేరు

దూరంగా సుబ్బారావున్నా కేకకందడు కనపడ్డానికి చూపసలిటు లేదు అటు దూరంగా డొంక వెంట ఎవరో వస్తున్నారు. అమ్మయ్య అనుకొంది ధైర్యం తెచ్చుకొంది. ఎదిరించేందుకు సిద్ధమయ్యింది.

దగ్గరకొచ్చాడు మోహనరావు ''ఏందే ఆరోగ్యం ఎందుకు లేచావ్ భయమేసిందా? ఎందుకే భయం? నీకేది కావాలంటే అదే యిస్తాను ఎవ్వరు లేరిక్కడ కాదనకు'' అంటూ పట్టుకో బోయాడు కొడవలి విసురుతుందని వూహించాడు. విసిరిన చేతిని గట్టిగా పట్టుకున్నాడు కొడవల్ని లాగి అవతల పడేశాడు

గట్టిగా వాటేసుకున్నాడు

కేకలు పెడుతుంది ఆరోగ్యమ్మ బయట పడ్డానికి బలాన్నంతా ఉపయోగిస్తోంది వాటేసిన చేతిని కరిచేందుకు యత్నించింది నోటికి చేతిని అందకుండా లాక్కున్నాడు గడ్డం క్రింద చెయ్యేసి బలంగా ముఖాన్ని పైకెత్తి ముద్దుపెట్టుకోబోయాడు. వాటునుండి దొరికిన వెసులుబాటుతో బయటపడాలని బలంగా వెనక్కు నెట్టింది పెద్దపెద్దగా కేకలేస్తోంది. బలంగా పెనుగులాడుతోంది

దూరంగా వున్న సుబ్బారావుకి అరుపులు వినబడ్డం లేదు దృశ్యం కనపడ్డం లేదు. తన ధ్యాసలో తానున్నాడు. పంటలు అంచనా వేసుకుంటున్నాడు. ఆదాయాన్ని లెక్క వేసుకుంటున్నాడు

''పెళ్లాం ఆలస్యంగా వెళ్లింది. ఒక్కతె కోసుకురావాలంటే శానా ఆలస్యమవుద్ది నానుగూడా వెళ్తాను ఇద్దరం సెరికొత్త కొత్త తొందరగా పనవుద్ది. పెందలాడే రావచ్చు అనుకున్నాడు'' పరిశుద్ధరావు బయలుదేరాడు. డొంకన నడుస్తున్నాడు. చూపంత పొలం వేపే. చూస్తున్న పరిశుద్ధరావుకి భార్యను ఎవరో బలవంతం చేస్తున్నట్టు కనబడింది. కడుపు మండిపోయింది కళ్లెర్రబడ్డాయి. ఒంట్లో వున్న ఓపికంతా ఒక్కసారిగా కాళ్లలోకి వచ్చింది పరుగు పరుగున అక్కడికి చేరుకున్నాడు మంచో చెడో ఆలోచించలేదు. చేతిలో వున్న కర్రతో 'చేదొదిలి పెట్టాడు' మోహనరావుని

పెనుగులాడితే ప్రమాదమనుకున్నాడు. పరులకు తెలిస్తే పరువు పోతుందనుకున్నాడు. దెబ్బల్ని తప్పించుకోవాలనుకున్నాడు. కాలికి బుద్ధి చెప్పాడు మోహనరావు

కోసిన గడ్డి నెత్తినేసుకుని కొట్టినందుకేమవుతుందోనని అనుకొంటూ కొంపకు చేరుకున్నారు భార్యాభర్తలు

అగ్రకులాల వాళ్లంతా ఆలోచనలో పడ్డారు. చర్చలు మొదలయ్యాయి. ''కొరకరాని కొయ్యగా తయారయ్యింది పల్లె. పెద్దవాళ్లను గౌరవించేవాడే లేడు. వాడికిష్టమయితే చేస్తాడు లేకుంటే ముట్టుకోనన్న ముట్టుకోడు

భూస్వాముల ప్రక్కనే కుర్చీలో కాలుమీద కాలేసుకున కూర్చుంటున్నారు. పెద్దవాళ్లకు కాసింత మర్యాద నిద్దామనే మనసే వుండటం లేదు ఇళ్లల్లో జొరబడుతున్నారు పల్లెల్లోకెళ్లిన మనోళ్లని పట్టుకు తంతున్నారు

ఇప్పుడు మోహనరావుని తన్నారు. నిన్న వెంకట్రాముణ్ణే తన్నారు. రేపు చౌదరిగారిని తంతారు. ఇట్టా తన్నులు తినడం సాగుతువుంటే ఇక మన పెత్తనమంతా పేలాలేగి పోతుంది. ముందుముందు పల్లెల్లో వాడొక్కడు మన మాట వినడు. ఆ తర్వాత ఇతర కులాలవాళ్లు కూడా నెత్తినెక్కి కూర్చుంటారు.

మనపొలాలు బీళ్లవుతాయి. తిండికూడా దొరకదు. చివరకు పల్లెను లొంగదీయడమా? మరో వూరికి పారిపోవడమా? ఏదో ఒకటి చెయ్యాలి. ఏం చెయ్యాలి పల్లెను అదుపుచేసి తీరాలి ఆరు నూరయినా నూరు ఆరయినా నిర్ణయం జరిగింది కార్యక్రమం మొదలయ్యింది. డబ్బుకాడ వెనుకాడ కూడదనుకున్నారు. లక్షలు లక్షలు పోగయినాయి. వూళ్లో వున్న పోలీసోళ్లను కొనిపారేశారు అధికారంలో ఉన్న అగ్రకులాల మంత్రుల అండదండలను దండిగా సంపాయించారు పల్లెలో తక్కిన కులాల కూలోళ్లను కలవనీయకుండా చేయాలనుకున్నారు ఆ కులాల్లో వున్న పెద్దల్ని ఆశల్ని చూపి, అదిరించి - బెదిరించి లొంగదీసుకోవడానికి ప్రయత్నాలు మొదలయ్యాయి. అందుల అనువైన వ్యక్తుల్ని నిర్ణయించారు.

మాల- మాదిగల్ని కూడా చీలదీయాలనుకున్నారు. ముందుగా మాలల్ని లొంగకొట్టాలని అందుకు

మాదిగల్ని వాళ్లతో కలవకుండా చేయాలని మాదిగల్ని మంచి చేసుకోవాలని వాళ్ల పెద్దల్ని పిలిపించి మాటలాడాలని, అవసరమైతే ఆశల్ని అమితంగా కల్పించాలని నిర్ణయాలు చేసుకున్నారు

మాదిగ కుల పెద్దల్ని రప్పించారు. వాళ్లు వచ్చారు. వచ్చిన వాళ్లతో ''మీరు చాలా మంచివాళ్ళ, నెమ్మదస్తులు మీమీద మాకెంతో నమ్మకముంది మిమ్మల్ని మేమెప్పుడు కనిపెట్టుకునే వుంటున్నాం

మొన్న మోహనరావుగార్ని పరిశుద్ధంగాడు కొట్టాడు. తన గట్టున గడ్డికోస్తున్న ఆడి పెళ్లాణ్ణి కోపడ్డాడని, అదంతా మీవాడు సుబ్బారావు చూచాడు. ఆ సంగతి సాక్ష్యం చెప్పించండి చాలు మీరేం భయపడవద్దు. మీమీద ఈగను కూడా వాలనియ్యం. చెయ్యాల్సింది చెప్పారు భూస్వాములు.

''దొరగార్లు ఇయ్యనకటి రోజులుగావండి. కుర్రకారు పెద్దలమాట యినేట్టుగనే కదండి అల్లందర్నీ కనుక్కొని ఏ సంగతి రేపు చెబుతామండి'' అన్నారు పెద్దలు భయం భయంగా

''ఇందులో ఇయ్యాల రేపు ఏందిరా? నిజం చెప్పడానికి మీకంత భయమెందుకురా? కౌలు పొలాలు మీకే ఇస్తాము మా పొలాల్లో కూలి పనులన్నీ మీరే చేసుకుందురుగాని మీరేం భయపడనక్కరలేదు'' అన్నారు పెద్దపెద్ద ఆశల్ని వాళ్లముందు పెడుతూ

''అదికాదండి. మా వాళ్లని కాత్త కనుక్కొని సెపుతామండి. రేపే సెవుతామండి'' మళ్లా పెద్దలు భయంగా.

ఆశలు పనిచెయ్యలేదని గ్రహించారు భూస్వాములు. బెదిరింపును ప్రయోగించారు.

''నిజం మీరే చెప్పాల. చూచిన నిజాన్ని చెప్పకపోతే ఎట్టాగూ? మర్యాదగ చెప్పండి. చెప్పకపోతే తెల్సుగా తాట ఒలిపించైనా చెప్పిస్తాం. మీ ఇష్టం''

''వత్తామండి'' పెద్దలంతా అన్నారు ఒక్కసారి అడుగులు వడిగా వేశారు. బయటపడ్డారు

''తాట ఒలిపించైనా చెప్పిత్తాం'' దీన్నే మాటి మాటికి మననం చేసుకుంటూ కొంపలకు చేరుకున్నారు.

మాదిగలంతా ఒక చోట చేరారు. భూస్వాములు చెప్పిందానిమీద చర్చించుకున్నారు.

అల్లు మన తాట వొలిసేది కాయం. అయితే దీన్ని కొత్తకాలం ఆపుతారు. ముందు మాలోళ్ల తాట వొలుత్తారు. మాల మాదిగల్ని నాశినం చేసినంక తక్కిన కులాల కూలోళ్లని నాశనం సేత్తారు.

బూసాముల చేతుల్లో కూలోళ్ల బతుకులన్నీ బుగ్గయిపోయేయె. పదిమందితో సావు పెళ్లితో సమానం. అందుకని సావో బతుకో మనం మాలోళ్లతోపాటె వుందాం. నిర్ణయం జరిగింది. చర్చ ముగిసింది

ప్రమాదాన్ని పసికట్టింది పల్లె కలిసికట్టుగా బ్రతకాలనుకొన్నది. ఒక నాటి రాత్రి పల్లంత బళ్లో సమావేశమయింది. చర్చ మొదలయ్యింది. ''మాలలం మాదిగలం అందరం అంటరానోళ్లమే. పొద్దుగూకులు శాకిరి సేసుకునేటోళ్లమె. కూడునేక గుడ్డనేక యాతనులు పడేటోళ్లమె సీ శా బతుకులోళ్లమె. సీటికి మాటికి తన్నులు తినాల్సినోళ్లమె. ఇన్ని అవత్తలు సమానంగా పడుతున్నా మనమంతా ఒకటి కాదు. మనయ్యి రెండు కులాలు. మాలోళ్లం మాదిగోళ్లం ఇట్టా నిలదీశారు. కట్టపడేటోళ్లమంతా ఒకటై ఎక్కడ తిరగబడతామోనని మన్నందర్ని సీలదీసేశారు కులాల పేరుతో కూలగొట్టేశారు.

అల్లు సీలగొట్టారు. ఇప్పుడు మనం సీలిపోయుంటె సచ్చిపోతాం కాబట్టి మనమంతా ఒకటి కావాల. అని చెప్పారు బాగా అనుభవమున్నవారు. ఔనంటే ఔనన్నారు అందరు. ఒకటిగావల్సిందె నన్నారందరు.

''కష్టపడేవోళ్లంతా ఒకటిగావాల. బాగానే వుంది అందరం కలిపే ముందు మీ మాల మాదిగోళ్లిద్దరు ఒకటికండి ఆనాక మనందరం కలుద్దాం అంటున్నారు మిగతా కులోళ్లు అన్నాడు మరొకరాయన.

''నిజమేనన్నారు. అంటరానోళ్లము ముందు కలుద్దాం రొండు కులాలు కలవాలంటె ఏం చెయ్యాల? ఆ పిల్లని ఈల్లు ఈల్ల పిల్లని ఆల్లు పెల్లిల్లు సేసుకోవాల. అప్పుడె కులాలు లేకుండా పోతయ్యి'' అన్నాడింకోకాయన. పెద్దలంతా ఒప్పుకుంటేనేను మాదిగోరమ్మాయిని చేసుకుంటానికి సిద్ధంగా వుండాను అన్నాడొక మాలోల్ల యువకుడు. రెండు కులాలనుండి చాలామంది ముందుకొచ్చారు యువకులు. ఆశీర్వదించారు పెద్దలు. మనలో మనకు బేదాలు పాటించినోడిని ఎలియ్యాలని తీర్మానించుకున్నారు.

''మనమేగాదు, కష్టపడి బతికే పేదోల్లం. అందరం ఒకటే కులంగావాల. కుల బేదాలు నశిచ్చిపోవాల. పనిసేసేచోట కులమెట్టా మనక్కనపడదో మిగిలినసోట్ల కూడ అట్టాగె వుండాల. మనమందరం సెమటోడ్చి పనిచేసేటోల్లం. మనది శ్రామికవరగం. బూసాముల అన్నాయాలకు ఎతిరేకంగా పోరాడే వరగం అన్నాడింకో యువకుడు.

''కష్టం సేత్తం దిమనం. సంపదల్ని పముట్టింతంది మనం. ఈ పెపెంచకాన్నంతా పోసిత్తం మనం. మన మూ మన శమటనేకపోతే ఈ పెపంచకమంతా ఎప్పుడో సచ్చిపోయుండేది. మనం మంచోల్లం. మనం నిజమైన మడుసులం. మాన్నులం. మరో యువకుడు.

''మనం మాన్నులం, మనం మాన్నులం'' అన్నారు చాలామంది.

''మనం మాన్యులం, మనం మాన్యులం'' అన్నారు చదుకున్నవాళ్లు.



# అమ్మా నువ్వా నవ్వొచ్చే!

సి. సుజాత

''ఇయ్యాలే పని లేదు ఈదంతా సుబ్బరంగా ఆళ్ళే ఊడ్చేసినారు. రోడ్డంతా ఇదిగో అమ్మ అద్దంలా గుందే''

మళ్ళా ఈడు తాగొచ్చినాడా ఏందీ కర్మ. ఏడ్పించి వచ్చినయరా డబ్బులు నీకు. ఓర్నాయనో తిండి లేక ఏడుస్తా వుంటే నీకు సారా తక్కువయిందంటరా. ఓయమ్మో నేనీ అద్దవాన్నం సంసారం ఈదలేను. నా కన్నోరింటికి పోతా''

రత్తి హోరెత్తి పోయింది. నోరు తెరుచుకొని రత్తి వీరంగాలు చూస్తున్న రంగడికి రత్తి పుట్టింటి పేర్లు వినగానే ఎక్కడ లేని ఉత్సాహం ముంచుకు వచ్చింది

''కన్నోరింటికి పోతావా పోవే, పో, ఆడ గడ్డి ఇదిగో ఇన్లా గడ్డి తిందువు గానీ మా గొప్ప అమ్మా బాబుల్ని ఇదే సంపాయించింది. ఇదిగో కిందటి సంకురేతిరికి పుచ్చుకొన్న కాసులు ఇప్పటికి నా చేతిల బడలా పోపో. ఈ సారి ఆ ఇన్నూరు లేకుండా వస్తే నీకు దరువే ''

''అయ్యో సంబడం నువ్వుగాంగ ఇన్నూరు అప్పిస్తివా. నీ బొడ్డుకాడ డబ్బు తీసిస్తివా. అయ్యి వేరు జేసి తెచ్చినా నాకన్నాళ్ళకి నేను ఇచ్చుకొన్నా నీకే తిరిగి ఇవ్వాలంట''

''ఓసి నీ దుంపతెగ నీ కష్టార్జితివా. మరి నా కష్టార్జితివో. పిచ్చి పిచ్చి నకరాలెయ్యక ఆ డబ్బు కక్కమను.''

'' ఆ కక్కుతారు. నీ మొహానికి.'' రత్తి నోట్లో మాట నోట్లో వుండగానే రంగడు దాని మీద విరుచుకుపడ్డాడు

'' ఓ రంగా, అది సస్తదిరో నాయినా. అదసలే ఒట్టి మనిషి కాదురా ఓరి దున్నపోతా, వదుల్రా దాన్ని'' మంచం మీద లేవ లేకుండా పడున్న ముసలాడు గొల్లుమన్నాడు

రంగడికి ఆ కోపం దిగేసరికి రత్తి వళ్ళు హూనమయింది.

''పనిపాటు లేక తిన్నది ఏం గావాలా, ఇట్టా మనుషుల్ని ఇరపక తింటాడు. రత్తి ఏడుస్తా గొణుగుతోంది.

''అసలీ ఏళకి ఇంటికెందుకొచ్చినావురా రంగా ఇయ్యాళ పనిగాని లేదా మళ్ళీ స్ట్రైయికు గానీ''

''ఓర్నియ్యవ్వ అడిగినా సెపుతుండగానే ఇది మొదలెట్టింది. ఇంగో''

''ఓరి బాబూ, సెంద్రవా, ఏడబోయితివారా తండిరీ. నేనీ బాధ బడలేనురా బాబో. నా వళ్ళు ఊనమయిందిరా ఈడిసేతులిరిగిపోను సావు దెబ్బలు కొట్టిండిరా...''

రత్తి గొల్లుమంటూ వాకిట్లోకి వచ్చిన కొడుకుని చూస్తూ ఏడవడం మొదలుపెట్టింది.

''మళ్ళీ ఓ సారి వాయిస్తే గానీ దీని పొగరు....'' అంటున్న రంగడు కొడుకును చూసి వెనక్కు తగ్గాడు

''మళ్ళీ కొట్టాడా. ఏమన్నావమ్మా?'' అన్నాడు చంద్రం. ఆ గొంతులో నమ్రత ఆ మృదుత్వం రంగడిని నోరెత్తనివ్వవు

''పనికెళ్ళి ఏంటనే వచ్చా(డ్రా పైగా రోడ్లన్నీ ఎవరో సుబ్బరంగా సిమ్మి పెట్టేరని అబద్ధపుకూతలు కూస్తా వున్నాడు. కిందటేల ఆమైన ఈదులు ఊడ్చకుండా తాగి తొంగున్నందుకేగా ఉద్యోగం లోంచి పీకి పారేస్తిరి. అయ్యలమ్మల కాళ్ళట్టుకొని నానా పాట్లు బడితే మళ్ళా ఆ ఉద్దేగం వచ్చింది. ఈడు తాగొచ్చి ఇచకాలు సెబుతున్నాడని తాగొచ్చినవా అన్నా. అంతేరో కొడకా. నన్ను సావగొట్టిండిరా సెంద్రివా''.

రత్తి మళ్ళీ శోకం అందుకొంది. చంద్రం కళ్ళెత్తి తండ్రి వేపు చూసేసరికి తప్పు ఒప్పేసుకున్నాడు రంగడు.

''మాటికి తాగొచ్చినవా అందిరా. యాడుం .. .. .పోరగాళ్ళు రోడ్లంతా ఊడ్చేసినారు. ఈదిలో సెప్పులు గుట్టేంద్రు. అది సెప్పపోతే ఇనిపించుకొంటదు'' గోలెత్తింది.

చంద్రం మొహం తిప్పుకున్నాడు. ఆగమన్నా ఆగని నిట్టూర్పు గుండెల్లోంచి దూసుకొని వచ్చింది. తల్లి వేపు చూశాడు.

మాసిన చీరె, మురికి చేతులు, చాకిరిలో వున్న అస్తిపంజరం, ఆ ఎముకలపోగుని ఇంకాస్త కుంగదీశాడు తండ్రి.

''నిజమేనమ్మా. ఈ రోజు ప్రదర్శన చేశారు. వాళ్ళే రోడ్లు ఊడ్చి చెప్పులు కుట్టి మనం చేసే పనులన్నీ చేసేశారు'' మట్టి గోడకు చేరగిలబడుతూ నిదానంగా అన్నాడు. ఆ గొంతులో ఏ భావము లేదు.

''ఎవరూ, ఎవ్వురా సెప్పులు కుట్టిందీ....''

కుక్కి మంచంలో తాత ఆత్రం చూసేడు''ఎరికిలా ఏందీ?''

ముసలాడి గుండె గుభేలుమంది. ''సెప్పులు కుట్టేది మన హక్కు. ఇందులో ఎరికలకూ, మాలోళ్ళకు పోటీ ఎందుకు?'' అన్నట్లు ఆత్రం చూపించేడు.

చంద్రం నవ్వుతూ ''ఏం తాతా చెప్పులు ఇంకెవరూ కుట్టకూడదా. మనవే ఎప్పుడూ కుడుతూనే వుండాలా?''

ముసలాడు మనవడి నవ్వు చూసి సర్దుకొన్నాడు

''కాదురా అబ్బీ, తాతల్నాటి నుంచి మనవే ఈ వృత్తి చేసుకుంటున్నావా? ఆ ఎర్ర ఏసోబు గాడు దుకాణం ఎట్టించేసి ఆడు కుట్టించేస్తా వున్నా(డ్రా అదేం పనీ! ఆళ్ళు పొలాల్లో ఎలకలు పట్టేటోళ్ళు. మనకీ, ఆళ్ళకీ పోటీ ఏంటంట''

చంద్రం నవ్వేశాడు.

''నిజం తాతా, బాగా చెప్పేవు. మరి నాకూ నేర్పలేదే. నా సెప్పు తెగినా నేను కుట్టుకోలేక పోతున్నా. మరి నువ్వే ఓపిక తెచ్చుకొని కుట్టి పెడతానన్నావు. నేను నేర్చుకోవద్దా?''

ముసలాడు తడబడ్డాడు శుభ్రంగా ఉతికిన బట్టలు, తీరుగా దువ్విన జుట్టు, కళ్ళజోడు, నవ్వుతూ తన వైపు చూస్తున్న చంద్రం మొహం చూస్తుంటే ముసలాడికి అన్నం తినకుండానే కడుపు నిండిపోయింది.

''నీకెందుకురా ఆటి జోలి నిక్షేపంగా చదువుకొన్నావు నీకు మంచి ఉద్యోగం వస్తాది పెద్దింటోళ్ళా దర్జాగా బతుకుతావు నాయనా'' అన్నాడు

చంద్రం గుండెల్లో ఎక్కడో బలమైన దెబ్బ తగిలిన భావన కలిగింది ఈ పెద్దింటోళ్ళలాగా బతకడం అన్న భావన ఎలా పోగొట్టడం?

''అయ్యా ఆ పెద్దింటోళ్ళే బజార్లు ఊడ్చిందీ, సెప్పులు కుట్టిందీ ఆళ్ళే అయ్యా, దొరబాబులాంతా సెప్పుళ్ళేసుకొని జరజరా రోడ్లు ఊడ్చేస్తను రోడ్లంట ఎళ్ళే మారాజులు సెప్పులు తొడుక్కొని పెట్టేను'' అన్నాడు ఏసోడు

''ఎట్టా! ఆళ్ళంకే కడుపు!'' ముసలాడు నోరు తెరిచాడు

''యూహో ఎవరడిగినాసు మేమంతా సెప్పుళ్ళుట్టుకోని సూస్తావుండిపోతివి ఆళ్ళు అరుసుకుంటా ఎళ్ళిపోయిన్రు గవుర్మెంటు మనకే ఎక్కువ ఉద్యోగాలు ఇచ్చేస్తానని సెప్పిందంట అదే ఆళ్ళ కోపం''

బాధ కలిగింది చంద్రానికి

''అంతేరా నాయనా, ప్రపంచకం ధోరణే! ఏదో కాస్త బాగుపడే రోజులు వచ్చినాయంటే ఈళ్లేందిరా కళ్ళు సిప్పులు పోసుకుంటారు . ''

''అమ్మా పెట్టా పెట్టదు, అడుక్కు తినానివ్వదు అన్న సావిత అయ్యింది!'' అన్నది రత్తాలు అంతకు క్రితం జరిగిన గొడవలో ఊడిపోయిన జుత్తు ముడిపెట్టుకుంటూ, ఏదో గుర్తొచ్చినట్టు మళ్ళీ అంది ''ఇందాకా నేను పని చేసే కాడ దొరసాని నా జుట్టు చూసి నీ జుత్తేందే ఇంత నల్లగా, పొడుగ్గా ఉండాది. అవులే దిగులా, సింతా! కాయకష్టం చేసుకొని బతికేవాళ్ళకేం దిగుళ్ళు ! దిగుళ్ళంతా మాకేనాయె, అందుకే మా జుట్టు ముప్పై ఏళ్ళు రాకమునుపే తెల్లంగా పోయి ఊడిపోతుంది, ఇకన్నీ మీ రోజులేవే మీ కాడ మేం పని చేసే రోజులొస్తున్నాయి' అంటూ ఊరికూరికే యాష్టపడిందిరా ''

గుండె గొంతులోకి వచ్చినట్లయింది చంద్రానికి తల్లి పని చేసే యిల్లు తనకి కొత్తగాదు. ఊహ వచ్చాక ఎన్నో సార్లు ఆ వాకిలి ఎదురుగా నిలబడ్డాడు బడి నుంచి వచ్చేసరికి తల్లి ఇంట్లో వుండేది కాదు ఏ ఇళ్ళల్లో పని చేస్తోందో వెతుక్కుంటూ ఆ ఇంటికి ఎన్నోసార్లు వెళ్ళాడు. గుమ్మం ఎదురుగా టి.వి. కనబడుతూ వుంటుంది తన తోటివాడు, ఆ ఇంటి బిడ్డ రమేష్ సోఫాలో కూర్చుని టి.వి. చూస్తూ వుంటాడు ఆ వాకిలి దాటి లోపలికి పోయే ధైర్యం లేక, అమ్మ పని అయ్యే వర కేవలం చలికిలబడి ఎన్నో సార్లు నోరు తెరుచుకొని ఆ టి.వి. చూసేవాడు. ఆ ఇంటి ఇల్లాలు తల్లి ఈడుదే. శుభ్రమైన జరీ చీరెలో పండులా ఉంటుంది తల్లిలా ఎండిపోయి ఎముకల గూడులా ఉండదు. అయితే సహజంగా, తల్లికి ఉన్న మూరెడు జుత్తు కూడా ఆ ఇల్లాలికి కంటగింపుకావాలా!

''నువ్వు గమ్మునుండే! ఆళ్ళకేదో మనస్సుకి కష్టం తోసి అలాగని వుంటారు. మనం తలొంచుకొని పోవాలి'' చెపుతున్న తండ్రి వైపు చురుక్కుటూ చూసాడు చంద్రం

''ఎందుకు గమ్మునుండటం! వాళ్ళకి మంచి ఇళ్ళు వసతులు ఉన్నాయని మనం కుళ్ళుకున్నామా? విశ్వాసంగా కుక్కలాగా ఆ ఇళ్ళకి, ఆ మనుషులకి ఊడిగాలు చేయటం లేదా? ఎవరికి ముష్టి తెచ్చుకొని తినే యావారం అయ్యాగారు- అదే యాజులుగారికి గూడా అమ్మఅంట్లు తోముతుందే! ? నువ్వు పాతచెప్పులు కుట్టేవాళ్ళకంటే ఎక్కువే సంపాదిస్తావు మన ఇంట్లోకి ఏ ఒక్కరూ పనుల్లోకి రారేం? ఆ పెద్దింటోళ్ళు దరిద్రం వస్తే మన కులాల ఇండ్లల్లో అంట్లు తోముతారా? ''

''ఊరుకోరా సెంద్రిగా, అంత కోపమెందుకురా కాసింత మెల్లంగ ఎవ్వరన్నా వింటే జాస్తీ అవుతారు మనిండ్లలో చేసేందుకు ఏ పని ఉంటాదిరా? ''

''ఏం! మనం అన్నం వండుకోమా, అప్పుచ్చులు చేసుకోమా! పనులకీ ఉంటాయి. స్తోమత . సుఖంగా బతకగలిగే స్తోమత విషయం ఆలోచించాలిగాని కులం పేరుతో మనమే చాకిరీ చెయ్యాలని రాసిపెట్టి ఉంటుందా వాళ్ళకి డబ్బిచ్చి పనులు చేయించుకొనే వెసులుబాటు ఉంటుంది. మనం లేదంటే లేదు!'' అన్నాడు చంద్రం ఆవేశం ఆపుకొంటూ

''ఆళ్ళ పుటక అట్లాండేది సెంద్రా నువ్వు కోపం సెయ్యవంటె ఒక్కమాట. మనకీ, వాళ్ళకీ పోలికేంటిరా!'' రత్తాలు గొంతులో మరగకాగిన జీవితానుభవం.

చంద్రం వెర్రిచూపులు చూశాడు తల్లి వంక. ఎంతో నిరాశతో తరతరాల బానిసత్వ భావం నరనరాన నింపుకొన్న ఆ పేద తల్లివంక వేల కళ్ళతో మరీ మరీ చూడాలనిపించింది. ఆ వేల కళ్ళనే ఆమె కిచ్చి మారుతున్న ప్రపంచాన్ని చూపాలనిపించింది. కళ్ళనీళ్ళ సుడి మధ్య ఆమె రూపం అస్పష్టంగా కదులుతుంటే వేదనగా, ఆర్తిగా చూశాడామెను ఆవిడ తన తల్లి మాత్రమే కాదు- శిథిలమై చెదలు పట్టిన దేశమాత!

ఈ మురికి జీవితమే తనకు అనివార్యమనుకుంటున్న పిచ్చి తల్లి!!

'అమ్మా నిన్నెలా నమ్మించను... మనుషులందరూ ఒక్కటేనని నీకెలా చెప్పను? అందరిలా నవ్వే హక్కు, సుఖపడే హక్కు నీకూ, నాకూ ఉందని నీకెలా అర్థం అవుతుంది? నా కన్నతల్లీ... ఏ సౌకర్యాలూ, ఏ అవకాశాలూ ఏ ఒక్కరి సొంతం కాదని, అందరూ అన్నీ అనుభవించేందుకు అవకాశం వుందని నీ కెలా అర్థం అయ్యేలా చెప్పనే నా పిచ్చి తల్లీ...'



# ఆచూకీ...

గోపి

పొద్దు నెత్తిమీదికి రాబోతోంది. సీకటితోనే లేచి నోట్లె మంచినీళ్ళు పొయ్యకుండ ఊర్లో నోట్లె వాలికున్న ప్రతి మనిషి దగ్గరికి కాలుగాలిన పిల్లిలాగా తిరిగాడు లసుమయ్య, అయినా చాలా మంది పంచాదుకాడికి రాలేదు ఆశ భావక మళ్ళీ మళ్ళీ ఇండ్ల చుట్టు, పొలాల చుట్టు తిరిగాడు.

ఇదే పది సంవత్సరాల క్రితమైతే పంచాదు ఉన్నదని తెలిస్తే చాలు ఎక్కడి పనులు అక్కడే ఒదిలిపెట్టి సబ్బండ వర్ణాలు చేరిపోయేవారు. పంచాయతి పెద్దలు రాజువెడలె రవితేజము లలరగ అన్నట్టుగా బయలుదేరేవారు. ఊరి సుంకరి రాని వాళ్ళకోసం, రావాల్సిన వాళ్ళ కోసం గజ్జెల కర్ర ఊపుకుంటూ తిరిగేవాడు. పంచాయితీ సాగి సాగి పంచాయితీదారుల కులాన్ని బట్టి, ఆర్థిక హోదాను బట్టి, పంచాయితీ పెద్దలతో వారి సంబంధాన్ని బట్టి తీర్మానం జరిగేది తప్పు దండుగల కింద ఒకరు నలిగిపోతే గెలిచినవారు పంచాయితీ పెద్దల కింద నలిగిపోయేవారు. అలాంటి పాముల కోరలు విరిగిపోయాయి. ఆ పంచాయితీ కుప్పకూలిపోయింది.

అలాంటి పాత తరహా పంచాయితీల స్థానే న్యాయాన్యాయాల గురించి ప్రశ్నించిన యువకుల పంచాయితీలు నిన్న మొన్నటిదాకా నడిచాయి. ఆ పంచాయితీలు చేసిన వాళ్ళు కొందరు అలాంటి పంచాయితీల దగ్గరే ఆగకుండా ఎందుకోసమైతే గాని ఊరు విడిచి వెళ్ళి బతికిపోయారు. అట్లా పోలేనివాళ్ళు ఈ ప్రారంభమైన 'ఏరివేత'లో ఒకరు చావుదెబ్బలు తిని ఇల్లు గుల్లయి నోరెత్తకుండా అయ్యాడు. మరొకరు ''తలంచుకొని'' తప్పుకాయండని మొరబెట్టుకొని ఊళ్ళె నుండి వెళ్ళిపోయి మరెక్కడో బతకడానికి తంటాలు పడుతున్నాడు.

ఏతావాతా పాతది కూలిపోయి కొత్తది నిలదొక్కుకోక ఆ ఊరు చిత్తడినేల లాగా ఉన్నది మనుషులు అంతకన్నా అధ్వాన్నంగానే వున్నారు

ఏదిఏమైనా కాలం ఆగదు గదా! వెనక్కి పోలేదు గదా! ఉన్నకాడనే కదం తొక్కలేదు గదా!

లసుమయ్యకు ఈ గొడవలేమి తెలియదు అతనికి తెల్సిందల్లా తన కడుపు కానిపోవడమే. ఊరు ఊరంతా తన మీద పగబట్టిందనుకున్నాడు అందుక్కారణం తన పెండ్లాం లసిమియే అనుకున్నాడు

లసుమయ్య బుసు బుస పొంగే కోపంతో గుడిసె ముంగటికి వచ్చి, ''లసిమి లంజెముండా నాకు ఇదమ్మ తగిలినట్టు తగిలినవ్.'' గుడిసె లోపలికి జొరబడ్డాడు

అప్పటికే లసుము తాగున్నది. లసుమయ్య ఆదర బాదరగా వచ్చి లసుము కొప్పు పట్టుకొన్నాడు పెడిపెడిన గుద్దసాగిండు.

"నీ కాడుగాల-కాముని పెంటగాను '' లసుము విదిలించుకున్నది

లసుమయ్య లసుము కన్న పదిహేనేండ్లు పెద్ద  లసుమును రెండో సంబంధం చేసుకున్నాడు.

"లంజెకాన, పెద్ద పోరిని ఆట్ల సెడగొడ్తివి  సిన్నపోరి ఇట్లసచ్చె- గొడ్డలేది  అందరిని మునుంబెట్టి గొడ్డట నరుకుత '' ఆడికీడికి ఎగురసాగిండు

"మాదండి మొగోనివి. నరుకు ఏ ఏపాటి నరుకుతవో నరుకు  నీ సాతగాని నర్సొక్కుల ... పెద్ద పోరికి పెండిల సెయ్యకపోతే ఏం జేత్తది-  నీకే దమ్మంటే సిన్నపోరికి వేలు బోసి మొగన్ని జెయ్యి. నీ తాడు దెంప  . అయినా నిన్నంటే మున్నది.'' లసుము కంఠం పూడుకుపోయింది

ఈతతాడు పేనుతన్న కొమురు బెదిరిపోయి తల్లిని తండ్రిని ఎట్లా సముదాయించాలో తెలియక ఏలుచున్నది

లసుమయ్య కోపం దిగిపోయింది... నిజానికి పెళ్ళాం నోరు తెరిచిదంటే అతనికి జవాబులుండయి. అదిగాక లసుము అంతెత్తు మనిషి- ఇప్పుడంటే ఈకలు దీసిన తాంబుర్రలాగా తిండి సాలక మనిషి కొంచెం తగ్గిందికాని...

లసుము కొమురును చూసింది  ఆ పిల్ల ఆరు నెలల కడుపును చూసింది. ఏదో ఆవేశం కమ్ముకొచ్చిన దానిలాగా- కూతురుని రెట్ట బట్టుకొని మాదిగిండ్ల మధ్యలో గల పెద్దమ్మగుడి వేప చెట్టు కిందికి గొరగొర ఈడ్చుకుపోయింది.

"ఇది ఊరా అడివా? నా మొగుడు పొద్దటి నుంచి కాలుకు బలుపం కట్టకుంట అందరి సుట్టు తిరుగుతండు  ఈ ఊళ్ళే పటేండ్లు మంది సొమ్ములు దీని నోర్లు పడిపోయున్నరు. కులానికి మీకేమయ్యింది? ఇది మన మాదిగిండ్లల్ల బుట్టిన ఎడ్డిపోరి. అవ్వలాలా అయ్యలాలా! ఎడ్డిపోరిని జూసి దీన్ని బుట్లేసిండు ఓ గాడ్డికొడుకు. ఇది ఆరు నెల్ల కడుపేసుకొని మీ కండ్ల ముంగట దిరుగుతంటే కండ్లు మూసుకుపోయి నయా? అదే మీ బిడ్డకైతే గిట్లనే ఊకుంటరా?'' లసుము ఇట్లా మాట్లాడుతుండతానే ఆ చుట్టుపక్కల గుడిసెల వాళ్ళు కలుగుల్లోని ఎలుకల్లా బిలబిలలాడుతూ బయట కొచ్చారు.

"వానీ తమ్మీ ఏసయ్య మతం బట్టి దుర్గన్నా! పెద్దమాటినంగనే సెవులు మూసుకుంటవు గదరా? ఇదొగిది నా బిడ్డ! గిదీన్ని తీర్మానం సెయ్యి...  కులపోల్లు, ఊరోల్లు పట్టించుకోకపోతే ఇదే కాల్లమీన ఆమీను కచ్చేరుకుబోతు- లీసిమి 'తెగినలంజె' అని మీరంత ఎంత మొత్తుకున్నా మన్సోబ కచ్చీరుకు బోత '' నని బిడ్డను తీసుకొని రోడ్డుకేసి నడవబోయింది

అప్పుడు అందరిలోపట కలకలం బయలుదేరింది.

అప్పటికప్పుడు మాదిగలంతా పెద్దమ్మ గుడిముందు జమైపోయారు. ఈ రకమైన పాత కొత్త సందులో పైకి రావాలనుకున్న మిట్టమీది ఓదెలు మన్నెపోల్ల గుడిసెల్లకు మనిషిని దోలిండు. లసుము పెద్దబిడ్డ మూతులు పొడువంగ దుడ్డెగాళ్ళ రాజయ్య ఎందుకైనా మంచిదని ఎక్కువ కులపోల్ల కోసం ఊళ్ళెకు పరుగెత్తిండు.

ఎట్లయితినేమి పొద్దువంగుదలకు పెద్దమ్మ గుడికాడ పంచాదు షురువయ్యింది

పంచాయతు ప్రారంభమయ్యే సమయానికి ముద్దాయి అయినా, తీర్పుకోసం ఎదురుచూసే అభాగ్యురాలైనా కొమురు ఒక్కతే.

కొమురు భూమి చెరచెర చెక్కలైపోయి తను అందులోకి కూరుకుపోదామన్నంత వేదనతో దించిన తల ఎత్తకుండా ఏడుస్తోంది. ఆమె ఎరుపు చెక్కిల్లు కందిపోయాయి

అయిష్టంగానే వచ్చిన కాపులు, పెర్కలు, రెడ్లు, షావుకార్లు మాదుగులకు కొంచెం ఎండగా పెద్దమ్మ గుడిముందు గద్దెల మీద కూర్చున్నారు యువకులు కొందరు గోడకానుకొని నిలుచున్నారు మాదుగులు వేపచెట్టు కింద నేలమీద దుమ్ములో కూర్చున్నారు ఆడవాళ్ళు గుడిసెల చూర్ల కింద నిలుచున్నారు.

లసుము బిడ్డను నడిమందిలోకి తీసుకెళ్ళి ''అయ్యలారా! అవ్వలాలా! మేం పచ్చులసోంటోల్లం తంగెడు పువ్వసోంటి నా బిడ్డను ఆ అందరి ముంగట నిలబెట్టిన దానికి అన్నమే పెడతారో? మన్నె పెడుతరో మీ యిట్టం?'' అన్నది చేతులు జోడించి.

వేప చెట్టు మీద గొర్రెంకలు ఒర్లినట్టు తలోమాట అన్నారు.

''ఆడబుద్ధో ఆట్టబుద్ధో దాన్ని మాయజేసిండ్లు ''

''ఈ అవ్వ! బొత్తిలకు కాలం సెడిపోయింది. మా కాలంల గిదెరకేనా?'' ఒక ముసలవ్వ దవడలు నొక్కుకున్నది.

''ఎనుకటి కాలంలైతే పెండ్లిగాకుంట కడుపైనందుకు పోలీసు పటేల్ లసుమని మీద బండలెత్తి తప్పుదండుగ దీసుకొనేటోడు. దీన్ని తల గొరిగిచ్చి తింపెటోల్లు- ఎనుకటి సంగతులు ఎవలకు జెప్పుతన్నవ్.''

''ఆడిదిసెడ్డ! మొగోడు సెడ్డ! ఆడిదానిదే తప్పనే టోల్లు.'' ఇంకోకామె.

''ససుండ్లి సంసుండ్లి(రా! ఎనుకటి సంగతి ఏట్లెబోయింది గిప్పుడేం చెయ్యాల్నో గదిసూడుండ్లి.'' కాపు రాయమల్లు కొంచెం సొలుగుతూ చెప్పాడు.

''నలుగురున్నకాడ నారాయుడున్నడంటరు?'' లసుమయ్య చేతులు జోడించి.

''అది నిజమేనురా? కని తప్పుగిదని తేలుతే ఇనాలెగదా?'' పెద్ద మనిషిగాజుల లచ్చయ్య అన్నాడు.

''ఇనకపోతే అమీను కచ్చీరుకు బోత.'' లసుము.

''లావులావు ఉరుకులాడ్తన్నవ్-పోరాదే- ఆడ మొడుసులిరుత్తరు.'' ఆడవాళ్ళ గుంపులోనుండి ఎవరో?

''మరేం జెయ్యాలె - దేకేది నా ముడ్డికాకుంటే పట్నందాక దేకుతనన్నదట ఎనుకటెవతో? అవ్వపెట్టదు అడుక్క తిననియ్యది''- లసుము గయ్యిన లేచింది.

''ససే లసుము, ససు ఏమంటు(రా మాదుగులు. గీ సంగతి అందరు సూత్తనే ఉన్నరు. చచ్చిన శవం ఊళ్ళె బెట్టుకొని ఎన్ని దినాలుంటమ్. నలుగురం కూడినం ఏదన్న చేద్దామంటర- లేకుంటే ఎవల సందాల వాళ్ళం బోదామంటర. మంచికో సెడ్డకో ఎనుకటి పద్ధతులు పోయినయ్. కొత్త పద్దవతులు అందరికి తెలిసినయే. కాగల కార్యం గంధర్వులే సేత్తరంటే -గంధర్వులు ఎప్పుడత్తరో రారో? ఎరుకలే- అచ్చినా ఎట్లుంటదో తెలువది- నూటికి సెలుగ ఆళ్ళు వచ్చి తీర్మానం చేసేదనుక ఆగుదామంటే ఆ పోరి గట్లున్నది. అది మల్ల ఆమీను కచ్చీరుకు దెలుత్తె అదో కిరికిరి. ఈ సారికి మనమే గిది గు(రం గిదిమైదానం అందామా?'' లచ్చయ్య

ఆ మాటకు అందరు తలలూపారు.

''గట్టరావే కొమురు.'' లచ్చయ్య పిలిచిండు.

కొమురుకు ఈ మాటలేవి విన్పించటం లేదు. ఆమె తలెత్తి ఎవరి ముఖ్లోకి చూడలేకపోయింది.

వరి పొలాల కోతలప్పుడు వరి మోపు నెత్తిమీది కెత్తుతూ ''కొమురు నువ్వు ఊకె యాదీకొస్తున్నవే'' అన్నప్పుడు తన శరీరం ఉయ్యాలలూగింది గడ్డి కోసుకొని అందరికన్నా వెనుకే వచ్చినప్పుడు తన

వెనుకే పిల్లిలా వచ్చి కళ్ళు మూసినప్పుడు- తనుగొంతెత్తి పాడుతూ ఉంటే ''కొమురు నీ పదం నన్ను నిదుర పోనియ్యదే'' అన్నప్పుడు- రాత్రి పగలు ఒకరి మనసు ఒకరే కాదు, ఒకరి తనువును మరొకరు తెలుసుకున్నప్పుడు ఇట్లా తను ఒంటరిగా నలుగురు మందు నిలబడతాననుకోలేదు.

''కొమురు...'' లచ్చయ్య ఎట్లా అడుగాలో తెలియక తల గోక్కున్నాడు.

పంచాదుల ముద్దాయి ఒక్కతే నిలుచున్నది ఆవలిపక్క ముద్దాయి లేకుండా పంచాదు నడువదు. ఇలాంటి పంచాదులు సాగలాగి కూడ ఏం లాభం లేదు.

''కట్టడి ఎక్కడ తప్పింది. కట్టడంటే ఏంది?'' యువకులు చాలా మంది ఆలోచిస్తున్నారు.

''కొమురుకు వాగులు పోటెత్తున్నట్లు, టేకుటాకుల మీద వాన చినుకులు మోత పెడుతున్నట్లు, తన గుండె కొట్టుకోవడం తనకు భయంగొలిపే విధంగా ఈతచెట్ల డొంకల్లో తిరుగాడుతున్నట్లు- మావురు గప్పినట్లుగా ఉన్నది

''కొమురు, పెండ్లి గావాల్సిన దానిని- పెండ్లి కాకుంటనే నీతో జతగూడిన పోరడెవలే?'' తన గొంతే తనకు విచిత్రంగా విన్పిస్తుండగా లచ్చయ్య.

''పాపం మంచిదిగాదు. పాపం ఎవలు చేసినా ఈ లోకంలో కాకున్నా వరలోకంలో సిచ్చుంటది.'' దుర్గయ్య.

''నసవయ్యా!'' అన్నారెవలో

అయినా కొమురు తలెత్తలేదు.

''చేసిండు కూసుండు మందనడు మాకనడవ్వా! అన్నట్లు సెయ్యంగి లేంది? మా కాలంల్లైతెనా నిన్ను గొడ్డట నరుకుదురే '' ఒక ముసలవ్వ.

''నీ బొందమురుగ నా కడుపున సెడపుట్టినవే- ఏల్పులోల్ల ఇజ్జత్ తీత్తివి గదవే '' లసుము కొమురు మీదికి ఉరుకబోయింది.

''ససరాదే. తల్లికి బొల్లుంటే పిల్లకు సుక్కన్నరు. నీ సందాల నువ్వుంటే ఎడ్డిపోరి బోర్లపడ్డది.'' ఒకామె లసుము పింది.

అయినా కొమురు తలెత్తలేదు.

యువకులు కిసకిస నవ్వింఢ్లు.

''చెప్పుబిడ్డా!'' లచ్చయ్య.

కొమురు తలెత్తకుండానే ''బూడిది లింగయ్య నన్ను పెండ్లి చేసుకుంటనన్నడు'' అన్నది.

అప్పుడు లేచింది కలకలం. కాసేపటికి బూడిదోల్ల ఇంట్ల నుంచి శోకాలు మొదలయినయ్. సలిపిడుగు పడ్డట్టుగ బూడిద మారయ్య పనికి పోయాడు. మందిల కూసున్న బూడిది మారయ్య కేసి జనం చూశారు.

యువకులు కొందరు పరుగెత్తి వాగులో బట్టలుతుక్కుంటున్న బూడిది లింగయ్యను పట్టుకొచ్చారు

బూడిది లింగయ్య నిలువెల్ల చెమట కారుతుండగా వచ్చాడు. ఒక్కమారుగా తలోమాట అన్నారు.

బూడిది లింగయ్య కొమురుతో జత కూడింది నిజమే అన్నాడు.

అటుతిప్పి ఇటుతిప్పి ఇప్పటికైనా ఇద్దరికి తలువాలు ఎయ్యడమే మంచిదని పెద్దమనుషులు చెప్పారు.

బూడిది మారయ్య పెండ్లాం కొండమ్మ శాపనార్థాలు పెడుతూ..

''నల్లికుట్ల నా కొడుకు ఇల్లు ముంచిండు. అయ్యలారా అవ్వలాలా! ఆపోరి అట్ల కనిపిత్తందేగని అది జన్నెకిడిసిన దూడతీర్గ తిరిగింది మావోని మీద బట్ట కాల్చిమీదేత్తంది'' అన్నది

మారయ్య లసుమయ్య కన్నా కొంచెం స్థితిపరుడు రెండెకరాల పొలం, ఒంటి నాగలున్నది కొడుకు పెండ్లికి వరదక్షిణ వస్తే మరో ఎకరం కొందామని- మాదిగిండ్లల్ల పెంకలిల్లు కట్టుకోవాలని కలలు కంటున్నాడు ఆ కలలన్ని కుప్ప కూలిపోయాయి.

మారయ్య పెద్ద బిడ్డ మూడేండ్ల క్రితం అట్లాగే అయితే భార్య భర్తలిద్దరు కలిపి చావదెబ్బలు కొట్టారు. ఆ పిల్ల ఎండ్రిన్ తాగి చనిపోయింది. ఆ కేసుకు పది వేలప్పయ్యింది అది తీర్చసరికి ఇగో కొడుకు ఈ నిర్వాకం చేశాడు.

''కులం కల్సింది. వరుస గల్సింది. నలుగురింటే నాలుగు లోకాలిన్నట్టు. కాలం మంచిగ లేదు సుట్టూ పొలాలల్ల ఎర్రమూతి పోలీసోల్లు డేరాలేసుకున్నారు గిది గిట్లని ఎరుకైతే కచ్చీర్లు కతుపలు, అయింక మీ ఇష్టం . కాలం ఇట్లా అచ్చింది ఇంకెటల ముందు నడుత్తదో ఎరుకలే. జబర్దస్తీ చేసిన పెద్ద లోకులు ఊళ్ళేనుంచి ఎల్లి పోయిండ్లు '' లచ్చయ్య.

''నిజమో అపద్దమో పరమాత్మునికెరుక. నా బిడ్డ అట్లజేసి మీ కండ్ల ముంగట నేడు ఏడు నిల్వుల లోతున బడ్డ- గిప్పుడైతే పెండ్లి జెయ్య నాతరం గాదు'' మారయ్య.

''పెండ్లా? దానవ్వ తాగుబోతు, కట్టుబోతు అది ఎత్తులేసి పోరికి నేర్పింది. పెద్ద పోరిని గిట్లనే చేసి దుడ్డెగాళ్ళ రాజాలను బుట్లేసింది అని పెండ్లి పెండ్లాం ఆరరనుకుంట ఎల్లి పోయింది. దాని మొగుడు మేదకున్ని కాజూసి ఇదే కత నడుపు కత్తంది అయినా అయ్యలారా! మేం అంబలే తాగినమో! గంజే తాగినమో? మా రెక్క లిరుసవకొని ఇట్ల బతుకుతున్నం మా మీద మాదుగు అందరికి కండ్ల మండి ఎట్ల మారిగాన్ని అంగదీయాలెనని గీ ఎత్తులేసిండ్లు. గిది మీకు బనావుగాదు. నా పోరడు అగ్గానపు పోరడు సూసుకుంట సూసుకుంట మురుకు నీళ్ళు తాగుమంటే ఎట్ల?'' అన్నది కొండమ్మ

కొమురును మురుకు నీళ్ళన్నందుకు పడుసు ఆడ పిల్లలు రేషాని కచ్చిండ్లు, ''ఆడదానికొక నీతి మొగోనికొకటా? కొమురు సెడపోయిందనుకుంటే అంతకన్నా సెబల్ సెడిపోయినోడు లింగయ్య'' అన్నరు

అట్లా పొద్దు వంగేదాకా అనేక మాటలు నడిచాయి.

మారయ్య ''మారే-ఈ పెండ్లి నా బొందిల పానముండగ కానియ్య ఏం జేసుకొంటరో చేసుకోండి'' లేచిపోతూ అని నడిమందిలకొచ్చి.

''అంత లావయితే, నడిమందిల ఆ పొల్ల మావోని పేరేత్తుకున్నది గస్క తప్పు దండుగ కింద మూడువేల రూపాయలు గడ్త'' మారయ్య కొడుకును గొర గొర ఈడ్చుకుంటూ వెళ్ళిపోయాడు.

లసుము మెడవరాలు ఉబ్బంగ శాపనార్థాలు పెట్టింది. దారిల దుమ్ము దోసి ఎత్తుకొని వెళ్ళి మారయ్య ఇంటిమీద పోసి ''మీరు మునిగి ముతమాయమై పోతర్రా - మీ వంశం నిర్వంశమై పోతదిర్రో. నా పోరి గోన తాకి మీ లింగడు పెట్టన సత్తడు.'' కొమురును తీసుకొని వెళ్ళి కడుపుల పేగులు అవిసిపోయేలాగున రోదించింది

పొద్దు గుడిమెట్టు కొండ వెనుక గూకింది ఆకాశంలో ఎర్రడౌలు మెరుస్తోంది. చెట్లమీదికి చేరిన పక్షులు అరుస్తున్నాయి. అంతకన్నా అధ్వాన్నంగా ఆ ఊళ్ళో మనుషులు తాగి అరుస్తున్నారు. చేలల్లోకి పోయిన గుంటుకలు బర్రున గీరుతూ ఊళ్లోకి వస్తున్నాయి. పశువుల మందల కొడార్ల దగ్గర

చేరిపోయాయి.

రోడ్డు పక్క మర్రి చెట్టు కింద గుడిసె హోటల్ ముందు చాలా మంది కూర్చున్నారు

తాగిన కళ్ళు మెరస్తుండగా బింగి బొంద్యాలు ఏదో చెప్తుతున్నాడు. యువకులు చాలా మంది సాయంత్రం స్నానాలు చేసి లుంగీలు కట్టుకొని వచ్చి చేరారు.

''ఇయ్యేడు కాలం ఎట్లుంటదో?'' అన్నాడొక రైతు

''కాలం ఎట్లుంటుందేంది? గుంటెడు భూమి లేకపోతే వానయితేంది? అరుపైతేంది? నీకేందివయ్యా మారాజువు చెరువెనుక రెండెకరాల పొలమున్నది'' ఒకరు

మర్రిచెట్టు మొదట్లో ముల్లెకట్ట తీర్గ కూర్చున్నాడు బూడిద లింగయ్య అతని ముఖం ఉబ్బి ఉన్నది. అతను ఆ పంచాయితి జరిగిన కాన్నుండి అక్కడి నుంచి లేవలేదు. అతన్ని లెమ్మనిగాని, నీ కడుపుల దుఃఖమేందనిగాని ఎవరు అడుగ లేదు.

అతనికి ఊరంత నోరు తెరిచి ''కొమురును నేను పెండ్లి చేసుకుంట, ఎవలడ్డ మత్తరో రానియ్యి'' అని మొత్తుకోవాలని ఉన్నది. తండ్రి దగ్గరి కెల్లి ''నువ్వు తండ్రివి కాదు పోలీసోనివి'' అనాలని ఉన్నది. పోనీ ఇవేవి తనకు చాతకాదు.

చీకటి ఎప్పటిలాగే ఊరుమీదు పరుచుకుంటోంది

లింగయ్య హఠాత్తుగా లేచి ఊళ్ళోకు నడిచాడు. వెంకులు ఇంటిముందు పందిరి కింద పది మంది తాగుతున్నారు. తీరా చూస్తే తన దగ్గర డబ్బులేదు. తాగాలన్న నిషా దిగిపోయింది. అక్కడి నుండి నర్సింహులు ఇంటికి నడిచాడు.

నర్సింహులు దిగాలు పడి మంచంలో వెల్లకిలా పడుకున్నాడు.

దడి దగ్గర లింగయ్య నిల్చున్నాడు.

''ఎవలది?''

''నేను బూడిది లింగయ్యను.'' ఆ తరువాత లింగయ్యకు ఏం మాట్లాడాలో తోచలేదు.

నర్సింహులు మంచంలో లేచి కూర్చున్నాడు

''మీ అయ్యకు పైస పిస్స పట్టుకున్నది. ఎవలు చెప్పినా వినడు. నేను అత్తామంటే. మళ్ళీ పంచాదులు చెత్తన్ననంటరు.''

లింగయ్యకు బిగ్గరగా ఏడువాలని ఉన్నది.

''మీరిద్దరు కలిసి ఎటన్న ఎల్లిపొండి-'' నర్సింహులు ఆ మాట అనేసరికే అతని భార్య వీరమ్మ వచ్చి

''ఆఁ మాదండి మొగోడచ్చిండు మంచమెల్లెలుక లెయ్యివన్నదట-గదమ్మెంటె గింత దూరమెందుకచ్చు. ఔపిలగా నీకు సిగ్గు శెరం లేదు. ఎగ్గలి పోరిని జూసి. మల్లనువ్వు పంచాదులంటే రేపు మామలచ్చి పట్టుకపోతరు ఇగమేం ఏ నుయ్యో సూసుకోవాలె.'' చేతులూపుతూ.

బూడిది లింగయ్య అక్కడి నుండి కదిలాడు. ఈ ఊళ్ళె ఎవలు తనకు మద్దతు రారు. నర్సన్న అన్నట్టు ఎటన్నపోతే- ఇప్పటికే కొమురు బెదిరి పోయున్నది.

అనుకోకుండానే అతని కాళ్ళు కొమురు ఇంటికేసి నడిచాయి.

కొమురు తల్లి, లసుము పందిరికింద పడ అదో పదంలాగా తిడుతోంది. .

గొంతు పెకుల్చుకొని ''కొమురూ!'' అని పిల్చిండు

''అచ్చినవా? నర్సొక్కుల గాడిది కొడుకా? పదిమందిల మా ఇంటి ఇజ్జత్ తీసి పెంటమీద పారేసినవ్ ''

''అదిగాదత్తా- కొమురును తీసుకపోత.''

''ఏడికి ఆడివిలక- అంతలావు మొగోనివైతే మీ నాన్నను తీసుకొనిరా! లేదంటవా? నీమీద దాని మీద ఇంత గాసు నూనె పోసి కాలబెడ్త''

గుడిసెలో నుండి ఏడుపు విన్పిస్తోంది.

లింగయ్య అక్కడి నుండి బయలుదేరాడు మునిమాపు- అందరు ఉన్నది లేనిది తిని పడుకోవడానికి ప్రయత్నం చేస్తున్నారు

తనకా ధైర్యం లేదు ఈ చిక్కులోనుంచి బయటపడే మార్గం ఎట్లా?

లింగయ్య డక్కా మొక్కీలు తిన్నవాడు కాడు

మరెక్కడికి పోవాలో లింగయ్యకు తోచింది కాదు. అతనికి పుట్టెడు దుఃఖం ముంచకవస్తోంది. ఎవరిమీదనున్న పడి ఏడిస్తే బావుండును.

కొమురు గొంతు తనను వెంటాడుతోంది .. చిమ్మెట్లు పలుకే ఈ రాత్రి పిచ్చి పట్టిన వానిలాగా తిరిగాడు అతనికి తెలియకుండానే అతని అడుగులు ఊరి బయటకు పడ్డాయి. పొలాలు దాటాడు-చేలు దాటాడు. అడివి బందునే గల కంచెల్లో ఒక నల్లరాయజ మీద కూర్చుండి వెక్కి వెక్కి ఏడ్చాడు

అదే రాయి మీద కూర్చుండి రేన్నెల్ల క్రితం అన్న చెప్పిన సంగతులు గుర్తొచ్చాయి

ఇప్పుడెక్కడున్నారో? అన్నలు జ్ఞాపకం వచ్చి అతను కళ్ళు తుడుచుకున్నాడు... అతనికి తెలియకుండానే లింగయ్య అడుగులు అడివికేసి పడ్డాయి.

వారం గడిచింది లింగయ్య తండ్రి చెట్లు పుట్టలు అన్ని వెతికాడు లింగయ్య జాడ దొరకలేదు

విచిత్రంగా నర్సింహులు తనకు తెలిసి అడివంతా గాలించాడు. తనొక్క మాట 'పర్వాలేదంటే'. . ఎవరిని ఎవరాపగలరు?

కొమురు లింగయ్య కోసం వెతుకుతోంది

అయినా లింగయ్య ఆచూకి దొరకలేదు.

మీ కెవరికైనా తెలుసా?



# పరిధులూ - ప్రమేయాలు

**దగ్గుమాటి పద్మాకర్**

అన్నం తింటున్నంతసేపూ ఆలోచిస్తున్నాడు ఆనందరావు కూతురితో విషయాన్ని ఎలా మొదలుపెట్టాలా అని.

అప్పటికీ అడిగింది భార్య- ''ఏంది? ఏదో ఆలోచిస్తున్నట్టున్నారు?'' అని.

''ఏం లేదు! చంద్రానికెన్నోయేడు నడుస్తూంది?''

''ఏదైనా సంబంధం వచ్చిందా?''

''ఎన్నో యేడంటే సంబంధం అంటావేందే? దానికీ దానికీ సంబంధం ఏమిటి?''

తను చేసే చర్యలేవీ భార్యతో చెప్పడం పెద్దగా ఇష్టం వుండదు ఆనందరావుకి. దానికి కారణముంది ఆలోచనల్లో బాగా వెనుకబాటుతనం వున్న భార్యని చర్చలతో మార్చలేక, ఏకపక్షంగా తనే నిర్ణయం తీసుకుని ఒకేసారి ప్రకటించడం అలవాటు చేసుకున్నాడు. ఇందుకు తనకు సమాజంలోని పురుషాధిక్యత బాగా ఉపయోగపడుతూ వస్తుంది.

''ఉన్నట్టుండి దాని వయస్సు మాటెత్తితే అలా అనుకున్నాను లెండి'' కొంచెం నిష్ఠూరపడింది భార్య.

''అందుకేలేవే! ఆ మాట కాస్తా దాని చెవినేసి విషయాన్ని పీకలమీదికి తేకు. దానితో మాట్లాడాలి ముందు''

''మాట్లాడను గాని అబ్బాయెవరు యింతకీ?''

''అలూ లేదు - చూలూ లేదనీ.. అబ్బాయి విషయం యెందుకే! ముందు అదొప్పు కోవాలిగా!''

''ఎందుకొప్పుకోదూ? కులాంతరమా ఏమిటి?'' విషయాన్ని కూపీ లాగడంలో సిబిఐకి ఎంతమాత్రమూ తీసిపోదు ఆనందరావు భార్య.

నవ్వుతూ చూశాడు భార్యవేపు

''నిజమేనే! అబ్బాయి బ్యాంకిలో క్లర్కు.. కులాంతరమంటే మనకంటే పై కులమేననుకో!''

''అంటే, కట్నం గిట్నం ఏమీ లేదు కదా! అబ్బాయి బాగుంటాడా! బాగుంటే నిక్షేపంగా చేసుకుంటుంది లెండి! మన స్థితిగతు లేపాటివో దానికి మాత్రం తెలీదూ!''

''అబ్బ! నిర్ణయం తీసుకోకే! దాని సంగతి తెల్సి కూడా నువ్వు...''

''ఇందులో తప్పేముందండీ! మీరైనా, నేనైనా దాని మంచికే గదా మాట్లాడేది! అయినా కన్నవాళ్లం. .''

''కన్నవాళ్లమే! దాన్నడగాలిగా!''

''చిన్నపిల్ల! దానికేం తెలుసండీ!''

''నువ్వుండవే అబ్బ! ఇప్పుడేం చేస్తుందో చూడు''

భార్య కూతురు గదివైపు రెండడుగులు వేశాక పిల్చి మళ్లీ చెప్పాడు ఆనందరావు

''నువ్వు దానితో ఏమీ మాట్లాడొద్దు. నిద్రపోతోందో? చదువుకొంటూoదో చూడు చాలు''

భార్య వెళ్లాక క్షణం ఆలోచనలో పడ్డాడు ఆనందరావు



ఆనందరావు దళిత సంఘం జిల్లా నాయకుడు వృత్తిరీత్యా కాలేజీ లెక్చరర్ కులం రీత్యా హరిజన వయస్సు నలభై దాటింది

తమ పార్టీ రాష్ట్ర అధ్యయన తరగతుల్లో భాగంగా పక్క జిల్లాకు ''దళిత సంస్కృతి'' అనే అంశంపై పాఠం చెప్పేందుకు మూడు రోజుల ముందు వెళ్లాడు ఆనందరావు

రెండవరోజు పాఠం ముగిశాక అన్నాడు. ''ఎవరైనా నా పాఠంపై ప్రశ్నలు, అనుమానాలు వుంటే అడగచ్చు లేదా చీటీలైనా పంపవచ్చు''

ఆ తర్వాత ఆనందరావు తనకొచ్చిన కొన్ని ప్రశ్నలకు సావధానంగా జవాబులు చెప్పాడు అయితే ఆ జిల్లా కన్వీనర్‌గా వుంటున్న శంకర్ అనే యువకుడు పంపిన చీటీయే ఆయన్ను కొంత ఇబ్బంది పెట్టింది. అందులో ఇలా వుంది.

''మీరు చెప్పిన క్లాసులో సమాజంలో కులం అంతరించిపోవడానికి కులాంతర వివు జరిపించడం సరైనన మార్గమన్నారు. మన సభ్యులందరూ కులాంతర వివాహాలనే తమ కుటుంబాలలో జరిపించాలని సూచించారు వివిధ కులాల నడుమ స్నేహ సంబంధాలను కలిగించాలంటే రక్త సమ్మిశ్రణమే సరైన మార్గమని డా అంబేద్కర్ చెప్పినట్లు కూడా చెప్పారు కులాంతర వివాహాలు చేసుకోవడం మన ప్రణాళికలో మొదటి అంశంగా ఈ మధ్యనే చేర్చామన్నారు సంతోషం ఇది నిజంగా నేను అంగీకరిస్తున్నాను నమ్ముతున్నాను. సూటిగా ఇక విషయానికి వస్తే, నేను మీ అమ్మాయి చంద్రావతిని వివాహం చేసుకోవాలని అభిలషిస్తున్నాను మీరు ఏమంటారు? కులం, ఉద్యోగం మీకు తెలిసిందే. ఇందుకు మీ అంగీకారం వుంటుందనే అనుకోవచ్చా?''

ఈ చీటికి వేదికపై సమాధానమివ్వలేదు ఆనందరావు కొన్ని ప్రశ్నలు ఇప్పటికిప్పుడు సమాధానం చెప్పలేనివిగా వున్నాయని, అవి ఆచరించవలసినవి మాత్రమేననీ, ఆచరించే ప్రయత్నం చేస్తాననీ అన్నాడు అలా అంటూ కోపాన్నీ, నిస్సహాయతను కలగలిపిన చూపు చూశాడు శంకర్‌వేపు.

ఎవరికి వాళ్లువీడ్కోలు తీసుకుంటున్నారు తిరుగు ప్రయాణానికి అప్పుడు పిలిచాడు ఆనందరావు దూరంగా వున్న శంకర్‌ని.

నిలువు నిదానం లేకుండా ఇటువంటి ప్రశ్నలు పంపరాదనీ, తాను ఆలోచించుకోవాలనీ, అలాగే అమ్మాయినీ కూడా అడగాలనీ అన్నాడు.

సమంజసమైన ధోరణిలో అన్నాడు శంకర్

''ఒక విషయం సార్! నేను మీ అమ్మాయిని పెళ్లి చేసుకోవాలని ప్రేమనుంచో, ఆశనుంచో, పట్టుదలనుంచో మాట్లాడటం లేదు. అలాగని మీ అమ్మాయి పట్ల సదభిప్రాయం లేకుండా యేం పోలేదు ఆచరణలో మీరు చెప్పిన సూత్రం ఏ క్రమంలో ముందుకు వెళుతుందో పరిశీలించా

ుచుకున్నాను అది నాతోనే, నా ద్వారానే వెంటనే మొదలుపెట్టాలనుకున్నాను. ఇది తప్పంటారా?''

''ఇంతకీ నీకు మా చంద్రం సరయిన జోడీ అన్న అభిప్రాయం లేదా యేం?'' అనుమానంగా అడిగాడు ఆనందరావు

''నేను పంపిన ప్రశ్నలో హాస్యం లేదు. సత్యం, సత్యాన్వేషణ వున్నాయంతే'' సూటిగా చూస్తూ అన్నాడు శంకర్

ఎవరో పిల్చారు ఆనందరావుని. వస్తానంటూ కరచాలనం చేసి వెళ్లిపోయాడు ఆనందరావు



''చదువుకొంటూందండీ! పిలవమంటారా'' అంది భార్య

''పిలు''

చంద్రావతి ఎం.ఎ చదువుతోంది. తనకీ రాజకీయాలంటే ఇంట్రస్టు వుంది. ఫెమినిస్టు భావాలతో కొంత పరిచయమూ వుంది. తనకంటూ ఒక మిత్ర బృందమూ వుంది. తండ్రి తోటి, అతని కోసం వచ్చేవాళ్ల తోటీ, తన స్నేహితురాళ్లతో సీరియస్‌గా తరచూ చర్చలు చేస్తూ వుంటుంది.

సాంఘిక అణచివేతలో దళిత సమస్య లేదా అంటరాని సమస్య మధ్యలో పుట్టిందనీ అంతకుముందునుంచే తరాలుగా అణచివేతకు గురవుతున్న స్త్రీల సమస్య అంతకుమించి ప్రాధాన్యతతో కూడుకున్నదనీ ఆమె వాదన ఆయా కులాల్లోని, స్త్రీలను అపధానంగా అణచివేస్తున్నది ఆయా కుటుంబాల్లోని తమ పురుషులేనని అంటూ వుంటుంది. దళితులుగా ముందు మీకు రాజాధికారమే రావాలంటే - ముందుగా కుటుంబ అధికారాన్ని మన ఇంట్లో అమ్మకివ్వమంటుంది.

''మీ అమ్మకేం తెలుసు చంద్రా! తను తవ్వకాలలో దొరికిన మనిషి'' అంటాడు ఆనందరావు

''మీ దళిత పురుషులేనా రాజకీయాలు, సిద్ధాంతాలు, తత్వం కాచి వడకట్టిన మేధావులు'' అంటుంది చంద్రావతి.

''నువ్వు పీడిత కులానికి చెందిన స్త్రీవి కాదా'' అంటాడు తండ్రి. పైగా ''పీడిత వర్గమే పీడిత కులం'' అంటాడాయన

''ఏం తెలివితేటలు? ఈ ఎత్తుగడతో మా స్త్రీలను కలుపుకోవద్దు మీరు. పీడిత కులానికి చెందినా నేను స్త్రీని నాన్నా - మేం వాడే చీపుర్లు, మసిగుడ్డలు, అంట్లు - రోజుకి ఒక్కసారైనా అంటుకుంటున్నారా మీ మగాళ్లు. చివరకు మీరు తిన్నాక మీ ఎంగిలి కంచం కూడా మీకు అంటరానిదే! కాదంటారా?''

''పీడిత కులాల్లో మీరు అంటే దళిత పురుషులు అణచివేతకు గురిచేస్తున్న మా స్త్రీ జాతిని తొలగిస్తే - మీరెంత శాతం నాన్నా- నలభై శాతం కూడా వుండరు'' అని తేల్చి పారేస్తుంది.

ఇదంతా గుర్తొచ్చి కూతురితో విషయం చాలా జాగ్రత్తగా మొదలుపెట్టాలనుకున్నాడు ఆనందరావు

చంద్రావతి వచ్చింది.

''ఏమిటి నాన్నా! ఇప్పుడు పిలిచావు! ఏమైనా వినాలా! లేక ఏమైనా అనాలా?''

మెరుస్తున్న ఆ కళ్లల్లో విసుగు. చిరునవ్వుతో గుంటలు పడుతున్న బుగ్గలు ప్రతిదీ తేల్చుకోవాలన్నట్లుండే ప్రవర్తన. పమిట కొంగును బొడ్లో దోపుకుంటూ వచ్చి మంచంమీద ఒకపక్కన కూర్చుంది.

''మనం ఇంతకుముందు ఏ విషయం మాట్లాడుకున్నామో గుర్తుందా చంద్రా''

''అదీ. ''

''తత్వశాస్త్రం కదండీ'' భార్య అందుకుంది

''ఈ చర్చలో నువ్వెందుకే! నిద్రపోరాదూ!''

''ఉండనీ నాన్నా! మనిద్దరికీ తప్పించి అమ్మకేం సంబంధం లేని విషయమైతే చెప్పండి నేను పంపిస్తాను'' అని నవ్వింది చంద్రావతి

''సరే! నువ్వు కూచోవే!'' అంటూ మంచంపై జరిగి కూర్చున్నాడు ఆనందరావు

''చెప్పండి నాన్నా'' అడిగింది చంద్రావతి.

''అంబేద్కర్ మీద నీ అభిప్రాయం ఏమిటి చంద్రా?''

విషయాన్ని అప్రస్తుతం నుంచి ప్రస్తుతానికి లాక్కు రావాలన్నది ఆనందరావు ప్లాను.

''ఇంతకుముందే చెప్పాను గద నాన్నా''

''కొత్త విషయాలేమైనా మీ మధ్య చర్చకు వచ్చాయేమోననీ''

''ఊ. అంబేద్కర్ ఒక స్త్రీగానే గనక పుట్టి వుంటే కుల సమస్య కంటే స్త్రీ సమస్యకే ప్రాధాన్యత ఇచ్చి వుండేవాడేమో నాన్నా! కందుకూరి, రామమోహన్‌రాయ్ వంటి వారి ప్రాధాన్యత కొంత తగ్గివుండేదేమో! అయినా అది అసంభవం కద నాన్నా! అంబేద్కర్ దళితుడే అయినా పురుషుడు కనకనే ఆ కాలంలో ఆ మాత్రమైనా చదవగలిగాడు అలా కాక నాలా ఆడదానిలా పుట్టివుంటే తన సర్వశక్తులు పొయ్యికేసి ఊది ఊది ఊపిరి తిత్తయ్యేవాడు దళిత శక్తయ్యే వాడు కాదు!'' మాటలు అయిపోగానే చంద్రావతి పెదవులు విచ్చుకున్నాయి.

''దళిత సమస్యపై స్త్రీలతో చర్చలు జరిపితే ముందుకు సాగదు కానీ కులాంతర వివాహాలపై నీ అభిప్రాయం చెప్పు! అసలీ టాపిక్ మనం మాట్లాడుకోనే లేదు'' తనకి కూతురుతో పెళ్లి విషయం కదపడానికి తగిన గేప్ దొరికిందనుకున్నాడు ఆనందరావు

''కులాంతర వివాహాలా! చేసుకోవచ్చు! ఇందులో నాకెం అభ్యంతరం అనిపించే అంశాల్లేవే!''

''అది కాదు! కులాంతర వివాహాలు జరిపించడం ద్వారా కులం అంతరించిపోయే అవకాశం ఎక్కువ అనీ అలా జరిపించాలనీ మేం ప్రణాళికలో రాసుకున్నాం అంబేద్కర్ కూడా చెప్పాడు గదా! నువ్వేమంటావు?''

కళ్లు మూతలు పడుతున్న తల్లినీ ఒక తట్టు తట్టి ''నువ్వు మాట్లాడమ్మా'' అంది చంద్రావతి.

''టీ కావాలంటే చెప్పండి. తెస్తాను. ఆ మహానుభావుడు చెప్పిన వాటిపైనేను మాట్లాడడ మేమిటే?''

''అంబేద్కర్ మనిషేనమ్మా! దేవుడు కాదు!''

విషయం పక్కకెళుతూందని భార్యని టీ తెమ్మన్నాడు ఆంనదరావు ఆమె వెళ్లాక చెప్పింది చంద్రావతి

''ఒక అమ్మాయి, ఒక అబ్బాయి అవగాహనకు వచ్చి కులాంతరం చేసుకున్నా, కులంలోనే చేసుకున్నా అభ్యంతరం లేదుగానీ, ఇలా పని గట్టుకుని యువతీ యువకులకు పెళ్లిళ్లు చెయ్యాలనుకోవడం నాకు నచ్చదు నాన్నా! కులం ప్రాముఖ్యతను అంతరింపజేయడం కోసం వైవాహిక జీవితం ప్రాముఖ్యతనూ, అందులోని సంబంధాలనూ అప్రదానం చేస్తున్నారు మీరు ఇందులో భయంకరమైన నాయకత్వం, పెద్దరికం, పెత్తందారీతనం వున్నాయి''

పెద్దరికం అన్న పదం కూతురి నోటినుంచి రాగానే జంకాడు ఆనందరావు. మళ్లీ సందర్భం

రాదేమోనని అనేశాడు దగ్గరకు జరిగి

''సరే! నీకో సంబంధం వుందమ్మా! అబ్బాయి పేరు శంకర్ నాకు మూడేళ్ళుగా తెలుసు మన ఇంటికి కూడా గతంలో నాలుగైదు సార్లు వచ్చాడు దళిత సంఘంలో కార్యవర్గసభ్యుడు. బ్యాంకిలో క్లర్కు కేస్టు బి సిలు కాపులనుకో! ఈ మధ్య బి సిల్లో చేర్చారు ఇందులో పెత్తందారీతనం ఏముందమ్మా? నిన్నింత చేసిన నాకా హక్కు లేదా చంద్రా?'' అని శంకర్ చీటీ పంపడం అంతా చెప్పాడు

చంద్రావతి నవ్వింది ఆమె కళ్లు కూడా తళుక్కున నవ్వాయి ఆస్లేషన్ వున్న ఫ్యాను అప్పుడే అటు తిరగడంతో నొసటిపైన రేగిన వెంట్రుకలు నాట్యం చేస్తూ నవ్వాయి. బిగించి బొడ్లో దోపిన పైటకొంగు ఊడి ఒక్కసారిగా ఎగిరిపడి రెపరెపలాడింది విసురుగాలికి దాన్నలా వదిలి, గుండెలనిండా గాలిపీల్చి, కొంచెం సర్దుకుని కూర్చుని అంది చంద్రావతి.

''ఖచ్చితంగా నాన్నా! మీరు ఎంత వద్దనుకున్నా పెత్తందారీ భావజాలంలోనే వున్నారు. మీకున్న హక్కు పేరుతో నా హద్దుల్లోకి ప్రవేశిస్తున్నారు మీరు.

అందరు తల్లిదండ్రులకూ మీకూ కొంత తేడా వుంది నాన్నా! మీరు వేదికలెక్కి మాట్లాడే వాళ్లు. కొంత ఎదిగిన తరహా మీ పెంపకంలో నేనూ కొంత ఎదిగాను నా భావాలు నాకుంటాయి గదా! నా జీవితం హద్దుల్లో మీరు ప్రవేశించేప్పుడు, మీ భావాల హద్దుల్లోకి నేను ప్రవేశించాల్సి వస్తుంది. మీరు ఇప్పటికిప్పుడు కులం పోవాలంటే పోదు ప్రస్తుత ఉద్యమాల ఎజెండాలో 'కులం' అంశాన్ని చేర్చడం వరకే ఈ అంశాన్ని గుర్తించిన వారి బాధ్యత''

టీ తెచ్చిన అమ్మ చేతిలోంచి కప్పును తీసుకుంటూ అంది మళ్లీ చంద్రావతి. ''అమ్మ ఇప్పటికిప్పుడు తన వంటింటి శ్రమకు జీతం కావాలంటే కుదురుతుందా? మానసికపరమైన ఘర్షణ ప్రతి కులంలోనూ తప్పదు నాన్నా!

ఓ ఓ సి కులస్తురాలైన అమ్మాయి తనకంటే తక్కువ మార్కులు తెచ్చుకుని ఉద్యోగం పొందిన ఎస్ సి కులస్తురాలిని చూసి నిరుద్యోగం మూలంగా తాను ఏ ఎస్.సి కులంలోనే పుట్టి వుండవలసిందను కోవచ్చు!

ఒక హేతువాద యువకుడు తండ్రి తనకు పెట్టిన వెంకటేశ్వర్లు అన్న దేవుని పేరు కారణంగా సంఘర్షణ పడుతూ వుండవచ్చు. అలాగే కులాంతరం చేసుకున్న వారి పిల్లల్లో తనలో ఏ కులం తాలూకు స్వచ్ఛమైన రక్తమూ లేదన్న ఆవేదన వుండవచ్చు! అదంతా వాళ్ల చైతన్యాన్ని బట్టి వుంటుంది''

ఆశ్చర్యపోయాడు ఆనందరావు ''అలా కూడా వుంటుందా?''

''ఎందుకు లేదూ! మా ఫ్రెండ్ వసంత అనుందొకమ్మాయి. తన తల్లిదండ్రులది కులాంతరం దీనికి తగిన చైతన్యం లేదు. ఇతరులకు అగ్రకులమైన తండ్రి కులమే చెప్పినా - తనను అంతరాల్లో ఆ ఏదో ఒక కులం కాదన్న భావన పీడిస్తూనే వుంటుందని చెప్పింది''

''అయితే శంకర్‌ని చేసుకోనంటావా?''

''అదుగో! ఆ ప్రశ్నకే కొన్ని హద్దులున్నాయి. నా సమాధానానికి ముందే నన్ను సరెండర్ చేసుకుంటున్నారు''

''ఇక్కడ సరెండర్ ఏముందమ్మా! ఇష్టం లేదని చెప్పు! బలవంతం ఏముంది?''

''అసలు పెళ్లి చేసుకోవాలా! వద్దా! ఎవర్ని చేసుకోవాలి? ఎవరిని కాదు? ఏ కులంలో చేసుకోవాలి? ఇవన్నీ నా పర్సనల్ కొశ్చన్స్!'' ఎడమ రొమ్మును కుడిచేతి చూపుడు వేలితో గుచ్చుకుంటూ అంది

చంద్రావతి

''అసలు పెళ్ళి చేసుకోవా ఏమిటి?'' ఒక్కసారిగా ముఖం అంతా ఆశ్చర్యంగా నింపుకుని ప్రశ్నించాడు ఆనందరావు

నవ్వుతూ ''ఇదీ నా పర్సనల్'' అంది

''ప్రేమించి పెళ్లి చేసుకుంటావా?''

ఓరగా చూస్తూ అంది ''ఇదీ నా పర్సనల్ కాకపోదు''

''పోనీ! ఎవర్నయినా ప్రేమించావా?''

చంద్రావతి నిండుగా నవ్వింది ''ఇది నాన్నా! నా పరిధిలోకి రాని ప్రశ్న!''

''ఎలా రాలేదు?'' నొసలు మడిచేసుకున్నాడు ఆనందరావు

''తండ్రి ఎలాంటి ఉద్రేక స్వభావమూ లేకుండా, ఎవర్నయినా ప్రేమించావా అని తన బిడ్డను అడిగితే - అంటే మీరు అడిగిన అన్ని ప్రశ్నల్లోకి ఒక రకంగా ఇది మల్టిపుల్ ఛాయిస్ కొశ్చన్ నాన్నా! ఇప్పుడు నా హక్కులు కాపాడుకుంటూ నేను మాట్లాడవచ్చు''

కూతురుకు దగ్గరగా జరిగి, నవ్వుతూ అడిగాడు ఆనందరావు

''ప్రేమలో పడ్డావా చంద్రా?''

''లేదు నాన్నా''

''అయితే శంకర్‌ని చేసుకోవచ్చు గదమ్మా మంచి ..''

''మళ్లీ దురాక్రమణ చేస్తున్నారా నాన్నా!''

''నీ ప్రేమ దుర్వినియోగం కాదనే అంటావా?''

''నా అంచనా మీద నాకు నమ్మకముంది పైగా దుర్వినియోగమే అయితే నా కొచ్చే ఇబ్బందుల్ని నేను ఎదుర్కొంటాను''

ఆనందరావుకు ఎక్కడో అనుమానంగానే వుంది. అందుకే మళ్లీ అన్నాడు

''విషయం తేల్చమ్మా! ప్రేమలో పడ్డావు కదూ''

''లేదు నాన్నా! నేను ప్రేమలో పడటం అంటూ జరిగితే నా చర్యలు మీకు ఇన్‌డైరెక్టుగా నైనా తెలిపే ప్రయత్నం చేస్తాను కానీ, ఆ విషయం దాచి మిమ్మల్ని ఒక్కసారిగా ఆశ్చర్యానికి మాత్రం గురిచేయను''

''మరి ఇంత రాద్ధాంతం ఎందుకమ్మా?''

''మరింకెప్పుడూ నా పరిధిలోకి రాకుండా వుండేందుకే! నా వ్యక్తిగత విషయాల్లో ఇతరుల ప్రమేయం నేనంగీకరించలేను నాన్నా!''

''మరి . శంకర్ . చంద్రా.... నా పరిస్థితి. '' ఆనందరావు ఏదో అనబోయాడు.

''నే వెళుతున్నా నాన్నా!'' వెళ్లిపోయింది చంద్రావతి.

ఆశ్చర్యంగా చూస్తున్న భార్య కళ్లలోకి బేలగా చూశాయి ఆనందరావు కళ్లు.

(ఆంధ్రజ్యోతి వారపత్రిక
దీపావళి ప్రత్యేక సంచిక, 1994)



# రుధిర మథనం

డా. జి. భాను

పశ్చిమాకాశం పగపట్టినట్లు మండిపడుతున్నది!

చిరిగిన రవికతో, చిందరవందరైన జుట్టుతో, చెదిరిన కుంకమ బొట్టుతో, ఎగసిపడుతున్న రొమ్ములతో, ఎర్రని కళ్ళతో, అదురుతున్న పెదాలతో, బెదరిన లేడిలా వచ్చి భర్త ఎదుట పడింది అరుంధతి!

చెప్పులకు పోగలపడుతున్న పోలయ్య ఒక్క క్షణం ఆగిపోయాడు! శివం పట్టిన పోలేరమ్మలాగా ఎట్ట యెదుట అర్ధాంగి భీతావహమైన రూపం విభ్రాంతిని కల్గించింది! చేతిలోని పనిముట్టు జారిపోయింది!

'ఏందే?_యాఫైందే!' అన్న ప్రశ్న నోట్లో వుండగానే, అరుంధతి గొంతులోని మాటలు విరుచుకొని పడ్డాయి

'రెణ్ణాళ్లలో సెప్పులిత్తం దొరగోరు' అని సెప్పిరమ్మన్నావా? 'నెనెల్లనంటే', 'ఎళ్లి సెప్పవే పిచ్చిదానా' అని బలవంతంగా పంపావా? సరేనని అట్టాగె ఎల్తే, మనుసులో అనుకున్నదంతా అయ్యింది! ఆడు మడిసా? పసరమా? ఆడికి కూతుర్లేరా? అప్పచెల్లెళ్లు లేరా? కనబడ్డ ఆడదానిపైన సెయ్యెయ్యటమేనా ఆడి పని? ఆడి డబ్బేంజేసు; ఆడి డాబేంజేసు, ఆడి గొప్పేం జేసు; ఆడి కులమేంజేసు . నా వొంటిపైన సెయ్యేత్తాడా గుడిసేటి నా గుడ్డ!'

''మరియాదాగా సెప్పి, మప్పితంగా తిరిగొత్తంటే, 'వొసే! ఆగేకాసేపు' అన్నాడు. 'ఎందుకండి దొరగోరు' అన్నా. 'పోలిగోడి ఆలి... అబ్బో... ఇంత మజాగ వుంటదనుకోలేదే ఈ మధ్యలో నీలాంటిదాన్ని సూడనేలేదే. . సక్కని సుక్కలాగా, తుమ్మెద రెక్కలాగున్నావే పిల్లా... భలే కమ్మగుండావే . నువ్వొప్పుకుంటే, 'వూ' అంటే, పువ్వుల్లో అదే... మల్లిపూవుల్లో బెట్టి పూజిత్తా... యేంగావాలంటే . అదిత్తా. నువ్వు నా గుండిలో గుడికడితే, నీకు మేడ గట్టిత్తా... రా .' అన్నాడు.

'అప్పుడా దొరను సూత్తే మా చీదర యేసింది వొళ్లంతా కంపరమెత్తింది కళ్లు మూసుకుపోయి, కావరంగా మాట్లాడతుంటే, దిక్కు తోచక రాయిలాగా నుల్చుండిపోయా యామనుకొన్నాడోగాని బుజాలపైన సేతులేసి, గుండెపైన గూడా సెయ్యయబోయాడు నా వొంటి మీద తేళ్లు, జెర్రులు పాకినట్టయ్యింది. దొరని గభాల్న నిట్టేశా

''ఆడి సేతిలో రైక సిరిగిపోయింది. దూరంగా యెల్లకిలబడ్డాడు. నేను పంచాదిలో నుంచి వొత్తా. యెక్కడా నక్కడానికి సోటు కనబడలా బయట తలుపు దగ్గిర, గోడకానజేసిన మోటార్ సైకిలు పక్క దాక్కున్నా సెమటలో ముద్దయిపోయా గుండెలు గుబగుబలాడతన్నాయి 'దేవుడా! సామీ!

నన్ను రచ్చించు' అని మనసులో అనుకున్నా

కుంటుకుంటూ వొచ్చాడు దొర సచ్చినోడు పూనకం పట్టినోడిలాగా వచ్చాడు పారిపోయిం దనుకొని, పళ్లు పటపట కొరికాడు.

'పారిపోయింది తప్పించుకొని పోరంబోకు లంజ. నన్నే నెట్టిపారేస్తదా! కూటికి గదిలేని కుంకముండ - నా కోసం యెందరో కాసుక్కూకుంటే, కాతరు సెయ్యకుండా పొద్దా, పెద్ద పత్తిత్తులాగా, చూత్తా ఎవడడ్డం వొత్తాడో చూత్తా నా దమ్ము సూపిత్తా. ఈ కామయ్య తడాఖా ఏంటో రొండు రోజుల్లో చూపిత్తా' అని నానా బండ బూతులు తిట్టి, లోనకెళ్లిపోయినాక, ఆడనుంచి సేలల్లో గుండా లగెత్తుకొచ్చి, నీ యెదుటబడ్డా మావా!'' అని బావురుమంది అరుంధతి, పోలయ్య కాళ్లమీద పడి.

పొంగిపోయింది పోలయ్య ఒళ్లు ఆవేశంతో. శివతాండవం చేసింది ఉడుకెత్తిన నెత్తురు. కళ్లలోని ఎర్రదనం, క్షణంలో కుత్తుకలు ఉత్తరించగల పని కత్తిపై ప్రసరించింది! కత్తి వాదరపై కామయ్య బలిసిన కంధరం దర్శనమిస్తున్నది! అగ్నిపర్వతంలా నిలబడ్డాడు పోలయ్య.

శిరసెత్తి చూసిన అరుంధతికి భర్త కళ్లు కనబడ్డాయి. ఆ కళ్ళలో అధరితమై సంచలించేకర్కొటకుని మహోగ్ర క్రోధ తీక్ష్ణత!

అరుంధతి చప్పున భర్త పాదాలు తన చేతులలో కట్టేసింది!

''వొద్దు మావా.. వొద్దు... పెద్దోళ్లతో పగ మనకొద్దు. అన్నేయం అళ్ళే జేసినా, యెదిరిత్తే మనకే చేటు. ఎన్నాళ్ళులో నేయం బట్టకట్టిందో సెప్పు .. సెరువుకట్ట తెగినప్పుడు, **పొగురుగిత్త** యెదట బడ్డప్పుడు ఏం జేత్తనాం... పారిపోతన్నాంగా... యిప్పుడు అంతే మావా... మన పరువు కోసం, కడుపు కోసం తియ్యని బతుక్కోసం యెట్టాగో బతకాలి గాని, పేదోడు వేడి చూపితే, అన్నేయం అయిపోటం అందరూ సూట్టంలా... ఎవురొత్తారు మన సాయానికి? అందుకే ఆ వూరినుంచి పోదాం ఈ గాలి నుంచి దూరంగా పారిపోదాం .. ఈ బెడదనుంచి తప్పించుకొందాం... మొన్నోగా పాన్నూరోళ్లు నిన్ను వరిసేల మీద కాపలా రమ్మంది .. అప్పుడొద్దనుకున్నాం.... ఇప్పుడు ఆడకే యెల్లిపోదాం మనూరి యెల్లదాటి! తెల్లారేసరికి ఆ వూర్లో వాలుదాం. . నా మాటిను... కూకో మావా .'' అన్నది అరుంధతి కూలబడ్డాడు పోలయ్య. అతని కాళ్లపై తల ఆనించింది.



పొలాల మధ్య ఉన్న మెట్టలో గుడిసె వేసుకున్నారు. ముప్పయి ఎకరాలకు కాపలా కాస్తున్నారు. కనుచూపు మేర పచ్చని వరి పొలాలు, ప్రక్కనే స్వచ్ఛంగా పారుతున్న కాలువ, పొలాల మధ్యలో పాపటలాగా ఉన్న రోడ్డు, దానిపై నిరంతరం అటూ ఇటూ పోతున్న లారీలు, బస్సులు, సైకిళ్లు, మనుష్యులు - అదీ అక్కడ పరిసరాల విశేషం.

కొత్తలో స్వజనానికి, స్వగ్రామానికీ దూరంగా వున్నామనే చేదు ఆలోచన ముల్లులా బాధించినా, క్రమంగా ఆ ఏకాంత వాసానికి అలవాటు పడిపోయారు అక్కడ ప్రకృతిలో లీనమై, మృతగతాన్ని మనస్సుల్లో పాతిపెట్టి, కమ్మని వర్తమానంలో నిమ్మకు నీరెత్తినట్లు బతుకుతున్నారు అరుంధతీ పోలయ్యలు

అయినా, చీకటి రాత్రుల్లలో నక్కలు ఊళలు వేస్తుంటే, పొలాల గట్లపైన ఎట్లమీద పేరు తెలియని ఏవో పిట్టలు పిచ్చిగా అరుస్తోంటే, చల్లగాలి రివ్వురివ్వున వీస్తుంటే, ఒకనాటి ఘోరమైన సంఘటన తన్ను వెంటాడినట్లు భ్రమతో, కలతపడి, కలగుండుపడి అరుంధతి భర్తను గట్టిగా వాటేసుకొనేది.

అప్రయత్నంగా కోర్కెలు చిగురించగా ఇంకా దగ్గరకు పొదుపుకొని, ఒళ్లంతా నిమిరి, బుజ్జగించి కోర్కె విచ్చిన పూలకొమ్మగా మార్చేవాడు పోలయ్య!

పోనుపోను వాళ్లకు పొలాలలోనే గాక, తమలా కాపలా కాసే అక్కడ మనుష్యులతో సన్నిహిత సంబంధం ముదిరింది అంతేనా? గట్లపై తిరిగే ఎండ్రకాయలు, నీళ్లలో చెలాకీగా ఈదే మట్టగిడిసలు, పిత్తపరిగలు, బొంబడాయిలు; చుట్టంలాగా వచ్చి ఒంటికాలితో జపంచేసే కొంగ సన్యాసులు, 'పెద్దమనుషుల్లాంటి' నీళ్లపాములు వాళ్లకు మాలిమి అయ్యాయి.

మనుషులతో ఎంత రాసుకుని, పూసుకుని తిరిగినా కనబడని ఆర్ద్రత, ఆప్యాయత, ఆత్మీయత ఆ పొలం గట్లపై కనబడుతుంటే అర్థం కాక, అన్వయం చేసుకోలేక ఆ అవాయకులు అప్రతిభులయ్యేవాళ్లు!

అందుకే వాళ్లకు ఆ పొలాలు దైవం, కర్తవ్యం పూజ!

రోడ్డుమీద వస్తూపోతూ ఉన్న వాహనాల్ని చూడ్డం వినోదం!

ఒక్కోసారి, ఒక్కో లారీ మరీ వేగంగా వెళ్తుంటే, ఇంకో లారీ సోమరిగా వెళ్తుంది ఓ మోటరు సైకిల్ జుయ్యిమని అమిత వేగంగా దూసుకొని పోతుంటే, ఇంకోటి తాపీగా సాగుతుంది ఒక బస్సు చెయ్యెత్తితే ఆగి ప్రయాణీకున్ని ఎక్కించుకుంటుంది. ఇంకో బస్సు ఛస్తే ఆగదు! మనిషి ప్రవృత్తిని బట్టే బండ్లు సాగుతాయి కాబోలు!

ఒకరోజు రోడ్డువైపు చూస్తుండగా ఓ మోటారు సైకిల్ మహావేగంగా వస్తున్న దృశ్యం కంటబడింది. రెండోవైపునుండి ఓ లారీ ఆఘమేఘాలమీద దూకుతున్నది. ఆ రెండూ అటూ, ఇటూ పందేలమీద వస్తున్నట్లు అనిపిస్తున్నవి. ఉత్సుకతగా, ఉత్సాహంగా చూస్తున్నారు భార్యాభర్తలు. లారీ దగ్గరకు మోటర్ సైకిల్ వచ్చేసిందా? మోటార్ సైకిల్ దగ్గరకే లారీ వచ్చిందా? ఎవరూ తప్పుకోరేం? మోటారు సైకిల్ లారీ ముందు భాగానికి తగిలింది! ఛట్‌ఫట్ శబ్దం! మోటార్ సైకిల్ ఎగిరీ పడింది! దానిపై ఉన్న తెల్లబట్టల మనిషి జారిపోయి బిళ్లబీటుగా పడిపోయాడు.... హాహాకారాలు... అరుపులు... ఆక్రందనలు!

లారీ ఒక్కక్షణం ఆగి, మరుక్షణంలో రయ్యిమని వెళ్లిపోయింది దుమ్ములేపుకుంటూ. లేచి నుంచొని ఆ దృశ్యాన్ని ఆసక్తిగా గమనిస్తున్న అరుంధతీ పోలయ్యలు అప్రయత్నంగా ప్రమాదం జరిగిన చోటికి పరుగెత్తారు. అన్నివైపులనుండి కాపలా మనుషులు, మిగతా జనం వచ్చి గుమికూడారు.

తలకు, వంటికి గాయాలు తగిలి, కాళ్ల పెచ్చులు ఊడిపోయి, నెత్తురు మడుగులో ఉన్న ఆ మనిషిని చూడగానే, బాధతో మెలి తిరిగి పోతున్న అతని అవస్థ చూడగానే చూస్తున్న వారి మనస్సులు విలవిలలాడాయి.

అరుంధతి గుండెమీద చేతులు వేసుకొన్నది.

అప్పుడు ఏం చేయాలో? ఎట్ల చేయాలో? అర్థంకాక అక్కడ చేరిన జనం ఒకరి మొఖాలొకరు చూసుకున్నారు

కుక్కో, పిల్లో, గాడిదో, దిక్కుమాలినవాడో అయితే గప్‌చుప్‌గా వుండొచ్చు. కానీ ఖరీదైన మనిషైపోయే! రోడ్డుపక్క, దిక్కుమొక్కు లేక రక్తపు ముద్దలాగ దొర్లాడుతుంటే కిమ్మనకుండా ఊరుకోవడం అమానుషం గదా! వాళ్ల మనస్సులే వాళ్లని అదిలించాయి.

డబ్బు జబ్బుంటే గుండెలోని సానుభూతి జల అడుగంటిపోతుంది!

ఆ జబ్బులేని వాళ్లం గదా, కనీసం కనికరమైన చూపుదాం - అని అనుకొన్నారు లోలోపల

టౌనువైపు వెళ్లే లారీ వస్తున్నది అందరూ అడ్డం తగిలి దణ్ణాలు పెడితే డ్రైవరు ఆపాడు జరిగిన దారుణం చూశాడు వాళ్లవైపు ప్రశ్నార్ధకంగా చూశాడు వాళ్లు ఓట్లేసే జనమే కాని మాట్లాడే జనం కాదు పాపం!

అరుంధతే చేతులు జోడించి మాట్లాడింది. ''ఈ మోటారు సైకిల్ బాబును ఓ లారీవోడు గుద్దేసి పోయాడన్నా మాకైతే ఈయనెవరో తెలవదు ఇంకా పేణాలతో వున్నాడు అలిస్సెం అయితే పెమాదం రగతం పోతావుంది. అన్నా! దయచేసి ఈ బాబును పట్నంలో దర్మాసుపత్రికాడ దింపితే, భూమ్మీద నూకలుంటే బతుకుతాడు లేకుంటే మనం చేసేదేమీ లేదు మనకాడ డబ్బుల్లేకపోయినా, జాలి, కనికరమయినా సూపిద్దాం ఎవురు మెచ్చకపోయినా ఆ దేముడయినా మెచ్చడా?''

ఆ మాటలు నచ్చాయి డ్రైవరుకు

క్లీనర్ - శుక్రుడు అడ్డుపడ్డాడు

''. యిది యాక్సిడెంటు గురో! పోలీసోల్లకి దెలిస్తే, మన మక్కెలిరగదన్ని, బొక్కలోనికి తోస్తారు గురో . ఈ ఆడదాని మాటింటే ఇంతే సంగతులు గురో బండి లాగించేయి గురో . '' అని నసబెడుతున్నాడు.

''ఛత్ నోరు మూసుకోరా ఫుండాకోర్ యెదవ సన్నాసి . మంచి పని జేసినందుకు బొక్కలోనికి తోస్తే తొయ్యనియ్యరా . ఈ అమ్మ అన్నట్టు భగవంతుడు లేడా? ఆడు సూడ్డా మంచీ సెడూ... నువ్వు కిందికి దిగి ఎనకడోరు తెరవరా ముందు. '' అన్నాడు డ్రైవరు.

క్లీనరు చెంగున దిగి వెనకడోరు దించాడు.

''రేయ్ మీరు ఆ దెబ్బతిన్న శాల్తీని ఎత్తండ్రా.. ఆగండ్రా . ఆడి కండవాతో తలకి గట్టిగా చుట్టండి . రక్తం కారకుండా. . చుట్టారా? రైటో . ఆ తీసుకొచ్చి బాడీలో పెట్టి, ఇద్దరు మనుషులు ఎక్కడి' అన్నాడు డ్రైవరు.

అరుంధతీ పోలయ్య ఎక్కారు

''సూరన్నా . తొందరగా వచ్చేత్తాం గుడిసెవైపు సూత్తావుండు'' అన్నది అరుంధతి. సూరయ్య తలూపాడు

లారీ స్పీడందుకుంది. బాడీలో తల దగ్గర పోలయ్య, కాళ్ల దగ్గర అరుంధతి ఒకరి మొఖాలొకరు చూసుకుంటూ కూర్చున్నారు

ఒక గంట తర్వాత గవర్నమెంటు హాస్పిటల్ దగ్గర లారీ ఆగింది. క్లీనరు సాయంతో దెబ్బలు తగిలిన మనిషిని లోపలికి తీసుకొని వెళ్లారు

విషమ పరిస్థితిని గమనించి, ఆ మనిషి వైఖరి చూసి వెంటనే ఎమర్జన్సీ వార్డులో చేర్చుకొన్నారు లోపలే అడవి తంగేడు చెట్టు కింద ఉన్న సిమెంటు బెంచిమీద అరుంధతీ పోలయ్యలు భయం భయంగా కూర్చున్నారు. ఆ మనిషి బ్రతుకుతాడా? తమకేదైనా జరుగుతుందా? డ్యాక్టర్లు ఏమంటారో? దేవుడా, ఏం చెయ్యాలి? ఇటువంటి ఆలోచనలు వాళ్లని రంపంలా కోస్తున్నవి

కొద్ది నిముషాల్లో ఎమర్జన్సీ వార్డులోనుండి వాళ్లు కూర్చున్న చోటుకి ఒక డ్యాక్టరు వచ్చాడు. ఇద్దరూ గబుక్కున లేచి నుంచున్నారు.

''ఆ యాక్సిడెంటయిన మనిషి వెంట వచ్చింది మీరేనా?''

''అవును బాబు''

''ఇప్పుడో ప్రమాదం వచ్చిందే! ఇంతకీ అతనికి మీరేమౌతారు''

''యేమీ కాము బాబు  పెమాదం జరిగినప్పుడు చూశాం  గుద్దిన లారీవోడు ఆగకుండా పోయాడు.  అక్కడేమో ఎవరూ లేరు. .  ఓ లారీ బాబుని బతిమిలాడి తీసుకొచ్చాం'' అన్నాడు గాభరాగా పోలయ్య

''గుడ్ .. మంచి పని చేశారు. అతని జేబులోని పుస్తకంలో అడ్రసుంది. సరే.  అది ముఖ్యం కాదు అతని రక్తం చాలా పోయింది మా దగ్గర బ్లడ్ బేంక్ .  అదే మా దగ్గరున్న రక్తం అతని గ్రూపు రక్తంలో సరిపోయేది ఏదీ లేదు. ఇప్పుడు ఎవరైనా ఆ రక్తం ఇవ్వాలి. అప్పుడే బతుకుతాడు. ఇప్పుడేం చేయాలి? టైం లేదు'' సాలోచనగా అంటున్నాడు డాక్టర్.

''డాట్రు బాబు! నా రగతం తీసుకోండి నా రగతం సరిపోతే ఆ బాబుగారు బతుకుతాడుగా ..'' పోలయ్య అన్నాడు.

''నీ రక్తమా? నువ్వు బలహీనంగా వున్నావయ్యా..  నీ రక్తం వద్దులే..  ఇంకెవరిదైనా చూద్దాం''

''నా వొంట్లో రగతం సరిపోద్దేమో సూడండి బాబుగారు. పాపం పెద్దింటి మడిసి. . బతికితే మా బోటోల్లని ఆదుకుంటాడు ..  కూడెడతాడు. బతికిత్తాడు. నా రగతం సరిపోద్ది బాబు, నా మాటిని సూడండి'' ఆత్మవిశ్వాసంతో ధైర్యంగా అంటే ఆ డాక్టరు ఆమెని పరికించి చూశాడు

మిసమిసలాడుతున్న చామనఛాయ దేహంతో ఆరోగ్య తారుణ్యాల సమ్మిశ్రితంతో ఉన్న అరుంధతి, విరిగిన కెరటంపై చంద్రకిరణం ప్రతిఫలించినప్పుడు తళుక్కుమన్న కాంతిలా కన్పించింది!

మాతంగి జాతిలో ప్రభవించినా మమతామృతంతో స్విన్నమైన ఆమె అంతరంగం మదర్ థెరీసా అంశంలో భాగంగా అన్పించింది!

పొందికైన అవయవాలతో నేత్రపర్వం చేస్తున్న మనోహరమైన రూపం, నలబయ్యో నెంబరు ముతకకోక పొరల్లో ఆచ్ఛాదింపబడిన చందనవృక్షంలా ఆ డాక్టరు కళ్లకు కనబడింది!

''ఓ.... నీ రక్తం చూద్దాం'' సంభ్రమంగా అన్నాడు లోపలికెళ్లాడు.

అరుంధతి రక్తం అతని గ్రూపు రక్తంతో సరిపోయింది! ఆమె రక్తం అతనికి ఎక్కించారు. కొద్ది గంటల్లో అతనికి స్పృహ వచ్చింది. ఈ పని నిర్వహించని డాక్టర్లకు అవధిలేని ఆనందం కలిగింది చాలా అరుదుగా విజయవంతం అయ్యే కేసు అది!

నీరసంగా వున్నా సంతృప్తి బరువుతో ఉత్సాహంగా కనబడింది అరుంధతి. డాక్టరు సలహాను తీసుకొని భార్యాభర్తలు సాయంకాలానికి గూటికి చేరారు

కొన్ని వారాలు గడిచాయి. సుంకుపట్టిన వరి పొలాలు గుండెలకు పండుగ చేస్తున్నాయి.

ఓ రోజు పొద్దున  ''మావా .. ఇందాక మాపు దగ్గరికి యెల్లాను రోజూ యేసే పిత్తపరిగల్ని తినే నీళ్లకొయ్య పైకి రాబోయింది పుల్లతో అదిలించేతలికి నీళ్లలో మునిగిపోయిందనుకో. . కానీ, మడుసులకు మల్లే ఈటికీ యిశ్వాసం లేదు మావా. . ఛీ..  యెదవ లోకం .. యెదవ జలమ'' అన్నది అరుంధతి.

అరుంధతి ముఖంలోకి చూశాడు పోలయ్య.

''ఓ మాట జెప్పనా.  మరే . ఆనాడు లారీ కింద పడ్డోడు... కామయ్యగోడిలాగే వుండాడు. ఆడి మొకం, వొళ్లు, జుట్టూ అట్టాగే వుండాయి రగతంలో నిండిపోయి సరిగా అనలేదు గాని

కామయ్యేనని అనుకున్నా మనసులో నువ్వు సూడలేదు. నేను సెప్పలేదు రగతం కూడా ఆడికిచ్చావ్ నువ్వు. దురమార్గుడికి మేలుజేత్తే ఆడుగూడా పాములాగే కరవొస్తాడు గంద ఈ లోకమే అంత!''

''ఆడూ.. కామయ్యయితే యేంది. కలకటేరైతే మటుకేంది? పెమాదంలో వుండాడు రగతం పోయింది. ఆసుపత్రిలో రగతం లేకపోయె . పేణం పోయేటట్టుంది. . అందుకనేగా రగతం యిచ్చింది.. నిజంగా ఆడు కామందే అయితే నన్నటా జేసినందుకు దేముడు దెబ్బకొట్టాడనే అనుకొంటాడు.. ఇంక మన జోలికే రాడు '' అరుంధతి అన్నది

''నీతో మాట్టాడం నాకెప్పుడైనా సేతనయ్యిందా?'' అని లేచి పోయాడు పోలయ్య. అతని వెన్నంటి వెళ్లింది భార్య నవ్వుతూ

సాయంత్రపు నీరెండ వెన్నెలలా వుంది! అప్పుడే చలి శాఖ చూపిస్తున్నది పైరు నిండు చూలాలిలా కదులుతున్నది. అప్పుడు రోడ్డుమీద బస్సు దిగి, తమ గుడిసె వైపుగా ఐదారుగురు మనుష్యులు రావడం పోలయ్య గమనించాడు. వాళ్లు కాపలా పొలాల కామందులు మాత్రం కారు. దూరానికి కొత్తవాళ్లుగా అనినా వాళ్ల దగ్గరయ్యే కొద్దీ పరిచయమైన వ్యక్తులుగా అనిపిస్తున్నారు. ఒకరిద్దరు చేతుల్లో కర్రలున్నట్టున్నవి.

వాళ్లలో ముందు నడుస్తున్నది కామయ్య! హుందాగా నడుస్తున్నాడు!

పోలయ్య అంతరంగం పేలాల మంగలం అయ్యింది!

చేతిలోని బాణాకర్రకు ప్రాణం వచ్చింది!

గుడిసెలో నుండి బయటకు వచ్చి చూసిన అరుంధతి కన్నులు క్రోధఘూర్ణితాలయ్యాయి!

ఆనాటి పరాభవం పునరావృత్తమౌతుందా? దుర్నీతికి, దురాగతానికి పట్టపగ్గాలుండవా?

మట్టి మనుష్యుల ఆర్తికి పరిసమాప్తి లేదా?

రకరకాల మాటల ఆలోచనలతో సజీవ ప్రతిమల్లా నిల్చున్నారు.

వస్తున్న వాళ్లలో కొందరు అల్లంత దూరంలో ఆగిపోయారు కామయ్య ముందు నడుస్తుంటే, వెనక ఇంకొకరు అనుసరిస్తున్నారు

''మునుపటి కామయ్యేనా వస్తున్నది?'' అనుకొన్నది అరుంధతి.

కామయ్య కొంచెం దగ్గరగా వచ్చాడు. వెనుక మనిషి కామయ్య నీడలా వస్తున్నాడు. కామయ్య ఆ ఇద్దరికీ ఇంకా దగ్గరగా వచ్చాడు

వచ్చిన కాయమ్య ఆ ఇద్దర్నీ మార్చి మార్చి చూశాడు! ఆ ఇద్దరి కన్నుల్లోకి చూశాడు 'పో-ల-య్యా, ఇక్కడా వుంటన్నది?'' అన్నాడు

'పోలిగా, ఇక్కడ ఉంటున్నావ్రా?' అని దురుసుగా, దుందుడుకుగా అనవలసిన వాక్యానికి బదులుగా ఇంకో వాక్యం మర్యాదగా, మార్దవంగా కామయ్య నోట్లోనుండి వెలువడింది! కుంగవలసిన భూమి కదలకుండానే ఉందే!

''అవును సోమి .. మనూరు వదిలేసి, ఈడ తల దాసుకుని బతుకున్నాం తవరి సూపుల్లో పడ్డాం'' రోషం పడగ విప్పింది!

''ఆ నా సూపుల్లో పడకుండా ఏడకు బోతర్రా మీరు? మిమ్మల్ని సూడాలనేగా పని గట్టుకొని

నేవొచ్చింది!'' అని నవ్వాడు కామయ్య.

'' .. సూసి. యేం జేత్తారో సెయ్యండి యిప్పుడు నా మీద నుంచి రండి'' బాణాకర్రను ఓ మూలగా పెట్టి నుంచున్నాడు పోలయ్య ముక్కు పుటాలు పెద్దవయ్యాయి

నవ్విన కామయ్య హఠాత్తుగా మారిపోయాడు!

''వూ.. తప్పుకోరా మరియాదగా నీ పెళ్లానికి ఇంతసేపు అడ్డం నుంచున్నావేంట్రా, మమ్మల్ని సూడనియ్యకుండా. ఇంతోటి పెళ్లాం నీకు తప్పితే మరెవడికీ లేదురా అమ్మోరికి అడ్డం తప్పుకోరా ఎర్రిపీనుగా ..'' కర్కశంగా అన్నప్పటికీ గొంతు గాద్గదికం అయ్యింది కామయ్యకి

''సరే తప్పుకున్నా కామయ్యా! నా పేణం పోయినా పర్వాలేదు. నీకు పేణంమీన ఆసుంటే దీనొంటిమీద సెయ్యేయి సూద్దాం'' అని కర్ర అడ్డంపెట్టి అరుంధతి పక్కన నుంచున్నాడు పోలయ్య. కళ్లు మూసుకుని చుక్కలా వణుకుతున్నది అరుంధతి!

''అమ్మా! తల్లీ! అరుంధతీ! నీ రక్తం ఇచ్చి, నా వంశాన్ని నిలబెట్టిన దేవతవమ్మా .. లేకుంటే నా కొడుకు... ఈ కొండలరావు .. అప్పుడే సచ్చిపొయ్యేవాడంట. .. ఈడే నీ రక్తంతో పేణం పోసుకున్న నా వంశాంకురం.. నీకు నేను కళ్ళు మూసుకుపోయి అపచారం సేయబోయాను. నువ్వు నీ రక్తమిచ్చి నా కళ్ళు తెరిపించావు... నీ రుణం ఈ జన్మలో తీర్చుకోలేనమ్మా!'' అని చేతులెత్తి నమస్కారం చేశాడు కామయ్య. అతనిలాగే ఉన్న కొండలరావు తలవంచి నమస్కారం చేశాడు తడి కన్నులతో. అప్పుడు చూశాడు అతణ్ణి అరుంధతీ పోలయ్యలు ఆశ్చర్యంగా.

కామయ్య కళ్లు తుడుచుకొని ముందుకు సాగబోతూ ఒక మాట అన్నాడు! ''అరుగో కరణం, మునసబు, మనవూరి పెద్దలు... మీమీద ఈగ వాలదు... మనూరు వచ్చేయండి'' అతని కంఠంలో ఆత్మీయత, ఆప్యాయత ధ్వనించింది!

అరుంధతీ పోలయ్యలు పరస్పరం కన్నుల్లోకి చూసుకొన్నారు!

పశ్చిమాకాశం ఎర్రగా నవ్వింది!

(అముద్రితం, రచనాకాలం - నవంబర్ 93)



# అంకురార్పణ

## పాలెపు బుచ్చిరాజు

నవనాగరికతలోకి ఇంకా తొంగి చూడని ఓ పల్లెటూరు గునుపూడి. ఆ వూళ్లో ఓ పాడుబడిన రామాలయం వుంది ఏనాడో ధర్మం నాలుగు పాదాల నడిచే రోజుల్లో పూర్వీకులు కట్టించారు దాన్ని చాలాకాలంగా పూజా పునస్కారాలు లేక బూజు పట్టిన సీతారామలక్ష్మణుల విగ్రహాల్లూ, ఓ చెయ్యి విరిగి, తోక నలిగినా, గద పగిలినా, వదల్లేక ధ్యానముద్రతో అలాగే కూర్చున్న హనుమాన్లూ, సిలుంపట్టి నూనె బారిపోయిన 'భజన చెట్టూ' ఓనాటి ఆ ఆలయ ప్రతిష్టను చాటుతుంటాయి ఇప్పుడు వీటన్నింటినీ తూర్పువైపు కొట్టుగదిలోకి నెట్టేసి ఎక్కడికి పోకుండా గట్టిగా తాళంతో బంధించేశారు ఆ వూరివాళ్లు. అనాదిగా వస్తున్న ఆలయ ధర్మకర్తల వారసుడు రంగనాథం గారికి దాని వూసే లేదు

ఒకప్పుడు పండగొచ్చినా, పబ్బమొచ్చినా, భజన బృందాలతోటీ, తప్పెట్లూ, తాళాలతోటీ కళకళలాడే ఆలయ మండపం ఈనాడు అవినీతీ, అధర్మం, అరాచకాలకీ ఆలవాలమైంది ఆవరణ నిండా కాల్చిపారేసిన చుట్టపీకలూ, చీట్లపేక బృందాలు, చీకటి తప్పులు ఈ విషయం చెప్పకనే చెపుతుంటాయి



ఓనాడు

రోజూలాగే సాయంత్రం రామాలయ మండపంలో రమ్మీ రంజుగా సాగుతోంది. ఇంతలో డప్పు వాయించుకుంటూ నారిగాడు, వెనకాలే బాణాకర్ర భుజాన్నేసుకుని పాండవులుగాడు వచ్చారు వీధి మధ్యలో నిలబడి పాండవులు దండోరా విషయం ఇలా చెప్పాడు ''గునుపూడి పెజలు యావన్మందికీ చెప్పేదేమనగా, రేపు గవర్నమెంటువారు సర్కారు లోనులు వసూలు చేయడానికి వస్తున్నారు కనక ఎవరు కట్టవలసిన సొమ్ములు వారు కట్టవలసింది కట్టనివారికి కటినశిచ్చ ఏసి జైల్లో పెడతారంటొహో!''

రమ్మీ బృందంలో నాయుడు ధ్యానం కొంచెం ఇటు మళ్లించి, ''టముకేయిస్తున్నారండీ, టముకు! ఏంటి, లోను వసూలు చేద్దారనే?'' అన్నాడు

''ఏం బట్టికెల్తారు? ఆల్ల మొకం. ఒకిడికేనా లోను డబ్బు పూర్తిగా ముట్టజెప్పుతేనా? సూనికి సగం ఆళ్ల మామూళ్లకే సాలదాయె! వొచ్చిన డబ్బు గోచీకి పెద్ద, గావంచాకి కురసాను! ఏం మావా, నీకూ వున్నట్టున్నాది ఎడ్ల లోను! తీరుత్తావేటి?'' అని అడిగాడు సత్తెన్నారాయణ అప్పన్నని

''సీ! సీ! సీక్వెన్సులేని సెయ్యి ఆడగూడదందుకే! ఒక్క ముక్క కలిసిందిగాదు'' అని చేతిలో ఉన్న పేకని నేలమీద పారేసి, ''ఏటంటావు? ఎడ్లలోను సంగతా? అసలు ఎడ్లని కొంటేగదా అర్దెకి తోలడానికీ,

అప్పు కట్టడానికీను రొండు వేలకి ఏలు ముద్దరేయించుకుని, ఆళ్ళు మామూళ్లు ఎలాగూ రావు గాబట్టి రమ్మీలో ఎట్టాను ఎప్పుడో ఆవిరైపోయాయి ఆ డబ్బులు'' అన్నాడు అప్పన్న

''అద్దదీ! అప్పన్న బావది మిడిలు(డ్రాపు అన్నమాట'' అని చెన్నయ్య సెట్టి, ''అయితే బావా! మరి ఎడ్లని కొనలేదు గందా? ఆళ్లూరుకోరే, ఏం జేత్తా?'' అని అడిగాడు

''దానికేం పెద్ద బెమ్మాండం పేటలో మా బామర్దికాడ కాడెడ్లున్నాయి ఆటిని తోలుకొచ్చి సూపిత్తా, ఇయ్యేనని'' అప్పన్న చెప్పాడు.

''అద్సరే, మరి లోను తీర్చడం సంగతి ఏటాలోచించావు?'' అని ప్రశ్నించాడు నాయుడు

''సూద్దాం! దానికి ఏదో మసిబూసి మారేడుగాయ చేయాలా. రేప్పొద్దుటి దాకా టైముందిగదా?'' అని ధీమాగా అన్నాడు అప్పన్న

''సూడు! సూడు! గవురుమెంటు డబ్బు అది. తిరిగియ్యకపోతే బొక్కలో తోసేత్తారు. రమ్మీలో నా డబ్బు ఎగ్గొట్టినట్టు గాదు! ఓకులు లెక్కెండయ్యా! ఆటయింది'' అని ముక్క ముడిచాడు చెన్నయ్యసెట్టి.

''చీకటి పడింది. రంగులుబాగా ఆనడం లేదు ఇహ ఆట మానేద్దాం!'' అన్నాడు గోపాలం బాబు.

''ఇదుగో పంతులూ! నీకీ కుళ్ళు బుద్ధే పోయిందిగాదు. సరిగ్గా నా చెయ్యి రైజులో ఉన్నప్పుడు ఆట మానిపించేత్తావు'' గుర్రుగా అన్నాడు చెన్నయ్య సెట్టి

''పోనీండయ్యా! పంతులుకసలే రేచీకటి. ఇయ్యాల్టికి ఆట కట్టేద్దాం!'' అని లేచాడు నాయుడు. ఇంకెవరూ మాట్లాడలేదు

అంతవరకూ అక్కడ నిశ్శబ్దంగా కూర్చుని, నాయుడి ఎడంకాలు పడుతున్న రాజప్పకి, వారి సంభాషణ విన్నాక, ఏదో జ్ఞాపకం వచ్చి, చీకట్లో ఎర్రని చురక తగిలినట్టయింది. వెంటనే లేచి, తుండుగుడ్డ దులిపి భుజానేసుకుని, పెద్ద పెద్ద అంగలేసుకుంటూ, వెనుదిరిగి చూడకుండా ఇంటివేపు వెళ్లాడు.

''వోరి వోరి రాజప్ప! సీకటడిందో లేదో, అప్పుడే ఈడికి ఇంటిమీద మనసు తిరిగినట్టుంది''

''అందమైన పెళ్లామున్న మొగాడికి ఆరటం అలాగుంటాది!''

''రెండేళ్లయి పెళ్లయింది. ఇంకా కొత్తేమిటి?''

''వొయ్! వొయ్! నువ్వు రొండేళ్లకే పాతబడిపోయేవేటి?''

ఇలా వాడిమీద వేడివేడి వ్యాఖ్యానాలు చేసుకుంటూ వాళ్లంతా ఎవరిదారిన వాళ్లు వెళ్లిపోయారు.



రాంకోవెల కాణ్నుంచి రొప్పుకుంటూ ఇంటికొచ్చిన మావని చూసి బేంబేలెత్తిపోయింది రంగి.

''ఏం మావా! ఏటయింది?'' అని అడిగింది.

''ఏపీ లేదుగానీ, ఒలే గంగీ! ఆ మద్దెన అందరికీ లోనులొచ్చినప్పుడు మనవూ ఏలిముద్దరేసేం గదటే! '' అన్నాడు.

''బనవూ ఏటి! నువ్వే ఏసేవు. జాగర్త మావా అని నేను సెప్పినా ఇనకుండా! ఇప్పుడేమయింది?'' అని అడిగింది గంగి ఆదుర్దాగా.

''పర్లేదులేయే! నువ్వెందుకు అలా కంగారుపడిపోతున్నావు? రంగనాథం బాబు భగవంతుడి లాటోడు. అంతా ఆయనే జూసుకుంటాడు! మనల్ని అన్నేయం జెయ్యడు'' అన్నాడు రాజప్ప.

మనసులో కంగారుగా ఉన్నా బైటికి ధైర్యంగా కనిపిస్తూ

''మావా! నువ్వదోలా మాటాడుతున్నావు నాకు బయంగా వుంది అసలేటయినాది?'' అని అడిగింది గంగి.

''ఏమీ లేదే! అప్పుడు దీసుకున్న అప్పు ఇప్పుడు కట్టకపోతే జైల్లో పెడతారంట ఏలిముద్దరంటే ఏశానుగానీ, ఆ డబ్బేటో, ఎంతుచ్చుకున్నాడో, అంతా ఆ రంగనాథం బాబుకే తెలుసు. ఉండు, ఎళ్లి అడిగొస్తా'' అని రాజప్ప విసురుగా గుడిసె దాటి, చీకటిగా వున్న దారి గుండా, ఆ ఊళ్లోకల్లా పెద్ద మేడవైపు వెళ్లాడు

''మావా!'' అని పిలుస్తూ గంగి కూడ వాడి వెనకాలే పరుగులాంటి నడకతో వెళ్లింది



అప్పుడే రాత్రి భోజనం పూర్తిచేసి తీరిగ్గా ఇంటిముందు సిమ్మెంటు గట్టుమీద కూర్చుని చుట్ట కాలుస్తున్నాడు రంగనాథం అదాటుగా వచ్చిన రాజప్పని చూసి ఆయన ఆశ్చర్యపోలేదు సాయంత్రం ఊళ్లో వేసిన దండోరా ఆయనా విన్నాడు అయినా, అడగాలి గదా అనీ ''ఏరా? ఇలా వచ్చావు?'' అని అడిగాడు. ఎదురుగా నిల్చున్న రాజప్ప వెనకాలే వున్న గంగిని హరికేన్ లైటు వెల్తురులో ఓరకంట చూస్తూ

''సాయంత్రం టముకు ఏయించారు కదా బాబయ్యా! రేపు లోను కట్టాలంటున్నారండి'' అన్నాడు రాజప్ప భయం భయంగా.

''అయితే ఏటట?'' మోకాలుమీద మోచెయ్యి ఆన్చి చుట్ట ఎడం చేతి చూపుడు వేలికి బొటనవేలికీ మధ్యనపెట్టి, వుంగరపు వేలుతో నుసిని దులుపుతూ, ఆ వెచ్చదనాన్ని అనుభవిస్తూ గంభీరంగా అడిగాడు రంగనాథం.

''రేపది కట్టకపోతేజైలేనంటున్నారండి!'' రాజప్ప కంఠం వొణికింది

''సర్లేరా! అర్ధాంతరంగా వచ్చి ఇప్పుడు డబ్బంటే ఎలా? రేపటికేవో తంటాలుపడు, తరువాత చూద్దాం!'' ధీమాగా చెప్పాడు జవాబు రంగనాథం.

''దర్మ పెబువులు, తమరే అలాగంటే ఎలా? అసలా డబ్బేటో, లోనేటో నాకేం తెలుసు. నాకు కబురెట్టి ఏలుముద్ర రేయించుకున్నారు అంతే మీరే జూసుకున్నారు'' వొంచిన నడుం ఎత్తకుండా ప్రాధేయపడ్డాడు రాజప్ప

''అవునురా! నేను కాదన్నానా? నీ డబ్బు ఎగ్గొట్టేసాననుకున్నావా? రేపటికి సర్దడం కుదరదంటున్నానంతే'' రంగనాథం నిక్కచ్చిగా చెప్పాడు.

''నన్ను పోలీసులట్టుకుపోతే నా కుటుంబం సంగతి ఏం గావాల? ఏ రోజు కూలీ ఆ రోజుకే చాలని వాళ్లం దానికి గంజెలా గొస్తాది బాబయ్యా? తమరే ఏదో దారి సూపించాల'' దీనంగా వేడుకున్నాడు రాజప్ప

జైలంటే అంత భయమెందుకురా? అక్కడా రెండు పూటలూ తిండి పెడతారు, ఇక నీ పెళ్లాం అంటావా? మేమంతా లేమూ! ఊరా? అడివా? నువ్వు తిరిగొచ్చిందాకా దానికేదో ఉపాధి చూపిస్తాంలే అయినా ఆ విషయం రేపు చూసుకుందాం. అర్ధరాత్రి నెత్తిమీద కెక్కి కూర్చుంటే నేనెలా చచ్చేది? వెళ్లు ఇంటికి వెళ్లు'' అన్నాడు రంగనాథం విసుగ్గా

అంతవరకూ, పులికీ, మేకకు మధ్య సంభాషణ వింటున్న గోవులా నిస్సహాయంగా నిలబడిన గంగికి ఒంట్లో రక్తం ఉడికిపోతోంది. తన భర్త జైలు కెళ్లకుండా కాపాడమని ప్రాధేయపడుతూంటే,

మ్మకు నీరెత్తినట్టుగా జవాబిస్తున్న యజమానిని చూసి గంగవెర్రులెత్తి పోయింది

''రా మావా! ఎల్దారి!'' అని భర్త చేయి పట్టుకొని నడిపించుకుని వెళ్లిపోయింది

''ఒసే! యానాదోళ్లకి అంత పౌరుషం కూడదే!'' అంటూ ఇంట్లోకి వెళ్లిపోయిన రంగనాథం మాటలు ఆమె చెవిన పడలేదు.

మర్నాడు ఆఫీసర్లు, పోలీసులు వచ్చి, డబ్బు కట్టని వారిని భయపెట్టి, బెదిరించి నానా రభసా చేశారు. రాజప్పవంటి అమాయకుల్ని బేడీలు వేసి తీసుకువెళ్లిపోయారు కూడా.

★ ★ ★

పోలీసుల వెంట వెళ్లిపోతున్న మామని చూసి కన్నీరు మున్నీరుగా ఏడిచి గోలపెట్టింది గంగి

''నువ్వు చేయని నేరానికి, నీకు సిచ్చ ఎందుకు పడాలి మావా?'' అని వాపోయింది. 'మా బతుకులిలా, గంగపాలు కావలసిందేనా?' అని ఎలుగెత్తి ప్రశ్నించింది లోకాన్ని; అంతా నిష్ఫలం అని తెలిసి కూడా.

సాయంత్రానికంతా చల్లబడిపోయి ఊరు మాటుమణిగింది.

★ ★ ★

ఓనాడు రాత్రి పొద్దుపోయి రంగనాథం మనిషొచ్చి, 'రమ్మంటున్నా'రని గంగిని తీసుకెళ్లాడు యజమానికి ఇంటికి.

''ఏమే! ఒంటరిగా ఇంట్లో పడుండకపోతే, మా ఇంట్లో పశువుల కొట్టం బాగుచేసి, రాంకోవలె మట్టికొట్టుకుపోయి వుంది- దాన్ని బాగుచేసే కాలం గడపకూడదూ? నీ కష్టం వుంచుకోములే ఏదో కొంత ముట్టజెపుతాము. ఈ రోజునుంచే పని మొదలుపెట్టు. నువ్వు పోరా! అది పన్మాసుకుని వస్తుంది'' అని నౌకరును పంపించేశాడు రంగనాథం. గింగి తట్టా, చీపురు పట్టుకుని పశువుల కొట్టంలోకి వెళ్లింది.

రాంకోవెల తూరుపు గది సర్దిపెట్టి, దుమ్ము దులుపుతుండగా వెనకాలే వచ్చాడు రంగనాథం. చీకట్లో అలజడికి వెనుదిరిగి చూసి గతుక్కుమంది గంగ.

''కంగారెందుకే! కొరుక్కుతినేస్తానా ఏంటి? నువ్వు 'ఊ అను నీ యింట్లో బంగారం నింపేస్తాను'' అని పులిలా మీద బడపోయాడు. కట్టు గొర్రునున్న గంగిగోవులా గజగజలాడిపోయింది గంగి. అయినా గుండె దిటవు చేసుకుని జాగ్రత్తగా తప్పుకుంది. చీకట్లో సీతమ్మ విగ్రహం కాలుకి తగిలి బొక్కబోర్లా పడ్డాడు కామాంధుడు. అంధకారంలో చేతులు చాచినగంగి చేతికి హనుమాన్లు చేతిలోని గద తగిలింది. అది ఎత్తి కసిదీరా నడినెత్తిమీద ఓ దెబ్బ వేయబోయింది గంగి. అదే జరిగివుంటే అసుర లోకానికి వెళ్లిపోయేవాడే రంగనాథం. కాని, అంతలోనే చీకటిని చీల్చే మెరుపులాంటి ఆలోచన మదిలో మెదిలింది గంగికి. ఆ గద నక్కడనే వదిలిపెట్టి, త్రాడు తెంచుకుని పరుగెత్తే ఆవులా ఆ కోవెలలోంచి బైటపడింది. తిరిగి చూడకుండా తన గుడిసెవైపు దూసుకుపోయింది. కలతపడిన మనసుతో అలాగే నులకమంచంమీద పడి ఆలోచించసాగింది.

★ ★ ★

మానవ జాతిని పట్టుకు పీడిస్తున్న ఈ పరపీడ పరాయణత్వ పిశాచం ఎప్పుడు వదుల్తుంది? ఎంతకాలం బలహీనుల్ని బలవంతులిలా కొట్టుకుతింటారు? ఎంతటి దుర్మార్గానికి తెగించాడు రంగనాథం! నా మావ రాజప్పే రంగనాథం పెళ్లాన్ని ఇలా చేయగలడా? కనీసం అలా ఊహించగలడా? దీనికి మూల కారణం ఏమిటి? సంఘం నిర్మించి ఉచ్చనీచాలేనా ఈ చౌరవకి కారణం? అయితే,

నైతికంగా వాడు నాకంటె ఎన్ని మెట్లు కిందనున్నాడు? అది నైచ్యం కాదా? ఈ సమస్యకి పరిష్కారం ఏమిటి? కొద్ది క్షణాల క్రితం ఆ రాక్షసుడు నా చేతిలో బలి అయిపోయి వుంటే! అక్కడితో సమస్య తీరదు నేలకొరిగిన ప్రతి రక్తపు చుక్కా మరొక రంగనాధమై పుట్టుకొస్తుంది. అందుకే వాడ్ని చంపాలనిపించలేదు దీనికొక్కటే పరిష్కార మార్గం కనిపిస్తోంది సంఘం దృష్టిలో వాడికున్న ఔన్నత్యాన్ని మనమూ పొందాలి వాడి కంట్లో కన్ను పెట్టి చూడగల ఎత్తులకి మనమూ ఎగదాలి ఓ పెద్ద గీతని చిన్నదిగా చెయ్యాలంటే దానిని చెరపడం కాదు చేయవలసింది - దాని పక్కన పెద్దగీత గీసి, అదెంత చిన్నదో దానికే తెలిసేలా చేయాలి నైతికౌన్నత్యం కేవల మానవ ప్రయత్నం మీద దుస్సాధ్యం. కాని సంఘం దృష్టిలో ఎదగాలంటే? - తల్చుకుంటే అదెంత ఘనకార్యం!

అయితే, అందుకు ఎవరో వచ్చి మనల్ని ఎప్పుడో ఉద్ధరిస్తారని కూర్చోవడం భావ్యం కాదు ఈరోజే, ఇప్పుడే దానికి అంకురార్పణ జరగాలి ఫలితాన్ని నా జీవితకాలంలో, నా కళ్లతో నేను చూడలేకపోవచ్చు కాని, నేను నాటిన విత్తు వృక్షమై, దాని ఫలాలు అక్షయమై, ఇప్పుడు నా కడుపులో ఎదుగుతున్న నా బిడ్డ - నా మావ ప్రతిరూపం- తింటే అది నా ఆత్మకి తృప్తికాదా?!

ఇలా ఆలోచిస్తున్న గంగిని, ''కేరు, కేరు'' మని ఏడిచి, ఏడిచి అలసిపోయిన చంటిపాపని, అమ్మలా లాలించి, తన ఒడిలోకి తీసుకుంది నిద్రాదేవి నెమ్మదిగా

తూరుపు తెల్లవారుతోంది. గంగి మనసులోని స్థిరనిశ్చయంలా ఎర్రని సూర్యబింబం కొండలమధ్య నుంచి ఆకాశంలోకి ఎదుగుతోంది



# అంటరాని ప్రేమ

## కెమెరా విజయకుమార్

"మీ అటెండరు ఆఫీసునుంచి తీసుకొచ్చిన ఉత్తరాలు టేబులుమీద పెట్టాను అవి చూస్తూ వుండండి ఈ లోపుగా మీ స్నానానికి నీళ్లు పెడతాను" టూర్‌నుంచి వచ్చిన నాతో చెప్పి లోపలికి వెళ్లింది నా శ్రీమతి.

బట్టలు మార్చుకుని రిలాక్సయి ఉత్తరాలు చూడటం మొదలుపెట్టాను. దాదాపు అన్నీ వార్డెన్లు, మేట్రెన్లు పంపిన రిపోర్టులు. సోషల్ వెల్ఫేర్ ఆఫీసరయిన మొదట్లో ఆ నివేదికలన్నీ ఆసక్తిగా చదివేవాణ్ణి. తర్వాతర్వాత అందులో సగానికి సగం అబద్ధాలని తెలిసి యాంత్రికంగా ఫైల్ చేస్తుంటాను

ఇంగ్లీషులో రాసిన ఉత్తరాల మధ్య ఒక తెలుగు ఉత్తరం, కవరుమీద సైతం ఏసుదాసుగారు అన్న తెలుగు అక్షరాలు... కాస్త వంకర టింకరగా... ఆ వంకర్లలో పదేళ్ల స్నేహం వుంది. రాసింది తనకెంతో అప్పుడు వెంకన్న. వచ్చింది ఆత్రేయపురంనుంచి.

వెంకన్న ఎప్పుడోగానీ ఉత్తరం రాయడు. ఆ ఉత్తరాన్ని ఒకటికి రెండుసార్లు చదివి అర్థం చేసుకున్నాను.

"నీళ్లు చల్లారిపోతున్నాయి. ఏం చేస్తున్నారు?" రెండవసారి లోపలినుంచి కేక సాదరంగానే వినిపించింది. నిజానికి ముచ్చెమటలు పోసి అప్పటికే ఒళ్లు చల్లబడింది.

స్నానపానాదులు యాంత్రికంగా జరిగిపోయాయి. బయటపడక కుర్చీలో కూచున్నాను. ఆత్రేయపురంలో జరిగిన సంఘటనలు నా కళ్లముందు కదలాడాయి.

★ ★ ★

మొదటిసారి ఆత్రేయపురం వెళ్లింది ఉద్యోగరీత్యా. బదిలీ ఆర్డరు పుచ్చుకొని చిన్నపిల్లాడిలా ఆనందం ఉప్పొంగి రాగా నిండుగా ప్రవహించే గోదావరి కాలవల్ని, పచ్చని కొబ్బరి చెట్లని ఊహించుకుంటూ వెళ్లాను.

కొత్తగా పెళ్లయి వుండటంవల్ల మంచి ఇల్లు దొరికితే భార్యను తీసుకొచ్చి కాపురం పెట్టాలని అద్దె ఇంటికోసం ఊళ్లోకి వెళ్లాను.

ఊళ్లో మంచి ఇళ్ళే కనిపించాయి అక్కడ మా కోసం ఓ మంచి ఇల్లు దొరక్కపోద్దా అని నమ్మకంతోనే అడిగాను.

ఎక్కడ ఏ యింటి వద్ద అడిగినా ఒకే ప్రశ్న 'ఎవరండి మీరు' అని... నేను కాస్త సందిగ్ధంలో పడేసరికి వాళ్ళే కాస్త విపులంగా... 'మీ కులం ఏమిటండి?' అని అడిగేరు

నన్ను ఎవరైనా కులం పేరుతో ప్రశ్నిస్తే సహించలేను. దానికి కారణాలు ఏవైనా కాని . అది

అనాగరికంగానే జమకడతాను అయినా నాకిప్పుడొక మంచి ఇల్లు కావాలి అందుకని 'క్రిష్టియన్‌ని' అన్నాను.

'అంటే మీరు పంచములా?' అని వాళ్లే తేల్చేసుకుని ముఖంమీదే తలుపులు మూసేసుకున్నారు

ఈ దేశంలో హాస్టలు వార్డెన్లు పేదవాళ్లు కాకుంటే నేనూ పేదవాడ్ని కాదు ఆ ఊళ్లో నాలా మూడు ఎమ్మేలు చదివిన వాళ్లు ఒక్కరూ లేరు. నేను ఒక్క చేత్తో సంపాదించినా ఎక్కువే వస్తుంది అయినా ఇల్లు ఇవ్వడానికి యూనివర్శిటీలు ఇచ్చిన ఫస్ట్‌క్లాస్ డిగ్రీలు కానీ, సెక్యులర్ ప్రభుత్వం ముద్రించిన నోట్లు కానీ ఏమీ చేయలేకపోయాయి అక్కడ 'మనీ' కూడా మనువును జయించలేకపోయింది అక్కడ అర్హతలన్నీ మించిన అర్హత కులం.

నేను చేసేది లేక దగ్గర పట్టణం అయిన రాజమండ్రిలోనే కాపురం పెట్టి రోజూ మొదటి లాంచీకి వెళ్లి చివరి లాంచీకి వచ్చేవాడ్ని లాంచీలలో అంటరానివారికి వేరే బెంచీలు వేయకుండా అడ్డుకున్న క్యాపిటలిజానికి మనస్సులోనే ధన్యవాదాలర్పించేవాడ్ని

పని ఎక్కువగా వున్న రోజుల్లోనూ, వర్షం వచ్చినప్పుడూ లాంచీలు లేక పడే ఇబ్బందులకు అంతుండేది కాదు ఈ చికాకులు పడలేక మళ్ళా ఇంటి గురించి ఆలోచించాను. ఊరు కాదంటే వాడ కాదంటుందా? ఊరికి పక్కనే ఆనుకుని వున్న మాలపల్లెలో ఇల్లు చూసుకుని దిగిపోయాను

ఆ ఇంటిలో దిగి రెండు నెలలు గడిచింది. ఒక రోజు సాయంత్రం ఇంటికొచ్చేసరికి కరెంటు లేదు డాబాపైకి వెళ్ళాను వేసవికాలం మూలాన ఆలస్యంగా పొద్దుగుంకటం మొదలైంది.

ఎదురుగుండా ఆకాశంలో మారుతున్న రంగుల చిత్రాన్ని చూడటం మొదలుపెట్టాను ఒక వర్ణం మరొక వర్ణంతో కలిసి ఎంతో ఆనందమయం చేస్తున్నాయి ఆ అందమైన అనుభూతి అంతలోనే చెదిరినట్లనిపించింది. ఈ సమాజంలో మాత్రం ఏ వర్ణం మరొక వర్ణంతో కలవకూడదు

నేను డాబాపై అలానే నిల్చుని కుంగిపోతున్న సూర్యుణ్ణే చూస్తున్నాను నిశ్శబ్దంనిండా ఆవరించుకొంది

''ఎంకడూ. .. ఎంకడూ...'' అంటూ ఎవరో పిలుస్తున్నారు. నేను కిందికి చూశాను ప్రహరీగేటు బయటనుంచి నలుగురు రైతు కూలీలు ఇంటి యజమానిని పిలుస్తున్నారు వారి వేషధారణ పేదరికానికి గీటురాయిలా వుంది. గేటుకీ, డాబాకీ మధ్యనున్న రెండు వరసలు పొడుగాటి కొబ్బరిచెట్ల మధ్యనుంచి వాళ్ల ...తనం స్పష్టంగా కనపడుతుంది.

ఇంటి యజమాని గబగబా అడుగులేసుకుంటూ గేటు దిగి వెళ్ళి వాళ్లముందు చేతులు కట్టుకొని నిలుచున్నాడు. నాకది విడ్డూరంగానూ, అసహజంగానూ అనిపించి ఎదురుగా జరుగుతున్న ఆ దృశ్యం మీద మనస్సును లగ్నం చేశాను.

''తోటంతా తవ్వే పాలికి నడుం ఇరిగిపోయిందిరా ఎంకా?'' ఓ గుబురు మీసాల కూలి బొంగురు గొంతుకతో అన్నాడు.

''మెరక సేను మాటేం సేద్దాంరా?'' తువ్వాలు దులుపుకుంటూ మరో కూలి అందుకున్నాడు

''పొద్దు గుంకిపోతాంది, బేగి పంపిచేత్తావా మరి'' గుబురు మీసాల ఆసామీ తొందరపెట్టాడు

వెంకన్న గుడ్డ బన్నీను జేబులోంచి డబ్బులు తీసి గేటు అరుగుమీద పెట్టి ''ఇందండి డబ్బులు'' అన్నాడు వెంకన్న అరుగుమీద పెట్టిన డబ్బులు తీసుకుని ఆ నలుగురు కూలీలు వెళ్లిపోయారు.

''ఎవరండీ వాళ్లు మీ చుట్టాలా?'' డాబా మెట్లు దిగి వరండాలోకి వస్తూ వెంకన్నని అడిగాను

''సుట్టాలా? భలేవోరే. ఆళ్లు కూలోళ్ళు కూలి డబ్బుల కోసం వచ్చేరు'' నవ్వేశాడు వెంకన్న.

నాకు మాట రాలేదు. అప్పటికే చీకటి పూర్తిగా కమ్మేసింది. ''మీరు డబ్బులు అరుగుమీద పెట్టేరేమిటి?''

వెంకన్న ఓ క్షణం ఆగి 'ఆళ్లు పెద్ద కులపోళ్లు గదండి. మనం సేత్తో యిత్తే పుచ్చుకోరు''

వెంకన్న సమాధానం తుపాను కెరటం పడవను చాచి కొట్టినట్టు నా మనస్సుకు తగిలింది.

అప్పుడు నాకనిపించింది! ఈ దేశంలో స్వతంత్రం ఎవరికి వచ్చింది; డబ్బుకొచ్చిందని దబాయిస్తారు. కాని దానిక్కూడా పూర్తిగా రాలేదనిపిస్తుంది. ఎందుకంటే... వెంకన్న పదెకరాల మాగాణి పొలం, అయిదెకరాల కొబ్బరి తోటకు ఆసామి. లక్షల ఖరీదు చేసే ఇల్లుంది. పైగా లాకుల దగ్గర కళాసీగా వుద్యోగం వుంది.

ఇదంతా ఒక ఎత్తు. అతని పెద్ద కొడుకు కువైట్ నుండి నెలకు కనీసం ఓ పదివేలు తక్కువ కాకుండా తండ్రికి పంపుతున్నాడు. కనుక వెంకన్న దరిద్ర రేఖ దాటి చాలా దూరం పోయాడు.

ఇప్పుడు వెంకన్న ఏ వర్గానికి చెందుతాడు? ఇలా నా ఆలోచనలు పరిపరివిధాల పోయాయి.

'యిక్కడిది మామూలే' నా ఆలోచనలకు చిన్న అడ్డుకట్ట వేశాడు వెంకన్న.

నా మనస్సులోని ఆవేదనకు బయట పెట్టేశాను. ''ఇంత డబ్బున్న మిమ్మల్ని కూడా ఇంత తక్కువ చేసి ఎలా మాట్లాడుతున్నారు. చిన్నదో పెద్దదో గవర్నమెంటు ఉద్యోగం కూడా చేస్తున్నారు'' అన్నాను.

''లాకుల కాడ కలాసి ఉజ్యోగం కూడా గొప్పదేనటండీ. ఇదయినా ఆ దొరల పున్నమేనండి. నా కట్టం వుంచుకోలేదాళ్లు. ఎళ్ళిపోతూ నన్నిందులో పెట్టేరు. అసలు సిన్నప్పుడు పాలేరుగా ఈ ఊరి కామందుల కాడ చేసినోడినే కదండి! ఊరి తన్నులకీ దెబ్బలకీ బయపడి దొర పంచన సేరాను. ఏదో ఈ కూడు దొరికిందీనాడు'' అన్నాడు.

ఇంతలో వెంకన్న చిన్న కొడుకు రాజు అక్కడకొచ్చాడు.

''మా నాన్న ఎప్పుడూ అంతేనండి. బస్సులో టికెట్టు తీసి ఎక్కి కూర్చొంటాడా- ఊళ్లోవాళ్లు ఎవ్రైనా కనబడితే చాలు లేచిపోతాడండి. నన్ను కూడా కూచోనివ్వడండి'' అప్పటివరకు వరండాలో వుండి మా మాటలు వింటున్న రాజు అందుకున్నాడు.

''ఏడిశావ్!'' అంటూ కొడుకును ఆప్యాయంగా వెంకన్న మందలించాడు. రాజు ఆ ఏడాదే పదవ తరగతి పాసై ఇంట్లో కూచున్నాడు.

ఈ సంఘటన నా కళ్ళని పూర్తిగా తెరిపించింది. వెంకన్నలో వున్న న్యూనతాభావం కన్నా, రాజులో వున్న నిర్లిప్తత కన్నా, పడగవిప్పి విషపు కోరలు చాచిన హైందవ నాగరాజు నన్ను కలచివేసింది.

ఆ సంవత్సరం ఇంకా కాలేజీ అడ్మిషన్లు వున్నాయి. నేను రాజుని తీసుకెళ్ళి కాలేజీలో సైన్సు గ్రూపులో చేర్పించాను.

రెండు సంవత్సరాలు తెలియకుండానే గడిచాయి. ఈ రెండు సంవత్సరాలలో రాజును మంచి లెక్చరర్ల దగ్గర ట్యూషను ఇప్పించి ఇంటర్‌లో మంచి మార్కులు సంపాదించేటట్టు చేశాను.

మంచి మార్కుల్తో క్లాసులో పాసయ్యాడు. అందుకని యూనివర్శిటీకి తీసుకెళ్లి కంప్యూటరు ఇంజనీరింగులో చేర్పించాను. మంచి తెలివైన చలాకీ కుర్రవాడు రాజు.

అదే సంవత్సరం నాకు ప్రమోషన్ రావడంతో మరో ఊరు వెళ్లిపోవడం జరిగింది.

రాజు ఇంజనీరింగు కోర్సు పూర్తిచేశాక బెంగుళూరులోని జర్మన్ కొలాబరేషన్‌తో ప్రారంభించిన ఓ పెద్ద కంపెనీలో చేర్పించడం వరకు నా ఆధ్వర్యంలోనే జరిగింది

రాజు ఉద్యోగంలో స్థిరపడ్డాడు

ఇప్పుడు ఆ రాజును గురించి ఏదో మాట్లాడాలని, నేనే నచ్చజెప్పాలని ఎప్పుడూ ఉత్తరం రాయని వెంకన్న నాకు రాశాడు. వెంటనే బయలుదేరి రమ్మని మరీ రాశాడు

నేను ఆత్రేయపురం బయల్దేరాను.

నా రాక చూసి వెంకన్న గేటు దగ్గరికి ఎదురొచ్చి చేతిలో బ్రీఫ్‌కేసు అందుకున్నాడు

''రాజేడి? ఊర్నించి వచ్చేశాడని రాశారు!'' అంటుండగా ముఖం కడుక్కోవడానికి వెంకన్న నన్ను నూతి దగ్గరికి తీసుకెళ్లేడు

''మద్దేనం మీ దగ్గరకే బయల్దేరాడు. అసలు ఇసయం ఏటంటేండి!'' అంటూ రాజు రాకముందే తాను అన్ని విషయాలు చెప్పేయాలన్న తొందర పడుతుండగా ఇంతలో

''ఎంకా... ఎంకా. .'' గేటు బయట నుంచి ఎవరో కీచుగా పిలుస్తున్నారు.

వెంకన్న కంగారుగా తువాలు భుజాన్నేసుకుని పరుగులాంటి నడకతో వెళ్ళి గేటు బార్ల తెరిచాడు.

ఎదురుగా వెంకన్న పొలంలో పనిచేసే అగ్రకుల రైతు కూలీ. గేటు దగ్గర నుంచి వెంకన్న చేయి పట్టుకొని కొంచెం దూరం తీసుకెళ్లాడు.

ముఖం కడుక్కుని వరండాలోకి వచ్చి కూర్చున్న నాకు వాళ్లిద్దరూ మాట్లాడుకోవడం కనిపిస్తుంది. దూరం అవడంవల్ల వాళ్ళు ఏం మాట్లాడుకుంటున్నారో వినబడటం లేదు. అంతా మూకీ సినిమాలాగుంది.

ఆ వచ్చిన కూలీ వెంకన్న రెండు చేతులు పట్టుకొని ఏదేదో చెపుతున్నాడు. వెంకన్న చేతులు విడిపించుకుంటూ జోడించి దండాలు పెడుతున్నాడు. ఆ కూలీ భుజంమీది తువ్వాలుతో కళ్ళు తుడుచుకుంటూ వెంకన్నను మరీ మరీ ప్రాధేయపడుతున్నాడు.

ఎదురుగా చూస్తున్నది నిజమేనా? చేత్తో డబ్బులిస్తేనే పుచ్చుకోని వీళ్లు వెంకన్న చేతులు పట్టుకొని మాట్లాడుతుంటే నాకు ఆశ్చర్యం కలగవలసింది పోయి ఏదో అనుమానం వేసింది.

అలా ఆ వ్యక్తి ప్రాధేయపడుతుంటే వెంకన్న మరింత ముడుచుకుపోతున్నాడు. అంతేకాదు వెంకన్న అతనికి నన్ను చూపెడుతూ ఏదో భరోసా కూడా ఇచ్చేస్తున్నాడు. అసలు విషయం తెలియక ఈ సస్పెన్సు కొనసాగుతోంది.

అంతవరకు ప్రాధేయపడుతున్న ఆ అగ్రకులస్థు చివరికి ఏదో బెదిరిస్తూ అక్కడకినుంచి వెళ్లిపోయాడు.

''నేనుకొన్నదంతా అయిందండీ దాసుగోరు'' గేటు తలుపేసి లోపలికొస్తూ వెంకన్న జీరబోయిన గొంతుతో అన్నాడు.

''అసలేం జరిగిందో చెప్పండి'' ఆత్రుత అణుచుకోలేక అడిగేశాను.

''పెద్ద ఇంజనీరు సదివి వుజ్జోగం చేసుకుంటున్నాడని సంబరపడిపోతుంటే మద్దెలో యిలా సేసాడు. ఆడ్ని ఏం సేత్తరో మీరే సెయ్యాలి'' తరతరాలుగా దెబ్బతీస్తున్న భయం వెంకన్న గొంతులో వుంది.

''యిందాకొచ్చాడు సూడండి ఆయనే బులిరాజుగోరు. ఆరమ్మాయినే మనోడు మనువాడతా

నంటూ కూర్చున్నాడు. ఆ ఇసయం నాకు నాలుగు రోజుల కిందే తెల్సింది'' అని చెప్పి కొండంత బరువు దించుకున్నట్టు అరుగుమీద కూర్చుండిపోయాడు వెంకన్న

''అమ్మాయి ఏం చదువుకొంది?'' తృటిలో పెద్ద తుపాను తప్పిపోయిన రిలీఫ్‌తో అడిగాను.

''మా సిన్నమ్మాయి తోటిదండి సదువేదో పదవ తరగతితోనే ఆపేశారు. ఎప్పుడూ మన ఇంట్లోనే వుండేది మీరు సూసే వుంటారు'' వెంకన్న మాటలలో ఆ అమ్మాయి మీద వాత్సల్యమే కనిపించింది.

''అయితే ఈ బులిరాజుగారేమంటారు?'' కథ తర్వాత భాగం తెలుస్తుందని అడిగాను.

''పాపం బులిరాజుగోరు మంచోరేనండి ఈ పెళ్లైతే వూళ్ళో ఆయన ఎలా తలెత్తుకుంటాడు సెప్పండి నా సేతులు గెడ్డం అట్టుకుని - ఒరే ఎంకడూ - సచ్చి నీ కడుపున పుడతాన్రా - ఈ పెళ్లి ఆపెయ్యరా - అని సంటిపిల్లాడిలా ఏడిశాడండి బాబు'' అలా అన్నప్పుడు వెంకన్న కళ్ళలో కూడా చెమ్మ కనిపించింది. వెంకన్న దేన్నయినా తట్టుకోగలడు కాని కృతజ్ఞత ప్రకటిస్తే తట్టుకోలేడు.

''ఆయన మీ దగ్గర కూలి చేయడానికి లేని అభ్యంతరం బిడ్డనిచ్చి పెళ్ళి చేయడానికొచ్చిందన్న మాట'' నాలో పౌరుషం తన్నుకొచ్చింది ''అంతే కదా, రాజుని రానీ, ఆ తర్వాత మాట్లాడదాంలే'' అని వెంకన్నని ఆపుచేశాను.

రాత్రి పడుకునే ముందు రాజు వచ్చాడు. ''మీరు కాకినాడ వెడతారని చెప్పింది అక్క.. ఇక్కడికెప్పుడొచ్చారు?'' అని అభిమానంగా అడుగుతూ దగ్గర కూర్చోబోయాడు.

''ముందు భోజనం చేసిరా, నీతో మాట్లాడాలి'' అని లోపలికి పంపి రాజు భోజనం చేసి వచ్చేసరికి నేనొక నిశ్చితాభిప్రాయానికి వచ్చేశాను.

'రాజు నువ్వేమనుకోనంటే నిన్నొకటి అడుగుతాను. రాధ నీకు నిజంగా నచ్చిందా? లేక గొప్పకులంలో పుట్టిన బిడ్డ కదా అని మోజు పడ్డావా?'' ఆ ప్రశ్న కటువయిందని తెలుసు. అయినా నాలో రగులుతున్న కసి అలా అడిగించింది.

''మీరడిగిన కోణంనుంచి నేనెప్పుడూ ఆలోచించలేదు సార్'' ప్రశ్నకు దెబ్బతిన్నా నిజాయితీగా చెప్పేడు రాజు

''రేపు అమ్మాయితో మాట్లాడటానికి వీలవుతుందా? అటు విషయాలు కూడా తెలుసుకోవాలి కదా?''

''అదేమిటి సార్ ఇప్పుడు రమ్మంటే ఇప్పుడు వస్తుంది. ఆమెది నిజమైన ప్రేమ నా గురించి అంటారా మీరన్న కోణంనుంచి మరోసారి ఆలోచించాలి'' తమ ప్రేమ స్వచ్ఛంగా వుందా లేదా అన్నది తను కూడా తేల్చుకోవాలన్నట్టుంది రాజు స్వరం.

రెండవరోజు ఉదయం పదిగంటలయ్యేసరికి రెండుసార్లు రాధ ఇంటికి వెళ్లివచ్చాడు రాజు. రాధ తండ్రి ఆ రోజు కూలికెళ్లలేదు. తండ్రి ఇంట్లో వుండగా ఆ రోజు రాజుతో రావడానికి వీలు పడలేదు.

''ఎన్ని కబుర్లెట్టినా రాధమ్మ ఎందుకు రాలేదో?'' మనస్సులో గొణుక్కున్నట్టు అన్నాడు వెంకన్న ''జరిగేదేదో జరుగుద్ది అన్నాలకి లేవండి'' అని ఆయన అనేవరకు ఎవరికీ భోజనాలు చేయలేదన్న స్పృహే లేదు.

సాయంత్రం అయింది పాలేళ్లు పశువులను చెరువులో కడిగి వెంకన్న ఇంటికి తోలుకొచ్చేరు అగ్రవర్ణ కూలీలు కూడా అదే వేళకు వెంకన్న ఇంటికొచ్చి ఎప్పటిలానే కూలి డబ్బులు నేలమీద పెట్టించుకుని వాటిని అందుకుని వెళ్లిపోయారు సంవత్సరాల ఆ సంస్కృతిలో మార్పు లేదు

''కాస్త చీకటి పడిన తరువాత వస్తుందేమో. '' ఇంకా తనలో ఆశ చావక రాజు అన్నాడు

చీకటి పడింది. అప్పుడు రాధ రాలేదు గానీ ఓ చిన్న కుర్రాడు వచ్చేడు రాధ ఇచ్చిన చీటీ రాజు చేతిలో వుంచి వెళ్లిపోయాడు

రాధ ఎందుకు రాలేదు? ఉత్తరం చదివి రాజు హతాశుడైపోయాడు నేనూహించిందే జరిగి వుంటుందని అనుకొన్నాను

రాజు గొంతు పెగుల్చుకొని ''రండి మాష్టారు, మిమ్మల్ని బస్సు ఎక్కిస్తాను'' అన్నాడు. నేను వెంకన్నతో వస్తానని చెప్పి బయల్దేరాను.

కాలువ గట్టుకు చేరాం బస్సు ఆగేచోట ఆ గట్టుమీద నిల్చున్నాం. మా ఇద్దరి మధ్య చాలాసేపు మౌనం తాండవించింది. కాలవ నిండుగా పార్లి ప్రవహిస్తోంది. ఏ క్షణాన్నయినా రోడ్డు మీదకు పార్లుకొచ్చేలా వుంది రాజు గుండెల్లో కూడా ఆవేదన అంత తీవ్రంగానూ కన్నీరై తన్నుకొచ్చేలాగుంది.

''చూడండి సార్ ఈ ఉత్తరం! ఆమెను మర్చిపోయి ఇంకొకరిని ఎవరినైనా చేసుకోవాలట...'' ఉత్తరంలోని విషయం చివరికి బయటపెట్టాడు. తన ప్రేమ సౌధం కళ్ళముందే కూలిపోతే తట్టుకోలేక కుమిలిపోతున్న రాజును చూసి కొంతసేపు నిర్లిప్తంగా వుండిపోయాడు.

విభజించి పాలించడం ఆంగ్లేయులకు వెన్నతో పెట్టిన విద్య అని మన చరిత్రకారులు మన చిన్న నాటినుంచి నూరిపోస్తారు కాని కొన్ని వేల సంవత్సరాలనుండే విభజించి, అణగద్రొక్కడంలో తెల్లవాడిని తలదన్నిన ఈ దేశంలో అంటరాని సంస్కృతిని గూర్చి ఎక్కడా చెప్పరు. నేను రాజుకేసి తిరిగాను.

రాజు భూదిగంతాల కేసి, పార్లి ప్రవహించే నీళ్లకేసి గొంతారని గుండెతో చూస్తున్నాడు

''చూడు రాజా! ఆ అమ్మాయి తండ్రి నీ తండ్రి దగ్గర వ్యవసాయ కూలీ. ఆ అమ్మాయి మీ ఇంట్లోనే పెరిగింది. మీ ఇద్దరూ ఒకే కంచంలో భోంచేసి వుండవచ్చు. మీ ఇద్దరి మధ్య నిజానికి కాకి ఎంగిలి కూడా లేకపోవచ్చు. కాని పెళ్లి దగ్గరకొచ్చేసరికి ఏమీ లేనిదయినా ఆమె రాచబిడ్డ నీవు అన్నీ వుండి కూడా పంచముడివి. ఆమె నిన్ను స్వచ్ఛంగానే ప్రేమించి వుంటుంది కానీ ఇప్పుడున్న సమాజం నిన్ను తాకనంటుంది .. కర్మ, తలరాత అనే మత్తుమందుల్తో పుట్టకముందే ముఖాలపై అంటరాని వాళ్లనే పచ్చబొట్టు పొడిచే ఈ వ్యవస్థపై మొదట చేయాల్సింది వర్ణ పోరాటం అని నేనేనాడో గ్రహించాను'' అన్నాను

చీకటిని చీల్చుకుంటూ, జనాన్ని మోసుకొస్తున్న మా ఊరి బస్సు మా ముందుకు వచ్చి నిలిచింది.

నేను బస్ ఎక్కుతూ రాజా ముఖంలోకి చూశాను. గాంభీర్యాన్ని సంతరించుకొన్న ముఖాన్ని చూస్తూ వీడ్కోలు చెప్పేను.

రాజుకు నేను ఏ సలహా ఇవ్వకుండానే బస్ ఎక్కాననే దిగులు నాకు లేదు. అతడు విద్యావంతుడు. జరిగిన సంఘటన చాలు, తన జీవితం ఒక్కటీ తీర్చిదిద్దుకున్నంత మాత్రాన ఈ వ్యవస్థ మారదని అతనికి అర్థం కావటానికి.



# ప్రశాంతం

## స్వామి

చంకల్లో రెండేండ్ల పాపనెత్తుకుని దుర్గమ్మ నడుస్తోంది దుర్గమ్మ నడవబట్టి ఇరవై అయిదేండ్లు దాటింది అయినా ఆ పొద్దే దుర్గమ్మకు నిజంగా నడుస్తున్నట్లుంది

దుర్గమ్మ నడకలో రీవి వుంది. ఊరు ఊరంతా తననే గమనిస్తున్నారన్న ధ్యాస వుంది మెరవణిలో ఒక కొత్త గుర్తింపు వచ్చిన పెళ్లికూతురిలా ముసిముసి నవ్వులు నవ్వుతూ ఉంది.

ఆరోజు ఒళ్లు రుద్దుకునే సోపు లేకపోతే బట్టలు ఉతుక్కునే సోపుతోనే స్నానం చేసింది. చిరిగిపోని రవిక ఒక్కటీ లేకపోతే, చంకల్లో చిరిగిపోయిన రవికనే చక్కగా కుట్టుకుని తొడుక్కుంది. రంగు వెలసిపోని చీర ఏ ఒక్కటీ లేకపోయినా, ఆ వెలసిపోయిన చీరనే బాగా ఉతుక్కుని కట్టుకుంది. ఇస్త్రీ చేయని ఆ బట్టలు శుభ్రమైన మడతలు పడుతుంటే సాన పెట్టడానికి నోచుకోని ముడివజ్రంలా కనిపిస్తాంది దుర్గమ్మ

హరిజనవాడలోని తన ఇంట్లోంచి రాబోతూ, ఇంటిబైట కల్లి కంపల మధ్య పూచిన ఒక పసుపు చెండుమల్లి పువ్వును పుటుక్కున తెంచి కొప్పులో తురుముకుంది. హరిజనులు గుళ్లలోనికి పోకూడదు కానీ, దేవుళ్లు హరిజనుల ఇళ్లలోకి రావచ్చు ఏదో గుర్తొచ్చినట్టు చటుక్కున వెనక్కి తిరిగి ఇంట్లోకి పోయి రాముని పటం ముందు నిలబడి చెంపలేసుకుంది

గిత్తలకు నీళ్లు తాపుకుని వచ్చి ఇంటిముందు ఎదురయ్యాడు ఆమె భర్త వెంకటేశులు.

'ఆఫీసుల్లో పనిచేసే దొరసాని మాదిరి ఉండావే!' అని భార్యవైపు చూసి కనుబొమలెగరేసి నవ్వాడు.

'నువ్వు పశువుల డాక్టరు మాదిరి వుండావులే!' అని కిసుక్కున నవ్వింది దుర్గమ్మ.

ఆరోజు దుర్గమ్మ అంగన్‌వాడి సెంటర్‌లో ఆయాగా ఉద్యోగంలోకి ప్రవేశిస్తున్న రోజు!

చిన్నప్పుడు దుర్గమ్మ బాగా చదువుకుని టీచరమ్మ కావాలని కలలు కంది. కానీ ఆ కలలు కల్లలయ్యాయి. బడి పిల్లలను ఆడ, మగ అని విడదీసి రెండు విభాగాలుగా కూర్చోబెట్టడం ప్రతి స్కూల్లోనూ ఒక సామాన్య సంప్రదాయం. అదే కాకుండా, మగ పిల్లలనుంచీ హరిజన మగపిల్లల్నీ, ఆడపిల్లలనుంచీ హరిజన ఆడపిల్లల్నీ దూరంగా కూర్చోబెట్టే సంప్రదాయం కూడా ఆ బడిలో వుండేది. ఇప్పటికీ కొనసాగుతూనే వుంది కూడా! ఈ రెండవ సంప్రదాయానికి కారణం ఆ బడిలో పనిచేస్తూ వచ్చిన బ్రాహ్మణ అయ్యవార్లు. అంతకంటే లోతైన కారణం - ఆ బ్రాహ్మణ అయ్యవార్లను సమర్థిస్తూ వచ్చిన కమ్మ సర్పంచు రంగయ్యనాయుడు! ఇప్పటికీ అతడు ఆ గ్రామ సర్పంచే!

ఈ రెండు సంప్రదాయాలకూ లోబడి దుర్గమ్మ స్కూలు జీవితం ముగిసింది. ఏటేటా తన తల్లి పిల్లల్ని కంటుంటే, వాళ్లని ఎత్తుకుని ఆడించడం కోసం దుర్గమ్మ మధ్యలో మూడేళ్లు చదువు మానివేయవలసి వచ్చింది అయిదవ తరగతి పూర్తి చేసేటప్పటికి ఆమెకు పదమూడేళ్లు వచ్చాయి.

రజస్వల కూడా అయింది ఆరోతరగతి చేరాలంటే పక్కనున్న ఊరికి ఒక మైలు నడిచిపోవాలి ఒక మైలు నడవడం పెద్ద దూరం కాకపోయినా, ఆ మైలు నడిచే లోపల తమ కూతుర్ని ఏ మగవాడైనా ఏమైనా చేయొచ్చు అన్న భయంతో ఆమెను అప్పర్ ప్రైమరీ స్కూలుకు పంపడానికి ఆమె తల్లిదండ్రులు నిరాకరించారు మీ పాప దుర్గమ్మ ఏకసంధాగ్రహి అని స్కూలు టీచర్లు మెచ్చుకున్నప్పుడు, ఈ ఆడముండకు ఉన్న తెలివి మా మగపిల్లోల్లకు లేకపోయనే అని కూడా వారు సంకటపడ్డారు దుర్గమ్మ తను చదివే అవకాశం కోల్పోవడానికి అసలైన కారణం ఆమె ఆడపుట్టుకే!

జీవితంలో టీచర్ కాలేకపోయినా, ఏదో ఒక చిన్న ఉద్యోగం - అంగన్‌వాడి ఆయాగా ఉద్యోగం రావడం ఆమెకు ఏదో కొత్త ఉత్సాహాన్ని కల్గించింది. నేను కూడా ఒక గవర్నమెంట్ ఉద్యోగస్తురాలిని అన్న స్పృహ ఆమె ప్రతి రక్తాణువులోనూ చిందులేసింది. ఆ ఉద్యోగం కోసం ఆ గ్రామంలో ఇద్దరు ముగ్గురు ఆడవాళ్లు పోటీపడ్డారు కానీ, ఐసిడిఎస్ మేడమ్ మేరీ చుట్టూ తిరిగి తిరిగి వేయి రూపాయలు తాంబూలంలో పెట్టి సమర్పించుకుని ఆ ఉద్యోగాన్ని దక్కించుకుంది దుర్గమ్మ

'ఏ కులం వాళ్లు ఆ కులం వాళ్లకు సహాయం చేసుకుంటారు గానీ, మా హరిజనుల్లో మాత్రం పైనున్నవారు కిందనున్నవారిని ఏమాత్రం ఆదుకోరు' అని మేడమ్ మేరీ మీద లోలోపల మెటికలు విరిచింది.

'నువ్వు టింగురంగా అని నీ ఉద్యోగానికి పోతే ఇంట్లో అన్నం చేసేదెవరు?' అని అడిగాడు దుర్గమ్మ భర్త వెంకటేశులు.

'నువ్వు ఈ మాట అడుగుతావనే, నసుకులోనే లేచి వంట చేసినాను' అంది దుర్గమ్మ

'నువ్వు పోతే నాకు అన్నమెవరు పెడతారు?'

'మా టీచరమ్మను అడిగి వచ్చి నీకు అన్నం పెట్టి పోతాను'

'పిల్లోల్లను బడికి పంపేదెవరు?'

'మా టీచర్‌ని అడిగొచ్చి పిల్లోల్లకు అన్నం పెట్టి బడికి పంపించి పోతాను' 'మధ్యాన్నం పశువులకు మేత వేసేదెవరు?'

'మీ జేజినాయన' అందామనుకుంది.

ఆయా పనిచేస్తే నెలకు నూటాయాభై రూపాయలు వస్తుంది వేన్నీళ్లకు చన్నీళ్లు మాదిరి కుటుంబానికి అక్కర వస్తుంది. అని నేను తాపత్రయ పడుతుంటే, నేనేదో పెళ్లీ పేరంటాలకూ పోతున్నట్లు మాట్లాడుతున్నాడే ఈ మొగోడు' అని భర్తమీద దుర్గమ్మకు చిర్రెత్తుకొచ్చింది. శుభమా అని ఉద్యోగంలో చేరబోతున్న మొదటిరోజే మొగునితో తగవులాట ఎందుకని నిగ్రహించుకుంది.

'రామేశ్వరం పోయినా శనీశ్వరం పోలేదన్నట్లు ఆడదానికి ఏ ఉద్యోగమొచ్చినా ఇంటిపనీ, వంటపనీ తప్పదు కదా' అని నిట్టూర్చింది.

'ఇప్పుడే వస్తాను సామీ' అని పాపను చంకలో వేసుకుని చకచకా నడిచిపోయింది దుర్గమ్మ.

మండల కేంద్రమైన ఉదవకొండలో ఉంటుంది అంగన్‌వాడి టీచరు తను పనిచేస్తున్న ఆ గ్రామానికి రోజూ బస్సులో వస్తుంది. ఆమె జీతంలో సగం బస్సు చార్జీలకే సరిపోతుంటుంది ఆమె బస్సు దిగి వచ్చేలోపల దుర్గమ్మ అంగన్‌వాడి సెంటర్‌లో కసువు నూకి ఎత్తేస్తుంది ఊర్లో సందుసందూ తిరుగుతుంది ఇంటింటి ముందూ ఆగుతుంది అయిదేండ్లు లోపల ఉన్న పిల్లల్ని పోగుచేసి సెంటర్‌లో సిద్ధంగా కూర్చోబెడుతుంది పిల్లలు ఒంటికి పోస్తే ఆలికే గుడ్డతో తుడుస్తుంది కక్కసు

చేస్తే దానిమీద ఈగలు వాలకుండా మన్నుతెచ్చి పోస్తుంది. పండ్రెండు కాగానే పిల్లోళ్లకు పౌష్టికాహారం పెండి పెడుతుంది ఆ తరువాత పిండిని ఊర్లో గర్భిణీ స్త్రీలకు పెడుతుంది. పిల్లల్ని సెంటరుకు పంపకుండా, పిండికి మాత్రం సత్తుగిన్నెలు ఊపుకుంటూ వచ్చే ఆడవాళ్లమీద ఖయ్యిమంటూ మండిపడినా చివరకు పట్టువిడుపులు ప్రదర్శిస్తుంది. రేపటినుంచీ మీ పిల్లోళ్లను సెంటరుకు పంపించకపోతే పిండి పెట్టేది లేదు చూడండి అని హెచ్చరిస్తుంటుంది.

మూడు దినాలకొకసారి సెంటర్లో బండలు కడుగుతుంది. పది రోజులకొకసారి పైకప్పులో బూజు దులుపుతుంది. నీ మాదిరి పనిచేసే ఆయాని నా సర్వీసులో చూడలేదు దుర్గమ్మా అని పదహైదేళ్ల సర్వీసుగల అంగన్‌వాడి టీచర్ మెచ్చుకుంటే 'పనిచేయకపోతే తీసుకున్న జీతం కడుపుకు అంటుతుందా అమ్మయ్యా' అంటుంది. 'నా మొగునికి అన్నం పెట్టేదానికీ, నా పిల్లోళ్లని బడికి పంపించేదానికీ మధ్యమధ్య ఒక పది నిముషాలు నన్ను ఇంటికి పంపుతల్లీ! ఇంక ఎంత పనైనా చేస్తాను' అంటుంది.



ఆ రోజు రెండవ తేదీ! దుర్గమ్మ చేతికి జీతమొచ్చింది. రంగయ్యనాయుడు తోటలో భర్త ద్రాక్ష చెట్లకు నీళ్లు కట్టి ఇంటికి వచ్చేటప్పటికి రాత్రి ఎనిమిదయింది. రాగానే అన్నం పెట్టు అన్నాడు. దుర్గమ్మ నవ్వుతూ రెండు సారాయి పాకెట్లను కాగులోంచి బైటికి తీసి మొగుని ముందు పెట్టింది.

'యాడివి?' అన్నాడు వెంకటేశులు ఆత్రంగా.

పిల్లోళ్లకు పిప్పరమెంట్లతో పాటు కొనుక్కొచ్చిన రెండు సిజర్ సిగరెట్లను కూడా అతని చేతిలో పెట్టి - 'నాకు జీతమొచ్చింది' అని ఆపుకోలేకుండా గలగలా నవ్వి మొగున్ని చుట్టేసుకుంది దుర్గమ్మ.

'నువ్వు నా రాణివే! నా చిలకవే!! నా పూర్వజన్మ పుణ్యానివే!!' అంటూ నాయుడి తోటకు నీళ్లు కట్టిన అలుపునంతా క్షణంలో మరచిపోయి పలవరించాడు వెంకటేశులు.

ఆరోజు ఊర్లోకి ఒక ట్రాక్టరొచ్చింది. బాలవాడి పిల్లలకు ఉప్మా వండి పెట్టడానికి అని మొక్కజొన్న రవ్వ, పామొలిన్ ఆయిలూ, వగైరా సరుకులు దించి వెళ్లిపోయింది. అక్కడినుంచి ప్రారంభమైంది దుర్గమ్మకు ఉద్యోగ సమస్య!

ఆరోజు పదకొండు గంటలకల్లా ఉప్మా వండిపెట్టేబాధ్యతను దుర్గమ్మకు ఒప్పజెప్పి, పిల్లలతో చిట్టీ చిలకమ్మా పాడించడంలో నిమగ్నమైపోయింది అంగన్‌వాడి టీచరు.

దుర్గమ్మ మొదట బోరింగు దగ్గరికి పోయి బిందెడు నీళ్లు ఎత్తుకొచ్చింది. రెండునెలలుగా పని లేకుండా పడివున్న పాత్ర సామానుని గోనెసంచి నుంచీ బైటికి తీసింది. బూడిదపోసి కొబ్బరి పీచుతో తోమింది. ఆ తరువాత పాత్రలు తళతళలాడేటట్లు నీళ్లుపోసి కడిగింది. అంగన్‌వాడి సెంటరు వెలుపల మూడురాళ్ల పొయ్యి పొందించి నిప్పు రాజేసింది. డేగిసాలో ఎసరుపెట్టి పొయ్యి మీదికి ఎక్కించింది. కట్టెల పొయ్యిలో పెద్ద గరిటపెట్టి, దాంట్లో చిటపటలాడే తిరగమోతని సుయ్... మంటూ ఎసట్లో కలిపింది. అట్లే రెండు గుప్పెళ్లు ఉప్పు కూడా వేసింది. ఆ తరువాత మరిగే నీళ్లలోకి మొక్కజొన్న రవ్వపోసి గరిటతో కలియదిప్పింది. పోపు వాసనతో ఘుమఘుమలాడే ఉప్మా నోట్లో నీళ్లూరిస్తుంటే ఇంటర్వెల్‌లో బైటికొచ్చిన పిల్లలు పొయ్యి దగ్గరే తచ్చాడుతున్నారు

అప్పుడు వచ్చినవాడు అక్కడికి కురుబ కిష్టప్ప. మాసిపోయిన ముతక బనియను తొడుక్కున్నాడు. కాల్చి ఆర్పేసిన తుంట బీడీ ఒకటి చెవిలో పెట్టుకున్నాడు. కిష్టప్ప సెంటు భూమి కూడా లేని కూలి. రెక్కాడితే గాని డొక్కాడనివాడు. పొట్టేళ్ల బొచ్చు కత్తిరించే పనికి పోతుంటాడు. అతని వెంట ఇంకా ఇద్దరు ముగ్గురు ఉన్నారు.

'ఎవరికి దుర్గమ్మా ఈ ఉప్మా' అని అమాయకంగా ముఖంపెట్టి అడిగాడు

'పిల్లోళ్లకి!' అని బిడియంగా నవ్వింది దుర్గమ్మ

ఆమె మనసేదో కీడు శంకించింది తనేదో చేయరాని పని చేసిందన్న భావం ఆమె మెదడులోకి చప్పున ప్రవేశపెట్టబడింది ఇప్పుడే కాదు, బుద్ధి తెలిసినప్పటినుంచీ ఆమెకు ఈ నేరభావాన్ని, పిరికితనాన్ని ఆమె మనసులోకి ప్రవేశపెట్టే ప్రక్రియ, స్త్రీ పరంగానూ జరిగింది, కులపరంగానూ జరిగింది.

భయమూ, తిరుగుబాటూ పరస్పరం వ్యతిరేకమైన ధోరణులు కావు భయానికి పరిణామ రూపమే తిరుగుబాటు తోకముడిచిన పిల్లిలో కూడా తిరుగుబాటు పంజా విప్పుతుంది ఆ విధంగా దుర్గమ్మలో తిరుగుబాటు పంజా విప్పడానికి కొన్ని అణచివేతలు బాగా దోహదం చేశాయి అప్పుడామె బడిలో నాల్గవ తరగతి చదువుతూంది. 'దసరా శలవుల తర్వాత మళ్లీ స్కూలు మొదలైన రోజది

'ఎప్పుడూ మా ఆడపిల్లలే కసువు నూకాలా? మీరు నూకండి కొన్ని దినాలు అని' మగపిల్లలతో ఆడపిల్లలు పేచీ పెట్టుకుంటున్నారు.

'కసువు నూకేది మా పని కాదు' అని మగపిల్లలు మొండి కేసుకున్నారు. ఆరోజు ఎవరు కసువు నూకాలని ఆడపిల్లల్లో సమస్య వచ్చింది.

'మేం కమ్మోళ్లం మీ కురవోళ్ల పిల్లోళ్లు నూకండి' అన్నారు కమ్మవాళ్ల పిల్లలు

'మేం కురవోళ్లం మీ మాదిగోళ్ల పిల్లోలు నూకండి' అన్నారు కురుబ కులం పిల్లలు.

'మేం హాల్లో నూకుతాం. మీరు వరండాలో నూకండి' అని ప్రతిపాదించింది దుర్గమ్మ

'పోపో' అన్నారు కమ్మవాళ్ల పిల్లలు

'పోపోపో' అన్నారు కురుబ కులం పిల్లలు

'అయితే, మాకేం పట్టింది పో' అని బిగదీసుకున్నారు మాదిగ కులం పిల్లలు

బాపన టీచరు వచ్చాడు చెత్తాచెదారంతో నిండిన గదినంతా కలియజూశాడు. ఎవరు ఎందుకు కసువు నూకలేదని విచారించాడు అందరు చెప్పిన మాటలూ విన్నాడు.

కమ్మవాళ్ల పిల్లల్ని వీసమెత్తు మాట అనలేదు కురవోళ్ల పిల్లల్ని మాట మాత్రంగా దండించాడు. మాదిగ పిల్లల్ని మాత్రం - 'ఇంత కొవ్వా మీకు భ్రష్టుముండల్లారా!' అని వారి కులాన్ని తిట్టిన తిట్టు తిట్టకుండా తిట్టాడు. అందర్నీ వరసలో నిలబెట్టి చేతులు చాపమని చింతబరికతో జవిరాడు.

ఆ విధంగా తను కులపరంగా పొందిన తిట్లూ, దెబ్బలూ, పరాభవాల్ని ప్రస్తుతం తన పిల్లలు అనుభవించవలసి వస్తే మాత్రం దుర్గమ్మ అప్పటిలాగా ఊరికే పడుండదు తన పిల్లల్ని హైన్యపరిచే అయ్యవారి మీదికీ, పెద్ద కులాల మీదికీ సివంగి మాదిరి విరుచుకుపడుతుంటుంది కానీ ఎంత కోపంలో కూడా - 'తక్కువ కులందానా! నోరు జారేవు జాగ్రత్త!' అని ఆమె మనసు అట్టడుగునుంచీ ఏదో గొంతు హెచ్చరిస్తూ ఉన్నట్లే ఉంటుంది ఆ హెచ్చరికను దాటడానికి ప్రేరేపించే పరిస్థితులు ఆమెకు కురుబకిష్టప్ప రూపంలో ఎదురయ్యాయి.

'మీ మాదిగోళ్ల చేతివంట మేమెప్పుడైనా తిన్నామా? ఈ పొద్దు మా పిలొల్లకు నీ చేతుల్తో చేసి పెడుతున్నావు?' అని అడిగాడు. ఆ ప్రశ్న మామూలుగా అడిగినట్లు లేదు. దుర్గమ్మను నిలదీస్తున్నట్లుంది ఆమె ఎక్కడ ఏ స్థానంలో పడి వుండాలో ఆమెకు గుర్తు చేస్తున్నట్లుంది.

నాకిన్ని మడులూ మాన్యాలూ ఉన్నాయని అహంకరించడానికి కురుబ కిష్టప్ప ఆస్తిపరుడు కాదు

నాకింత అధికారం ఉంది కదా అని విర్రవీగడానికి ఆ ఊర్లో అతని మాటకు దమ్మిడీ విలువలేదు. పుట్టగోచీకి కూడా గతిలేని కురుబకిష్టప్ప తన అహంకారాన్ని ప్రదర్శించుకోవడానికి ఇక ఈ భూమ్మీద మిగిలింది మాలమాదిగలే!

'బడికి వచ్చినంక అన్ని కులాల పిల్లోల్లూ ఒకటే కదా!' అని జవాబు ఇచ్చింది దుర్గమ్మ.

'అదెట్ల? ఈ పొద్దు కట్టడి తప్పిన పిల్లోల్లు రేపు మన ఊర్లో కట్టడి పాటిస్తారా? ఈ పొద్దు మేము మీ చేతి వంట తింటే, రేపు పొద్దున మీరు మా ఇళ్ళలోకీ, గుళ్లలోకీ కూడా వస్తామంటారు' అని కురుబ కిష్టప్ప తన దూరదృష్టిని ప్రదర్శించుకుంటూ ఉంటే, అంగన్‌వాడీ టీచరు మధ్యలో కల్పించుకుంది. 'ఫరవాలేదులెండి దుర్గమ్మ హరిజన్ అయినా గిన్నెలన్నీ బాగా తోమి శుభ్రంగా వంట చేసింది' అంది.

హరిజనులు శుభ్రంగా ఉండరని ఏనాడో తన పూర్వులు తన మనసులో నాటిన భావం ఆ అంగన్‌వాడి టీచర్‌లో ఇంకా పదిలంగానే ఉన్నట్లుంది.

శుభ్రత అనేది మనిషి వృత్తికీ, ఆర్థిక వర్గానికీ సంబంధించినది. ధాన్యం పండించేవారు మట్టివాసన కొట్టకుండా, పాలమ్మేవారు పేడవాసన కొట్టకుండా ఎలా వుంటారు? వారు ఉత్పత్తి చేసిన పాడినీ, పంటల్నీ అనుభవిస్తూనే; మరోవైపు వారి చెమట వాసనల ప్రత్యేకతల్ని అశుభ్రతగా ఆరోపణ చేసే మనస్తత్వం కాయకష్టానికి దూరమైన కులాలకు మాత్రమే వుంటుంది. తక్కెడ పట్టుకునే కులానికి సంబంధించిన అంగన్‌వాడి టీచర్ కూడా ఆ మనస్తత్వానికి దూరం కాలేకపోయింది. హరిజనులు అశుభ్రంగా వుంటారనే సామాన్య సత్యానికి ఒక అపవాదుగా మాత్రమే ఆమె తన హరిజన ఆయా శుభ్రతను ఒప్పుకోవడానికి సిద్ధపడింది.

'ఎంత శుభ్రంగా చేస్తే మాత్రం మాదిగమైల మాదిగమైలే? అదెట్లా పోతుందమా?' అని నిలదీశాడు కురుబ కిష్టప్ప.

దుర్గమ్మ పాటించే శుభ్రత కూడా కురుబ కిష్టప్పకు అప్రధానం కావడం పెద్ద ఆశ్చర్యమేమీ కాదు. కంబళిలో అన్నం తినే కులాచారం ఉన్న అతన్ని ఏ అశుభ్రత మాత్రం బాధిస్తుంది? మనిషి జాతిలోని 'ఆడ'కు దేవుడు ఆ నాలుగు రోజుల శరీరక ప్రక్రియ విధించాడు కాబట్టి సరిపోయింది కానీ, లేకపోతే ఆ కిష్టప్ప తన కుటుంబ స్త్రీలు ఎన్ని వారాలకొకసారి స్నానం చేస్తారో చెప్పగలిగేవాడు కాడు.

'రోజూ దుర్గమ్మ తన చేత్తో పిండి పెడుతూ వస్తూంది కదా! ఊర్లో ఉండే పిల్లోల్లూ, గర్భిణీ స్త్రీలు అంతా తిని పోతూనే ఉన్నారు కదా! మరి ఈ రోజు కొత్తగా మాట్లాడుతున్నారే?' అని అడిగింది అంగన్‌వాడి టీచరు. ఆమె తన ఉద్యోగ ధర్మంలో భాగంగా దుర్గమ్మ పక్షమే వహించి మాట్లాడింది.

పిండి పిండే! ఉప్మా ఉప్మానే!! పిండిని మిషిన్‌లో ఆడిస్తారు కాబట్టి తిన్నా ఫరవాలేదు. ఉప్మా చేతివంట కదా? తింటే మైలపడమా?' అని ఆ టీచరుకు ధర్మసూక్ష్మం బోధించాడు కురుబ కిష్టప్ప.

'ప్రాణం లేని ఆ పిండి మిషనుకు ఉన్న విలువ కూడా మా మాదిగోల్లకు లేదా? మేమూ మీ మాదిరే మనుషులం కామా?' అంది దుర్గమ్మ.

మరో ఇద్దరు కురుబ కులం మనుషులు వచ్చి వాదనకు దిగారు- 'మాల మాదిగలు వండితే తినడానికి మేమేం గతిలేనివాళ్ళమా? పోపోమ్మా! బాగా చెప్పినావు' అని గొంతులు పెంచి అరిచారు. వారి పిల్లలు కూడా ఆ బాలవాడి కేంద్రంలో ఉన్నారు. సాధారణంగా 'గతిలేని వాళ్లే' అంగన్‌వాడి సెంటర్‌లో పెట్టే పిండి కోసమూ, ఉప్మా కోసమూ పరుగులు పెడతారు. ఆ విధంగా గవర్నమెంటు సొమ్ము కోసం అడుక్కునేటప్పుడు అడ్డుపడని అహంకారం మాదిగవంట' తినడానికి మాత్రం అడ్డొ

పడుతుంటుంది. పాపం! వారేం చేస్తారు?

'సరే! మీ బిసి పిల్లోల్లకు ఉప్మా వద్దు అనుకుంటే అది మీ ఇష్టం .'' అంది అంగన్‌వాడి టీచరు

కురుబ కిష్టప్ప పిల్లలవైపు తిరిగి తన మెడమీది టవలు జాడిస్తూ అరిచాడు - 'పొండి. మన కురవోల్ల పిల్లోల్లంతా ఇండ్లకు పొండి రేపటినుంచీ సెంటరుకు వచ్చినారంటే చూడండి!'

కిష్టప్ప వీరావతారం చూసి ఎవరి పిల్లల్ని వాళ్లు చంకల్లో వేసుకుని పరుగెత్తారు ఆ పిల్లల అక్కయ్యలు

తమను ఇంటికి పిల్చుకుపోవడానికి పెద్దపిల్లలు లేని ఇద్దరు ముగ్గురు చిన్న పిల్లలు ఏం చేయాల్లో దిక్కుతోచక ఏడ్పు లంకించుకున్నారు. మాదిగ పిల్లలు కూడా గాభరా పడి పరుగెత్తబోతుంటే - మీరు కూర్చోండని దుర్గమ్మ అడ్డుకుంటూంది ఆ వాతావరణమంతా గవర్నమెంటు ఆస్పత్రిలో చిన్న పిల్లలకు సూదులు గుచ్చే వార్డులా తయారయింది

'ఈ ఉప్మానంతా యస్సీ పిల్లోల్లకే పెట్టు ఆయా! అంతకంటే మనమేం చేస్తాం?' అంది అంగన్‌వాడి టీచరు

'అదెట్ల కుదురుతుంది?' అని అరిచాడు కురుబ కిష్టప్ప.

'యస్సీ పిల్లోల్లు ఉప్మా తింటుంటే మా బిసి పిల్లోల్లు చూసుకుంటూ నిలబడాలా?' అని న్యాయమూ, ధర్మమూ అడుగుతున్నట్లు అడిగాడు.

'అయితే మమ్మల్ని ఏంచేయమంటారు?' అంది ఇంకేం చేయాలో బోధపడని అంగన్‌వాడి టీచరు.

'మా బీసీలకు లేని ఉప్మా యస్ సిలకూ ఉండకూడదు'

'మేం బీసీలకు ఉప్మా పెట్టం అని చెప్పలేదే?'

'మీరు చెప్పలేదు కానీ మా బీసీలే మాదిగ వంటకాన్ని తినరు'

'మీ పిల్లోల్లకు వద్దన్నారు, సరే! ఎస్.సి పిల్లోల్లకు కూడా ఉప్మా లేకుండా చేస్తే మీకేమొస్తుంది' అంది అంగన్‌వాడి టీచరు. ఆ మాట అడగడానికి అయితే అడిగింది కానీ, ఆమె గొంతులో పెద్దగా బలం లేదు. పల్లెటూళ్లలో ప్రజల అతి తెలివికిగానీ, అజ్ఞానానికిగానీ లొంగిపోతే తప్ప తనలాంటి బడుగు టీచరమ్మలు ఉద్యోగాలు చేసుకోలేరని ఆమెకు బాగా తెలుసు

'మాకేమీ రాదు. ఈ మాదిగోల్లకు ఇటువంటి ఉద్యోగాలిచ్చే గవర్నమెంటుకు బుద్దొస్తుంది' అని ఒకసారి చుట్టూ కలియజూశాడు కురుబ కిష్టప్ప.

'లేయ్, పట్టంద్రా! ఈ ఉప్మాను దిబ్బలో బోర్లించి వస్తాము ఇది మనుషులు తినాల్సింది కాదు; కుక్కలు తినాల్సింది' అంటూ పెద్దగొంతుతో అరిచాడు. ఒక కులస్థుడు సాయం పట్టడానికి ముందుకొచ్చాడు. అడ్డుపడిన దుర్గమ్మను పక్కకునెట్టి, ఆ మనిషి సాయంత ఉప్మాను దిబ్బలోకి బఓర్లించి వచ్చాడు

అటునుంచీ ఒక కుక్కా, ఇటునుంచీ ఒక కుక్కా వచ్చింది. మరోవైపునుంచీ రెండు కుక్కలు వచ్చాయి. దిబ్బపైకి ఉరికి గయ్యిమంటూ కలబడ్డాయి. కుయ్యోమంటూ అరిచాయి మధ్యమధ్య గుర్రుమంటూనే గిన్నెమూసలో అచ్చుపోసినట్టున్న ఉప్మాను వాసన చూస్తూ కొంచెం కొంచెం పాము నాలికల్లా నాకుతున్నాయి. ఒక కుక్క ఆబగా తినబోయింది. కాలేకాలే ఉప్మా దవడల్లో ఇరుక్కుంది. అది జిగటుగా ఉండి బైటికి ఊడిరాకపోయేసరికి ఆ బొబ్బలెక్కే వేడికి అరుస్తూ ముందుకాళ్లతో ముఖాన్ని రాసుకుంటూ దిబ్బంతా పొర్లాడింది. దిబ్బలో ఎండిపోయిన పేడనుసి లోంచీ దుమ్మునంతా పైకి రేపి ఉప్మామీద కూర్చునేటట్లు చేసింది

తన చేతి వంటకు పట్టిన గతి చూస్తుంటే దుర్గమ్మకు తననే దిబ్బలోకి ఈడ్చి హీన పరిచినట్లుంది. తనపైకే ఊరకుక్క ఉసిగొల్పినట్లుంది

'మీరు మనుషులేనా? ఛీ' అన్నట్లు ఈసడింపుగా చూసింది దుర్గమ్మ. దుర్గమ్మవైపు నేరుగా చూసి మాట్లాడే ధైర్యం లేక అంగన్‌వాడి టీచరు వైపు తిరిగాడు కురుబ కిష్టప్ప.

'మాకు మాదిగ ఆయా వద్దు. మా బిసి ఆడమనిషిని ఆయాగా పెట్టేటట్లయితే, ఇక్కడ మీ సెంటరు నడపండి. లేకపోతే మాకు మీ అంగన్‌వాడి సెంటరే వద్దు' అన్నాడు

'మాదిగ ఆయా వద్దు అనేదానికి నువ్వెవరు?' అని అరిచింది దుర్గమ్మ. ఆమె ఒంట్లోని రక్తం సలసలా మరిగి చెవుల్లోకి వెచ్చగా ఎగదన్నింది.

'నాకు ఆయా పనిని నువ్వు ఇప్పించలేదూ, మీ జేజినాయన ఇప్పించలేదు. నా ఉద్యోగం తీసేయమని చెప్పేదానికి నువ్వెవరు?' అని నిలదీసింది.

'ఇదో! ఇదో! ఆడదానివి! నోరు జారొద్దు. మంచిది కాదు'

'ఏం? ఏం చేస్తారు?? నేను ఆడదాన్ననే జ్ఞానమే మీకుంటే, మీరంతా ఇట్ల ఒక పరాయి ఆడదాని ముందుకు వచ్చి ఇంత గలాటా చేస్తారా? అని అరిచింది.

- తక్కువ కులం ఆడవాళ్ల దగ్గర విర్రవీగే మగవాళ్లు దుర్గమ్మకు కొత్తేమీ కాదు.

అప్పుడామెకు పదహారేళ్లుంటాయి. ఇంకా పెళ్ళి కాలేదు. ముఖం కడిగి, పౌడరు కొట్టి, నుదుట చుక్కబొట్టు పెట్టి, కళ్లకు కాటుక పెడితే, దివినుంచీ భువికి దిగివచ్చిన గంధర్వకన్యలా ఉండేది. అప్పట్లోనే సర్పంచు రంగయ్యనాయుడి బావ మరుదుల్లో ఒకడు ఇంటర్మీడియెట్ డుంకీలు కొట్టి ఊర్లో చిత్తకార్తె కుక్కలా తిరుగుతుండేవాడు. సుఖరోగాలు ఉన్నవాడిలాగా లుంగీ కట్టుకుని ఎప్పుడూ హరిజనవాడలో తచ్చాడుతూ వుండేవాడు. ఒక ముద్దలా ఉండే దుర్గమ్మ వైపు వెకిలిగా చూసేవాడు. పళ్ళికిలించి నవ్వేవాడు. ఇదంతా చూసీ, చూసీ ఇద్దరు ముగ్గురు కులపెద్దలు ఆ పిల్లవాని తండ్రితో చూచాయగా ఫిర్యాదు చేశారు. అప్పుడు ఆ అగ్రకులం తండ్రి - 'నాకు నా కొడుకు గురించి లేనిపోనివి చెప్పే బదులు, మీరు మీ ఆడపిల్లల్ని అదుపులో పెట్టుకోవచ్చు కదా?' అని సలహా ఇచ్చాడట.

ఆ ఇంటర్మీడియెట్ పిల్లవాడు ఒకసారి గడ్డివాము దగ్గర చేయి పట్టుకుంటే విడిపించుకుని పారిపోయి వచ్చింది దుర్గమ్మ. మరోసారి మిషన్ రూములో కౌగిలించుకోబోతే భయంతో కేకలు పెట్టి తప్పించుకుంది.

'మీ బంగారం మంచిదైతే ఎవరేం చేస్తారు; పోండ్రా' అని తేలిగ్గా నవ్వి వీళ్లనే మందలించి పంపించాడట ఆ పిల్లవాని తండ్రి. అప్పటినుంచీ మొదలు - దుర్గమ్మకు అగ్రకులాల మగవాళ్లపట్ల ఒక అసహనంలాంటిది కలగడం!

'మా బంగారు ఎటువంటిదో మీరు పరీక్షిస్తారు. మీ బంగారు ఎటువంటిదో మా మగవాళ్ళు పరీక్షచేసి చెప్తే బాగుంటుంది కదా?' అని మాట్లాడే తెలివి ఆనాడు తనకు లేకపోయినందుకు దుర్గమ్మ ఇప్పటికీ విచారిస్తూనే వుంటుంది.

తాను దుర్గమ్మతో సూటిగా వాదించకపోయినా, దుర్గమ్మే తనతో ఎదురేసుకుని వాదనకు దిగడం కురుబకిష్టప్ప ప్రాణానికి సంకటంగా ఉంది

'నేను ఆడదాన్నే! అయితేనేమి? ఏం చేస్తారు మీరు?? మా మగవాళ్లు కూడా మీ ఆడవాళ్ల దగ్గరికి పోయి ఇప్పుడు మీరు చేస్తున్నట్లు గలాటా చేస్తే...?' అని దుర్గమ్మ నోరు చేసేసరికి - 'నువ్వు ఆడదానివి

కాదు, మగరాయునివి' అని గొణుక్కుంటూ, అంతమందిలో ఒక ఆడదానితో తిట్టించుకుని పరువు పోగొట్టుకోవలసి వస్తుందే అన్న మగ భయంతో గుండె జారి లేని బింకం తెచ్చుకుంటూ సర్పంచ్ నాయుడింటివైపు గబగబా వెళ్లిపోయాడు కురుబ కిష్టప్ప



దుర్గమ్మ ఇంటికొచ్చింది. చిన్న పాపను ఒళ్లో వేసుకుని గడపమాను ముందు కూర్చుంది పేడదిబ్బ మీద బోర్లించిన ఉప్మానే ఆమె కళ్లలో కదులుతూంది దిబ్బపాలైన ఈ ఉప్మా వైపు ఆశగా చూసే చిన్నపిల్లల చూపులు గుర్తొచ్చి ఆమె మనసంతా వికలమవుతూంది చిన్న పాప గుక్కపెట్టి ఏడుస్తుంటే పాలకే అనుకుంది.

ఇంతలో ముఖాన్ని మటమట మాడ్చుకుంటూ వచ్చాడు వెంకటేశులు. దుర్గమ్మతో ఒక్కమాట మాట్లాడలేదు వచ్చీరావడంతోనే ఎద్దులకు నీళ్లు తాపే ప్రయత్నంలో పడ్డాడు.

ఇంటి బయట వేపచెట్టు కింద మట్టితో మెత్తిన గాట్లో మేతమేస్తున్నాయి ఎద్దులు నీళ్ల బకెట్టు తెచ్చి ఒక ఎద్దు ముందు పెట్టాడు. అది రెండు మూడుసార్లు నీళ్లలోకి నాలుక అద్ది తలెత్తి వెంకటేశులు ముఖంలోకి అర్థవంతంగా చూసింది

'బాగా అలవాటయిపోయింది దీనికి! తౌడు రాలిస్తే తప్ప ముట్టదు' అని గొణుక్కుంటూ ఇంట్లోపలికి పోయి, శేరుతో తౌడు ముంచుకువచ్చి బకెట్టు నీళ్లు తాగకుండా నాలుక చాపి తౌడును మాత్రం నాక్కోవడానికి చూసింది. తేలాడే తౌడును నీళ్లలో కలియదిప్పి; ట్రు ..వ్వ, ట్రువ్వ అంటూ నీళ్లు తాగమని ఎద్దును బుజ్జగింపబోయాడు అది ఏం వినిపించుకోకుండా కళ్లవరకూ మునిగేటట్లు మోరను బకెట్టులోకి ముంచి, అడుగునున్న తౌడు కోసం మూతితో కెలకడం మొదలుపెట్టింది కాలుభాగం నీళ్లు బకెట్లోంచీ కిందికి వొలికిపోయాయి

వెంకటేశులుకు ఓర్పు నశించింది 'ధూ! దీనెమ్మ. గబ్బుది! దీనికంటే బరిగొడ్డు మేలు' అని అరిచి చేతుల్లోకి చెర్నాకోల తీసుకుని పూనకమొచ్చినట్లు ఎద్దును రపారపా జవరడం మొదలుపెట్టాడు.

'నీకేమన్నా తిక్కగానీ పట్టింది! ఇంట్లో పడుండాల్సిన ఆడలంజలు రచ్చకెక్కి మొగోళ్లతో వాదానికి దిగుతుంటే; ఇంక ఈ ఇంట్లో మగోన్ని నేనుండుకంట?'

మొగుని బాధ ఏమిటో - అప్పటికి అర్థమైనట్లుగా ముఖం పెట్టి నెమ్మదిగా అంది 'ఓహో! అత్తమీది కోపం దుత్తమీద చూపినట్ల అదన్నమాట సంగతి!'

తన మానాన తాను పనిచేసుకుపోతుంటే, కురుబ కిష్టప్ప వచ్చి ఎంత ఆగంతం చేసిందీ, అప్పుడు తానేం మాట్లాడిందీ... అంతా విడమరిచి చెప్పుకుంటూ వచ్చింది దుర్గమ్మ. అంతా విని - 'అయితే మాత్రం; ఆడదానివి అనే జ్ఞానం కూడా లేకుండా అంతమంది మగోళ్లముందు బరితెగించి మాట్లాడతావా? అని అరిచాడు... ఎంత చెప్పినా, ఇంకా తననే తప్పుపడుతున్న మొగునివైపు అసహనంగా చూసింది దుర్గమ్మ. ఇంతలో అక్కడికి ఊరి తలారి వచ్చాడు.

'నిన్ను రంగయ్యనాయుడు పిలుస్తుండాడు'

'ఎందుకు?' అని అడిగాడు వెంకటేశులు.

'ఏమో, నాకేం తెలుసు?'

'ఎవరున్నారక్కడ?'

'కురుబ కిష్టప్ప ఉండాడు; నువ్వు బిరానపో!' అంటూ తలారి వెళ్లిపోయాడు. దీనికంతా నువ్వే

కారణం అన్నట్లు భార్యవైపు మి(ర్రిమి(ర్రి చూశాడు వెంకటేశులు ఆ చూపులు తనకు అర్థమైనట్లు ముఖం పెట్టి - నేను ఆడదాన్ని! నోరు విప్పితే తప్పు. సరే! నువ్వు మొగోనివి కదా? నాయుడు చెప్పందానికి గంగిరెద్దు మాదిరి ఊకొట్టి వస్తావో? లేక చీమూ నెత్తురు ఉన్న మగోని మాదిరి మాట్లాడి వస్తావో... అదీ చూస్తాను. పోయిరాపో!' అని నెమ్మదిగా మాట్లాడుతూనే సవాల్ విసిరింది దుర్గమ్మ వెళ్లిపోతున్న భర్తవైపే చూస్తూ, చిన్నపాపకు చన్ను మార్చి పైట సరిజేసుకుని మళ్లీ ఏదో దీర్ఘాలోచనలో పడింది.

★ ★ ★

వెంకటేశులు వెళ్లేటప్పటికి ఇంటి అరుగుమీద కూర్చొనున్నాడు కురుబ కిష్టప్ప. ఆ అరుగు మీదే ఒక కుర్చీ వేసుకుని ఆశీనుడై ఉన్నాడు రంగయ్య నాయుడు. తలకు పేటాగా చుట్టుకున్న టవాలు విడదీసి చంకలో పెట్టుకుని, సర్పంచుకు భక్తిగా నమస్కారం పెట్టాడు వెంకటేశులు ఆ నమస్కారానికి గంభీరంగా తల ఊగించి; ఇప్పుడు చెప్పు అన్నట్లు చూశాడు సర్పంచు కురుబ కిష్టప్పవైపు.

'మన ఊర్లో అంగన్‌వాడి సెంటర్ అయ్యాగా ఈ వెంకటేశులు భార్య దుర్గమ్మను పెడితే ఎట్ల? మాదిగోల్లు వండే ఉప్మాను మన పిల్లోలు ఎట్ల తింటారన్నా?' అంటూ వెంకటేశుని పరోక్షంలో ప్రస్తావించిన విషయాన్నే మళ్లీ మొదలుపెట్టాడు కురుబ కిష్టప్ప.

'అది గవర్నమెంటు ఉద్యోగం కదా! దానికి మనమేం చేస్తాం రా?' అన్నాడు రంగయ్యనాయుడు, తన మాటల్లో మొదటి పావును జరుపుతూ గుర్రాన్ని కాజేయడానికి బంటును ఎరగా వేసే మంచితనం అతనిది.

'ఈ గవర్నమెంటుకు బుద్ధి లేదన్నా! మాదిగోల్లనీ, మాలోల్లనీ ఓట్ల కోసం నెత్తికెక్కించుకుంటుంది. చెప్పులు తెచ్చి ఎవరైనా ఇంటి మధ్యలో పెట్టుకుంటారా? ఎవర్ని ఎక్కడ పెట్టాలో అక్కడ పెట్టల్ల'

'కాలం మారిపోయింది కదరా? కాలంతోపాటు మనమూ మారల్ల' అన్నాడు ఉదారంగా నాయుడు.

నాయుడు మాటలకు వెంకటేశులు హమ్మయ్య అని ఊపిరి పీల్చుకున్నాడు.

'మాదిగోల్లు వండింది తింటే మైలపడిపోమా అన్నా?'

'మనం పేటకు హోటళ్లలో దూరి, టీలూ కాఫీలూ తాగుతున్నాం కదా? టిఫిన్లూ, భోజనాలూ చేస్తున్నాం కదా?? ఆ వంటకాలన్నీ బాపనోల్లే వండిపెడుతున్నారా? మన ఊరి మాదిగోల్లు నలుగురున్నారు ఉరవకొండ హోటళ్లలో? ఆ హోటళ్ళలో తింటే లేని మైల మన వెంకటేశుని భార్య వండిపెట్టే ఉప్మా తింటే వస్తుందా?' అని నాయుడు ఎగతాళిగా నవ్వాడు.

వెంకటేశులకు నాయుడిమీద భక్తి గబగబా పెరిగిపోయింది. అతనికెందుకో నాయుడి కాళ్లు చుట్టేసుకుని వలవలా ఏడ్చేయాలనిపించింది. తక్కువ కులం వాళ్ల లోపాల్నీ, ఎక్కువ కులం వాళ్ళ సుగుణాల్నీ భరించవలసి రావడం ఏ మనిషికైనా కొంచెం కష్టమే!

నాయుడేనా ఇట్ల మాట్లాడేది అన్నట్లు కురుబ కిష్టప్ప గుడ్లు ఒప్పగించి చూస్తున్నాడు. ఈ కిష్టప్ప అవస్థ చూసి జాలిపడిన నాయుడు - కానీ... అంటూ తన స్వస్వరూపాన్ని సాక్షాత్కారింపజేయడం మొదలుపెట్టాడు.

మనం, పెద్దొల్ల కాలంనుంచీ వస్తున్న ఊరి కట్టుబాట్లను అంత తొందరగా వదలులుకోలేము ఇప్పుడు ఆ వెంకటేశులు గాడున్నాడు. వచ్చి ఈ అరుగుమీద కూర్చోరా అంటే కూర్చుంటాడా?'

అని మధ్యలో ఆపి వెంకటేశులు వైపు తిరిగి - 'ఏరా? కూర్చుంటావా?' అని అడిగాడు లోపల ఎంత కర్కశత్వం ఉన్నా, బైటికి మాత్రం సౌమ్యంగా మాట్లాడటం నాయుడికి తన కుటుంబ వారసత్వంగా సంక్రమించిన విద్య.

'అయ్యయ్యో! ఆ పని నేనెట్లా చేస్తాను గొంచికాడా!' అని చెంపలేసుకున్నాడు వెంకటేశులు. వెంకటేశులి నుండీ ఆ జవాబు రాకతప్పదనే ఉద్దేశంతోనే నాయుడు ఆ ప్రశ్న వేశాడు తను ఊహించినట్లుగానే వెంకటేశులు జవాబివ్వడం చూసి, తన తెలివికి తానే చిరునవ్వు నవ్వాడు రంగయ్యనాయుడు

'ఆ. అదీ! ఈ అరుగుమీద నువ్వెందుకు కూర్చోలేవు అంటే. ఇంతవరకూ నీ తండ్రీ, నీ తాతా ఈ అరుగుమీద కూర్చోలేదు కాబట్టి. అంతేకదా?' అని అడిగాడు. అంతేకదా? అని నాయుడు అడిగిందానికి జవాబు వేరే ఏముంటుంది? 'అంతే గొంచోడా' అని ఒప్పుకున్నాడు వెంకటేశులు కూడా.

'అదేరా మన ఊరి కట్టుబాటు! అదేరా మన సంప్రదాయం' అంటూ తేల్చేసి, అంతవరకూ తను కాకమ్మ గువ్వమ్మ కథ మాట్లాడిన దానికీ, ప్రస్తుతం తను మాట్లాడబోతూ ఉన్న అసలు విషయానికి ముడిపెట్టే కార్యక్రమంలో పడ్డారు రంగయ్యనాయుడు.

'మీ తండ్రి తాతలెప్పుడూ ఈ అరుగుమీద కూర్చోనట్లే, మేము కూడా ఎప్పుడూ మీ మాదిగ వంట తినలేదు. తిన్నామా చెప్పు!' అని అడిగాడు

'లేదు గొంచిగాడా' అని అమాయకంగా ఒప్పేసుకున్నాడు వెంకటేశులు.

'మరి, ఈ రోజు మీ చేతివంట తినాల్సి వస్తే ఎవరికైనా బాధేకదా?'

'నిజమే గొంచికాడా!'

'కాబట్టే ఒక పని చెయ్' అంటూ, ఇది చివరి ఎత్తు అన్నట్లు మాటల పావు కదిపాడు రంగయ్యనాయుడు. 'నీవూ నష్టపోకూడదు వీళ్ళూ బాధపడకూడదు. కాబట్టే రేపటినుంచి నీ భార్య అంగన్‌వాడి సెంటర్లో కసువు నూకేపని చూసుకుంటుంది. ఈ కిష్టిగాని భార్య వంట పని చూసుకుంటుంది. ఆయా జీతం నూటయాభై రూపాయలు కదా? ఆ జీతాన్ని ఇద్దరూ చెరిసగం పంచుకోండి! అని తీర్పు చెప్పేసి - ఏమంటారు?' అని అడిగాడు.

'ఇందులో తనకు లాభమే గానీ నష్టమేమీ లేదే' అనుకుని కురుబ కిష్టప్ప గబుక్కున తలూపి - నీ ఇష్టమన్నా' అని ఒప్పేసుకున్నాడు.

'ఏరా? నువ్వూ??'

అయోమయంనుంచీ తేరుకోకుండానే, సరే అన్నట్లు అసంకల్పితంగా తల ఊపాడు వెంకటేశులు. అట్ల తలూపింది వెంకటేశులే అని కళ్ళతో చూసిన వాళ్లు అనుకోవచ్చుగానీ, నిజానికి - చచ్చిపోయిన అతని తండ్రో, తాతో, ఏ పూర్వులో ఆ క్షణంలో అతనికి ఆవహించి తల ఊపించి ఉంటారని కూడా అనుకోవచ్చు 'పొండి, ఎవరి పనులు వాళ్ళు చేసుకోండి కొట్లాటలకు దిగకండి. మన ఊరు ఎంతో సంప్రదాయ కల ఊరు! ఎంతో కట్టడిలో ఉన్న ఊరు! చాలా ప్రశాంతమైన ఊరని మన గ్రామానికి పేరుంది ఆ పేరు చెడగొట్టకండి' అని చిట్టచివర వాళ్ళిద్దరికీ రంగయ్యనాయుడు హితోపదేశం చేశాడు.

నిజంగా అది ప్రశాంతమైన ఊరే? సర్పంచుగిరీకి రంగయ్యనాయుడితో పోటీ చేసే మొనగాడింకా

ఆ ఊర్లో పుట్టుకురాలేదు. నీకు ఎవడు మంచోడైతే వాడే స్టోరు డీలరా? గ్రామంలోని కంట్రాక్టులన్నీ నీ ఒక్కని హక్కేనా? అని నిలదీసి ప్రశ్నించే 'తెలివి మీరిన వాళ్ళెవరూ ఇంకా ఆ గ్రామంలో పుట్టుకురాలేదు అతడు గీచిన గీటు పిల్లికూడా దాటదు ఎవరు ఎవరితో కొట్లాడినా, అతనిదే చివరి తీర్పు ఇంక ఆ ఊరు ప్రశాంతంగా ఉండకుండా ఎట్ల ఉంటుంది?

వెంకటేశులుకు అంతా చిత్రంగా ఉంది మొట్టమొదట రంగయ్యనాయుడు మాట్లాడింది ఎవరివైపు? తనవైపు! చివరికి తీర్పునిచ్చింది ఎవరివైపు? ఏమో!! అక్కడినుంచీ తలగోక్కుంటూ మెల్లగా వెళ్లిపోయాడు వెంకటేశులు

పాపం రంగయ్యనాయుడు మాత్రం ఏం చేస్తాడు? అతనికి నూరెకరాల సేద్యం. జీతగాళ్లు లేకుండా కేవలం కూలివాళ్లతో పని జరగదు కూలివాళ్లు పొద్దున పనికి వంగితే, పొద్దు మునిగేసరికి తమ ఇళ్లకు పరుగెత్తుతారు. జీతగాళ్లుఅట్లా కాదు; పగలూ రాత్రీ కూడా నాయుడి సేద్యం పనుల్లో తరించాల్సిందే అట్లాంటి జీతగాళ్లు నలుగురుంటే తప్ప నాయుడి వ్యవసాయ పనులు సజావుగా సాగవు.

ఒరే! వెంకటేశూ! నా దగ్గర జీతం ఉందువురారా' అని పిలిచాడు; నెల కిందట!

'కూలీకైతే వస్తానుగానీ, జీతానికైతే ఉండను గొంచిగాడా' అన్నాడు నిజమే! కూలికిపోవడంలో ఉన్న స్వేచ్ఛ జీతగానిగా కుదురుకోవడంలో ఎందుకుంటుంది? కడుపునిండాక మూడు రోజులు మునగదీసుకుని పడుకున్నా కూలోల్లను అడిగేవారు లేరు. అప్పటికీ చిలక్కి చెప్పినట్లు నాయుడు రెండు మూడుసార్లు చెప్పి చూశాడు. కానీ వెంకటేశులు వినలేదు. దాని ఫలితమే ప్రస్తుతం రంగయ్యనాయుడి తీర్పు! తాను అతని కులంమీద కొట్టిన దెబ్బ అతని ఆర్థిక పరిస్థితిని కూడా దెబ్బ తీస్తుందనీ, చివరికి అదే అతన్ని తన చెప్పు చేతలకిందికి నడిపిస్తుందనీ నాయుడి ఆశ. రంగయ్యనాయుడికి దౌర్జన్యం తెలియదు; రాజకీయం తప్ప!



నాయుడు చెప్పిన తీర్పును వినగానే, దుర్గమ్మ భర్తవైపు అదోమాదిరి చూసింది ఆ చూపు వెంకటేశులకు తన మగతనంలో గుచ్చుకున్నట్లయింది. వెటకారంగా మాట్లాడింది. ఒక్కొక్క మాటా అతని గానుగెద్దు మనస్తత్వంలో బాకు మాదిరి దిగబడింది.

'దేనికైనా పట్టువిడుపులుంటాయి. సర్దుకుపోవల్ల' అన్నాడతడు నిదానంగా! నాయుడి దగ్గర తన పిరికితనాన్నీ, తెలివిమాలిన తనాన్నీ వేదాంత ధోరణిలోకి మార్చుకుంటే' భార్య దగ్గర ఏ కొంచెమైనా మర్యాద మిగులుతుంది కదా అని అతని ఆశ.

'నీకు బైటి విషయాలు తెలీవు. నోరు మూసుకో' అన్నాడు. గడప దాటిపోని ఆడదానికి ఊరిలోని ప్రమాదకరమైన రాజకీయాలు ఏం తెలుస్తాయి? అన్న హెచ్చరికా, తృణీకారమూ ధ్వనించాయి అతని గొంతులో. స్త్రీ అయిన దుర్గమ్మకు నిజంగానే ఊరి రాజకీయాలు తెలిసే అవకాశం లేదు. కానీ ఎంత మగవాడైనప్పటికీ; తనపై కులాలకు తెలిసినంత రాజకీయం తనకు కూడా తెలిసే అవకాశం చాలా తక్కువన్న విషయం అతనికి తెలీదు

అప్పటికి దుర్గమ్మ నాయుడిమీద దుమ్మెత్తిపోయడం ఆపకపోవడంతో చివరికి - 'ఆడదానివి, ఆడదాని మాదిరే పడి వుండు' అని హెచ్చరించాడు.

'మగోడు మగోనిమాదిరే వుంటే, ఆడది ఆడదాని మాదిరే పడి వుంటుంది' అంది దుర్గమ్మ

'అంటే నీ ఉద్దేశ్యమేమి? నువ్వు మగరాయునివీ, నేను ఆడంగుల నాకొడుకునీ అనే కదా?' అంటూ

గూబగుయ్యుమనేటట్లు భార్య చెంపమీద చాచి కొట్టాడు. ఆమె పడిపోబోతూ నిలదొక్కుకుని - 'నీ మగతనమంతా నా దగ్గరే' అనేసరికి చేతిలోకి చెర్నాకోల తీసుకుని నాలుగు పీకులు పీకి - 'నువ్వు ఆడదానివేనా? ధూ?' అని కాండ్రించి మూసి బయటికి వెళ్ళిపోయాడు

★ ★ ★

ఆ మరునాడు దుర్గమ్మ యథాప్రకారంగా అంగన్‌వాడి సెంటరుకు పోయింది. కసువులు నూక్కి, ఇంటింటికీ పోయి పిల్లోళ్లను పిలుచుకొచ్చి కూర్చోబెట్టేసరికి; మహారాణిలా చేతులూపుకుంటూ వచ్చింది కిష్టప్ప భార్య. బిందెక్కడ, పాత్ర సామానెక్కడ అని కావాల్సినవన్నీ స్వాధీనపరుచుకుంది బిందెతో నీళ్లు తెచ్చుకుని వంట వండటం ప్రారంభించింది

పొయ్యి వెలిగించింది. ఎసరు పెట్టింది. తిరగమోత వేసింది మొక్కజొన్న పిండి పోసింది కలియదిప్పి మూతపెట్టింది.

అంతా చూస్తూ దుర్గమ్మ కూడా కట్టెల పొయ్యిలాగే భగ్గుభగ్గున మండిపడింది గిన్నెలోని ఎసరులాగే సలసలా కాగిపోయింది. ఉప్మా వంటకం లాగే కుతకుతా ఉడికిపోయింది కురుబ కిష్టప్ప భార్య పిల్లోళ్లకు ఉప్మా పెడుతుంటే, ఒకసారి తన చేతులవైపు పరీక్షగా చూసుకుంది.

మరునాడు కురుబ కిష్టప్ప భార్య ఒక అడ్డుపుల్ల వేసింది - 'వంట చేయడమే నా పని. పొయ్యిలోకి కట్టెపుల్లలు తీసుకువచ్చేది కూడా నీ పనే!'

దుర్గమ్మ మారు మాట్లాడకుండా కట్టెపుల్లలు ఏరి తెచ్చే బాధ్యతను కూడా మోసుకుంది. అంగన్‌వాడి టీచరుకు దుర్గమ్మ పట్లే సానుభూతి ఉంది. కానీ సర్పంచు మాటకు ఎదురు చెప్పలేక జరిగేదంతా నిమిత్తమాత్రురాలిగా చూస్తూ ఉంది.

ఆ నెల గడిచింది.

★ ★ ★

ఒకటవ తారీకు వచ్చిపోయిన మరుసటిరోజు అంగన్‌వాడి టీచరు ఆయా జీతం తెచ్చింది.

'నా జీతం...'' అంది కురుబ కిష్టప్ప భార్య.

'నా జీతం ..' అంది దుర్గమ్మ.

అంగన్‌వాడి టీచరు ఒకసారి వాళ్ళిద్దరి ముఖాలు చూసింది.

కిష్టప్ప భార్య ముఖం ఆబగా, ఆత్రంగా ఉంది.

దుర్గమ్మ ముఖం దేనినో నిగ్రహించుకున్నట్లుంది.

'నీ జీతం నీ ఇష్టం' అంటూ అంగన్‌వాడి టీచరు దుర్గమ్మ చేతిలో నూటాయాభై రూపాయలూ పెట్టింది. తను ఆయా ఉద్యోగం కోసం చేసిన వెయ్యి రూపాయల అప్పు దుర్గమ్మ మనసులో ప్రశ్నై మొలకెత్తింది.

కిష్టప్ప భార్య ఆత్రంగా -

'నా జీతం . నా జీతం. .' అంది.

'దుర్గమ్మను అడుగు'

'నా జీతం, నా జీతం .'

'దుర్గమ్మతో ఇప్పించుకో . ''

'ఛీ, ఆ మాదిగదాన్ని అడుగుతానా?' అంది కురుబ కిష్టప్ప భార్య రోషంగా

చివ్వున తలెత్తింది దుర్గమ్మ

'నువ్వు ఈ మాదిగదానికింద పనిచేసేదానవే!'

'పోయే!'

'నువ్వు నా దగ్గర చేయిసాచి జీతం అడుక్కోయే'

'పోపోయే!'

'నిన్న ఉద్యోగం పంచుకున్నావు. ఈ పొద్దు జీతం పంచమంటున్నావు రేపు ఇంకేం పంచమని అడుగుతావే దొంగనా సవితీ?'

'ఏం మాటే నువ్వు కూసేది? ఏదీ ఈసారి అను' అంటూ మీదిమీదికి వచ్చింది కిష్టప్ప భార్య.

'అంటానే! అంటాను. ఒకసారి కాదు, మూడుసార్లు అంటాను, నువ్వు నా సవితివి! నా సవితివి!! నా సవితివి!!!'

ఇద్దరూ కొప్పు కొప్పు పట్టుకున్నారు.

దభీదభీమని గుద్దుకున్నారు.

బూతులు తిట్టుకున్నారు.

శాపనార్థాలు పెట్టుకున్నారు.

కొట్లాట సద్దుమణిగే సమయంలో, కురుబ కిష్టప్ప రంగంలోకి దూకాడు. విధిలేని పరిస్థితుల్లో వెంకటేశులూ తలదూర్చాడు. ఆడవాళ్ల కొట్లట మగవాళ్ల కొట్లాటగా మారింది.

ఆవైపునుంచీ కురుబ కిష్టప్ప అన్నదమ్ములు దుడ్డుకర్రలు చేతబట్టుకుని దూకారు. ఈవైపునుంచీ వెంకటేశులి బావమరుదులు రొమ్ము విరిచి నిలబడ్డారు.

ఇప్పుడు ఎవరి బుర్రైనా బద్దలు కావచ్చు

ఎవరి మోకాలి చిప్పలైనా పగిలిపోవచ్చు.

ఇదంతా ఏ క్షణమైనా నాయుడి చెవిలో పడొచ్చు.

ఆ తరువాత ఇంకా ఏమైనా కావచ్చు.

అమ్మవారి శిలా విగ్రహంలోంచి చప్పున కనుగుడ్లు విచ్చుకున్నట్లు భయంకరంగా ఉంది దుర్గమ్మ చూపు.

ప్రశాంతమైన ఊరు అనే 'మంచి పేరు' పోగొట్టుకోవడానికి ప్రస్తుతం ఆ గ్రామం సిద్ధంగా ఉంది.



# విలోమం

## చిలుకూరి దేవపుత్ర

ఈ ఆదివారమే కాదు, ఏ ఆదివారమూ నాకు సెలవు దినంగా అనిపించదు. ఆఫీసు పని తప్పినా, వంట పని తప్పదు కదా.

''రాధా! టీ త్వరగా! మా వాళ్లు వెళ్లిపోవాలని ఆత్రపడుతున్నారు'' అంటూ నన్నుద్దేశించి జీవన్ బయటి గదిలోంచి కేక!

''ఆ వస్తున్నా!'' అంటూ బదులు కేకవేశాను

అయిదు నిమిషాల్లో అందరికీ టీలు అందించాను జీవన్ అక్కడ కూచుని వున్న నలుగుర్నీ ఓసారి పరకాయించి చూసి - నల్లగా, సన్నగా వున్నాయన్నుద్దేశించి 'చూడు మిస్టర్ జయరాజ్ - మా మిసెస్ రాధ, ఇరిగేషన్ డిపార్టుమెంట్‌లో టైపిస్టు' అనేసి నవ్వుతూ నావైపు చూస్తూ 'హి ఈజ్ జయరాజ్- మా కొలీగ్ - కొత్తగా మొన్ననే ఆ ఆఫీసుకు ట్రాన్స్‌ఫరయి వచ్చాడు' పరిచయం చేశాడు. ఇద్దరం పరస్పరం నమస్కారాలు చేసుకున్నాం జీవన్ పక్కనే వున్న కుర్చీలో కూచున్నాను

'మిస్టర్ జయరాజ్! మీకు తెలీదనుకుంటా మాది ఇంటర్‌కాస్ట్ మ్యారేజి. వర్ణాంతర వివాహం! నా కులం మీకు తెలుసు కదా. ఇంక ఈమె కులం మీ కులమే ఎస్సీ... ఈ రకంగా మీకూ, నాకూ పరోక్ష బంధుత్వం వుందన్నమాట' అంటూ నవ్వుతున్నాడు జీవన్. జయరాజు ఇబ్బందిగాను, తక్కిన ముగ్గురూ అమితానందంగానూ నవ్వుతున్నారు.

అక్కడ ఎందుకు కూచున్నానా అని సిగ్గుపడుతున్నాను నేను ఇప్పుడు ఇక్కణ్ణుంచి వెళ్లిపోవడమెట్లా? జీవన్ ఎప్పుడూ ఇంతే - సమయం సందర్భం వుండదు సందు దొరికితే చాలు, తను వర్ణాంతర వివాహం చేసుకున్నట్టు చెప్పుకుపోవడమే

''జయరాజు అంత లక్కీ ఫెలో ఎవరూ వుండరు రాధా! మూడేండ్ల కిందట జూనియర్ అసిస్టెంట్‌గా మా డిపార్టుమెంట్‌లో చేరాడా! అప్పుడే సీనియర్ అసిస్టెంట్ అయ్యాడు. రేపో ఎల్లుండో డిప్యూటీ తాహసీల్దారవుతాడు'' అంటూ జీవన్ చెబుతోంటే జయరాజు తలవంచుకుని టీ తాగుతూ వున్నాడు. జీవన్ అక్కడితో చెప్పడం ఆపలేదు ''ఇట్లా ఎస్సీలకి గవర్నమెంట్ మంచి చేయూత నిస్తూ వుండటం మనమంతా నిజంగా గర్వించదగ్గ విషయం .. ఏమంటారు శేషయ్యా!'' అంటూ సోడాబుడ్డి అద్దాల మనిషిని అడిగాడు జీవన్. ''నిజం మీరు చెప్పింది'' అన్న అర్థం వచ్చేలా తల ఆడిస్తూ నవ్వాడు శేషయ్య.

''అసలు అంబేద్కర్ మన దేశంలో పుట్టడం ఈ దళితులకి గొప్ప మలుపు తెలుసా! రిజర్వేషన్లు అణగారిన కులాలకి వుండాలని ఆయన రాజ్యాంగంలో పొందుపరచడం దళితుల అదృష్టమే మనం ఈ విషయంలో ఆనందించాలి'' అన్నాడు శ్రీనివాసరావు

''అవును మరి తరతరాలుగా అణగారిన వాళ్లకి ఎక్కడినించి వస్తాయండీ అద్భుతమైన తెలివితేటలు! వాళ్ల జీన్స్‌లో తక్కువ తనం, తక్కువ భావన గూడుకట్టుకుని వుంటాయి కదా!'' అన్నాడు మోహన్

వీళ్లల్లో ఒక్క జయరాజు తప్ప తక్కిన ముగ్గురూ ఏదో ఒక సెలవు దినాన ఇక్కడే జీవన్‌తో చదరంగమో, పేకో ఆడుతుంటారు. అందువల్ల వాళ్ల మాటల్ని నమ్మలేకపోతున్నాను

వంటింట్లో పాత్రలు దొర్లుతున్న శబ్దాలు ఉరుకుల పరుగుల మీద వంటింట్లోకి వెళ్లాను 'రోహిత్'గాడు నీళ్లగ్లాసుతో కనిపించాడు 'ఏరా!' అన్నాను 'ఏం జరిగింది?' అనబోయి ''నీళ్లమ్మా!'' గ్లాసు కోసం చూస్తూ వాడికి ఆరేళ్లు నిండుతున్నా మొహంలో రెండు మూడేళ్ల పిల్లల్లో వున్న అమాయకత్వమే కనిపిస్తుంది నాకెప్పుడూ వాడిని ఇంగ్లీషు కాన్వెంటులో వేసి ఎల్‌కెజి, యుకెజిలు చదివించాలని జీవన్ చాలా ప్రయత్నించాడు ప్రాథమిక విద్య మాతృభాషలోనే వుండాలనీ, ఆరేళ్ల వరకూ స్కూలుకు పంపకూడదనీ తెలుగు బళ్లోనే చదివించాలని నేను జీవన్‌తో పెద్ద పోరాటమే చెయ్యాల్సి వచ్చింది ఆ పోరాట ఫలితమే వాడు నెల క్రిందట తెలుగు బళ్లో చేరడం ఈ మధ్యనే జీవనే చేర్పించి వచ్చాడు రోహిత్‌గాడు నీళ్లు తాగేసి ఆడుకోవడానికి వెళ్లిపోయాడు

బయట గదిలో జీవనూ, అతని కొలీగ్సూ దళితుల మీద చర్చలు సాగిస్తూ వున్నారు. వాళ్లలో జయరాజు లేకుంటే ఆ చర్చాగోష్టి ఎంత తలకిందులుగా వుండేదో నాకు తెలుసు

నాకు ఒక్కోసారి మనుషులమీద నమ్మకం సడలడానికి ఒకే ఒక్క కారణం జీవన్! జీవన్, నేనూ జీవిత భాగస్వాములం కాకముందు ఇద్దరం ఒకే తరగతి వాళ్లం - బి.ఎ.లో అప్పట్లో అభ్యుదయ భావాలున్న విద్యార్థుల్లో జీవన్ మొదటివాడు విద్యార్థి యూనియన్ లీడరుగా వుండేవాడు. కాలేజీ ఫంక్షన్స్‌లో ఎప్పుడూ నేను పాటలు పాడేదాన్ని నా పాటలంటే జీవన్‌కి పిచ్చి మా ఇంటికొచ్చి నా పాటల్ని టేపు చేసుకొని వెళ్లేవాడు. మా అమ్మానాన్నలకు కూడా జీవన్ అంటే గౌరవమే 'మీ పాటల్లో లత గొంతులోని సౌకుమార్యత, సుశీల గొంతులోని తియ్యదనం వుంద'ని మెచ్చుకొనేవాడు జీవన్. ఆ మాటలు వింటున్నప్పుడు ఎంత పొంగి పోయేదాన్నో చెప్పలేను

అట్లా మా ఇద్దరికీ ఒకరిపై ఒకరికి అభిమానం పుట్టుకొచ్చింది కట్నాలని తీసుకునే యువకుల్నీ సంతలోని జంతువులంటూ విమర్శించేవాడు జీవన్ 'అంటరానితనం' జాతికి మచ్చ, దాన్ని అసహ్యమైన పదంగా చెప్పుకోవాలి అని ఆవేశంగా అనేవాడు ఎప్పుడూ. అప్పటికే నేను దళితురాలినని జీవన్‌కి తెలుసు. బి.ఎ కొత్తగా చేరిన రోజుల్లో సరదాగా 'క్లరికల్ కేడర్ గ్రూప్ ఫోర్' పరీక్షలు రాసి వుండటంతో 'ఎస్సీ' రిజర్వేషను కోటా కింద నాకు ఇరిగేషన్ డిపార్టుమెంట్‌లో టైపిస్టుగా ఉద్యోగం వచ్చింది. దాంతో బి.ఎ పూర్తి చేయకుండానే ఉద్యోగంలో చేరిపోయాను. తొలిసారిగా నా జీవితంలో తొలి మలుపు అది. జీవన్ ఒకటే పొంగిపోయాడు ఆరోజు. ఆ తరువాత ఒక వారానికి అనుకుంటా ఒక సాయంత్రం ఆఫీసు వదిలే సమయానికి బయటే కాచుకుని వున్నాడు జీవన్.

''ఆఫీస్ వాళ్లేమయినా అనుకోరూ నువ్విట్లా. .'' అన్నాను తగ్గు స్వరంతో...

మారు మాటాడకుండా దగ్గర్లోనే వున్న హోటల్లోకి తీసుకుపోయాడు ఒక మూలలో వున్న టేబుల్‌ముందు కూచున్నాం. సర్వరు తెచ్చిన కాఫీ తాగుతున్నాం. వున్నట్టుండి అన్నాడు జీవన్ ''నేన్నిన్ను పెళ్లి చేసుకోవాలనుకుంటున్నాను'' అని. ఆ మాటతో కొన్ని క్షణాలు అవాక్కయి పోయాను ప్రేమ ప్రస్తావన లేకనే పెళ్లి ప్రస్తావన! నేను వింటున్నది కలో, నిజమో తేల్చుకోలేని స్థితి!

''అమ్మా, నాన్నా అంగీకరిస్తే అందులోనూ మీది పెద్ద కులం కదా!'' అన్నాను మనుషుల మధ్య కనిపించని పెద్ద కోటగోడ కులం అనిపించిందా క్షణంలో .. మా నాన్న అన్నీ విన్నాక ఒకే

ఒక్కమాట అన్నాడు ''బాగా ఆలోచించగలదానివి నీ నిర్ణయం కాదనను. జీవన్ నిన్ను పెళ్లి చేసుకోవడంలో తన ఆర్థిక స్థితి దృష్టిలో వుంచుకున్నాడేమో . నీకీ ఉద్యోగం రాకుంటే నిన్ను పెళ్లి చేసుకునేవాడా? ఆలోచించుకో'' అన్నాడు. ఎంత హేతువాది అయినా ముసలి తనపు చాదస్తంతో అలా మాట్లాడారే మరి అనుకున్నాను నెల తరువాత మాకు పెళ్లయిపోయింది పెళ్లయ్యాక బి.ఎ పరీక్షలు పూర్తిచేసి, సెకండ్ క్లాసులో పాసయ్యాడు జీవన్ మా నాన్న రికమెండేషన్‌తో ఒక ప్రైవేటు కాన్వెంటు స్కూల్లో టీచర్‌గా ఉద్యోగం దొరికింది. అలా ఒకటిన్నర సంవత్సరం హాయిగానేగడిచింది. ఈలోగా రోహిత్ పుట్టాడు అప్పుడప్పుడు తనకు గవర్నమెంట్ ఉద్యోగం రానందుకు బాధపడేవాడు. ఎప్పుడయినా 'ఈ రిజర్వేషనువల్లనే తనకు ఉద్యోగం రాకుండా వుందని' వ్యధకు గురయ్యేవాడు. అదృష్టం కొద్దీ ఆర్నెల్లకల్లా జీవన్‌కి రెవిన్యూ డిపార్టుమెంట్‌లో జూనియర్ అసిస్టెంటుగా ఉద్యోగం వచ్చింది. జీవన్‌లో నూతనోత్సాహం చోటుచేసుకుంది.

జీవన్‌లో 'దళిత ద్వేషం' నిప్పురవ్వ ఎప్పుడు పడిందో తెలీదు కానీ 'చుండూరు'లో హరిజనుల ఊచకోత సంఘటన జరిగినప్పుడు గానీ, అది బాగా రగులుకొని బయటపడలేదు. ''వీళ్లేం తక్కువ నా కొడుకులు కాదులే రాధా! ఆ భూస్వాముల ఆడవాళ్లని అల్లరిపెట్టి వుంటారు. తక్కువ కులం నాయాండ్లు అట్ల నిక్కీ నీలుగుతుంటే - సంఘాలు పెట్టుకొని మిడిసిపడుతోంటే నరికెయ్యకుండా వుంటారా?'' అన్నాడోరోజు ఉదయమే పేపరులోని వార్త చదివి.

ఆ మాటతో ''ఇదేమిటి జీవన్! నువ్వేనా ఇట్లా మాట్లాడేది?'' అన్నాను ఏమనాలో తెలీక.

''రాధా! నువ్వు ఆ కులం దానివి కాబట్టే కులాభిమానం పొగొట్టుకోలేక అట్లా ఆశ్చర్య పోతున్నావు. మంచిగా వున్నంత కాలం మా వాళ్లు మనుషులుగా చూస్తారు మించి పోయినారంటే అంతే!''

కలుక్కుమంది నాకు.. ఇంత ద్వేషముందా ఈ మనిషిలో అనిపించి ఏడ్చేశాను. ఒక వారంపాటు మా మధ్య మాటలు కరువైనాయి. ఆ తరువాత మరి అప్పుడెప్పుడో మండల కమిషన్ సిఫార్సుకి వ్యతిరేకంగా తలెత్తిన ఉద్యమానికి బలంగా సపోర్టు చేస్తూ రెండోసారి బయటపడ్డాడు. గవర్నమెంట్ 'ఓట్ల వేట' నాటకంలోని అంతర్భాగమే రిజర్వేషన్‌లనీ, అంటరానివాళ్లకి నిజంగా అది కన్నీటి తుడుపేనని నేను ఎంత మొత్తుకున్నా జీవన్ చెవులకెక్కనేలేదు.



ఆ మరుసటి రోజు సాయంత్రం ఆఫీసునుంచి ఇంటికొస్తూనే మెట్లపైనే కూచుని ఉన్నాడు రోహిత్. మా ఇద్దర్లో ఎవరో ఒకరు ఆఫీసునుంచి వచ్చేవరకు రోహిత్‌ని పక్క ఇంట్లో వుండేలా ఏర్పాటుచేశాను. అయినా ఒక్కోసారి ఎందుకో మెట్లమీదనే కూచుండిపోతాడు వాడు. ఏరా! ఎంతసేపయింది వచ్చి! అన్నాను. 'చాలా సేపయ్యింది' అన్నాడు వాడు. తాళం తీస్తుంటే నా కొంగు పట్టుకునే వున్నాడు వాడు.

''అమ్మా! మా బళ్లో నాకు పుస్తకాలు, కొత్త బట్టలు ఇచ్చినారు ఇవిగో'' అంటూ ఇంట్లోకి వెళ్తూనే బాగ్ తీసి చూపించాడు. ముతకగా వున్న ఆకుపచ్చటి నూలు చొక్కా, కాకీ నిక్కరు... పదేళ్ల పిల్లాడికి సరిపోయే డ్రస్సు అది. తెలుగు బళ్లో చేర్పిస్తే పుస్తకాలూ, బట్టలూ ఇస్తారన్నమాట! అయినా నా మనసు ఎందుకో ఏదోలా అనిపిస్తోంది. లేని వాళ్లనుద్దేశించి గవర్నమెంట్ ఇస్తోందేమో. అంతో యింతో కొనగలిగిన స్తోమత వున్నవాళ్లం, మనం తీసుకోవచ్చా? ఇద్దరం ప్రభుత్వోద్యోగులమై వుండీ, ఇట్లా ప్రభుత్వం సొమ్ముని వృధా చేయడం మంచిది కాదనిపించింది.

రాత్రి భోజనాలయినాక రోహిత్‌గాడికి బళ్లో ఫ్రీగా బట్టలూ, పుస్తకాలూ ఇచ్చిన విషయం చెప్పాను

జీవన్‌తో.

''సర్లేవే... ఇస్తే ఇచ్చినారులే . నీ కొడుక్కి ఒక్కడికీ ఇచ్చినందువల్ల గవర్నమెంట్ దివాళా తీయదులే.. నీకు ఇష్టం లేకుంటే ఏ అడుక్కునే వాడకో ఇచ్చెయ్యి'' అన్నాడు సిగరెట్టు తాగుతూ.

నా మనసు కుదుటపడలేదు. అందుకే ఉదయం గంట లేటు పర్మిషన్ లెటర్ జీవన్‌తో పంపించి స్కూలుకు వెళ్లాను

నేరుగా హెడ్మిస్ట్రెస్ దగ్గరికి పోయి విషయమంతా వివరించాను. ''ఈ బట్టలూ, పుస్తకాలూ లేని పిల్లవాడికి ఇవ్వండి. పొరపాటున మా వాడికి ఇచ్చారు'' అన్నాను

''మేము పొరపాటు పడలేదమ్మా. . మీ పిల్లవాడు ఎస్సీ కాబట్టి వాడి కోటాకు వచ్చిన పుస్తకాలు, బట్టలూ ఇచ్చాము'' అంది హెడ్మిస్ట్రెస్.

''వాడు ఎస్సీ అని ఎవరు చెప్పారు?''

''వాళ్ళ నాన్నే రాయించారు, అప్లికేషనులో ఎస్సీ అని'' అందామె.

నా తల దిమ్మెక్కిపోయింది.

(ఆంధ్రజ్యోతి వీక్లీ, 26-5-1995)



# దోమతెర

## మద్దూరి నగేష్‌బాబు

ఆ ఆసుపత్రి భారతదేశంలా వుంది.

పూజయిపోయాక పూజారి విసుగ్గా బైటికూడ్చి పారేసిన పూలమాలలా వుంది. అవసరం తీరాక విటుడు విసిరేసిన రూపాయి నోటులా వుంది.

ఆ ఆసుపత్రికో వరండా వుంది.

ఆ వరండాకి వేలాది శవాల్ని చూసిన ధైర్యం వుంది. లోపల ఆపరేషనే మౌతుందోనని కాలు నిలువక కాలుగాలిన పిల్లిలా తిరిగిన ఎందర్నో ఎద్దేవా చేసి కసురుకున్న అనుభవమూ వుంది.

ఆ వరండాని ఆనుకునే డాక్టర్ల గదుంది.

ఆ గదికి స్టెతస్కోపేసి రూపాయల చప్పుళ్లు వినగల నేర్పుంది.

మరీ ముఖ్యంగా హౌస్‌సర్జన్ డాక్టరమ్మల, ట్రైనీ నర్సమ్మల శీలాన్ని మల్లెపూల లాంటి కోట్లు పరిచి ఆహ్వాదించిన అపారమైన అనుభవముంది.

ఆ లాబ్ కూడా సముద్రాలకొద్దీ పేషెంట్ల రక్తాన్ని తాగీ తాగీ పెరిగిన బానపొట్టుంది.

ఆ పొట్టలో మలమూత్ర వీర్యాల తెట్టొకటుంది.

ఆ తెట్టునానుకునే ఒక వార్డు వుంది.

ఆ వార్డుకి ఎమర్జన్సీ వార్డని ఎర్రటి అక్షరాలున్న బోర్డొకటుంది.

ఆ బోర్డు వెక్కిళ్లు దిగమింగుకున్న రోగి తల్లి ముఖంలా వేలాడుతుంది.

ఆ వార్డు లోపలి మంచాలు తాజా గాయాల్లా ఎర్రెర్రని కట్లతో మెరుస్తూ

ఆ మంచాల్లో శవాల్లాంటి మనుషులు ఆకాశానికీ నేలకీ

మధ్య ఫ్యూయలైపోయిన

విమానాల్లా కొట్టుకుంటూ...

మొత్తానికి గవర్నమెంటాసుపత్రి ఎమర్జన్సీ వార్డు

డాక్టర్ల ఉదాసీన నిర్లక్ష్యం సాక్షిగా తన్నుకురావటానికి సిద్ధంగా వున్న ఏడుపులా వుంది



రెండు కాళ్ల మధ్య తలకాయ ఇరికించుకొని దిగాలుగా ఆసుపత్రి వరండాకున్న ఒక స్థంభానికి

అనుకుని కూర్చున్నాడు ఆంజనేయులు అతని మనసులో తన భార్య తాలూకు తీయని అనుభవాలు కత్తుల్లా దిగబడుతూ రీలులా తిరుగుతున్నాయ్

అతని పక్కనుండే ఎంతోమంది వస్తూపోతూ దాదాపు మార్కెట్‌లోలా గందరగోళం జరుగుతున్నా ఏమీ పట్టనట్టు తన భార్య తాలూకు జ్ఞాపకాలు చెరువులో నిలువునా మునిగిపోయి వున్నాడతను.

డాక్టర్ల గదికి కొంచెం అవతల నిల్చుని ఆనందంగా బీడీ తాగుతున్న కాంపౌండర్ ఆంజనేయులు తలెప్పుడూ లేపుతాడా అమాంతం ఎటాక్కైపోయి ఎప్పుడు నా మామూలు వసూలు చేసుకోవాలా అని సిగ్నల్ కోసం ఎదురుచూస్తున్న పరుగు పందెపు పోటీదారుడిలా వుంటే... లాబ్ అసిస్టెంట్లు కాచుక్కూచున్నాడు.

ఎమర్జెన్సీ వార్డులో దోమతెర కట్టిన మంచంలో ఒక మనిషిని ఉన్న ఫలంగా ఉడకేసినట్లు ఒళ్లంతా కాలిన బొబ్బల్లో అరిటాకుమీద ఫ్రైలా పడుకుంది అనంతలక్ష్మి.

అనంతలక్ష్మి ఆంజనేయులుకి ఒక్కగానొక్క అధికారిక భార్య. అనధికారికంగా ఎవరైనా ఆంజనేయులుకున్నారా అంటే కూసిన్ని నీళ్ల నమలాల్సిందే.

ఎందుకనంటే ఆంజనేయుళ్ళా ఆంజనేయులేం కాటన్‌సీడు కాదు.

సగం గుడ్డల సిన్మా హీరోయిన్ల బొమ్మలు తారసపడినప్పుడో... లేదూ అష్టపదులో త్యాగరాయకృతులో విన్నప్పుడో ఆంజనేయులుకి నరాలున్నాయి కాబట్టి అతను ఉద్రేకపడటానికి అవకాశాలు ఇబ్బడి ముబ్బడిగా వున్నాయి కాబట్టి ఉద్రేకాలన్నీ ఇంట్లోనే చల్లార్చుకోవాలన్న నియమావళీ పట్టింపులూ గట్రా ఆంజనేయులుకి అంతగా లేవు కాబట్టీ ఆంజనేయులుకి అనధికారికంగా ఎవరైనా వున్నారా అంటే ఆకాశంవేపయినా చూడాలి లేదా కనీసం వెకిలిగా ఒకసారి ఇకిలించాలి మరి.

ప్రపంచంలో తగాదాలన్నీ స్త్రీ పురుష సంబంధాల దగ్గరే మొదలయ్యే సాంప్రదాయం ఒకటి ఏడ్చింది కనుక సదరు ఆంజనేయులు భార్య శ్రీమతి అనంతలక్ష్మికీ, సదరు అనంతలక్ష్మి ఒకే ఒక్క భర్త శ్రీ ఆంజనేయులుకీ మధ్య చిన్నసైజు వాదన మొదలై యుద్ధమై కూర్చుంది. తగాదా రావటం పరిపాటయిన సంసారాల్లో తన్నులు తినడం అనేది తరుణీమణులకి వారసత్వ ఆస్తిగాబట్టి అలాగే ఆస్తిపరురాలైన అనంతలక్ష్మి ప్రత్యేకించి ఆత్మాహుతులద్వారా సజీవ ఆత్మదహనాల ద్వారా ఏదయినా సాధించొచ్చనే వెర్రి సంస్కృతిలోంచి పుట్టుకొచ్చిన ఒక మహిళా రాజం కాబట్టే... కాబట్టే... కాబట్టే... ఇప్పుడు తనో అరిటాకుపై కాలిన బొబ్బయ్యింది. బతికుండే ఉడికిన మానవ మాంసమయ్యింది. శ్వాసశ్వాసకీ సందేహాలు మొలకెత్తుతున్న నిలువెత్తు ప్రశ్నార్థక మయ్యింది.

అనంతలక్ష్మి గురించి గానీ ఆంజనేయులు గురించి గానీ వారిరువురి వైవాహిక జీవిత విధానం గురించి గానీ తెలుసుకోవాలంటే ప్రత్యేకించి పేరాలు పేరాలు చేదవాల్సినంత అవసరం లేదు గానీ... ఏ పల్లెటూళ్ళో కయినా వెళ్లి ఏ హిందూ అగ్రకుల మధ్యతరగతి సంసారాన్ని చూసినా చాలు! భార్యేతర అక్రమ సంబంధం కలిగివుండటం మొగుడికొక హోదా. ! సదరు ఇతర సంబంధీకుల గురించి మొగుణ్ణే భక్తిగా, ప్రేమగా, ఈర్ష్యగా, ప్రాతివత్యంగా, పరాన్నభుక్కు కీటకంగా, సాధించడం పెళ్లాం హోదా! ఫలానా పెళ్లాం వాళ్లెంట పోవడం ఒక డిగ్నిటీగా చూసే సమాజంలో సహజంగా కాస్త ఇస్త్రీ గుడ్డలేసుకున్న రైతులకు అనంతలక్ష్మి లాంటి వెండి పళ్లేలు ఎంత సహజంగా వుంటారో అంతే సహజంగా చాలా ఇస్తరాకులూ వుంటారు. అదిగో అలాంటి ఇస్తరాకుల గురించే ఎవరయినా నీళ్ల నమలాలి

ఆకాశానికేసి చూడాలి వెకిలిగా యికిలించాలి

యిదంతా ఎందుకనంటే మన దేవుళ్ళకి ఒకళ్లిద్దరు కాదు. వంద వేల సంఖ్యలో పెళ్లాలుంటారు కాబట్టి ఆ పెళ్లాన్ని జోకొట్టడం ఒక పవిత్రమైన వీలవుతుంది కాబట్టి అంతేకాదు ఇప్పటి మన సినీ హీరోలక్కూడా ఇద్దరికి తక్కువ కాకుండా హీరోయిన్లుంటారు కాబట్టి కాబట్టే ఆంజనేయులుకో జేబుంది - ఆ జేబులు లేని మనుషుల్లో ఒకామె వుంది! కాబట్టే ఆ జేబులో ఆ రెండో మనిషుంది కాబట్టే ఆ మనిషే మొగుడూ పెళ్లాల మధ్య మిస్సయిల్ల యుద్ధమయ్యింది. ఆ యుద్ధఫలమే ఆస్పత్రి గర్భంలో స్రావానికి ఇద్దంగా వున్న అనంతలక్ష్మయింది



తన తలమీదెవరో ప్రేమగా నిమిరేసరికి చివాల్న తలెత్తి చూశాడు ఆంజనేయులు

ఆ తలకు రెండు చింత నిప్పు సరస్సులున్నాయి. అవి అతని కళ్లు ఆ సరస్సులు అంచులు దాటాలని ఊరికే ప్రవాహాలున్నాయి. అవి అతని కన్నీళ్లు ఎదురుగా నిలబడిన రాఘవమ్మని చూసి ఇక ఏడుపు ఆపుకోవడం ఆంజనేయులు వల్లగాకపోయింది. 'అత్తా' అంటూ రాఘవమ్మ కాళ్ళు చుట్టేసి బావురుమన్నాడు ఆంజనేయులు. తల్లిలేని ఆంజనేయుల్ని తల్లి తర్వాత తల్లిలా సాకింది అతని మేనత్త రాఘవమ్మ. ఇప్పుడు కూడా అంత కష్టంలోనూ తల్లిలాగే అనునయించి ఓదార్చింది. సంవత్సరం క్రితం వరకూ రాఘవమ్మ ఆంజనేయులు కలిసే వుండేవాళ్లు. ఆంజనేయులికి పెళ్లయ్యాక కొత్తజంట మధ్య నేనెందుకులే పుడకలా అనుకుందో లేక మరేమనుకుందో కానీ తన ఆస్తికూడా మేనల్లుడికిచ్చి ఓ బాబాగారి ఆశ్రమంలో చేరిపోయింది రాఘవమ్మ. దారినపోయే వాళ్లెవరో చేరేసిన కబురు విని ఆపబట్టుకోలేక ఆగమేఘాల మీద ఆసుపత్రిలోకొచ్చి పడిన రాఘవమ్మకి ఆంజనేయుల్ని అలా చూడాల్సి వచ్చేసరికి పేగులు మెలి దిరిగినట్లయినా తన బిడ్డలాంటి ఆంజనేయుల్ని ఓదార్చాలంటే ముందు తనని తాను ఓదార్చుకోక తప్పలేదు. ''ఏందిరా అంజీ. . ఎందుకంత అగాయిత్యానికి వొడిగట్టిందిరా అదీ'' ఆంజనేయులు అసలు తగాదా మొదలుకాడ్నుంచీ అనంతలక్ష్మి అగ్నిప్రవేశం వరకూ రుద్రాక్షలు గుచ్చినట్లు చెప్పాడు. అయితే మాత్రం మరీ ఇంత ఎర్రి చేష్టలా చేసుకునేది' గట్టిగా నిట్టూర్చిన రాఘవమ్మ మెల్లిగా అనంతలక్ష్మిని చూడాలని కదిలింది అక్కడ్నుంచి. సర్గిగ్గా ఆ క్షణం కోసమే నిక్కివున్న కాంపౌండర్, లాబ్ అసిస్టెంటూ ఇద్దరూ ఆంజనేయులు వైపు కదిలారు.

వార్డుకి విసిరేసినట్టుగా ఒక మూలనున్న దోమతెర కట్టిన మంచం దగ్గరికి నడిచిన రాఘవమ్మ అనంతలక్ష్మిని చూసి ఒక జలదరింపుకు లోనయింది. ఆమె కడుపులో ఎవరో ముక్కోటి చేతులు పెట్టి దేవినట్లయ్యింది లోపల ఒక బొగ్గుని పండబెట్టినట్లుంది అనంతలక్ష్మి. ఒక దోమ దోమతెరలోంచి బైటికెళ్లడానికి దారి దొరకడం లేదు కాబోలు ఎగిరి పోవడానికి యాతన పడుతున్న ప్రాణానికి మల్లే దారి కోసం తిరుగుతోంది. 'పసుపుగొమ్ములా పచ్చగా దేవాలయ శిల్పాలకు జీవమొచ్చి నట్లుండే మా అనంతేనా' అని గొణుక్కుంది రాఘవమ్మ ఈలోగా చీకటి రెప్పలెత్తి చంద్రుడు చూసినట్లు అనంతలక్ష్మి కళ్లు తెరిచింది. ఆ కళ్లలో రాఘవమ్మని గుర్తుపట్టిన మెరుపు స్పష్టంగా కనిపించింది. ఆ మెరుపు వెనకే ఒక అల తన్నుకొచ్చింది. ''ఊర్కోవే.. ఊరుకో .. మాయదారి ముండ నీకే దాపురించింది... ఊళ్లో ఎంతమంది లేరు అంజిగాడే కనబడ్డాడా... అయినా ఏందే అనంతా ఈ పని ఎక్కడయినా వుందా...''

రాఘవమ్మ గొంతు వణికింది! అయితే తనే ఏడిస్తే అనంత మరింత బేంబేలు పడుతుందని సంబాళించుకుని... ''అదికాదే అనంతా... మొగుడన్నాక తిరక్కుండా వుంటాడా! అంత మాత్రాన

ఇట్టా సావుకి తెగబడతారా ఎవురయినా.. ఏదైనా వుంటే గుట్టుగా సర్దుకోవాలే గానీ.. ఇదేం పనే అనంతా .''

నీళ్ల నిండిన కనురెప్పలెత్తినట్లు .. అనంతలక్ష్మి నోరు తెరిచింది బలాన్నంతా కూడదీసుకుని మాట్లాడసాగింది.... ''ఆయన ఎవరితో తిరిగినా నేను బాధపడేదాన్ని కాదు పిన్నీ . ఆయనెంత నీచానికి వడికట్టాడంటే... మాదిగదాంతోనా పిన్నీ ..''

అనంతలక్ష్మి మాట ఆగిపోయింది. దారి దొరికిన దోమ బైటకొచ్చి ఆశ్చర్యంగా తెరిచిన రాఘవమ్మ నోట్లోకి దూరింది ఆసుపత్రి అలవాటుగా ముసిముసినవ్వు నవ్వుకుంది

(గుంటూరు జిల్లా తెనాలి ప్రాంతంలో
జరిగిన ఒక వాస్తవ సంఘటనకి ఇది కథారూపం)



# పురిటి నెప్పులు

ఓల్గా

''కోటప్పకొండకెళ్లి యేం తెచ్చావే?''

చేలోకి దిగుతున్న వందనాన్ని చూసి నవ్వుతూ అడిగింది మరియమ్మ

'నా బొంద. యేంది తెచ్చేది? కొబ్బరికాయ కొట్టి ఒక దణ్ణం పెట్టి వచ్చా. తేటానికి చేతిలో దమ్మిడీ వుందెట్టా-'' మూతి తిప్పుకుంటా చెప్పింది వందనం

''కొడుకు పుడితే మళ్లొత్తానని మొక్కుకోలా?'' యెగతాళిగా అంది అన్నమ్మ.

''ఎందుకు తల్లా- రెండు శత్తులు పుట్టాయిగా- చాల్లే'' పనిలోకి వంగబోతూ నవ్వింది వందనం.

''నువ్వు చాలంటే సరిపోద్దా. మా తమ్ముడు వూరుకోవద్దూ''

''నేను మటికి కొడుకుని కనకుండా చాలించుకుంటానెట్టా'' పోటీగా అంది వందనం.

''అన్నీ నువ్వే అంటావేందే బడాయి'' వందనం బుగ్గ పొడిచింది అన్నమ్మ. వాళ్లు ముగ్గురు మరో ముగ్గురు అమ్మాయిలతో కలిసి పత్తికట్టె పీకుతున్నారు. శివరాత్రి వెళ్లి యెండలు నెమ్మదిగా వస్తున్నాయి.

సంక్రాంతికి ముందుగా పత్తి వొల్చిన చేలల్లో పత్తికట్టె పీకిస్తున్నారు రైతులు.

వందనం, మరియమ్మ, అన్నమ్మ నడుం వొంచి పనిలో పడ్డారు. ఒక గంటసేపు మాటా పలుకూ లేకుండా పని ముమ్మరంగా సాగింది. అన్నమ్మకు కళ్లు తిరిగినట్టయి కూర్చున్నచోటే కూలబడింది.

''ఏందే - యేవయింది'' అంటూ అందరూ చుట్టూ కమ్ముకున్నారు.

''యేందోనే కళ్లు తిరిగినట్లయింది''

''కడుపుతున్నావా యేంది?'' వందనం కుతూహలంగా చూసింది

కడుపూ లేదు - గడ్డలూ లేదు. వారం నుంచీ అదేమైన మైలవుతుంది'' అన్నమ్మ ముఖమంతా బాధతో మెలిదిరిగిపోయింది చవుటలు పట్టుకొచ్చాయి. పొత్తికడుపు పట్టుకుని ఒకటే మూలుగుతోంది.

''డాట్టరమ్మ దగ్గరికి పోదాం లేవే'' అంది వందనం.

''నేన్రాను తల్లో - నాల్నెల్లనాడు ఆస్పత్రికి పోయి చూపిచ్చుకున్నప్పట్నించీ నాకీ తిప్పలు-'' అన్నమ్మకు ఆస్పత్రి పేరెత్తితే యేడుపొచ్చేటట్టయింది

''యేం చేశారెట్టా - అసలెందుకు పోయా?''

''ఎందుకంటే - పిల్లగాడు రొమ్మిడిశాడు మల్లా కడుపొస్తందేవోనని ఆసిపత్తిర్లో మాత్తర్లు పెడతన్నారు కడుపు రాకుండానంటే పొయ్యానమ్మా మాత్తర్లు కాదంది, లోపల పరిచ్చచేసి యేందో

చ్చేంది కడుపు రాదంది కడుపు రాటం అట్టావంచి ఈ తిప్పలెక్కువైన్నే'' అంది అన్నమ్మ అక్కడ పక్కకి ఒరిగి కాళ్లు పొట్టలోకి వొచ్చేట్టు ముడుచుకు పడుకుంది

''పేట పొయ్యి మంచి డాక్టరుకాడ చూపిచ్చుకోరాదే''

''డబ్బులేడదెచ్చి?''

ఇంతలో చేలో పని సరిగ్గా జరుగుతాందో లేదోనని అజమాయిషీ చెయ్యడానికి వచ్చిన మాణిక్యమ్మ పని జరగకపోగా అందరూ ఒకచోట గుంపుగా వుండేసరికి కేకలు మొదలుపెట్టింది. ఆమెకు లోపల యింకో భయం కూడా ఉంది వత్తి ఒల్చే రోజుల్లో కూలి పెంచాలని కూలీల గొంతులు లేసినయ్ - ఒకరోజు 'పని ఆగిపోద్దా' అని రైతులందరికీ అనుమానం కూడా వచ్చింది. ఆ ఊళ్లో అంతపని ఎన్నడూ జరగలేదు. ఆధముండలూ, పిల్లలూ కల్సి పత్తి ఒల్సి యెక్కడలేని డబ్బూ కూలికింద లాక్కుపోతున్నారని రైతులు విసుక్కుంటుంటే యింకా కూలీ పెంచాలనే సరికి రైతులు అగ్గిరాముళ్లై పోయారు

మాణిక్యమ్మకు ఆ సంగతి గుర్తొచ్చి అంత దూరాన్నించే అరుస్తా వచ్చింది.

''అన్నమ్మ కళ్లు తిరిగి పడిందండీ''

మాణిక్యమ్మ దగ్గరకొచ్చేసరికి అన్నమ్మ మూలుగు మొాపైంది.

''దాన్ని ఆస్పత్రికి తీసుకపొండి.నా చేలో యెందుకీ దరిద్రం. యియ్యాళ సగం చేనన్నా అయిద్దనుకున్నా ఇట్టయితే అయినట్టే...''

మాణిక్యమ్మ గొణుక్కుంటూ తనూ పత్తికట్టె పీకటం మొదలుపెట్టింది

వందనం అన్నమ్మను లేవదీసి మెల్లిగా నడిపించుకుంటూ తీసికెళ్లింది

మరియమ్మ మాట్లాడకుండా పనిచేసుకుంటోంది



భయపడినా మళ్లీ ప్రభుత్వాసుపత్రికే వెళ్లక తప్పలేదు అన్నమ్మకు. ఆ వూళ్లో ప్రాథమిక ఆరోగ్య కేంద్రం వుంది. సంవత్సరం నుంచీ ఒక డాక్టరమ్మ కూడా వుంది. చిన్నచిన్న బాధలకు ఆడవాళ్లు ఈ ఆస్పత్రికి వెళ్తున్నారు. పెద్ద బాధలనుకుంటే ఆర్.ఎం.పీల దగ్గరకెళ్తే వాళ్లు చిలకలూరిపేటలో వున్న పెద్ద డాక్టర్ల దగ్గరకు తీసికెళ్తారు. ఆర్.ఎం.పీలు, పేటలోని డాక్టర్లు, ప్రాథమిక ఆరోగ్య కేంద్రం ఈ మూడిటి చుట్టూ తిరుగుతుంటారు ఆ వూరి ఆడవాళ్లు. తమ కోసం తమ వాళ్ల కోసం అన్నమ్మ వెళ్ళిన సమయానికి డాక్టరమ్మ వుంది. ఐతే నాలుగు నెల్లనాడు అన్నమ్మకు 'కాపర్ టీ' పెట్టిన డాక్టరమ్మ కాదు. ఆవిడ బదిలీ అయి కొత్తావిడ వచ్చి వారం రోజులే అయింది. అన్నమ్మను చూస్తూనే డాక్టర్‌కు పరిస్థితి అర్థమైంది. అన్నమ్మకు ఇంజక్షన్ ఇచ్చి కాపర్ టీ తీసేసింది. లోపల యిన్‌ఫెక్షన్ తగ్గడానికి మందులు ఇచ్చింది.

''ఓ వారంలో తగ్గిపోతుందిలే - నీకు పిల్లలెంతమంది?''

''నలుగురండి''

''మరి ఆపరేషను చేయించుకోరాదూ''

''కొడుకు ఒక్కడేనండి. ఇంకో కొడుకుని కన్నాక చేపిచ్చుకుంటానండి''

''ఈసారి కొడుకు పుడతాడని యేముంది. మళ్లీ ఇంకో ఇద్దర్ని కంటే నీ పని అయిపోతుంది.

ఐనా నలుగురు పిల్లలు చాలరా?'' డాక్టరు కాస్త వ్యంగ్యంగా అంది.

''ఆస్తులుండే వాళ్లకు పంచుకుంటే తలాకాస్త రాదని బయ్యం. మాకేముందండీ - పిల్లలకి రెక్కలొస్తే ఆళ్లే ఆస్తులనుకుంటాం''

ఈ సమాధానం వందనం ఇచ్చింది. డాక్టరు ముఖం చిట్లించింది.

''మాటలకేంగానీ... ఆరోగ్యం పాడయిపోతోంది. ఆలోచించుకో'' అన్నది తనకేం పట్టనట్టు ఆవిడ ఆ రెండు మాటలు కూడా సామాన్యంగా మాట్లాడదు. కానీ అది మార్చి నెల. ఆపరేషన్ల టార్గెట్ వుంది. ఆ బాధ్యత ఆమెమీద అంతగా లేదు గానీ యేదో తన వంతు తనూ చెప్పినట్లుంటుందని అన్నది. వినకపోతే వాళ్ల ఖర్మ.

''నాలుగు కాన్పులూ తేలిగ్గానే అయినయ్యండి. ఇంట్లోనే మంత్రసానొచ్చి చేసేసిందండి. ఈతూరి యెంటెంటనే రాకుండా మాత్తర్లిస్తారంటే సరేగదా అని వొత్తే ఆ డాట్టరమ్మ నా పేణం తీసింది''

''సరే, వెళ్లండి...'' అని డాక్టర్ వాళ్లను పంపింది. మాత్రలు సరిగా వేసుకోరని కాపర్‌టీలు పెట్టమంటారు అధికారులు. అది సరిగా అమర్చకపోయినా, పెట్టేటప్పుడో తర్వాతో అపరిశుభ్రమైన వాతావరణం వున్నా యిట్లాంటి కాంప్లికేషన్సు వస్తాయి. జనాభా తగ్గించండి అనే కేకలే గాని ఆడవాళ్ల ఆరోగ్యం గురించి యెవరికీ శ్రద్ధ లేదు.

డాక్టర్ వనజ కొత్తగా గవర్నమెంటు వుద్యోగంలో చేరింది. అంతకుముందు ప్రైవేట్ హాస్పిటల్స్‌లో పనిచేసేది. అన్నమ్మ, వందనం మందులు తీసుకుని వెళ్లిపోయాక కాంపౌండర్ నారాయణ అన్నాడు

''అట్లా వదలకూడదమ్మా. మార్చి నెల సగమైంది. మనకీ అవసరమే. ఇక బతకవని భయపెట్టి ఆపరేషను చేసెయ్యాలి''

''ఆమె చేయించుకోనంటుంది. ఇంకా యిద్దర్ని కంటుందట'' నిరసనగా చీదరగా అంది వనజ.

''వాళ్లిష్టమేనేంటి? అట్లాగయితే ఈ మాల మాదిగ ముండల్లో ఒక్కదానికీ చెయ్యలేం ఆపరేషను''

''బాగానే వుంది. కట్టేసి చేస్తామా?''

''అవసరమైతే చేసెయ్యటమే. టార్గెట్లు పూర్తికావొద్దు''

నవ్వాడు నారాయణ. ఇంతలో ఇంకో ముగ్గురు పేషెంట్లొచ్చారు. వాళ్లను చూసి మందులిచ్చి పంపేసింది వనజ. ఈ యెండలు, ఈ వుద్యోగం, ఈ కాంపౌండర్, అతని బూతులు అన్నీ చిరాగ్గానే వున్నాయి వనజకు.

గవర్నమెంట్ వుద్యోగం వొదులుకోలేదు. ఈ పల్లెటూళ్లో బతకలేము. కాలేజీలన్నీ సిటీల్లో, టవున్స్‌లో వుంటాయి. చదువుకునే రోజుల్లో అన్ని సౌకర్యాలూ అలవాటవుతాయి. ఇప్పుడీ బతుకు దుర్భరంగా వుంటోంది.

★ ★ ★

అన్నమ్మ మూలుగుతూ పడుకుంది. అత్త యింత అన్నం ఒండి పిల్లలకు పెట్టింది. అన్నమ్మ అరికాళ్ల మంటలంటే వందనం వాళ్లింట్లోంచి ఆముదం సీసా తెచ్చి కాళ్లకు రాసి మర్దన చేస్తోంది.

అన్నమ్మ మొగుడు డానియేలు వచ్చాడు. రావడం రావటమే అన్నమ్మమీద విరుచుకుపడ్డాడు.

మాణిక్యమ్మ గారి చేలోంచి సగం పనిలోనే వచ్చావంట. ఒళ్ళు బలిసిందా అంటూ మీదకు

దూకబోతున్న డానియేలును తల్లి ఆపి జరిగిన సంగతి చెప్పింది

''రెండేళ్ళాగి కంటానని తిప్పుకుంటూ యెళ్తినిగా ఆస్పత్రికి - అసలు నాకు చెప్పకుండా యిట్టాంటి పన్లు చేశావంటే పేణం తీస్తా అంటూ అన్నమ్మని తిట్టి తిండి తిని పడుకున్నాడు.

మర్నాడు పనికి పోక తప్పలేదు అన్నమ్మకు వారం రోజుల్లో మామూలు మనిషయింది ఇంతలో జీపుల్లో మనుషులు రానే వచ్చారు ఆపరేషన్లు చేయించమని మగాళ్లతో సంప్రదింపులు జరుపుతున్నారు ఆశలు పెడుతున్నారు.

''మళ్లీ వచ్చి పడ్డారవమ్మ. పోయిన తడవ నేనెట్టాగో తప్పించుకున్నా వూ ఆయన చేయిచ్చుకోవాల్సిందేనని గొడవ''

''అంత కుతిగా వుంటే ఆయన్నే చేపిచ్చుకోమనక పోయినావంటే''

''ఇంకా నయ్యం. మొగుడు చేయిచ్చుకున్నాక పెళ్లానికి వస్తే యేం చేస్తా? ఆడాళ్లం మనం చేయిచ్చుకోటమే నయం''

''నువ్వు చేయిచ్చుకున్నావంటే''

''వచ్చే యేడు చేయిచ్చుకుంటా''

అన్నాలు తినేటప్పుడు అందరూ యివే మాటలు మళ్లీ చేలోకి దిగేదాకా అంతే. వందనం అందరి మాటలూ వింటూ కూచుంది. వందనానికి ఆపరేషన్ చేయించుకోవాలని వుంది కొడుకుని కనాలనీ వుంది. కొడుకు లేడని అందరూ అంటున్నారు. మొగుడు కూడా కొడుకు పుట్టాల కోటప్పకొండకు ప్రభను కట్టాల' అంటూ తిరుగుతున్నాడు కానీ కొడుకు పుడతాడని గ్యారంటీ యేంది? మళ్లీ ఆడపిల్లే పుట్టుకొస్తే - యిట్టా యెన్ని తడవలని చూడాల? ఎన్ని తడవలైనా చూడాల్సిందే - యేమయిద్దీ - యింకో ఆడపిల్ల పుడితే పుట్టుద్ది. తన వొంట్లో వోపికుంది. కాన్పులు తేలిగ్గానే అవుతున్నాయి. దేవుడేం చెయ్యదల్చుకుంటే అదే చేస్తాడు. దేవుడిమీద భారం వేసి పన్లోకి దిగింది వందనం

ఆరోజు మాపటేల నాగేశు వురుకులు పరుగులమీద వచ్చాడు. వందనం పొయ్యికింద మంట పెడతంటే పిల్లలిద్దరూ చెరోపక్కా చేరి కుతకుత వుడుకుతున్న అన్నాన్ని చూస్తున్నారు. పొద్దున రామ్ములక్కాయలు పప్పులో యేసింది తొందరగా తినకపోతే అది కాస్తా చద్దోసన వస్తది. పిల్లలూ ఆవురావురంటన్నారు వందనం పొయ్యిలో మరో నాలుగు వత్తి కట్టె ఇరిచి పెట్టింది. మంట కాస్త పెరిగింది పిల్లలు కూడా పుల్లల్ని పొయ్యిలోకి ఎగదోశారు. వందనం పిల్లలిద్దర్నీ పొయి దగ్గర్నించి యివతలకు లాగుతుండగా నాగేశు మంచినీళ్లు తాగి ఆయాసం తీర్చుకుని -

''ఆప్రేసనంట చేయిచ్చుకోరాదూ'' అన్నాడు

''నువ్వు కొడుకు కావాలంటివిగా'' అంది వందనం ఎత్తి పొడుస్తున్నట్టుగా

''కొడుకు పుడతాడని గ్యారంటీ యేంది?''

తను అడిగే ప్రశ్న మొగుడు అడుగుతుంటే వందనం ఏం చెప్పాలో తెలియక వూరుకుంది

''ఇంకో రెండు శత్తులు పుట్టుకొస్తే యేం జేస్తా నామాటిని చేయిచ్చుకో'' అన్నాడు పోయినేడాది ఈ మాటంటే యింతెత్తున లేసిన మొగుడు ఈ యేడాది యెట్టా మారాడా అని ఆలోచించింది వందనం

'ఈ మడిసికి నిలకడ లేదులే - యియ్యాల్టి మాట రేపటికుండదు రేపటి మాట అవతల్నాటి కుండదు' అనుకుని మాట్లాడకుండా వూరుకుంది.

మూడోనాడు వూర్నించి దిగిన తల్లిని జూసి నోరెళ్లబెట్టింది

''నువ్వాప్రేషను చేయించుకుంటావంటగదే - నీ మొగుడు కబురుజేసి రమ్మన్నాడు'' అని రత్తమ్మ అంటంటే వందనానికి యేడుపొచ్చింది

''యేందమ్మా కొడుకు లేకుండా యెట్టా యింకో పాలన్నా చూడొద్దా'' అని కళ్లనీళ్లు పెట్టుకుంది

''ఇంకో పాలి లేదు యేం లేదు ఇయ్యాల సాయంత్రం ఆస్పత్రికి పోవాల్సిందే - నేను డాట్టరమ్మతో చెప్పొచ్చా'' అన్నాడు నాగేశు వందనానికి గుండెల్లో దడ పుట్టుకొచ్చింది తన కడుపులో పుట్టిన ఆలోచనైతే యెట్టా వుండేదో ఈ మడిసింత హడావుడి చేస్తుంటే కాలూ చెయ్యి ఆడట్లేదు రేపొద్దున ఆప్రేషనంట. పిల్లల్ని తల్లి చూసుకుంటది తననెవళో చూసుకుంటారు ఆప్రేషనేందో పాడేందో ఆప్రేషన తర్వాత కడుపులో నొప్పొస్తదనీ, నడుం నొప్పుస్తదనీ అంటున్నారు

''కాళ్లూ చేతులూ గుంజకపోతన్నయ్యే'' అని మార్తమ్మ రోజూ గోల. ఈ ఆప్రేషన్ చేయిచ్చుకుంటే పెద్దాప్రేషను తప్పదంటారు

''నువ్వు చేయిచ్చుకోరాదూ?'' అంది వందనం

''నే చేయిచ్చుకుంటే - నేనడ్డంబడితే - నువ్వు సంపాయిచ్చి పోషిత్తావా సంసారాన్ని''

''నేనడ్డంబడితే నువ్వు కూడొండి పెడతావా పిల్లలకి'' అంది వందనం

''నీ నోరుబడ- మాటకి మాట అంటం నేర్చావు నోరు మూసుకోని నే చెప్పినట్టు యింటావా యినవా?'' అన్నాడు చెయ్యి పైకెత్తి రత్తమ్మ అల్లుడి చెయ్యి పట్టుకుని బైటికి తీసుకుపోయింది వందనం యేడుపుకి అన్నమ్మ పరిగెత్తుకుంటూ వచ్చింది. వందనం చెప్పింది విని

''ఆ నారాయణగాడు పల్లెలో అందరూ మొగోళ్లకీ పురెక్కిస్తన్నాడు నీ మొగుడికి పుట్టిన బుద్ధి గాదిది ఆడు చెడగొట్టాడు'' అంది

''మన బంగారం మంచిదైతే వూళ్లో వాళ్లనుకునే పనేం వుంది. ఇప్పుడేం చెయ్యాల'' అని యేడ్చింది వందనం.

ఎవరు చెప్పినా నాగేశు వినలేదు. సాయంత్రం ఆరింటికి తలకు పోసుకుని, ఉతికిన చీర కట్టుకుని వందనం ఆస్పత్రికి వెళ్ళి చేరింది. అక్కడ యిరవైమంది దాకా వున్నారు పన్నెండు మందికి రెండు రోజుల్నాడు ఆప్రేషను చేశారు. ఐదుగురికి ఆరోజు పొద్దున చేశారు మిగిలిన వాళ్లకి వందనంతోపాటు.

బాధేం లేదన్నారు చేయించుకున్నవాళ్లు. కొందరు లేచి తిరుగుతున్నారు మర్నాడు యింటికి పోతామని కొందరంటున్నారు. వందనానికి అంతా మాలోకంగా వుంది. రాత్రికి నిద్రపట్టలేదు అన్నమ్మ పిల్లల్ని అత్తకప్పగించి వందనానికి తోడుగా వుందామని వచ్చింది ఇద్దరూ అర్ధరాత్రిదాకా మాట్టాడుకుంటుంటే నర్సొచ్చి తిట్టింది మెదలకుండా పడుకున్నారుగాని యిద్దరూ జాగారమే చేశారు ఆపరేషను అయిపోయింది వేరే బాధలేమీ లేకుండా యింటికొచ్చేసింది.

''పోన్లే - ఈ పిల్లలే తన కాధారం అన్నలు, తమ్ముళ్లు అమ్మనేం చూసి చస్తన్నారు - అక్కాయి దగ్గర వుంటంలా తను కూడా ముసల్దయితే ఈ పిల్లల దగ్గరే పడుంటది. ఇద్దరికీ కాత్త చదువు చెప్పిచ్చుకుని వుద్యోగాల్లో యేయిత్తే వాళ్లే యింత తిండి పెడతారు'' అనుకుంది తన దగ్గరికొచ్చిన పిల్లలిద్దర్నీ గుండెలకదుముకుంటూ

రోజులు గడిచిపోతన్నాయి వందనం భయపడ్డట్టు యే నడుం నొప్పి రాలేదు సంవత్సరం గిర్రున తిరిగొచ్చింది ఈసారి కోటప్పకొండ తిరణాలకు వందనం పోలేదు

నాగేశు ''వచ్చేయేడు ప్రభను కట్టకపోతా'' అన్నాడు

''కొడుకు పుడితే ప్రభను కడతానంటివిగా - కొడుకుని కనకుండానే, కొడుకు లేకుండానే ప్రభను కడతావా'' అనడిగింది వందనం నవ్వుతా.

అంతే, ఆమె వీపుమీద పిడిగుద్దులు పడ్డాయి.

''నాకు కొడుకు లేడంటావా? అంత చాతగాని వాడ్నంటావా? నేను కొడుకుని కనలేనా? నువ్వే కనలేనిదానివి నువ్వు గొడ్డుబోతే లోకంలో ఆడాళ్లు లేరా - అసలు నీకూ నాకు సమ్మందం లేదు నేను మారు మనువు చేసుకుంటాను'' అని తాడెత్తున లేచాడు.

యేమాత్రం తగ్గకుండా అట్టానే బైటికి పొయ్యాడు. వందనం దెబ్బలకు యేడవాలని కూడా మర్చిపోయి అట్లాగే నిలబడింది. సాయంత్రానికి అన్ని విషయాలూ బైటికొచ్చాయి. నాగేశు పక్కూళ్లో పిల్లని మాట్లాడుకుంటన్నాడు. రెండునెల్లనుంచీ రాయబారాలు నడుస్తున్నాయి. రేపోమాపో ముహూర్తాలు పెట్టుకుంటారు.

నాగేశుకి యింటిపేరు నిలబెట్టడానికీ, తలకి కొరివి పెట్టడానికీ కొడుకు కావాల్సిందే. విషయం తెల్సిన వాళ్లొచ్చి వందనంతో -

''నీకేం పొయ్యేకాలం వచ్చిందే - ఆప్రేషనెందుకు చేయిచ్చుకు చచ్చావ''ని అడిగితే వందనం లబ్బున మొత్తుకుంది.

''ఆ సచ్చినాడే - ఆడి బలవంతానే ఆస్పత్రికి పొయ్యాను. కావాలంటే మా అమ్మనడగండి. అన్నమ్మ నడగండి'' అని యేడ్చింది. అన్నమ్మ వందనం మాట నిజమని చెప్పటమే కాదు నాగేశుని బూతులు తిడుతా బజారుకొచ్చింది. ఎక్కడ్నించి వచ్చాడో డానియేలు వచ్చి అన్నమ్మని చావగొడతా యింటికి లాక్కుపొయ్యాడు.

వందనం ఆరోజు పొయ్యి రాజెయ్యాలా అన్నమ్మే మొగుడికి తెలియకుండా యింత అన్నం, చింతకాయి పచ్చడీ పంపించింది. వందనం పిల్లలకు పెట్టి తను తినకుండా పడుకుంది. నాగేశు వచ్చి అది శుభ్రంగా తిని నిద్రపోయాడు. అన్నమ్మ యెవరిచేత కబురు చేసిందోగాని రత్తమ్మ పెద్దకూతుర్నీ, పెద్దల్లుడినీ కూడా తీసుకొచ్చింది. నయానా భయానా కూడా లొంగలేదు నాగేశు. అతనికి వూళ్లో మొగోళ్ళ సపోర్టు బాగానే దొరికింది. చివరికి యేం చెయ్యాలో తెలియక రత్తమ్మ కూడా కూతుర్నే తిట్టింది.

పంచాయితీ పెట్టించమంది అన్నమ్మ.

''పంచాయితీలో యేం తేలుద్ది? వందనానికి యిడాకులిస్తాడు. ఇద్దరు పిల్లలతో వందనం యేం కావాలా? వాడు అందరికీ తాగబోయించి వాడికనుకూలం చేసుకుంటాడు. పొరుగూరోళ్లం తామేం చెయ్యగలరు? ఈ పిల్లనేం చెయ్యాలా? దాని పిల్లల్నేం చెయ్యాలా? ఇదంతా చుట్టుకుని చుట్టుకుని యాడికి బోద్ది?''

రత్తమ్మ కంటినుండి ధార ఆగలేదు. ముగ్గురాడవాళ్లకూ ముద్ద దిగలేదు. పంచాయితీలో రత్తమ్మ అనుకున్నదే జరిగింది. నాగేశు కొడుకు కావాలనుకోవటంలో యెవరికీ తప్పు కనిపించలేదు.

''మొగోడన్నాక కొడుకుని కనాల. ఇంటి పేరివ్వాల. వాడి చేత్తో యింట మట్టేయించుకోవాల''

ఇన్ని పన్లు జరగాల్సుండగా ''వందనం కొడుకుని కనకుండా ఆప్రేషనెట్టా చేయించుకుంటది?''

నాగేశు యిద్దరాడపిల్లల్ని చూసి భయపడి మళ్లీ ఆడపిల్లలు పుడతారేమోనని మాటవరసకు

''ఆప్రేషన్ చేయంచుకుంటావా'' అని అడిగితే ''ఆడది మంచీ చెడ్డా ఆలోచించకుండా యోసుకుని పోయి చేయించుకోటమేనా?''

యెంత గోల చేసినా, యెవరు యేడ్చినా, యెవరు అరిచినా ఈ మాటలకు తిరుగులేదు కావాలంటే తప్పు కడతాడు

సాయింత్రం దాకా అరిచి అరిచి సాయంత్రానికి యెవరిళ్ళకు వాళ్లు వెళ్ళారు వందనాన్ని తనతోపాటు రమ్మంది రత్తమ్మ.

''ఒద్దు ఈ వూరొదిలి యెందుకెళ్లాలా - ఆ మడిసి లేకపోతే వూరు వూరుగాకుండా వల్లకాడైపోద్దా పిల్లలు యిక్కడుంటేవాడిగ్గూడా కాస్త వాళ్లను చూడాలనుంటది పిల్లలకి తండ్రెసుమంటాడో తెలియాలిగా. యెప్పుడైనా యెక్కడైనా నీ రెక్కల కష్టమేగదా నిన్ను బతికిచ్చేది'' అంది అన్నమ్మ.

వందనానికి తల్లో పెద్ద మంట మండుతున్నట్టుంది.

''పదేనేళ్లప్పుడు ఈ వూరొచ్చింది వొచ్చి పదేళ్ళయింది ఇప్పుడు వూరు సచ్చిందో, తను సచ్చిందో తెలవటంలా. ఇది వూరుగాక వల్లకాడు అంటది అన్నమ్మ. వల్లకాడు గాక మరేంది? యేం చేసిందీ వూరు - ఈ మడుసులు వచ్చిందగ్గర్నుంచీ రేత్రింబగళ్లనకుండా చాకిరీ చేసింది తను కాపరానికొచ్చినపుడు నాగేశు కొంపెట్టా వుంది? మట్టిగోడలు పడిపోతన్నాయి లోపల నేల యింతింత లోతున గుంటలు పడిపోయింది. ఆ గోడల్ని రాళ్లు పెట్టీ, మట్టి యెత్తీ రెండేళ్లపాటు నానా యాతనా పడి పైకి లేపింది ఇంటికి యెంత మట్టీ చాల్లేదు ఆ మట్టి కోసం యెంతెంత దూరాలో తిరిగింది వూరంతా తిరిగి పేడ పోగేసింది అలికి ముగ్గు పెట్టిన యిల్లు నవ్వుతా వుంటే తనూ నవ్వుకుంది గానీ యేదో ఒకరోజు ఈ యింట్లో తన కడుపు భొగ్గుమంటుం దనుకోలేదు

ఇంటిచుట్టూ కంచె కట్టె తెచ్చి దడి కట్టింది. ఇంటి మీదికి సొరపాదు, కాకరపాదు, బీరపాదు పాకించింది. ఈ యిత్తనాల కోసం యిల్లిల్లూ తిరిగింది ఈ ఇంటిమీద కాకర పూసినప్పుడే తన కడుపున పెద్దపిల్ల పడింది.

ఇప్పుడా కాకర చేదంతా తన బతుకులోకి దిగబడింది. ఇప్పుడీ యింట్లోంచి పోవాల, యెక్కడికి? మొగాడు లేని బతుకయింది. మొగాళ్లకేం - కుక్కలల్లే యెక్కడబడితే అక్కడే వుంటారు తనకంటూ ఒక మడిసి వుండడు

పిల్లలు పుట్టరని కట్టుకున్నోడే వొదిలేస్తే యింకొకడు తనని మళ్లీ యెందుక్కట్టుకుంటాడు. తను వూరందరి పోరంబోకు అవుతది. మొగుడు తనని పంట పండని బీడు భూముల్లే చేశాడు. పోరంబోకు చేశాడు.

ఈ మాయదారి డాక్టర్లు, ఈ మాయదారి ఆప్రేషన్లూ ఆడాళ్ల కోసం యియ్యేకటి కనిపెట్టారు ఆ కాంపౌండరు సచ్చినాడు మొగుడెంట పడితే, ఆడు మొహర్బానీకో మరెందుకో పదపదమని నెట్టాడు ఇప్పుడు అబ్బే నాకేం తెలుసని చేతులు తిప్పుతున్నాడు తనకక్కర్లేదని వొదిలేశాడు. తనీ పిల్లముండల్ని పెంచాల. ఈళ్ళ బతుకెట్టా బుగ్గయిద్దో తెలవదు, యేందీ ఆడ జల్మ.

పెళ్లి పెళ్ళని పెద్దమడిసైన కాడ్నించీ వూపిరాడ్నీయక పోతిరి. పెళ్లయినాక రెండేళ్లు దాటినా కడుపు పండలేదని గోలగోల చేస్తిరి. అప్పుడు తన కడుపులో దెయ్యిమంత బయ్యిం. పిల్లలు పుడతారా లేదా అని - వరసనే పిల్లలు పట్టుకొత్తంటే యిక మొగపిల్లాడు కావాలని -

మజ్జలో మొగుడు సచ్చినోడు యిట్టా చేశాడు తన బతుకెందుకు?

ఆ మొగుడికీ ఈ పిల్లలకీ తనకీ ఈ ముడెందుకు?

ఈ ముడి పాడుగాను యిది వున్నట్టూ వుండదు లేనట్టూ వుండదు. ముడి సొంతం పడదు. సొంతం వూడదు ఈ మొగుడు వదిలేసినా బతకాల పిల్లలు వొదిలేసినా బతకాల

ఈరమ్మ బతకటంలా. డెబ్బయ్ యేళ్లు కళ్ళు సరిగ్గా కనపడవు వేరిశనక్కాయలూ, బటానీలు, జీళ్లు అమ్మిద్ది రూపాయి మిగిలితే వండుకు తింటది. లేకపోతే అడుక్కుతింటది.

ఊహ వొచ్చిందగ్గిర్నించీ యింటిని బాగుసేత్తాం. ఇల్లుండదు వయసొచ్చిందగ్గిర్నించీ పొలాలు బాగుచేత్తాం. పొలం వుండదు కట్టుకున్నాడ్ని కంట్లో పెట్టుకు సూత్తాం. కన్ను పొడిసేత్తాడు పిల్లల్ని కనిపెంచుతాం. రెక్కలొచ్చి యెగిరిపోతారు. మనం మాత్రం పేణం వున్నంతకాలం దాన్ని నిలుపుకోవడానికి తిప్పలు పడాల.

అంతేనా మానవ జల్మ.

ఇంతకు తప్ప మరేందో యెక్కడా వందనం మనసుకి అందడం లేదుగానీ యేదో వుందని ఆమెకి మనసు లోపల్నించి అనిపిస్తోంది

తనని అగాధంలోకి తోసెయ్యి జూస్తున్న నిరాశను నెట్టేసి తను లేచి నిలబడటానికి వందనం చేస్తున్న యుద్ధం గురించి తెలిస్తే, ఆలోచిస్తే గుండెలవిసిపోతాయి.

వందనం తనతో తాను ఒక సమాధానానికి రావటానికి బ్రహ్మాండం బద్దలయ్యేంత ప్రయత్నం చేస్తోంది

వందనానికి యిది యింకో కాన్పులాగ వుంది.

''యేడుపేగాదు, సంబరాలూ వున్నాయి. ఈ పాతికేళ్లలో యింత యేడుపు తనకెప్పుడూ లేదు

పనిచెయ్యడం తనకెప్పుడూ యేడుపు రాదు.

చేసిన పని చూసుకుంటే యెప్పుడూ గుండెల్నిండా సంతోసమే

కడుపుపంట చూసుకుంటే యెప్పుడూ కన్నుల పండగే ఈ మొగుడా సచ్చినాడి మూలానే గాని తనకింత యేడుపెన్నడూ లేదు

అన్నమ్మ సావాసం వుంది ఆడపిల్లలు తనను దిక్కులేని దానిలా వొదిలెయ్యిరు.

నోరు మంచిదైతే వూరు మంచిదవుద్ది

ఇంటికి గోడలు లేపిందంటే వూళ్లో యెవరి సాయం లేకుండానే జరిగిందా? రాళ్ళిచ్చారు. మట్టిచ్చారు పేడకళ్ళు యిచ్చారు

పల్లెలో పిల్లాజెల్లానుంచి అన్నమ్మదాకా తలో చెయ్యా యేశారు.

తొలి కాన్పుకి కూడా పుట్టింటికి పోలేదుగా ఇక్కడాడాళ్లే గట్టెక్కించారు.

కూలి పెంచాలని గోల చేసినప్పుడు పల్లెంతా ఒకటవలా?

నాగేశు వొదిలేశాడని వూరు తనను వొదులుద్దా? వూరిని తను వొదులుద్దా.

మంచీ చెడ్డా అన్నీ వున్నాయి వూళ్లో నేయిం, అన్నాయిం అన్నీ వున్నాయి వూళ్లో

తను నేయిం పక్కనుంది నాగేశు అన్నేయిం పక్కనున్నాడు

పంచాయితీలో మొగోళ్ళంతా అన్నేయిం పక్కనున్నా అన్నమ్మలాంటి ఆడోళ్లు తనపక్కే వున్నారు.

ఇయ్యాల ఆళ్లకి బలం లేదు అన్నాయమై పోయిన తను వూరొదిలి యెళ్లిపోతే యెప్పటికీ నాయానికి బలం రాదు తనుండాల ఈ ఆడోళ్ళు కళ్లెదుట తిరుగుతుండాల ఇంకెవురన్నా తనసుమంటి ఆడోళ్ళుంటే ఆళ్లపక్కన నిలబడాల నాయానికి బలం సంపాయిచ్చాల

మొగోళ్ళంతా కల్సి వూర్ని వల్లకాడు చేత్తే -

వల్లకాడుని వూరు చేసుకోవాల్సింది తనసుమంటి ఆడోళ్ళే

కూలిపోతన్న యిల్లు బాగుచేసుకున్నట్టే బతుకూ బాగుచేసుకోవాల

వందనానికి పురుటి నొప్పులు కొత్తగాదుగానీ యిప్పుడు ఈ నొప్పులు కొత్తగానే వున్నాయి.

''ఇవి తన బతుకు కోసం తన పడుతున్న నెప్పులు ఇప్పుడు యింకో పసిగుడ్డుకి జల్మ యియ్యటానిక్కాదు - ఈ బాధ, ఈ యాతన.

తన బతుక్కి తనే పేణం పోసుకోవాల తన బతుకుని తనే కొత్తగా మళ్లోసారి కనాల

ఈ పురిటి నెప్పులు అందుకు - తన బతుక్కోసం''

వందనానికి ఈ నొప్పులు వుధృతమవుతున్న కొద్దీ వుపశాంతిగా వుంది

మరోసారి తను పుడుతున్నట్టుగా వుంది

''తన పుటుకకు తనే నొప్పులు పడటం'' - యేడుస్తూ వందనం నవ్విన నవ్వు వేకువజాములా వుంది.

ఒక చెంపనుంచీ రాత్రి తెల్లవారుతుంటే యింకో చెంప వందనం మనసు తేటపడుతోంది.

కళ్ళల్లోకి యెక్కడ్నించి తెచ్చుకున్న ప్రాణమో వచ్చి చేరుతోంది.

జీవితాన్ని ప్రసవించడానికి వందనం సన్నద్ధమవుతోంది.



# నలుపు

డా. వి.చంద్రశేఖరరావు

మా నాయన ఒంటిరంగు నలుపు. చీకటి గడ్డకట్టినట్లు ఉంటాడాయన. మా జేజినాయన కూడా అట్లాగే ఉంటాడు. మా నాయన భార్య (పిన్ని), ఆమె ఇద్దరు పిల్లలు, అప్పుడప్పుడూ మా యింటికొచ్చే బంధువులు, మా చుట్టుపక్కల ఇళ్ళల్లో వాళ్ళూ అందరూ నలుపే. నేనొక్కదాన్నే తెల్లగా పాలిపోయినట్టుగా ఉంటాను. నా వాళ్లందరిలాగా కాక, యిలా ప్రత్యేకంగా ఉండే నా ఒంటిరంగు నాకు దిగులు కలిగించేది. 'మీ యమ్మది దబ్బపండు సాయ. దాని రంగే నీకు వచ్చింది' అని మా బంధువుల్లోని ముసలమ్మలు నా బుగ్గలు సాగదీస్తుంటే నాకు వింతగా ఉండేది.

నేను, మా అమ్మ మా జాతి మనుషులుగా పూర్తిగా రూపుదిద్దుకోకుండానే ఈ భూమిపైకి తోసివేయబడ్డామేమో ననిపిస్తుంది.

నా స్కూలు జీవితం, నా చదువు కూడా నాకు ఆందోళన కలిగించేవి. 'పిల్ల చాకు! పాదరసం లాంటి బుర్ర! ఒక్కసారి చెబితే చాలు యిట్టే గ్రహిస్తుంది. వాళ్లలో ఆపాటి చదివేవాళ్ళేరీ?' అనేవాడు మా స్కూలు అయ్యవారు. 'వాళ్లలో' అనే మాట నన్నెందుకో భయానికి గురిచేసేది. బానిసత్వం, అణచివేత, నరమేధంలాంటి మాటలు విన్నప్పుడు కలిగే ఉలికిపాటు, భయం. 'వాళ్లలో' అనే మాట విన్నప్పుడు కూడా కలిగేది. (చాలాసార్లు నా పరీక్ష పేపర్లలో కావాలని తప్పులు రాసేదాన్ని. టీచర్లు అడిగే ప్రశ్నలకు తెలిసినా తెలియనట్లు తల ఊపేదాన్ని)

మా ఇంటికీ, బడికీ, ఐదుమైళ్ళ దూరం. మేం మొత్తం పన్నెండు మందిమి. ఆడపిల్లలు నలుగురు. మేమందరమూ కలిసే వెళ్లాలని మా పెద్దవాళ్లు చెబుతుంటారు. ''ఒక్కదానివే ఎప్పుడూ రావద్దు!'' అని నాయన రోజూ చెబుతుంటాడు. అడవులు లేవు, పెద్దపులులు లేవు. మనుషులే! పెద్దవాళ్లు చెప్పే ప్రమాదమేమీ కనబడేది కాదు. రోజూవినీ వినీ ఈ 'భయపడటం' అనేది మాకు సహజమైన అనుభూతి అయ్యేది.

త్రోవలో జామతోటలు. పండి, మగ్గి దోవ పొడవునా మధురమైన వాసన. కోరిక ఆపుకోలేక అందరం తోటలోకి దూరాము ఒకసారి. లంగా పైకి గోసెలాగా కట్టుకొని చెట్టు ఎక్కాను. ఇంకో ఇద్దరు మగపిల్లలు కూడా ఎక్కారు. కాయలన్నీ దులిపివేశాం. కావలివాడు అరుపులు విని వాళ్లిద్దరూ చెట్టు దూకి పారిపోయారు. మిగిలిన పిల్లలూ పరుగు ఎత్తుకున్నారు. చెట్టుపైనుండి దూకడానికి భయంవేసి నేను కావలివాడికి దొరికిపోయాను. వాడు నా జుట్టు పట్టుకొని ఈడ్చి... ఆవేళ వాడు తిట్టిన తిట్లు నేనెన్నడూ వినలేదు. లైంగికక్రియలో హింస ఉందని, లైంగిక హింస మగవాడికొక ఆయుధమని అర్థమయీ, అర్థంకాక, ఆవేళ ఆ తిట్ల ద్వారా నాకు తెలియవచ్చింది

మా నాన్న భార్యకు ఇద్దరు పిల్లలు. పెద్దవాడికి ఆరేళ్లు ఇంగ్లీషు బడికి వెళుతుంటాడు. రెండోది

నాలుగేళ్ల పిల్ల. అదెప్పుడూ చింపిరి చింపిరిగా దిగులుగా ఉండేది దానికి తల్లి ఉంది నేను, తాను అనాధలుగా బతుకుతున్నట్లు అనిపించేది మా నాన్న భార్యపై నాకెంతో ద్వేషం ఉండేది ఆమె కొడుకుపై కూడా కానీ ఆ పిల్లంటే నాకెంతో జాలీ, సానుభూతి అఆలు సరిగ్గా రాలేదనే నెపం దాన్ని స్కూలు ఆపేశారు. స్కూలుకెళ్లడం లేదు కదా అని మంచిబట్టలు తెచ్చివ్వడం ఆపివేశారు అట్లాంటి పరిస్థితే నాకూ దాపురించింది ఒకసారి (నాకు పన్నెండేళ్లప్పుడు) ఎర్రటి చిక్కటి రక్తం లాంటిదేదో తడితడిగా నా కాళ్లమధ్య నుంచి ఉబికింది (నా మొదటి మెన్సెస్ రక్తం) కొంచెం భయం! కొంచెం ఆశ్చర్యం! దాని గురించి ఎప్పుడూ విన్లేదు లేను రాబోయే గొప్ప ప్రమాదానికి ఇదేమన్నా సూచనేమో అని భయపడ్డాను ఒక అక్కను మాత్రం అడిగాను (మా సీనియర్). ఆ అక్క దానిని గురించి వివరించాక, దానితోపాటు జరిగే తంతును చెప్పాక, ఆ విషయం ఇంట్లో చెప్పకూడదని నిర్ణయించుకున్నాను రక్తంతో తడిసిన లంగాను ఉతుక్కుంటూ ఉండగా మా నాన్న భార్య కళ్లలో పడ్డాను గొప్ప ఆపద వచ్చినట్లుగా ఇంటిల్లిపాదీ తలకిందులయ్యారు. బడి మాన్పించాలని మా నాన్న భార్య పట్టుబట్టింది ఆమె దూరపు బంధువొకడు (మద్రాసులో కక్కసుదొడ్ల కడిగే ఉద్యోగం) ముప్పయి యేళ్లయినా పెళ్లికాకుండా ఉన్నాడట. (సిటీవాడుకదా! రంగున్న పిల్ల కావాలట!) వాడికి కబురుచేసి నన్ను వాడికిచ్చి పెళ్లి చేయాలని పట్టుబట్టింది. ఆ రాత్రికి గన్నేరు పప్పులు తెచ్చుకుని, మెత్తగా నూరుకొని మొత్తం తాగేశాను వారం రోజులకు గానీ కళ్లు తెరవలేకపోయాను. మా నాయన ''నాకూ కాస్త పెడితే - ఇద్దరం కలిసే చచ్చేవాళ్లం కదరా తల్లీ!'' అంటూ ఏడ్చాడు. ఆవేళ నేను చేసిన పనికి నేను సిగ్గుపడలేదు కానీ అట్లా ఎంతదుకు చేశానా అని ఇప్పుడాలోచించుకుంటే బహుశా మానాన్న భార్యపై ద్వేషమే అనుకుంటాను. ఆమె అనే పీడకలను, ఆమె బంధువు రూపంలో ఎల్లకాలం భరించాలనే భయమేమో! అంతేకాదు... ఇంకో భయం కూడా తెలిసీ తెలియనట్లుగా బహుశా కావలివాడు ఆవేళ తిట్టినతిట్లలోని లైంగిక హింస కూడా గుర్తుకొచ్చి ఉంటుంది.

టెన్త్‌క్లాసు నేను ఫస్ట్‌క్లాసులో పాసవడం మా పల్లెలో పెద్ద వింత మా పల్లే కాదు. మా ఊరికి అటూ, ఇటూ ఉన్న చాలా పల్లెల్లో కూడా అదో ముచ్చటైంది (స్కూలు ఫస్టుకూడా నేనే మరి!) ''పిల్లనింకా చదివించు! బాగా పైకొస్తుంది. ఇంటరుకూడా ఇట్లాగే చదివితే దానికి డాక్టరు కోర్సు గ్యారంటీ! మీవాళ్లలో అది మొదటి డాక్టరవుతుంది! చదువాపమాక! పైగా దాని చదువుకు పైసా ఖర్చు ఉండదు సోషల్‌వెల్ఫేరు హాస్టళ్లున్నాయి తిండీ, వసతి ఫ్రీ. ఫీజులుండవు, పుస్తకాలు వాళ్లే కొనిస్తారు. వారానికో, రెండు వారాలకో మీరెళ్ళి దాన్ని చూసి వస్తూ ఉండొచ్చు!'' మా సారు మాటలు మా నాయనపై బాగా పనిచేశాయి

షెడ్యూలు తెగలు, షెడ్యూలు కులాలు అనే మాటను మొదటిసారిగా టౌన్‌కొచ్చినప్పుడే విన్నాను. నన్ను గురించినదేదో చరిత్రకు, నా నుంచి దాచివేసినట్లుగా ఇప్పుడే మొదటిసారిగా తెలుస్తున్నట్లుగా అనిపించింది. కాలేజీలో ఈ మాటల్ని అవమానానికి, చిన్నబుచ్చడానికి ప్రతీకలుగా వాడటం కూడా నేను తెలుసుకున్నాను. ప్రతి వ్యక్తికీ తన గురించి, తన జాతి లేదా తెగ లేదా కులం గురించి చరిత్ర గర్వకారణంగానే ఉంటుంది. కానీ అందుకు భిన్నంగా తమ గురించి తాము మాట్లాడకపోవడం అనే శిక్షను తమపై తాము విధించుకోవడం నేను గమనించాను. హాస్టలు పరిస్థితి కొంచెం బెటరు అటునుంచి, ఇటునుంచి నాలుగు మూలలనుంచి సమీకరించ బడిన ఎంతోమంది నాలాంటి పిల్లలు నాకెంతో ఊరటనిచ్చారు అయితే ఇక్కడా నా శరీరపు రంగు నాకు మళ్లీ దిగులును కలిగించేదిలా వుంది ''నువ్వు చాలా అందంగా ఉంటావు!'' ''నీది మంచి కాంప్లెక్షన్!'' ''నువ్వు వాళ్ల అమ్మాయిలా ఉంటావు!'' లాంటి మాటలు నన్ను వింత భయానికి గురిచేసేవి

'గాసిప్' గురించి, దాని తీవ్రత గురించి, హాస్టల్‌లోనే నాకు తెలిసి వచ్చింది. నిజాలతో, నిరూపణలతో పనిలేదు. ఊహకు కాస్త రంగులు, దినుసులు వేసి ఒక థ్రిల్లింగ్ స్టోరీని తయారుచేస్తారు. ఈగాసిప్‌లో ఎక్కువగా వినబడేది వార్డెన్ మేడమ్ గురించి, మెల్లగా కీచుగొంతుతో మాట్లాడుతుంది ఆమె. శరీరంలోని బలమంతా తోడేసినట్లుగా ఊగులాడుతూ వుంటుంది (చెక్క మేడమ్!) ఆవిడతో మాట్లాడాలంటే ఎందుకో భయం వేసేది. ఆమె కళ్ళు భయం గొల్పేలా వుంటాయి. ఆ కళ్ళు ఆవిడవి కానట్లుగా, ఏ శవానివో కళ్ళు పీకి అక్కడ అతికించినట్లుగా ఉంటాయి. ఆమె భర్త ఎనుబోతులా వుంటాడు. బాన కడుపు, పొడవు మెడ, చాట ముఖం, మనుషుల్ని తినే జాతికి చెందినవాడులా వుంటాడు. మా గాసిప్‌లో అతగాడే విలన్! సరదా కబుర్లతో మొదలయ్యే గాసిప్ ఒక్కోసారి వింత భయంగా ముగుస్తాయి. ఆత్మహత్య చేసుకున్న పూర్ణ అనే అమ్మాయి గురించిన కథలు నాలో దిగులును, భయాన్నీ కలుగజేశాయి.

అవమానం, బానిసత్వం, నరమేధం లాంటి మాటల్ని వింటున్నప్పుడు కలిగే ఉద్వేగం, ఆందోళన ఆ హాస్టలు పిల్లలు అనే మాటలు విన్నప్పుడు కూడా కలిగేవి. ఇదో కొత్త అనుభవం కాలేజీకి వెళ్ళి మళ్ళీ తిరిగి వచ్చేవరకు ఒక తప్పనిసరైన శిక్షను అనుభవిస్తున్నట్లుగా వుండేది. కొందరి చూపులు వెంటాడే బాణాల్లా వుంటాయి. కొన్ని మాటలు లోపలకంటా దిగబడిన కత్తుల్లా ఉంటాయి.

రమేష్ అనే ఇంగ్లీషు లెక్చరరు. అతనంటే గొప్ప ఆరాధన నాకు. అద్భుతమైన కాల్పనిక ప్రపంచాన్ని కళ్ళముందుంచుతాడు. సజీవ నాటకాన్ని వింటున్నట్లుగా ఉంటుంది అతని పాఠం. ఇంగ్లీషుపై కాస్త పట్టు వచ్చిందంటే ఆయన వల్లనే. ఒక శనివారం 'రేపు సండే మా ఇంటికి 'టీ'కి రాకూడదా?' అని ఆహ్వానించాడు ఆ ఆహ్వానానికి పొంగిపోయాను. ఆదివారం ఉదయం ముసిరిన మబ్బు, మూగ ఎండ, చల్లని గాలి, ఆకుపచ్చ ఓణీ, ఎర్రగాజులు, నుదుటిపై టెన్షన్ తాలూకు చిరుజల్లులు- ''రా! లక్ష్మీ లోపలికి!'' అంటూ ఆహ్వానించాడు. ఇల్లంతా బోసిగా వుంది. సెట్టింగ్‌లన్నీ పీకేసిన స్టేజిలా వుంది. ఊడవని గదులు, మాసిన బట్టలు- ''మీ మేడమ్ ఊళ్ళో లేదు అందుకే ఇల్లంతా కంగాళీగా ఉంది!'' కాఫీ సిప్ చేస్తుండగా చెప్పాడు ''నీలో గొప్ప స్పార్క్ ఉంది. బ్రైట్ ఫ్యూచరుంది నీకు''. నా కళ్ళల్లో ఆనందం, గర్వం - కానీ ఎందుకో అర్థం కాని భయం కూడా కలిగింది. ఆయన నా దగ్గరగా వచ్చి నా చుట్టూ చేతులు వేసి, ఆ చేతుల్ని పాము పిల్లల్లాగా చాతీలోకి పాకిస్తూ - విదిలించుకొని దూరంగా జరిగాను. ''వెళ్తాను సార్!'' ''ఏమిటి బెట్టు! మీ హాస్టలులో ఇట్లాంటివి మామూలేగా!'' ''బాస్టర్డ్!'' అని తిట్టానా? లేదు. తిట్టలేకపోయాను. పెద్దపెట్టున ఏడ్చాను. దుఃఖంతో, అవమానంతో ఏడ్చాను. బాల్యంనుంచి నన్ను భయపెట్టే అవమానం. వాళ్ళు అనే పేరుతో, ఆడపిల్ల అనే పేరుతో, ఇవాళ కొత్తగా ఆ హాస్టలు పిల్ల అనే పేరుతో.

కారణం రమేషో, మరెవరో తెలియదు. కాలేజీలో నా గురించిన ప్రచారం ''పెద్ద కేసు గురూ'' ''మొన్న శంకర్‌లాడ్జి దగ్గర చూశాను!'' ''హంద్రెడంట! మనకేమన్నా కన్సెషన్ ఇస్తుందేమో!'' హాస్టలుకు నా పేరుతో ఉత్తరాలు వచ్చేవి. జుగుప్సగా, అసభ్యంగా! వార్డెన్ కూడా వాటిని చదవలేకపోయేది.

కొలిమి నిప్పుల్ని మోసినట్లుగా ఇట్లాంటి అవమానాల్ని మోస్తూ చదివే ఈ చదువు అవసరమా అనిపించేది! చదువు మాని... ఆ తరువాత జీవితం కూడా పెద్దగా ఆసక్తికరంగా తోచలేదు. మద్రాసు సంబంధం నా కోసం ఇంకా కాచుకునే వుంది.

ఒక సెలవురోజు సాయంత్రం హాస్టలు మధ్యనున్న ఫౌంటెన్ దగ్గర కూర్చున్నాను. అటూ ఇటూ క్రోటన్ మొక్కలు అంతగా వాసన రాని డాలియా పూలు. ఒకే ఒక్క చామంతి పొద పసుపుపచ్చగా

విరిసి పూలతో కిలకిలలాడుతోంది. చీకటి సన్నసన్నగా పాకుతోంది ఆవేళ ఉదయంనుంచీ హాస్టల్లో కరెంటు లేదు. రూమ్‌లలో ఉండలేక మరికొంతమంది పిల్లలు కూడా బయటకు వచ్చారు. చీకటి నిశ్శబ్దంగా, దిగులుపడ్డ మనసులా వుంది. చిరంజీవి సినిమా గురించి ఒకచోట, వార్డన్ మేడమ్ హాస్టలు వస్తువులు అమ్ముకునే విషయం గురించి ఇంకోచోట లోగొంతుకలో కబుర్లు వినబడుతున్నాయి. ఆ చీకటిలో, దూరంనుంచి ఒక రూపం చాలా సేపటినుండి నావైపు చూస్తున్నట్టుగా అనిపించి ఉలిక్కిపడ్డాను మరీ పిరికిదాన్నయి పోయాననుకొని మనసును సమాధానపెట్టాను కెవ్వుమంటూ వెనకపొదలోంచి వినబడిన కేకతో భయంగా లేచాను. బలంగా నోరు మూసినట్లు, ప్రపంచానికి వినబడని నిస్సహాయపు కేకలు, మూలుగు రూపంలో నా చెవినబడ్డాయి. ''అక్కా...!'' పూర్తిగా వినబడని మరో రెండు కేకలు. విసురుగా లేచి ఆవైపు వెళ్లబోయేంతలో రెండు బలమైన చేతులు నన్ను చుట్టుముట్టాయి. ఒక చెయ్యి నోరు మూసి, రెండో చెయ్యి నా డొక్కలో ఫెడేల్మని పొడిచి - దుర్భరమైన భయం, బాధ తన్నుకువచ్చాయి. పొదలవైపుకు లాక్కువెళుతుండగా, సర్వశక్తుల్నీ సమీకరించి పెనుగులాడాను. కనపడని దేవుళ్లని ప్రార్థించాను ఒక సహాయం కోసం! నోటిపైన చెయ్యి అట్లానే ఉంచి, ఆ అజ్ఞాత మృగం నాపైన దాడి చేసింది. కత్తితో చీల్చినట్లుగా అతి భయంకరమైన నొప్పి. గాయం శరీరానికో, మనసుకో తెలియనట్లుగా ఉంది. దుఃఖం అలలా చెలరేగి ''అమ్మా!'' అంటూ పెనుకేక వేశాను. అది నోటిపై అదిమిపెట్టిన మృగపు చెయ్యిని సైతం చీల్చుకొని హాస్టలంతా మారుమోగింది. దూరంగా వాచ్‌మన్ కేక ''ఎవరక్కడా! ఎవరక్కడా!'' ''అక్కా! అక్కా ఏమైంది!'' గదుల్లోంచి మిగిలిన పిల్లల అరుపులు! మృగం నన్ను వదిలి పొదల మధ్యగా కాంపౌండ్‌వైపు పరిగెత్తింది గోడ దాటుతుండగా అతని రూపం లీలగా తోచి ఉలిక్కిపడ్డాను. ఇంగ్లీషు సార్‌లా తోచి, కాదు, కాదని మనసు గోల పెట్టింది హాస్టలు పిల్లలందరూ ఫౌంటెన్ చుట్టూ మూగారు సిగ్గుతో, అవమానంతో పెనుదుఃఖంతో మొత్తం ఆరుగురం! కొంచెం ధైర్యంగా ఉంది నేనే! పాలిపోయి గజగజ వణికిపోతున్నారు మిగిలినవారు.

నిస్త్రాణంగా, నిర్జీవంగా, భూమిపై బలంగా దిగ్గొట్టబడ్డ ఒకానొక హింసాత్మక దృశ్యంలా ఉన్న మమ్మల్ని పైకిలేపి, గుండెలకత్తుకొని లోపలకి తీసుకెళ్ళారు వాళ్లు. ఒక్కళ్లకొకళ్ళం పొగిలి పొగిలి ఏడ్చాం. ఆరాత్రి ఎవరూ నిద్రపోలేదు. అందరం ఒక గదిలోనే కూర్చున్నాం. వాచ్‌మన్ ద్వారా పాలు, టీపొడి తెప్పించి, వేడిగా టీచేసి పెట్టిందొక పిల్ల. వార్డెన్ ఇంట్లో లేదు వాచ్‌మన్‌తో కబురుపెట్టాం.

రాత్రంతా వార్డనొస్తుందేమో అని చూశాం రాలేదు. అపరాత్రివేళ వర్షం మొదలైంది. నిలబెట్టి కురిసింది. ఉదయానికి కూడా వాన తగ్గలేదు. పగటిపూట కూడా వార్డెన్ మేడమ్ రాలేదు. ఉదయం టిఫిన్‌కి ఎవరం లేవలేదు శరీరాల్ని అట్లాగే నేలపై కూలవేసి శవాల కుప్పల్లా గదిలో పడి ఉన్నాం అందరం.

ఆవేళ పగలు, రాత్రి కూడా వాన కురుస్తూనే ఉంది. సాయంకాలానికి వానలోంచి శవం నడుచుకు వచ్చినట్లుగా వార్డెను వచ్చింది. ''ఎవరు వాళ్లు? ఎవరువాళ్లు? ''తెలిసినవాళ్ళా? కొత్తవాళ్ళా?'' ''ఎప్పుడూ ఇట్లా జరగలేదే?'' తనలో తాను ప్రశ్నలు వేసుకొని, ఎటువైపునుండీ సమాధానం రాకపోయేసరికి కాసేపు మౌనంగా అయింది. తనలో తాను ఏదో గొణుక్కుంది. నుదిటికేసి టప్, టప్‌మంటూ నాలుగైదుసార్లు కొట్టుకుంది. పదే పదే దీర్ఘంగా నిట్టూర్చింది.

''మీరు పిల్లలు! ఇంకా జీవితం గురించి ఏమీ తెలియదు! ఇదేముంది? ఇంకా ఎంత నరకం అనుభవించాల్సి వుందో? ఇది మగలంజాకొడుకుల లోకం. వాడు కసాయివాడు! కిరాతకుడు! మగనాకొడుకుల్లో మంచోడెవరయినా ఉన్నాడని, ఎవరన్నా అంటే వాళ్ళ ముఖంపై ఊస్తాను నాకు తెలుసు! నేను ఇట్లాంటి బాధను అనుభవించినదాన్నే! ఆడ మగ అందులో తెగ సుఖం ఉందని కవులు,

రచయితలు రాస్తూ ఉంటారు. సుఖం కాదు రక్తాన్ని తోడేయడం. పైనబడి తినడం. నాకు పెళ్లయి పదేళ్ళయింది పిల్లలు లేరు. పుట్టరుకూడా. శవాలకు పిల్లలెట్లా పుడతారు. ఒకసారెప్పుడో ఒక నెల ముట్టు కాలేదు నిప్పులకుండలాంటి కషాయాన్ని తాగాను వరసగా నాలుగు రోజులు తాగాను. రక్తపు ఏరులై అది నా శరీరాన్ని వదిలి మురికి కాలవలోకి పారింది. నా వంశం, నా జ్ఞాపకం అంటూ నా మొగుడు తెగ ఎగిరాడు. ''ధూ! నా కొడకా! నీతో కాపరం చేయడమే గొప్ప పాపం, పైగా నీకు పిల్లల్ని కనడమా?'' అనుకున్నాను.

''పచ్చిగా మాట్లాడుతున్నాననుకోవద్దు? నా మనసు పాడయింది సరిగ్గా మీ వయసులో ఉన్నప్పుడు నా మొగుడు నన్ను బలిమిన చెరిచాడు. అప్పుడు వాడు మా ఇంట్లో అద్దెకుండేవాడు. వాడి కాళ్లావేళ్ళా పడి వాడికి నన్నిచ్చి పెళ్ళి చేశారు మా వాళ్లు''

''సరే, అయిందేదో అయిపోయింది. మీరెందుకు ఏడవాలి? ఇప్పుడేం కొంప మునగలేదు. ఆకాశం కూలిపోలేదు. పసిమొగ్గలు మీరు. పాపమంతా ఆ నా బట్టలదే. ముట్టుతో తడిసిన గుడ్డల్ని విసిరి డస్ట్‌బిన్‌లో వేస్తామే, అట్లాగే జరిగినదాన్ని 'పో! నా బట్టా!' అనుకొని మరచిపోండి''

''లేవండి. లేచి స్నానం చేయండి. నిండుగా తలస్నానం చేయండి. అన్నీ అందులో కొట్టుకుపోతాయి. తలవంచుకు నడిచిపోతుంటే, పైనుంచి కాకిరెట్ట వేసింది. కడుక్కున్నాం. పోయింది. ఇదీ అంతే''

''దీనిగురించి దిగులూ వద్దు, దుఃఖమూ వద్దు. అసలెవరూ దీన్ని గురించి మాట్లాడుకోవద్దు. మామూలుగానే రేపట్నించి కాలేజీకి వెళ్ళండి''

మమ్మల్ని బలవంతాన లేవదీసి, బాత్‌రూమ్‌కి తీసుకెళ్లి తనే స్నానం చేయించింది. తల తుడిచి జుట్టు ఆరబెట్టింది. గదుల్లోకి అన్నాన్ని తెప్పించి, అందరికీ అన్నం పెట్టింది. ఆ రాత్రి మాతోనే పడుకుంది. ఏవో కథలూ, కబుర్లూ చెబుతూనే వుంది. ఎప్పుడో వేకువజాముకు నిద్రపట్టింది.

కాకిరెట్టలాగో, పీడకలలాగో ఆ సంఘటనను మరచిపోలేకపోతున్నాను ఆవిడ చెప్పినంత సులభంగా తీసుకోలేకపోయానా సంఘటనని.

అది దుఃఖమో, కోపమో, అవమానమో - ఆత్మని దహించివేసే మహోగ్ని నాలో నిత్యం రగులుతుండేది. తూనీగలాగో, వెన్నెలలాగో, చిరుముద్దులాగో, బిడియపడే అజ్ఞాత లైంగిక స్వప్నంలాగో ఉండాల్సిన వయసులో, స్త్రీల దుఃఖ చరిత్రలు, లైంగిక హింస లాంటి సీరియస్ విషయాల గురించి ఆలోచించుకోవాల్సిన మానసిక స్థితిలోకి వచ్చాను. రహస్యం! గోప్యం! అణచివేత! అన్నీ దాచుకోవాల్సిందే. పుండు సలుపుతున్నా ఏం జరగనట్టే నవ్వుతూ ఉండాలి.

ఒకరోజు హాస్టల్ అడ్రస్‌కు ఒక ఉత్తరం వచ్చింది. ''గొప్ప మజాగా ఉంది కదూ. వాటే బాడీ. ఎంత సెక్సీగా ఉన్నావో. మళ్లీ కావాలనిపించడం లేదా? మైడియర్ బిచ్. ఇవాళ సాయంత్రం పార్కులో (టాయ్‌లెట్స్ వెనక) కలుసుకుందాం. మరోసారి'' - ''సీక్రెట్ లవర్''. ఒళ్లంతా చెమటలు పట్టాయి. కాళ్ళు వణుకుతున్నాయి. భయం, దుఃఖం, కోపం ఎగిసి వస్తున్నాయి. హఠాత్తుగా వివస్త్రనైపోయినట్లు - ప్రపంచం ఎదుట నగ్నంగా నిలబడ్డట్టు - ఏడుస్తూ కూర్చున్నాను. ఎవరు, ఎట్లా ఈ పరిస్థితినుంచి నన్ను కాపాడతారు? ఈ కీచకుల్ని, నరకాసురుల్ని సంహరించడానికి ఎవరు ముందుకొస్తారు?

పోలీసులకో, ప్రిన్సిపాలుకో రిపోర్టు ఇచ్చి - వద్దంటుంది మేడం ''వాళ్ళూ మగవాళ్లే కదా! నీపై అనుమానంతో మొదలవుతుంది ఇన్వెస్టిగేషన్'' అంటుంది. దాచాలి! అంతా దాచాలి! కక్కసు దొడ్డిలోకి మలాన్ని జార్చినట్లు, అవమానాల్ని లోపలికి తోసేయాలి. ''రచ్చవుతుంది జీవితం పాడవుతుంది - డామ్ నాన్సెన్స్ ఎంత దౌర్భాగ్యమైన బతుకు యిది''

ఉత్తరాన్ని చించి టాయ్‌లెట్‌లో వేశాను

వారం తిరక్కుండానే లైబ్రరీ గోడలపై బొమ్మలు నీలి రాతలు బట్టలు లేని అమ్మాయిల బొమ్మలు వాటికి యారో మార్కులు వేసి - లక్ష్మి, లీల, మేరీ, కౌసల్య అంటూ తల నేలకేసి బాదుకోవాలనిపించింది 'స్పెషల్ కోచింగ్ ఫర్ సెక్స్' - 'కాంట్రాక్ట్ వెల్ఫేర్ హాస్టల్' - 'చీఫ్ ఇన్‌స్ట్రక్టర్ లక్ష్మి' కత్తితో అక్కడికక్కడే నా శరీరాన్ని చీల్చివేసుకోవాలని, లేదా అదేదో పురాణంలో లాగా భూమి చీలి అందులోకి అట్లాగే దిగబడి పోవాలని అనిపించింది.

''మీరు బెదిరిపోతారేమోనని వాళ్ల ఆశ మీరేం దడవద్దు మీరిక్కడికి వచ్చింది చదువుకోవడానికి, అది పూర్తి చేసుకొని వెళ్లండి ఇవన్నీ పట్టించుకోవద్దు మన హాస్టలు పిల్లలనేముంది? ఆడపిల్లల బతుకులన్నీ ఇట్లాగే ఉన్నాయి. బస్సుల్లో సినిమాహాల్లో, రోడ్లపై, ఇదే బూతు పురాణం పుట్టించుకోకపోవటం సమయం చూసి చెప్పు తీసుకొని కొట్టడం అదీ కావాల్సింది ఇంకా కసిగా చదవండి ఫస్ట్‌క్లాసు తెచ్చుకోండి'' మామూలుగానే వార్డెన్ మేడం లెక్చరిచ్చింది

మరోసారి అతను రమేష్, ఇంగ్లీష్ సార్.

''సాయంకాలం ఒకసారి ఆడిటోరియం వైపు వస్తావా? ఆరుదాటిన తర్వాత?'' కీచకుడు, నర్తనశాల మనసులో మెదిలారు. సాయానికి వచ్చే భీముడే లేడు. లొంగిపోవడమో, పోరాడటమో తేల్చుకోవాలి

కప్పెర కప్పెరగా చీకట్లు. అక్కడక్కడా దీపాలు లైబ్రరీలో కాస్తంత అలికిడి పరీక్ష పురుగులు క్లాస్ రూమ్‌లన్నీ నోళ్లకు తాళాలు వేసుకున్నాయి నీతిశాస్త్రాలు, కథలు, కాల్పనికాలు, చరిత్ర, రాజనీతి, ఆర్థిక నీతి బోధించి బోధించి అలసిపోయిందా కాలేజీ ఆడిటోరియంలో సన్నగా వెలుగుతున్న దీపం. ఎదురుచూస్తున్నట్లుగా ఇంగ్లీషు సారు.

''లక్ష్మీ! ఏమిటట్లా అయింది భవిష్యత్తు అంతా నాశనం చేసుకున్నావే! ఎవరి నోట్లోవిన్నా నీ గురించే! రోజూ నీ గురించే ఆలోచిస్తున్నాను ఆ రొంపిలోంచి నిన్ను ఎట్లా బయటకు లాగుదామని - నాకు తెలుసు! నువ్వు ఇన్నోసెంటువని''

అతని ముఖంలో ఆవేదన, కళ్లల్లో నీళ్లు ఇది నాటకశాల కదా!

''లక్ష్మీ! బాగా ఆలోచించి ఒక నిర్ణయం తీసుకున్నాను నేను నిన్ను పెళ్లి చేసుకుంటాను. ఆవిణ్ణి కూడా ఒప్పిస్తాను. నీపై మచ్చ తొలగిపోవడానికి ఇంతకన్నా దారి కనబడలేదు బాగా ఆలోచించుకో బలవంతమేమీ లేదు''

అతను దేనికోసమో వెతుకుతున్నాడు నా ముఖంలోని భావాల కోసమో. ఒక ఆహ్లాదకరమైన నిట్టూర్పు విడిచి, ఒక అడుగు ముందుకు వేశాడు. బహుశా నన్ను దగ్గరకు తీసుకోవడానికి కాబోలు అతను ఇంకో రెండడుగులు ముందుకు వేస్తుండగా, ఆడిటోరియంలోకి ప్రిన్సిపాల్ సార్, వైస్‌ప్రిన్సిపాల్ సారు, మా వార్డెను మేడం వచ్చారు. అతను ఉలిక్కిపడ్డాడు కానీ భయపడలేదు. వార్డెను మేడం కళ్ళల్లో నిప్పులు రగిలాయి ఈడ్చి అతని చెంపపై కొట్టింది కోపం ఆపుకోలేక అతని జుట్టు పట్టుకులాగింది ప్రిన్సిపాల్ ఆమెను ఆపాడు. నా దగ్గర స్టేట్‌మెంటు తీసుకున్నారు. హాస్టలులో జరిగిన ఘోరంతో సహా అన్నీ వివరంగా రాసి ఇచ్చాను

కీచకవధ జరిగినట్లేనా?.

మనసు తేలికపడింది కానీ స్పష్టంగా చెప్పుకోలేని భయంతో గుబులు గుబులుగా ఉంది

కీచకుడు మరణించినట్లేనా?

గొప్ప వార్త కోసం మరుసటి రోజంతా ఎదురుచూశాను. ఏమీ జరగలేదు రెండో రోజు, మూడో రోజు - నాలుగో రోజు ఇంగ్లీషు క్లాసుకు మళ్లీ అతనే వచ్చాడు ఆ సాయంత్రం మేడమ్ చెప్పింది.

''దిక్కుమాలిన రోజులు! దిక్కుమాలిన కాలం. వాడో ఎమ్మెల్యే చుట్టమట. నోరు మెదిపితే నన్ను ఉద్యోగంలోంచి తీసివేస్తామని బెదిరించారు. స్టేట్‌మెంట్లు, సాక్ష్యాలు అన్నీ మసి చేశారు. ఇది దయ్యాలు పాలించే కాలం తలవంచుకు నీమానాన నువ్వు వెళ్లు. ఈ రెండు నెలలు ఉగ్గబట్టుకుంటే, ఆ పరీక్షలు కాస్తా రాసేసి సర్టిఫికెటుతో వెళ్లుదువుగాని రోజులిట్లాగే వున్నాయి. కాలేజీలిట్లాగే వున్నాయి. అంతటా దుర్మార్గులదే కాలం.

''మరొక్కమాట! కాస్త జాగ్రత్తగా ఉండే తల్లీ. ఆడు పగబట్టి ఉన్నాడు''

భయంభయంగా గడిచాయి రోజులు. ఒంటరిగా రోడ్డుపైకి వెళ్లాలంటే భయం. ప్రతిక్షణం ఎవరో తరుముతున్నట్లుగా హింసాత్మకమైన ఒక దృశ్యం ఎప్పుడూ వెంటాడుతూ వుండేది. ఒక పదును కత్తి, ఒక యాసిడ్ బాటిల్, ఒక లైంగిక హింస తలుచుకొని భయంతో కొయ్యబారేదాన్ని. నిద్రపట్టేది కాదు కాలేజీకి వెళ్లేదాన్ని కాదు. ఊపిరి బిగబట్టుకొని ఒక రోజులోంచి ఇంకో రోజులోకి బరువుగా అడుగులు వేసేదాన్ని. ధైర్యం, ధైర్యం కావాలి. ఎక్కడ దొరుకుతుందది? గట్టిగా మూసేసిన తలుపు వెనక పొర్లి పొర్లి ఏడ్చిన దుఃఖపు తెర తరువాత సన్నగా గుండెలో రెపరెపలాడేది. అప్పుడు వెళ్ళి ఏ కలెక్టరుకో మెమొరాండంలా ఇద్దామనిపించేది. ఏ వార్తాపత్రికకో నా దుఃఖ కథనం రాసి పంపాలనిపించేది. కానీ ఈ ధైర్యపు కవచం క్షణాల్లో అదృశ్యమయ్యేది. రాక్షసుడు ఎక్కడో పొంచి వుంటాడు. వాడిని ధ్వంసం చేయగల శక్తులు ఎక్కడనుంచి వస్తాయి నాకు.

పరీక్షలింకా నెలరోజులు. ఒకరోజు మేడమ్ పిలిచింది. ''ప్రీ ఫైనల్ పరీక్షల్లో రెండు సబ్జెక్టుల్లో నీకు ఫస్ట్ వచ్చిందట! వచ్చే వారం కాలేజీ డే ఫంక్షన్‌లో నీకో ప్రైజుకూడా. కంగ్రాట్స్. ఇదో విజయగాథలాంటిది. ఇంత గొడవ, ఇంత సఫరింగ్‌లో కూడా... మిగతా పిల్లలందరికీ కథగా చెప్పాల్సిన విషయం ..' నవ్వు వచ్చింది. ఇదో విజయమా? దుఃఖం, భయం తప్ప నా కథలో చెప్పుకోదగ్గ విశేషమేముంది.

కాలేజీ డే. రంగురంగు కాగితాలు ఆడిటోరియం గొడవగొడవగా, మాటలు మాటలుగా, సముద్రం సముద్రంగా, కాస్త మౌనంగా వుంటే. నా లోపల పొంగేది విషాదమో, ఆనందమో పోల్చి చూసుకుంటాను. సైలెన్స్ ప్లీజ్.

ఆడిటోరియమ్ వదిలి... అట్లా కాలేజీ వైపుకు వెళ్లాను. పరిచితమైన ప్రదేశాలు. క్లాసురూముల్లోకి వెళ్లి... అక్కడి బెంచీలను ప్రేమగా ముట్టుకోవాలని... కాంటీన్.. నాయర్‌కు థ్యాంక్స్ చెప్పాలని... అట్లాగే వెళ్ళి, వెళ్లి, జువాలజీ లాబ్‌లో. . ఫార్మాలిన్‌లో తేలుతున్న జంతువుల్ని బయటకు లాగి, విముక్తినివ్వాలని... పోగా పోగా లైబ్రరీ, దానివెనక మినీ ఆడిటోరియం.. నర్తనశాల... రమేష్ ఏడీ? 'కీచకుడా! ఒరే లంజకొడకా!' లోలోపల వణుకుతున్న మాటల్ని పెద్దగా పైకి అరవాలని... ''స్టూడెంట్స్ ఆర్ రిక్వెస్టెడ్ టు...'' మీటింగ్ స్టార్ట్ అయినట్లుంది. వెనక్కు బయులుదేరాను. వెళుతూ, వెళుతూ, వెళుతూ కెమిస్ట్రీ లాబ్ దగ్గర ఆగాను లోపల వాచ్‌మన్ ''గుడీవినింగ్ జకరమా!'' బాగున్నావా పాపా! బాగా చదువుతున్నావా?'' ''ప్రీ ఫైనల్‌లో కెమిస్ట్రీలో క్లాస్ ఫస్ట్ వచ్చింది'' అంటూ పది రూపాయల నోటు చేతిలో పెట్టాను. అతని ముఖంలో పరవశం అట్లాగే లాబ్‌లోకి వెళ్లి. అటూ ఇటూ తిరిగి... పొగలు కక్కే సల్ఫ్యూరిక్ ఏసిడ్ బాటిల్ దగ్గర ఆగి ''సల్ఫ్యూరీ! సల్ఫ్యూరీ! నీలా పొగలు కక్కే . సెగలు చిమ్మే అగ్ని ప్రవాహంలా నేనెప్పుడు మారతానో?'' అని

అనుకుంటున్నంతలో

''డియర్ స్టూడెంట్స్! టుడే ఈజ్ ఎ '' మీటింగు మొదలైనట్లుంది. హడావుడిగా వెనుతిరిగాను కాలేజీ సాధించిన విజయాలు, కాలేజీ ఘనత. కథలు కథలుగా చెబుతున్నారు. కాలేజీలను దేవాలయాలంటాడు ఒకాయన ఒక మినీ సమాజమని ఇంకొకాయన, పర్సనాలిటీని పెంచే హ్యూమన్ లేబొరేటరీలు. . ఇంకా.. ఇంకా . నిజమా? డామ్ నాన్సెన్స్! ఇది రక్కసి పాదలు! సర్పాలయాలు! చిత్రహింసల సైనిక శిబిరాలు!

ప్రైజు డిస్ట్రిబ్యూషన్ ఫస్ట్ ఇంటర్ బై.పి సి ఇంగ్లీషు క్లాస్ ఫస్ట్ పి లక్ష్మి చప్పట్లు, చప్పట్లు '' దళిత కుటుంబంనుంచి వచ్చి వెల్ఫేరు హాస్టల్లో వుంటూ కష్టపడి'' నన్ను పరిచయం చేస్తూ వాడే రమేష్! ది కీచక!

ముఖ్య అతిథి ( జిల్లా జడ్జి) నాకు సర్టిఫికెటు, ప్రైజు ఇచ్చి ప్రేమగా షేక్‌హాండ్ ఇచ్చాడు. చప్పట్లు, చప్పట్లు. .. మరోసారి. ఇవి ప్రశంసలేనా? నమ్మశక్యమైనవేనా? ఎందుకో దుఃఖం వస్తోంది. తన్నుకు వస్తుంది. ఎందుకో కోపం కూడా వస్తోంది. ఒక చీకటి సాయంకాలం. హాస్టలులోనే, ఆ అత్యాచారం, అవి మరచిపోయారా? గోడపైని రాతలు, అవి? కీచకుడి చెర అది కూడా.. కాని నాకు మాత్రం మరపు రావడం లేదు . దుఃఖం ఆగలేదు. పొగిలి పొగిలి ఏడుస్తూ, అట్లగే నేలపై కూలబడి... నా హాండ్‌బేగ్ లోంచి సెగలు సెగలుగా ఉన్న సల్ఫ్యూరిక్ ఏసిడ్ బయటికు తీసి. ''సల్ఫ్యూరీ! సల్ఫ్యూరీ! నీలా పొగలు కక్కి, సెగలు చిమ్మి... అగ్ని ప్రవాహంలా మారి ..'' బాటిల్ రమేష్ ముఖంపై విసిరాను. వాడి అరుపులు వినిపిస్తూనే ఉన్నాయి



# తెల్లబట్ట

**బి.ఎస్. రాములు**

ప్రియమైన రమేశ్‌గారికి,

ఆ రోజు రాత్రి పొద్దుపోయే దాకా ఎన్నో విషయాలు చర్చించుకున్నాం. మీరు వెళ్లిపోయాక నాలో అంతర్మథనం సాగింది. కొత్త ఆలోచనలు సాగాయి. జీవితం ఎంత విచిత్రమైనది. మనం ఒకటి తలిస్తే అది ఒకటి తలుస్తుంది. నా పట్లనే కాదు మీ పట్ల కూడా జీవితం యిలాగే కావడం సామాజిక పరిస్థితులు ఎంత బలీయమైనవో చెప్పకయే స్పష్టం చేస్తున్నాయి. ఏమైనా మీరు తిరిగి కొత్త జీవితంగెలుచుకోవాలని, నిశ్చయించుకోవడాన్ని అభినందిస్తున్నాను. పిల్లలు పెరిగిన ఈ వయసులో పెళ్లా అని ఎవరైనా అంటారేమోనని సంకోచించకుండా మీ మనసులోని మాట చెప్పినందుకు అభినందనలు ఈ వయసులో మీ జీవితంలో ప్రవేశించే స్త్రీ కేవలం మీ తోడుగా కాకుండా మీ కుటుంబ బంధుమిత్రులందరిలో పాలలో నీళ్లలా కల్సిపోగలగాలి. మీతోపాటు ఆ స్త్రీకి కూడా మీ పెళ్లి కొత్త జీవితం యివ్వాలి. మీలాంటి సంస్కారవంతులకు, ముఖ్యంగా మగవాళ్లకు భార్య దొరకడం అంత కష్టం ఏమీ కాదు. కానీ భర్తను కోల్పోయిన స్త్రీలకు మీకు లాగా తిరిగి కొత్త భర్త దొరకడం అంత సులభం కాదు అలాంటి స్త్రీకే మీ జీవితంలో స్థానం ఇవ్వాలని నిర్ణయించుకోవడం మీ జీవితావగాహనను తెలుపుతుంది.

మీరు ఒక నిర్ణయానికి వచ్చేముందు వాళ్ల జీవితక్రమాలు తెలపడం నా బాధ్యత. అందుకని మీరడిగిన వివరాల్తో పాటు వాళ్ల మొత్తం జీవితం మీ ముందు పరుస్తున్నాను. సావకాశంగా ఆలోచించి అన్ని విధాల మానసికంగా సిద్ధపడి మీ నిర్ణయం తీసుకోవడానికి ఇది అవసరం అన్పించింది. మీ నిర్ణయం కోసం వేచి వుంటాను.

- మీ విద్యాధరరావు



రమేశ్‌గారూ! వారి కథ మొదట్నుంచి మొదలుపెడ్తాను అతని పేరు ఆశయ్య అతన్ని మీరు చూసే వుంటారు. పంచె మోకాలి పైకి కట్టేవాడు. తెల్ల సైను బనీను వేసేవాడు. చేన్ల వెంట పాటలు పాడుకుంటూ నడిచేవాడు. చేను పక్క యిప్పచెట్టుకింద కారం మక్క గట్క సద్దిదిని శాలోల్ల మోట బావివద్ద నీళ్లు తాగేవాడు. మేదరి అంచె నిండా పిడుకలు ఏరుకొచ్చేవాడు.

అతని మరదలు సారవ్వను కూడా మీరు చూసే వుంటారు బావ స్నానం చేసేవేళ కనిపెట్టి అటుకేసి

ఏదో పని వున్నట్టు వెళ్తుండేది మామిడి చెట్టు కింది మంగలోల్ల బావిలో డైకొట్టి ఈత కొడ్తేగాని ఆశయ్యకు స్నానం చేసినట్టు అన్పించేది కాదు డై కొట్టే కొద్దీ అపుడపుడు గోచి గాలికి నడుమనే ఊసిపోయేది

చూసీ చూడనట్లు చూసే సారవ్వ 'ఛీ బావకు సిగ్గు లేదు' అని అకస్మాత్తుగా అరిచేది ''సిగ్గు చిన్నప్పుడే పోయింది మా అవ్వ ముడ్డి కడిగినప్పుడే పోయింది'' అనుకుంటూ డై కొట్టి నీళ్ల లోతు అందుకునేవాడు ఆశయ్య

''ఈతరాని మొకం గట్లనే ఒడ్డు మీదుండక ఏం జేస్తది'' అని ఎక్కిరించేవాడు ఆశయ్య సారవ్వకు రేషం ఎక్కువ ''నీకే వత్తదా - నాకెపుడో వచ్చు'' అని రేషంగా ఆఫ్ లంగా గోచీపెట్టి దబీమని మోటబావిలో దూకేది గాలికి గోచి ఊడిన లంగా గొడుగులా లేచేది చెడ్డీలేని లంగ సిగ్గుదీసేది

నీళ్లల్లో దరిపొంట నిలబడ్డ ఆశయ్య ''నీ సిగ్గేదే పోరి ..'' అని చప్పట్లు కొట్టేవాడు ''ఛీ . . నా సిగ్గు గూడ సిన్నప్పుడే పోయింది'' అనుకుంట నీళ్లలోతుకు చేరి బావకాళ్లు గిచ్చి దూరం ఉరికేది సిగ్గు దీసినందుకు నోటినిండ నీళ్లు పట్టి బావమీద పుక్కిలించేది అవి మీద పడకుండా ఆశయ్య చేత్తో నీళ్లు చల్లేవాడు అక్కడికి స్నానానికి చేరుకున్నవాళ్లు అది చూసి నవ్వేవాళ్లు. అపుడు ఏమెరుగని పిల్లవోలె అమాయకంగా మారిపోయేది సారవ్వ.

వయస్సు వస్తున్న కొద్దీ మనస్సులు దగ్గరయ్యాయి. కలయికలు దూరమయ్యాయి. ఏకాంత పరాచికాలకు సంకోచించేది సారవ్వ పదిమందిలో పరాచికాలకు మాత్రం బావతో పోటీపడేది. చదువులో బావతో పోటీ పడకలేక ఏడో తరగతికే ఆగిపోయింది ఇంట్లో పని ఎక్కువై చదువు ఆపేయాల్సి వచ్చింది ఆశయ్య అన్ని పనులు చేస్తూనే చదువుకుంటూ ముందుకు సాగాడు. అలా అని ఏ ఆటంకాలు లేకుండా అతని చదువు సాగలేదు. సెల్ఫ్‌లేని బండిలా అపుడపుడు ఆగుతూ ముందుకు సాగింది

ఆశయ్య తండ్రి రాంరెడ్డి పటేలు వద్ద పాలేరుగా పనిచేస్తుండేవాడు

ఆశయ్యకు నాయిన్నతో పటేలు ఇంటికి వెళ్తే ఏదో పని చెప్పేవాళ్లు రాంరెడ్డి పటేలు బిడ్డ మాలతితోపాటు తన పాలేరు కొడుకు ఒకే క్లాసులో చదువుకోవడం కంటగింపుగా వుండేది. అయిదో తరగతిలోనే చదువు మాన్పించి తన వద్దకు గొడ్లకు జీతం వుంచుకుందామని చూశాడు గానీ ఆశయ్య నాయిన్న నర్సింలు అంగీకరించలేదు నిజానికి ఆర్థికంగా లేకపోయినా నర్సింలు ఆశ ఆత్మవిశ్వాసమే సెల్ఫ్ అయి కొడుకు చదువు బండిని ముందుకు నడిపింది.

తొమ్మిదో తరగతిలో కొచ్చేసరికి నర్సింలు ఆశయ్యను చదువు మాన్పించక తప్పలేదు ఏడాది ఎలాగోలా గడిచింది నేను మళ్లీ చదువుకుంటానంటూ మారాం చేశాడు. తండ్రి వద్దని గట్టిగా వారించలేకపోయాడు. ఊళ్లో వుంటే చదువు యింతే సంగతులు అవుతుందని ఆశయ్యకు భయం పట్టుకొంది వేసవి సెలవుల్లో కులం సర్టిఫికేటు తీసుకొని వర్షాకాలం రావడంతోనే తాలూకా సెంటర్లోని ప్రభుత్వ సాంఘిక సంక్షేమ హాస్టల్లో చేరాడు దాంతో మాలతితో ఒక తరగతి వెనకబడిపోయాడు

పదో తరగతి సప్లిమెంటరీలో పాసై యింటర్లో చేరాడు ఆశయ్య దాంతో మాలతితో రెండేళ్లు చదువులో వెనకబడ్డాడు తనలాగే తన దోస్తులు పదో తరగతి రెండుసార్లు సప్లిమెంటరీ ఇచ్చి ఇంటర్లో తనతో మళ్లీ క్లాసుమేట్సు అవడం ఆశయ్యకు ఒక ఊరట

ఆశయ్య ఇంటర్ ఫైనల్ తప్పడంతో పెళ్లి ఊసెత్తాడు సారవ్వ తండ్రి పోచాలు. ఆశయ్య మనసు

గుదుగువలాడింది పెళ్లి చేసుకోవాలని నర్సింలు జాడించాడు ''వానికే పెట్టలేక సత్తున్నం లగ్గం జేసి ఇద్దర్నీ సాదాల్నా'' అంటూ పోచాలు కన్నా ఆశయ్య ఆశ అడియాసైపోయింది. అయిందానికేమి అని పట్టుదలతో యింటర్లో సప్లిమెంటరీతో గట్టెక్కాడు ఆశయ్య ఆర్నెల్లు అదీ యిదీ చేసి ఏదో పని చేస్తున్నాడనిపించుకొని డిగ్రీలో చేరాడు ఆశయ్య అప్పటికి మాలతి డిగ్రీ పూర్తయిపోయింది.

పాత పుస్తకాలు, నోట్సు కావాలని ఇంటర్ చదువుతున్నప్పటినుంచే మాలతి దగ్గరికి వెళ్ళేవాడు ఆశయ్య రాంరెడ్డి పటేలు అది సహించేవాడు కాదు ఆ విషయం ఆశయ్యకు తెల్సు అందుకనే పటేలు ఇంట్లో ఏదోఒక పనిచేస్తున్నట్టే చేస్తూ సమయం చూసి అడిగేవాడు. ఎవరూ చూడని ఆ సమయాల్లో మాలతికి ఆశయ్యను ఏడ్పించాలనిపించేది చిన్నప్పటినుంచి ఏదో మిషతో ఆశయ్యను ఏడ్పించడం అంటే మాలతికి ఎంతో సరదా. బూరుతోనే మక్కజొంకుల్ని మంటలో వేసి కాల్చి యిమ్మనేది కాల్చి యిచ్చాక సగం తిని ఇది బాగా ముదిరింది తిని సూడు అని కొరికితిన్న పాలకంకిని ఆశయ్య మీదకు విసిరేసేది ఎంగిలిది తిని ఎలాగో మొఖం పెడ్తే ''యిరవైమక్కజొంకులు దొంగతనంగ గిరుసక పోయినవ్'' అని నాన్నకు చెప్పి కొట్టిస్తానని బెదిరించేది ఇలా ఎన్నో .. సారవ్వ సాక్షిగా చిలిపిగా అతని శరీరంతో, మనసుతో ఆడుకునేది.

చిన్నప్పట్నించీ మాలతికి ఆశయ్యంటే పెద్ద గౌరవం ఏమీ లేదు తమ పాలేరు కొడుకు అనే చిన్నచూపు కూడా వుండేది. సారవ్వ నేర్పుతున్నదనే నెపం చూపుతూ ఆశయ్యతోనే ఈత నేర్చుకొంది మాలతి వయస్సు పెరుగుతున్న కొద్దీ సారవ్వ ఉన్నంతసేపు పాలేరును చూసినట్టే అధికారం చెలాయించేది. సారవ్వ లేకపోతే ముభావంగా తప్పుకు తిరిగేది.

''ఆశయ్య నీ మేనల్లుడేనాయె నీకెందుకే అల్లర'' అని అయినవాళ్లు అంటున్నా సారవ్వకు సంబంధాలు వెతికే ప్రయత్నం చేశాడు తండ్రి పోచాలు సదువంత అయినంక సదువులేని పిల్ల నాకు అల్లనంటే గా వయసుల పోరికి సంబంధం ఏడ దొరుకాలె అనేది కన్నతండ్రి బాధ. రాకరాక వచ్చే సంబంధాల్ని తిరగ్గొట్టేది సారవ్వ. ''ఏందే పోరీ . ! మరి బావనే చేసుకుంటావా ఏందే'' అని దగ్గరోల్లు అడిగితే సారవ్వ మూతి మూడు వంకర్లు తిప్పేది

''ఆడే దొరికినాడు. ఓ సిగ్గు లేదు. శరం లేదు. ఆడోల్లుండగనే బనీను యిడ్సి జాంగమీద తానం జేత్తడు ఏరుగ కూసుండి ఆడోల్లు కనబడ్తే లెవ్వనన్న లెవ్వడు సాటుకన్నవోడు అందరు జాడంగ తొవ్వపొంటనే నిలవడి ఉచ్చవోత్తడు అందరి ముంగట్నే గజ్జలల్ల పర్రపర్ర గోకుతడు. గింత సిగ్గులేని మొగోన్ని నేను అలేచేస్కోను'' అని తీరు తీరునా వర్ణించి వంకలు పెట్టేది సారవ్వ ''ఛీ పోరి, మొగోల్లను గంతగనం సూత్తావే'' అని వరుసైన ఆడోల్లు ఎకసెక్కెం చేసేవాళ్లు

చిన్నప్పటినుంచి ఆశయ్య మనసు సారవ్వ మీదే ఉండేది. గోచి బిగకట్టి పనికి సాగిందంటే సారవ్వతో పనిలో పోటీకి మొగోల్లు సైతం జడిసేవాళ్లు కండపట్టిన మోటుదేలిన అందంతో మిలమిల మెరిసేది సారవ్వ. ఓసారి చెలుకలల్ల ఎవలు లేకుండా చూసి చేయి లాగాడు ఆశయ్య. చర్రున కోపంతో చూసి మూతి ముడుచుకుని చరచరా వెళ్లిపోయింది తల్లిదండ్రులకు చెప్పి మానం తీస్తుందని భయపడ్డాడు కానీ సారవ్వ ఆ విషయం ఎవరికీ చెప్పలేదు మాలతికి ఆశయ్యకూ మధ్య మధ్యవర్తిలా తన సాయం మాననూ లేదు

ఓ రోజు ముగ్గురూ బయల్దేరి ఇద్దరిని చేనుమధ్య రేగు చెట్టు కింద వదిలి ఏదో పని వున్నట్టుగా వెళ్లిపోయింది సారవ్వ ఆమె కాల్చి పెట్టిపోయిన శనక్కాయలు బుక్కుకుంటూ పొట్టు ఆశయ్య

మీద విసిరేసుకుంటూ ఆ రోజు మాలతి ఏదేదో మాట్లాడింది ఆశయ్యకు అయోమయం అయిపోయింది బెరుకుగా వుండింది ఆ బెరుకును యింట్లో గుమ్మల చాటున మాలతే తీర్చింది ఆనక అలవాటై పిరిగి గొడ్డుతో తన ఇష్టం వచ్చినట్టుగా ఆటాడుకునేది భార్య కావాల్సిన సారవ్వ ఇద్దరికీ మధ్యవర్తి అయి, కాపలాదారు అయి ఎవర్తోనూ అపవాదు రాకుండా కాపాడే సాక్షిగా మారిపోవాల్సి వచ్చింది ఆమె తన గుండె కోత ఎవరికీ చెప్పుకోలేదు వయస్సు పెరుగుతోందని ఏదో సంబంధం చూసి పెళ్లి చేసేరు. సారవ్వ ఆ సంబంధాన్ని వద్దననూ లేదు అవుననూ లేదు ఏదో సంగాలంటూ తిరుగుతుండిన వెంకటయ్య కూడా ఇదే స్థితిలో వుండగా అతన్తో సారవ్వ పెళ్లయిపోయింది.

ఆశయ్య చదువు ఆగలేదు సారవ్వకు ఇద్దరు పిల్లలయ్యారు మాలతికి సంబంధాలు వెతుకుతున్నారు ఈలోపే ఎమ్మే చేసి బిఇడి కూడా పూర్తిచేసింది మాలతి

యూనివర్శిటీలో పడ్డ ఆశయ్య విద్యార్థి సంఘాల్లో పడ్డాడు స్కాలర్‌షిప్ కోసం ఎప్పుడూ ఏదో ఒక కోర్సులో సీటు సంపాదించేవాడు బాగా చదవాలని బుద్ధి కలిగాక విద్యార్థి రాజకీయాలు సమయాన్ని తినేయడం ఆశయ్యకు లోలోన బాధగానే వుండేది కానీ ఆ రాజకీయాల్లో దొరికే గుర్తింపు గౌరవం అవి పెంచే ఆత్మవిశ్వాసం చూసి వాటికి దూరం కాలేకపోయాడు

ఉద్యోగం వచ్చిన ఏడే ఆశయ్యకు లక్ష్మితో పెళ్లికూడా అయిపోయింది. కొద్ది నెలల తేడాతో మాలతిక్కూడా ఉద్యోగం దొరికింది. పెళ్ళీ జరిగిపోయింది మాలతి భర్త రాజిరెడ్డి ఎస్సైయిగా పనిచేస్తాడు

ఆసరికి మాలతి నాన్న రాంరెడ్డి ఊళ్ళోంచి మకాం మార్చేసి తాలూకా సెంటర్లో స్థిరపడ్డాడు మాలతి తమ్ముడు ఇంటర్లోనే గజనీ మహమ్మద్ దండయాత్రలు చేస్తుంటే సారా కాంట్రాక్టర్లగా పొత్తులో కుదిర్చాడు రాంరెడ్డి సారవ్వ భర్త వెంకటయ్య ఇంటికి రావడం మానేశాడు నక్సలైట్లలో కల్సాడన్నారు వాని భయానికే రాంరెడ్డి ఊర్లోకి వస్తలేడు అని పుకారు లేసింది నిజమెంతో తెలియదు

వెంకటయ్యను వెతికే పనిలో ఎస్సయి రాజిరెడ్డి సారవ్వపై దౌర్జన్యం చేసి తానూ నలుగురు కానిస్టేబుల్స్ అత్యాచారం చేశారు. అది ఆ వూరిని భయకంపితుల్ని చేసింది సారవ్వ పిల్లల్ని తీసుకొని తల్లిగారింటికి చేరింది.

సారవ్వను తన భర్త రేప్ చేసిన విషయం మాలతి జీర్ణించుకోలేకపోయింది. అతనితో సంబంధం యాంత్రికంగా మారిపోయింది రక్తం అంటిన కొడవలికి అతను గుర్తుగా మారాడు. బలిష్టమైన అతని పట్టు తన్పై కూడా అత్యాచారం చేస్తున్నట్టుగానే అన్పించేది క్రమంగా అదే అలవాటైపోయింది ఆశయ్యతో తొలి రోజుల్లో గడిపిన క్షణాల్లోని స్వేచ్ఛ, ఆనందం గుర్తొచ్చినప్పుడల్లా తానేదో కోల్పోతున్నానని బాధపడేది.

సారవ్వ పెనిమిటి వెంకటయ్యను పట్టుకున్నది రాజిరెడ్డే అని తెల్సినాక మూడు రోజులకు సారవ్వ ఆశయ్యా - మాలతి ఇంటిముందు ప్రత్యక్షమయ్యారు. మాలతీ, సారవ్వా ఏదో రూపంలో సన్నిహితులని తెల్సి ఏదోలా అయ్యాడు రాజిరెడ్డి కర్తవ్యం అతన్ని ఏ సాయమూ చేయనీయలేదు. అప్పటికే వెంకటయ్య పై అధికారుల అదుపులోకి అప్పగించబడ్డాడని చెప్పాడు వారం రోజుల చిత్రహింసల తర్వాత ఏదో కేసు పెట్టి జైలుకు పంపారు మాలతి మాట వెంకటయ్య ప్రాణం పోకుండా కాపాడింది గానీ జైలును తప్పించలేకపోయింది.

రాజిరెడ్డి మాలతిని ఉద్యోగం మానేయమనేవాడు. మాలతి ససేమిరా అంది ఆశయ్య తన భార్య

లక్ష్మిని మరింత చదువుకొమ్మని వుద్యోగం చేయమని పోరేవాడు లక్ష్మికి కూడా చదువంటే ఉత్సాహమే ఇంటికి వెళ్లినప్పుడు సారవ్వను కూడా మళ్లీ చదువుకో అని ప్రోత్సహించేవాడు ఆశయ్య ''ఈ పోరగాళ్లను పట్టుకొని కూలిపని చేసుకుంటూ ఎట్ల సదువుకోవాలె'' అని విషాదంగా నవ్వేది ఆ విషాదంలోనూ ''చదువుకున్న నువ్వు చేసుకుంటే నాకిన్ని కష్టాలుండునా- నీ స్వార్థం వల్లగాదా- నాకీ కష్టాలు'' అని వ్యంగ్యంగా మాటలంటుండేది.

ఇప్పటికైనా కల్సి వుందామా అని అడగబోయేవాడు ఆమె భర్త నక్సలైటు గనుక నక్సలైట్లంటే ఉండే భయంతో ఆ మాట పెదవి దాటకపోయేది కళ్లల్లోని ఆ కోర్కె పసిగట్టి ''అలా కల్సి వుంటే మాత్రం నేను పెళ్లి - పెళ్లాన్నవుతానా! కాని ముచ్చట ఎందుకు'' అని కళ్లతోనే జవాబిచ్చేది సారవ్వ

ప్రసూతికంటూ తమ్ముని ఇంటికొచ్చిన మాలతి ఆశయ్యకు కబురు చేయడంతో వెళ్లకతప్పింది కాదు వాళ్ల నాన్న రాంరెడ్డిలో మునుపటి బింకం లేదు. ఓడిపోయిన ముసలి నక్కలా ఆ చూపులు మాత్రం అసహనం ప్రదర్శించేవి కానీ దాన్ని కప్పిపుచ్చే ప్రయత్నం చేసి నవ్వేవాడు. ''ఏంరా ఆశయ్యా మంచిగున్నావా'' అంటూ పలకరించేవాడు. ''మా పొలం అమ్ముత. రెండెకరాలు కొనుక్కోరాదురా'' అని అడిగేవాడు. అది వ్యంగ్యమో - నిజంగానే అంటున్నాడో ఆశయ్యకు అర్థంకాక పోయేది. ''మీ తమ్మునికన్నా యింతపని చేసుకొని బతుకుటానికి పనికొస్తది గదరా'' అని రాంరెడ్డి అనేసరికి అది నిజమేనని తోచేది. తాను చదువుకుంటూ పోతుంటే పనిలో ఇరుక్కుపోయిన తమ్ముడు నారాయణ తొమ్మిదో తరగతి మించి చదవలేకపోయాడు ఇపుడు సుతారి ( తాపీమేస్త్రీ) పని చేస్తున్నాడు. సారవ్వ చెల్లెని అతనికిచ్చి పెళ్లి చేశారు. తమ్ముడు నారాయణ ఉన్నంతలో బాగానే బతుకుతున్నాడు. మునుపటి అంత పేదరికం ఏమీ లేదుగానీ మరీ బాగా బతుకుతున్నాడని కాదు. రాంరెడ్డి పటేలు సూచన బాగానే వుంది కానీ - నక్సలైట్లు కొననీయడం లేదు- అమ్మనీయడం లేదు. ఆశయ్య తండ్రి నర్సింలుకు తన జీవితమంతా పనిచేసిన భూమి కొంత తమది కావడం అనే ఊహే ఎక్కడ లేని ఆనందాన్నిస్తోంది. అది కొంటే రాంరెడ్డినే కొనగలిగాను అనే తృప్తి - ఆత్మవిశ్వాసం అతని మందగించిన చూపులో వెలుగు నింపుతుంది కొన్నాక అందులో తన వాటా ఎంతుంటుందో, లేదో అనే విషయం తేల్చుకోలేక నక్సలైట్లతో కిరికిరి వద్దంటూ వాయిదా వేశాడు ఆశయ్య.

ఎవరూ లేని సమయం చూసి తన మనసులో మాట ఆశయ్య ముందుంచింది మాలతి. ''నేను విడాకులు తీసుకోవాలనుకుంటున్నాను. అతన్తో యిక వేగలేను'' అంది. ఆశయ్య మీద పిడుగుపడ్డట్టుగా ఫీలయ్యాడు. తనను పెళ్లి చేసుకోమంటుందా! పోలీసోల్లతో కిరికిరి ఎవరు పెట్టుకుంటారు. అదే జరిగితే ఎన్‌కౌంటర్ పేరిట తనను పిట్టను కాల్చినట్టు కాల్చి పారెయ్యడా! కడుపులో వున్న శిశువు మాటేమిటి! తన భార్య మాటేమిటి - లోకం మాటేమిటి? అని పరిపరి విధాలపోయాడు.

మాలతి సూటిగా ఆశయ్య కళ్లలోకి చూసింది. అతని కళ్లల్లో మునుపటి అమాయకత్వం లేదు. అతనిలో ఇప్పుడు పురుషుడు కనబడుతున్నాడు. గతంలో అతనిలో చూసింది ఇది కాదు. అతనిలోని స్త్రీవంటి బేలతనాన్ని అపుడు ప్రేమించింది అపుడు తాను మగమహారాజు అతడు ముగ్ధ స్త్రీ. అదే వారి సంబంధం. ఇపుడా కళ్ళల్లో ఆమె కోరుకున్న స్త్రీ లేదు. అతను అందరిలాంటి పురుషుడయ్యాడు. కులం పోగొట్టిన ఆత్మవిశ్వాసాన్ని ఉద్యోగం, అనుభవం అతనిలో నింపేసరికి అతనూ అందరిలాంటివాడు మగవాడే అయ్యాడు. ఈ విషయం అర్థం అయి కాకుండా- కొంత అర్థం అయినా దాన్ని మాలతి జీర్ణించుకోలేకపోయింది. ఆశయ్యలో తాను కోరుకున్నది ఇది కాదు. ఇతను మునుపటి ఆశయ్య కాదు. ఇతను తనకవసరం లేదు అని నిశ్చయించుకుంది. మనస్సు మార్చుకుంది కానీ అప్పటికే హృదయం జారిపోయింది మాట వెలువడింది

''ఎందుకలా అనుకుంటున్నారు. మీకన్నా మీ ఆయనకు కాస్త జీతం తక్కువైనా సంఘంలో అతని హోదా పెద్దది పైసలకు కొదువ లేదు సుఖానికీ కొదువలేదు'' అతను నాకన్నా బలిష్టుడు కూడా అని మనసులో ఉంచుకొని చివరి వాక్యం ఒత్తి పలికాడు ఆశయ్య

మాట మార్చాలనుకున్న మాలతి రోషంతో ఆమాటే మరచిపోయింది 'రేపేలో సారవ్వ మా ఆయనతో సుఖపడిందే అంటావా? అది సుఖమేనంటావా!'

అరిచినంత పనిచేసిన ఆ మాటకు ఉలిక్కిపడ్డాడు ఆశయ్య ఎవరైనా విన్నారేమోనని కిటికీల తలుపులవైపు చూశాడు. ఏదో అనునయించాడు అతని సానుభూతితో ఆమెలో దుఃఖం పెల్లుబికింది

''ఆశయ్యా! నిన్ను మళ్లీ అరే ఆశిగా అని పిలువాలని పిస్తోందిరా! నా ఆశిగాడు - నాకు మళ్లీ కావాలనిపిస్తోందిరా! అప్పుడు నిన్ను వాడుకున్నాను అనుకున్నానుగానీ - అదే నిజమైన ప్రేమ అని ఇప్పుడు అనిపిస్తోందిరా నా కులం ఇచ్చిన అహంకారం ఆనాడు ఈ మాట నీతో అననీయలేదురా. నీవు మళ్లీ నా ఆశిగానివి కాగలవా! నేను మా ఆయనకు దూరంగా వుంటాను లేదా నీ కోసం ఆయనతో ఎలాగోలా సర్దుకుపోతాను నీతో నాకొక కొడుకును కనాలని వుందిరా. నాకు నా మునుపటి ఆశిగాడు కావాలిరా - ఆ చిలిపి చేష్టలు కావాలిరా!''

ఆశయ్యకు ఉద్రేం ఒక పక్క - భయం ఒకపక్క - కొంతసేపటికి శరీరం సల్ల చెమటల్తో తడిసిపోయింది. మాలతితో తాను సుఖపడి సారవ్వకు చేసిన అన్యాయం గుర్తొచ్చింది. అన్నీ ఉండి మాలతే ఇంతగా బాధపడ్తుంటే - ఏమీలేని సారవ్వ బావ గురించి ఇంతకన్నా ఎంత బాధపడి వుంటుందో. తెల్సీ తెలియని వయసులో తాను ఎంత తప్పు చేశాడు మాలతిని తాను చదువుకున్నదని భ్రమిసాడా! ఆమె కులానికో అధికారానికో తాను లొంగిపోయాడా! లేక తాను మాలతిని నిజంగానే ప్రేమించాడా! తాను నిజంగానే మాలతిని ప్రేమించేదైతే సారవ్వ మాటేమిటి? సారవ్వకు తన హృదయంలో ఉన్న స్థానమేమిటి? ఆవేదనలో పడిపోయాడు ఆశయ్య.

''అసలు మీరు యిలాంటి నిర్ణయానికెందుకొచ్చారు. తెల్సీ తెలియని వయసులో జరిగిపోయిన వాటిని జ్ఞాపకాలుగా మిగుల్చుకుంటేనే సంతోషంగా ఉంటుందేమో'' వాస్తవాలతో రాజీపడిపోయిన ఆశయ్య అంతకన్నా మాట్లాడలేకపోయాడు.

''నిజం చెప్పనా! పెళ్లయిన కొత్తలో అతనిలో నిన్నే చూసుకునేదాన్ని నువ్వే అతడని భావించుకునేదాన్ని. కానీ అతడు నీ స్థానాన్ని ఆక్రమించలేకపోయాడు. అతని వ్యక్తిత్వం వేరు అతడిలో నిన్ను చూసుకోవడం ఎన్నాళ్ళో సాగలేదు. అతను లాకప్పుల్లో పెట్టే చిత్రహింసలు గురించి విని అతనికి మన విషయం తెలిస్తే నా పట్లా యిట్లాగే ప్రవర్తిస్తాడేమోనని భయం వేసేది. అతను స్త్రీలపై చేసే అత్యాచారాల గురించి విని విస్తట్లోని ఎంగిలి కూడుకు ఆశపడే కుక్క అన్పించింది ఆ ఎంగిలితో నా శరీరం మైలపడ్డట్టనిపించేది. అతను కల్సినప్పుడల్లా వాళ్లంతా గుర్తొస్తారు. నాపైకూడా అత్యాచారం చేస్తున్నట్టుగానే అన్పించేది. నిజానికి అతన్తో ఆ కొద్దిసేపు ఎంతో సుఖం అన్పిస్తుంది. కానీ ఆ భావం ఎంతోసేపు నిలవదు అతన్తో కాపురం చేయలేను''

తన భార్య లక్ష్మికి పెళ్లికాకముందు మాలతికి ఆశయ్యలా - లక్ష్మికి ఎవర్తోనైనా అనుభవాలున్నాయని తెలిస్తే తాను ఎలా ఫీలవుతాడు - అని మొదటిసారి ఆలోచించాడు ఆశయ్య. దాంతో మనసంతా అల్లకల్లోలం అయిపోయింది సారవ్వపై మాలతిపై ఆశపెంచుకోవడం ఎంత తప్పు - అని గింజుకున్నాడు.

ఈ ఆలోచనలోనూ ఏదో పొరపాటుందనిపించింది. తన భార్య పవిత్రంగా వుండటం కోసం

మాత్రమే తనది తప్పు అనుకుంటున్నాడు తన భార్యకూ అలాంటి లవ్ ఎఫైర్స్ సహజమే అని అంగీకరిస్తే తనది తప్పు కాదన్నమాట - తన ఇప్పటి ఆశ కూడా తప్పుకాదన్నమాట. అని ఎవరో వ్యంగ్యంగా తనను ప్రశ్నించినట్టనిపించి చకితుడయ్యాడు ఆశయ్య తాను ప్రేమ పేరిట వారి శరీరాల్ని కోరుకుంటున్నాడా!

తన మనస్సు తనను మోసం చేయడం లేదు తాను కూడా ఓ ముగ్గుర్ని ద్రౌపదిలా సమానంగా ప్రేమిస్తున్నానని లక్ష్మి అంటే తాను నమ్మగలడా - నమ్మితే ఆమెను భార్యగా భరించగలడా!

మాలతికి కూతురు పుట్టింది ఏవో సాకులు చెప్తూ పుట్టింట్లోనే వుంటోంది. రాంరెడ్డి ఆశయ్యను పొలం కొనమని పోరుతూనే ఉన్నాడుగానీ ఆశయ్య తమ్ముడు నారాయణ నక్సలైట్లతో కలిశాడు. ఆశయ్య అంబేద్కర్ సంఘాల నిర్మాణం చేపట్టాడు అతని భార్య లక్ష్మి ప్రయివేటు స్కూల్లో పని చేస్తోంది

వెంకటయ్య జైలునుండి బేలుపై విడుదలయ్యాక సారవ్వ ఇంటిపైకి పోలీసుల దాడులు మళ్ళీ మొదలయ్యాయి క్రమంగా వెంకటయ్య పార్టీకి దూరం అయ్యాడు. పోలీసు కనపడగానే రేప్ - చిత్రహింసలు గుర్తొచ్చి సారవ్వ గజగజ వణికిపోయేది ఆ వూరు వదిలేద్దాం అని పోరింది వెంకటయ్య సరేనన్నాడు తాలూకా సెంటర్లోకి మకాం మార్చాక రాజిరెడ్డి వారి పత్తా దొరికించుకున్నాడు ఏం బెదిరించాడో సారవ్వ అతనికి లొంగిపోయింది. రాజిరెడ్డి ఉంచుకున్నదని పోలీసుల్లో పేరుకపోయాక కొన్నాళ్ళకే ఆమెను వదిలేశాడతను. వాని పీడా పోయిందని వెంకటయ్య అనుకునేంతలో రేప్‌లో పాల్గొన్న హెడ్‌కానిస్టేబుల్ ఒకడు బ్లాక్‌మెయిల్ చేయడం ప్రారంభించాడు. బతుకుమీది భయంతో చిత్రహింసలు గుర్తొచ్చి ఆ బతుకు మళ్లీ వద్దనుకుని వాడు వచ్చేవేళకు తప్పుకుని ఎటో వెళ్లేవాడు వెంకటయ్య సారవ్వ ఇద్దరి మధ్య బలిపశువై పోయింది. వాడితోపాటు మరో పోలీసు ఆ దారి తొక్కడంతో ఎవరికి చెప్పాలో తెలియక వెక్కి వెక్కి ఏడ్చింది అప్పుడప్పుడు ఎక్కడెక్కడికో తీసికెళ్లి ఎవరెవర్తోనో కలిపి తలుపువేసి పోయేవారు ఓ రోజు పిల్లల్ని ముందేసి రాయి మెడకు కట్టుకుని తానూ బావిలోకి దూకేసింది పిల్లలు చనిపోయారు సారవ్వ బతికింది గాయాలు మాని నెలకు ఇంటికి చేరింది. హత్య-ఆత్మహత్య నేరం కింద అరెస్టు చేయాలన్నారు. చచ్చినా సరే యిక లొంగను అనుకొని ఎదిరించడంతో వారు జైల్లో తోశారు

జైల్లో ఒక నక్సలైటు ఆడఖైదీతో పాటు, అత్తమామల - భర్త ఆగడాలకు వేగలేక భర్తను చంపిన స్త్రీ సారవ్వకు తోడయ్యారు వెంకటయ్యను సారవ్వ మీద మనసు లేకపోవడంతో బెయిల్ ప్రయత్నాలేవీ చేయలేదు అతని బెయిల్‌కోసం అతని ప్రాణం కోసం తన సర్వస్వాన్ని ధారపోసిన సారవ్వకు అతనేమీ కాలేకపోయాడు అతని వల్లనే ఆమె జీవితం అలా అయిందనే వాస్తవాన్ని అరిగించుకోలేక పెళ్ళికి ముందే ఆశయ్యతో కడుపు చేసుకొని రెండుసార్లు దిగిదాగిందట - దాన్ని నాకు అంటగట్టారు అని ప్రచారం ప్రారంభించాడు వెంకటయ్య

ఆ విషయం విని సారవ్వ హృదయం బండబారిపోయింది తాను వెంకటయ్యను ఎంతగా ప్రేమించిందో ఎవరికి చెప్పుకోగలదు తనకు అంతటి భాష కూడా రాదు. గతమంతా గుర్తొచ్చి విలవిలా ఏడుస్తుంటే ఆ ఇద్దరు ఖైదీలే ఆమెను ఓదార్చారు తాను ఫలానా వాడికి ఛాన్సు ఇవ్వకపోవడంతో వాడు లీక్‌చేసి తాను అరెస్టయ్యేట్టు చేశాడని నక్సలైటు ఖైదీ శారద వాపోయింది. మనం ముగ్గురం పార్టీలో చేరదాం వాడి సంగతేదో చూద్దాం వాడేదో చేశాడని వీడేదో చేశాడని మనం ఉద్యమాన్ని వదలవద్దు వాళ్లు రేపులకన్నా - చిత్రహింసలకన్నా యింకేం చేయగలరు. వాటికి కూడా తెగించగలిగితే ఇక మనను ఎవరేం చేయగలరు అంటూ ధైర్యం చెప్పింది శారద

పోలీసులు పెట్టే చిత్రహింసలను శారద వర్ణించి చెప్పుతుంటే భర్తను చంపిన సుశీలకు నవ్వు వచ్చేది తాను ఇంట్లో అంతకు తక్కువేమీ బాధలు అనుభవించలేదు శత్రువు కొడ్తుండంటే మనసు రాయి చేసుకొంటాం కానీ అయినవాడు అని హృదయం ఇచ్చినవాడు కొడ్తుంటే మనస్సు చిత్రవధ అవుతుంది శత్రువు కొట్టగలిగేది నీ శరీరాన్నే నీ మనస్సును వాళ్ళేమీ చేయలేరు కానీ నా అనుకున్న హృదయాన్నిచ్చిన వాళ్ల చిత్రహింస శరీరంతోపాటు మనస్సును ఎక్కువ చిత్రవధ చేస్తుంది అని సుశీల అంటుంటే ఆ హింస తెలియకుండా గారాబంగా పెరిగిన శారద నోరెళ్ళబెట్టేది ఈ రెండూ అనుభవించిన సారవ్వ నిజమే అంటూ విషాదంగా నవ్వేది

సన్నిహితులు సున్నితంగా ఆశయ్యకు బాధ్యతను గుర్తుచేయడంతో సారవ్వ కోసం బెయిల్ ప్రయత్నాలు ప్రారంభించాడు అడ్వకేటును వెంట తీసుకొని జైలుకు వెళ్లిన ఆశయ్యకు చుక్కెదురైంది. ''బయటకు వచ్చి నేనేం చేయాలి?'' సూటిగా ప్రశ్నించింది సారవ్వ

అవును ఇప్పుడు సారవ్వ ఏకాకి నమ్ముకున్న భర్త నట్టేట ముంచాడు కనుకున్న పిల్లల్ని చేతులారా చంపుకుంది. లోకం దృష్టిలో శీలం లేని ఆడది అయింది ఇక తనను ఎవరు దగ్గరికి తీస్తారు తలను ఎడవాసిన వెంట్రుక తాను. తనకిప్పుడు ఏ కుదురూ లేదు వెక్కి-వెక్కి ఏడ్చింది సారవ్వ అతను ఆమెను ఓదార్చడం కోసం వారిమధ్య నుండి తప్పుకుని బయటకు నడిచాడు అడ్వకేటు ఆశయ్య ఓదార్చాడు సారవ్వ విషాదంగా నవ్వింది మళ్లీ కళ్లనీల్లు పెట్టుకుంది

''బావా నిన్ను నన్నూ దూరం చేసింది చదువే గదా నీవు చదువు ఆపేసినా మనిద్దరికి పెళ్లయ్యేది నేను చదువుకోగలిగినా మనిద్దరికి పెళ్లయ్యేది మనల్నిద్దర్ని దూరం చేసిన ఆ చదువునే ఈ జైల్లో నేర్చుకుంటాను. నేనే చదువుకొని వుంటే నువు మాలతివెంట పడేవానివా!''

మాలతితో తనకు జరిగింది ఇలాగేనా- లేక ఇది సారవ్వ కోణం మాత్రమేనా - అర్థం కాలేదు ఆశయ్యకు. ''జైల్లో వారానికి రెండు మూడు కార్డులిస్తారట గదా అప్పుడప్పుడు ఉత్తరాలు రాస్తూ వుండు'' అంటూ ఆమె నిర్ణయాన్ని మార్చలేక జైల్లో ఆమె ఖాతాలో కొంత డబ్బు జమచేసి సెలవు తీసుకున్నాడు ఆశయ్య

''చాలా చక్కగా చెప్పి పంపేసావు'' అని సారవ్వను అభినందించింది. ''బయటకు వస్తే నీతో మళ్లీ ఏదో లవ్ఎఫైర్ ప్రారంభిద్దామనుకుంటున్నాడేమో అందుకే మాలతి దగ్గర ఉండుమన్న ట్టున్నాడు'' అని అర్థాలు తీసి ఛీ ఈ మొగాళ్ళంతా యింతే అన్నట్లు ఉమ్మేసింది శారద.

రెండో పెళ్లికి అన్నీ సిద్ధం చేసుకొని మాలతితో విడాకుల కోసం లాంఛనంగా రాయబారం పంపాడు రాజిరెడ్డి మొదటి పెళ్లి అపుడు యిచ్చేదానికన్నా ఎక్కువిచ్చి రెండో పెళ్లివాన్ని కొనుక్కుంటున్న ఆ పిల్లకూడా బాగా చదువుకున్నదే అని తెల్సి ఎలా వుంటుందో చూడ్డం కోసమైనా ఆమె ఇంటికి వెళ్దామా అనుకుంది మాలతి విడాకుల పత్రాలపై సంతకాలు చేసి పంపేసింది ఆ పెళ్లి పిల్ల ఇంటికి వెళ్లి కలవడం అంటే ఏదో రూపంలో అతని పట్ల తన (డ్యూటీ) చార్జిని ఆమెకు మంచి చెడ్డల్తో సహా అప్పగించి రావడమే. అతనూ ఆమె తిరిగి ఫ్రెష్‌గా జీవితాన్ని ప్రారంభించే అవకాశం వచ్చినప్పుడు తాను గతమనే పాతగీతల్ని గీసిరావడం ఎందుకు ఒక ప్రేక్షకురాలిగా ఆ పెళ్లికి వెళ్దామనుకున్నా - తన గతంవల్ల అపార్థాలు చేసుకోవడం - పెళ్ళి రసాభాసగామారడం జరుగుతుందేమోనని ఆగిపోయింది మాలతి.

వర్తమానంలో మన ప్రమేయం ఏమీ లేకుండా గతం తన ప్రభావం వేస్తుంది. తన ప్రమేయం లేకుండానే సాగిపోయిన గతం కూడా సారవ్వ వర్తమానాన్ని వెంటాడుతోంది వర్తమానాన్ని శాసించగలను అనుకుని యిష్టారాజ్యంగా ప్రవర్తించిన రాంరెడ్డి గతం రాంరెడ్డిని వెన్నాడుతోంది.

ఇపుడతను కొడుకునుగానీ కూతుర్నుగానీ యిలాగే బతకాలి అని శాసించేస్థితిలోనైనా లేడు నక్సలైట్లకు
అడ్రసు తెలియకుండా ఆ బంధుత్వం - ఈ బంధుత్వం పేరిట నగరాలు తిరిగే కాందిశీకుడయ్యాడు.
చేసేది సారా వ్యాపారం తండ్రి కూడా తన వద్దే వుంటే తన వీపు కూడా పగులుతుందేమోనని కొడుకు
భయం తండ్రి తన ఇంట్లో తిష్ట వేయకుండా ఉండేందుకు ఒకటికి రెండు కల్పించి వస్తే వెంటనే
ఉప్పు పోసుకుని పారిపోయేట్టు చేసేవాడతను. ఆశయ్య తమ్ముడు నారాయణ భయమే రాంరెడ్డిని
బాగా పట్టి పీడిస్తుండేది వాడు నక్సలైట్లలో చేరింది తన మీద పగ తీర్చుకోవడం కోసమే అని కలత
నిద్రల్లో కలవరింతలు.

అయితే నారాయణ రాంరెడ్డిని అతను భయపడ్డట్టేమీ చేయలేదు. అసలతను ఆ ఏరియాలో
కాకుండా వేరే ప్రాంతంలో పనిచేసేవాడు. ఎందుకోగాని అతను కొన్నాళ్ళకు నక్సలైట్లలోంచి బయటకు
వచ్చేశాడు. బయటకు వచ్చిన నారాయణ ఊరికే ఉందామంటే అటువాళ్ళూ ఉండనీయలేదు. ఇటు
వీళ్ళూ ఉండనీయలేదు తెల్సిన స్నేహితులు సరేసరి ఏదో రూపంలో తిరిగి రాజకీయాల్లోకి రాక
తప్పలేదు. పార్టీ వద్దని సూచించినా కావాలని పోటీచేసి సర్పంచుగా ఎన్నికయ్యాడు. వరుసగా రాంరెడ్డి
తండ్రి - ఆ తర్వాత రాంరెడ్డి - అతని తమ్ముడు లక్ష్మారెడ్డి ఇంతదాకా సర్పంచులవుతూ వచ్చారు. ఆ
చరిత్రను ఓడించి లక్ష్మారెడ్డి మళ్లీ సర్‌పంచ్ కాకుండా ఓడించి ఒక దళితుడు సర్‌పంచ్ కావడం మాత్రం
విప్లవం కన్నా తక్కువా ఏమిటి అనే నారాయణ చర్చలు జనాన్ని ఆకట్టుకున్నాయి. అతనికున్న
మంచిపేరు కూడా అందుకు తోడైంది నారాయణకు అలా నక్సలైట్లలో పనిచేసిన గతం అతని మంచికి
ఉపయోగపడింది. అదే గతం వెంకటయ్యను సారవ్వను గాలికి వదిలేసి అరబ్బు దేశాలకు పని
వెతుక్కుంటూ పారిపోయేటట్టు చేసింది. అదే గతం సారవ్వను శీలంలేని ఆడది అని ముద్ర వేసింది

ఆర్థిక స్వాతంత్ర్యంతో తన కూతురుతో ఒంటరిగా బతుకుతున్న మాలతిని చూస్తుంటే ఆశయ్యకు
ఆవేదనగా వుండేది. తనవల్లే ఆమె జీవితం ఇలా అయిందని తనా వాళ్ళ జీవితంలో ప్రవేశించి ఉండకపోతే
ఆమె హాయిగానే వుండేదని బాధపడేవాడు. సారవ్వ జీవితాన్ని మాత్రం సమాజం క్రూరంగా
బలితీసుకుంది. తెలియక చేసిన తప్పులకు కూడా శిక్షలు వేస్తూ జీవితం ముందుకు సాగిపోయింది.

తన కులాన్ని తాను కొంత కడిగేసుకున్నట్టుగా తన కులం కారణంగా జరిగిపోయిన గతాన్ని కూడా
కొంత సరిచేసుకోలేడా? తమ్ముడు నారాయణ తన గతాన్ని తనకనుకూలంగా మార్చుకోగలిగాడు.
సారవ్వ అలా మార్చుకోవడం సాధ్యమేనా! తనకు మాత్రం సాధ్యమా!

క్షమాగుణం లేని జీవితం మనిషిని హేయంగా, మూర్ఖ క్రూరున్ని చేస్తుంది. పశ్చాత్తాపంతో
దహించుకుపోయి పునీతులై తిరిగి కొత్త జీవితాన్ని కోరుకునే మనిషిని క్షమాగుణంతో స్వీకరించి
అవకాశం ఇవ్వలేని సమాజం క్రూరమైనది. పశ్చాత్తాపాన్ని తిరిగి గతంతో బాధించే సమాజంలో
పశ్చాత్తాపపడ్డమే తప్పు అని తిరిగి పాత పద్ధతికే మళ్లడాన్ని అనివార్యం చేస్తుంది. కొత్త జన్మలు ఎక్కడో
లేవు క్షమాగుణం - పశ్చాత్తాపమే తిరిగి కొత్త జన్మలనిస్తాయి. తెల్సీ తెలియకుండా గడిచిపోయిన
జీవితాల్నుంచి తిరిగి కొత్త జీవితాల్ని ప్రారంభించే అవకాశం ఉంటే ఈ మనుషులు - ఈ సమాజం
- ఈ మానవ సంబంధాలు మరింత ఉన్నతంగా ఎదుగుతాయి. సారవ్వ శారద సుశీలలు తిరిగి కొత్త
జీవితాల్ని ప్రారంభించుకునేందుకు సమాజం సహకరించగలిగితే గతంలోని అనుభవాల్తో వారి
''కొత్తజన్మ''లు ఎంత ఉన్నతంగా ఉంటాయో. వారికా కొత్త జీవితం ఇవ్వడానికి పురుషులు ఎంతమంది
ముందుకు రాగలరు? ఆదర్శాల కబుర్లు చెప్పడం అందరికీ తేలికే. ఆచరించే తన వంతు వచ్చేసరికి
అవి రోల్డుగోల్డు వ్యక్తిత్వాలని తేలిపోతాయి తిని తిరిగ్గా కూర్చుని కబుర్లాడుకునే జీవితం ఆ ముగ్గురికీ

కొత్తే అది వారికి జైలులా లేదు స్వర్గంలా వుంది వారికదొక భువనవిజయంలా వుంది వంటతంట, పొట్టకూటి కోసం పొద్దున లేస్తేనే పోరాటం చేసే జీవితాల్నుంచి విముక్తి పొందిన ఆ జైలు జీవితం వారి వ్యక్తిత్వాల్లో ఎన్ని మార్పులు తెచ్చిందో ఎవరికి చెప్పతరం! ఆ జైల్లో వారి మధ్య ఒక మహోన్నత నూతన సమాజం పురివిప్పుకుంటోంది

ఆశయ్యకు కలుగుతున్న కొత్త అనుభవాలు మరో తీరువి సారవ్వా, శారదా, సుశీలా ఆ ముగ్గురు జీవితాల్ని తిరిగి గెల్చుకోవాల్సిన వారైతే - ఆశయ్య తాను గెలుచుకున్న జీవితంపట్ల కూడా నిస్పృహ చెందేవాడు అంబేద్కర్ సంఘాల నిర్మాణంతో పాటు పౌరహక్కుల సంఘాల్తో కలిసి ఊళ్లు తిరుగుతున్నకొద్దీ ఆవేదనతో ఆశయ్య కడుపుకోతకు గురయ్యేవాడు తనది కాని జీవితమేదో తాను జీవిస్తున్నట్టుగానే తన చుట్టూ వున్నవాళ్లు తమది కాని జీవితమేదో జీవిస్తున్నారనిపించేది జనం కొత్త జీవితాల్ని కోరుకుంటున్నారు అందుకు అవకాశం ఇవ్వకుండా సమాజాన్ని శాసిస్తున్న శక్తులేవి? వ్యక్తుల స్వార్థమా - కులమా - ఆర్థికమా- మార్పు నిచ్చగించని సంస్కృతా - అలవాటైన జీవితాలా - ప్రభుత్వ రాజ్య యంత్రాంగమా - పాలక వర్గాలా - ఇవన్నీనా - ఏదో గజిబిజి ఛ!!

బాల్యం ఎంత హాయి ఊహ తెల్సీ తెలియని జీవితం ఎంత గొప్ప ఉత్తేజం ఆలోచన అనుభవం పెరిగిన కొద్దీ ఆనందం ఆవిరైపోతుందా! ఎరుక సంతోషపడనీయదు అది అహమై వీడని నీడవుతుంది. గోరంత జ్ఞానం కొండంత ఆశల్ని పెంచుతుంది ఆశే నిరాశై నిస్పృహకు గురిచేస్తుంది. ఇక ఆశించడానికేమీ లేని నిరాశ జీవితం మీద కొండంత బరువై బతుకును భారం చేస్తుంది అది యవనోత్తేజాన్ని ముసలి ముదివగ్గులా కుదించేస్తుంది సారవ్వవంటి దళితులకు స్త్రీలకు కర్మ సిద్ధాంతం ఆశలేని నిరాశనిచ్చింది. అగ్రకులాలకు ఆశాపూరిత నిరాశనిచ్చింది. ఆశయ్య ఈ రెండో కోవలోకి వచ్చిపడ్డాడు. జైల్లోని సారవ్వ సుశీల గత జీవితం - ఆశలేని నిరాశ అందులో జీవిత వృక్షం ఎండిపోయి సారవంతమైన మట్టి సానుభూతి కరుణ క్షమ కరువై ఎండి పగిలి నెర్రెలిచ్చి ఇసుకపర్రగా మారిపోయింది

నిరాశ నిండు గర్భిణీవంటిది అనుభవించడం రావాలేగానీ నిరాశలో గర్భిణీ స్త్రీలా ఆనందాన్ని పొందవచ్చు అది జీవితాన్ని కొత్తగా ప్రసవిస్తుంది. కొత్త ఆనందాన్నిస్తుంది. ఆశ ఒక ఊహ. ఆశ అందమైనది. నిరాశ ఒక వాస్తవం. నిరాశ - వాస్తవంనుండి ఊహకు చేరుకుని దాన్ని వాస్తవం చేసుకోలేకపోయిన తీరును తెలుపుతుంది. ఆశ గమనాన్ని తెలుపుతుంది. నిరాశ గమ్యం యొక్క దూరాన్ని తెలుపుతుంది. ఆశ లక్ష్యాన్ని తెలుపుతుంది. నిరాశ ఆ లక్ష్యాన్ని చేరుకోలేని దశను తెలుపుతుంది. నిరాశ దాటిన లక్ష్యాల గమ్యాలపట్ల అహాన్ని తొలగిస్తుంది. మరింత ఉన్నత జీవిత లక్ష్యాన్ని తిరిగి కొత్తగా ప్రారంభిస్తుంది. ఆ ముగ్గురి మధ్య యిలా ఎన్ని చర్చలో... జైలు ప్రపంచంలో ప్రపంచానికి వెలుగునిచ్చే ఎన్నో పుస్తకాలు రాయబడ్డాయంటే రాయబడవూ మరి! తన మనసు - ఈ సమాజం లోపలి పొరల్లోకి వెళ్లి తరచి చూసే సమయమూ ఏకాగ్రతా స్వేచ్ఛా చిక్కేది జైల్లోనే కదా! అని కూడా చర్చించుకున్నారు. బయటి ప్రపంచం చూసి ఆశయ్య ఏం ఆలోచిస్తున్నాడో తమ లోపలి ప్రపంచం చూసి వాళ్లూ అదే ఆలోచిస్తున్నారని అతనికి తెలియదు. అలాగే హాయిగా స్వేచ్ఛగా యింకా కొంతకాలం బతకాలి - యింకా చదువుకోవాలి అనే సారవ్వ నిశ్చయాన్ని కోర్టు నిరాశ చేసింది. సాక్ష్యాలు లేక కోర్టు కేసు కొట్టేయడంతో జైలునుండి వీధిలో పడింది. తనకు తెలియని వారెవరో తన పార్టీ తరపున ష్యూరిటీస్ యివ్వడంతో కొన్నాళ్లకు శారద బెయిల్‌పై బయటకు వచ్చి పార్టీలో భాగంగా జనారణ్యంలో తిరిగి కలిసిపోయింది. ఒంటరి సుశీల తండ్రి యిస్తానన్న ష్యూరిటీస్‌ను వద్దంటున్న సుశీల అప్పుడు అంగీకరించి ఇంటికి చేరింది.

జైల్లో ఉన్నప్పుడు బయటకు వచ్చాక ముగ్గురం కల్సి వుందాం ఒకే దళంగా పని చేద్దాం అక్కడా మగవాళ్ల పెత్తనం ఎదురైతే మహిళా సంఘాలు పెడ్దాం నాటి బౌద్ధ బిక్షువుల్లా నేడు కొత్త ఒరవడి సృష్టిస్తూ స్త్రీ బౌద్ధ బిక్షువుల్లా సమాజానికి అంకితం అవుదాం అని జైల్లో చేసుకున్న బాసలు బయటకు వచ్చాక నిలవలేదు. సారవ్వా సుశీలా ఏదో ఉత్తేజంలో సరేనన్నారు గానీ బయటకు వచ్చాక ఎవరి జీవితం వారిదైపోయింది ముందు నేను కబురు చేస్తాను. ఆ తర్వాత వీలు చూసుకుని నేనే వస్తాను. నాతో రావడానికి రడీ ఉండండి అని శారద అన్నప్పుడు జైల్లో నిర్బంధంలో సై అన్నారు గానీ బతుకుమీది తీపి అంత త్వరగా వదిలేది కాదని బయటకు వచ్చాక వారికి అర్థం కావడానికి ఎంతోకాలం పట్టలేదు

బావిలో పడి చావాలనుకున్న సారవ్వ యిప్పుడు చాలా మారిపోయింది. నిర్బంధంలో శారద ఇచ్చిన చైతన్యం సారవ్వను దళంలో చేరి మళ్లీ చావడానికి సిద్ధం చేసింది. ఆనాడు ఊరికే చావడం కన్నా ఈ రోజు ఒక మంచి సమాజం కోసం చావడానికి సిద్ధపడ్డం ఎంతో నయం. అయితే యిప్పుడు ఆమెకు శారద చెప్పిన త్యాగం పట్ల భిన్నాభిప్రాయం లేదు అసలు ఎందుకు చావాలి అనే అంశంతోనే విభేదించింది ఆశ - నిరాశ - లక్ష్యం - గమ్యం - మరింత ఉన్నత లక్ష్యాల చర్చ ఆమెను చావును ప్రేమించే దశనుండి బతుకు ప్రేమించే దశకు పరివర్తన చెందించింది. జీవితాన్ని ఓడిపోయినవారు నిరసనతో, త్యాగంతో చావుకు సిద్ధపడ్డ - జీవితాన్ని తిరిగి గెలుచుకునే అవకాశాలున్నాయనే కొత్త ఆశలు లక్ష్యాలు కొత్తగా చిగురిస్తే - చావుకు సిద్ధపడి బతుకును ప్రేమించడం నుండి - బతుకుకు సిద్ధపడి చావును నిరాశ నిర్లక్ష్యం అనే రూపంలో ప్రేమించడంలోకి పర్యవసిస్తారా- ప్రాణాలివ్వడం కోసం వచ్చి కొంతకాలం పనిచేసి తిరిగి వెనక్కి వెళ్తున్నవాళ్లు - ఈ దశలోని వారేనా - అలా అయితే ఈ నిర్బంధాలు తొలగిపోతే చావు భయంతో చేరి చావుకు సిద్ధపడి పనిచేస్తున్న రిక్రూట్‌మెంట్ అంతా దళాల్లోంచి రిట్రీట్ అవుతారా! నిర్బంధం వుంటే తప్ప తమ రిక్రూట్‌మెంటు సాగదా! సారవ్వ సుశీలల్తో ఓ రౌండు చర్చించి వెళ్లాక శారదలో ఈ కొత్త అనుమానాలు మొదలయ్యాయి. భయం భయంగానే తన భయాల్ని పార్టీ ముందుంచితే తేలిగ్గా నవ్వేసి నీక్కూడా వెళ్లిపోయి వారిలాగే జీవించాలనిపిస్తోందని చెప్పరాదూ - అని హేళన చేయడంతో తన కమిట్‌మెంటు పట్ల ఆ మాటలు శూలాల్లా గుచ్చినట్టయి విలవిలలాడిపోయింది. కొన్ని భావాల్ని వ్యక్తం చేయకపోతేనే హాయి. ఎక్కువ గౌరవం. ఆ కోవలో ఈ చర్చనీ చేర్చేసి మౌనం దాల్చింది శారద. కాని సారవ్వ వాదనలో ఏదో సత్యం తాలూకు అంశ ఉందనిపించేది.

అత్తగారి ఊరూ, చెల్లెలింటికీ - మాలతి - సుశీల - ఆశయ్యల యిళ్ల మధ్య ఆసు పోస్తున్నట్టుగా తిరుగుతూ సారవ్వ పరిపరివిధాల భావి జీవితం గూర్చి ఆలోచిస్తోంది. అసలు పెళ్లీ పిల్లలూ లేకుండా ఆ ఆశ నిరాశల్తో పని లేకుండా సమాజం కోసం బ్రహ్మచారుల్లా - సన్యాసుల్లా - బౌద్ధ బిక్షువుల్లా స్త్రీలు తమ బతుకు తాము ఎందుకు బతకకూడదు. స్త్రీలు బౌద్ధబిక్షువుల్లా మారితే మానవ వంశం నిర్వంశం అవుతుందనే భావ వాదనలో మగదృష్టి తాలూకు లోపం లేదా! స్త్రీలు ఎందుకు పిల్లల్ని కనాలి. ఎందుకు మగవాళ్లను సుఖపెట్టాలి. ఇప్పుడు సమాజంలో రావాల్సింది అంబేద్కర్ చెప్పిన నవబౌద్ధ విప్లవం. ఈ మాటపై మాలతితోపాటు ఆశయ్య కూడా సారవ్వతో ఏకీభవిస్తాడు. అయితే ఆ బౌద్ధ విప్లవం ఇప్పుడు స్త్రీవాద కోణంలో భాగంగా స్త్రీబౌద్ధ బిక్షు సంఘాల ద్వారానే సాధ్యం అని చేసే మాలతి సారవ్వల చర్చల్తో ఆశయ్య విభేదిస్తాడు నువ్వు ఆడదానివై పుట్టి వుంటే నీకు తెల్సి వుండేది అనడంతో ఆశయ్య ఓడిపోయినట్టు నవ్వి తలవేలాడేస్తాడు దాంతో ఆశయ్య స్థానంలో సుశీలను కలుపుకున్నారు వారు. ఏదో మిషతో ఆ ముగ్గురు కలుసుకుని ఏదేదో చర్చించేవారు

ఆ ప్రశ్నలు అప్పుడప్పుడు ఆశయ్యను కూడా చర్చకు లాగేవి

ఇంతకూ తాము ఎందుకోసం బతకాలి మాలతి కూతుర్ని చూసుకుంటూ బతుకుతుంది తమ ఇద్దరికీ ఇపుడా అవకాశం లేదు అసలు ఈ జీవితం అంటే ఏమిటి? తమకు తెలిసింది జీవితమేనా- స్త్రీల సగటు జీవితాలు యిలానే వుంటాయా - తాము జైల్లో ఒక కొత్త జీవితాన్ని ఒక కొత్త సమాజాన్ని సృష్టించుకున్నారు ఈ సమాజంలో ఆ నమూనా జీవితాన్ని తిరిగి కొత్తగా ప్రారంభించగలిగితే ఎంత బాగుండు.

''అందుకు ఈ పాత తెల్సిన సమాజాన్ని వదిలేసి మనం తెలియని ఒక కొత్త సమాజంలోకి వేరొకచోట కొత్తగా ప్రవేశించాలి. నాలాంటి ఉద్యోగులకు అది ఎలా సాధ్యం. ఈ సర్వీసు సీనియారిటీ పోతుంది కొత్త చోట ఆర్థిక అభద్రత ఎంతో కుంగదీస్తుంది. ఇంత జీతం కొత్తచోట సంపాదించడం అసాధ్యమైన విషయం'' అది మీలాంటి భద్ర జీవితం లేనివారికే ఉన్న గొప్ప అవకాశం'' అంది మాలతి

''అసలు ఒక కొత్త సమాజంలోకి నేనెందుకు వెళ్లాలి. శారద చెప్పిందీ యిదే గదా - పార్టీ అనే కొత్త సమాజంలోకి వెళ్లి పాత సమాజాన్ని ఒక కొత్త సమాజంగా మార్చడం గురించే శారద చెప్పింది నేను ఆ మాటనే గదా వ్యతిరేకిస్తున్నది. నేను కొత్త సమాజంలోకి ఎందుకు వెళ్లాలి. ఈ పాత సమాజంలో కొత్త జీవితాన్ని సాధించుకుంటూ ఈ సమాజాన్నే కొత్త సమాజంగా ఎందుకు' మార్చగూడదు. ఈ సమాజం అలా ఎందుకు మారకూడదు? వెనకాముందూ ఎవరూ లేని స్త్రీని మనం ప్రవేశించే కొత్త సమాజం ఎలా స్వీకరిస్తుందో'' అంది సారవ్వ

''బాల్యంనుండి మన జీవితాల్ని మళ్లీ కొత్తగా ప్రారంభిస్తే ఎంత బావుండేదో'' అంటూ వేదాంతంలో పడ్డాడు ఆశయ్య.

''అపుడు సారవ్వను చేసుకొనేవాడివా - మాలతిని చేసుకొనేవాడివా?'' సూటిగా ప్రశ్నించింది సుశీల. ఆశయ్య అయోమయం అయిపోయాడు. గడిచిపోయిన కష్టాలు జ్ఞాపకాల్లో అందంగానే వుంటాయి. అవే కష్టాలు మళ్లీ ఎదురైతే- ఆ బాల్యం నాకొద్దు ఆ కష్టాలు నాకొద్దు అనేవాళ్ళే ఎక్కువ ఆశయ్యను చూసి సారవ్వ ఆశగా నవ్వింది అటు సారవ్వ - ఇటు మాలతి - మరోవైపు లక్ష్మి - ఎటూ తేల్చుకోలేక అవస్థపడుతున్న ఆశయ్యను చూసి భలే నవ్వింది నవ్వినవ్వి విషాదంగా ''తిరిగి బాల్యంనుండి ప్రారంభించినా మన జీవితాలు ఇలాగే వుంటాయి'' అంటూ గంభీరమైపోయింది మాలతి

''ఏం అలా అంటావు?'' అని ఆశ్చర్యపోయాడు ఆశయ్య. తాను ఎవర్ని చేసుకునేవాడో అనే చర్చ తప్పిపోయిందని లోలోన సంతోషపడ్డాడు. అది గమనిస్తూనే అంది మాలతి

''ఈ సమాజం మారలేదు గనక - అవే మన పాత్రల్నీ పోషించక తప్పదు. మనం ఉన్న సామాజిక స్థితిగతుల్లో మనలో ఎవరం కూడా అంతకన్నా భిన్నంగా ప్రవర్తించడం సాధ్యం కాదు. ఉదాహరణకు సారవ్వను నువు చేసుకొని వుంటే సంసార జంజాటంలో నీ చదువు ఆగిపోయేది పోనీ నేను నీతో లేచిపోయి వచ్చినా నీ చదువాగిపోయేది తెచ్చినకాడికి నా నగలు అయిపోయినంక - నువ్వు చేయవట్టే యిన్ని కష్టాలు అని తిట్టికొట్టి పోసేవాడివి - ఏవేవే చిన్న వృత్తులు చేస్తూ''

ఆరోజు మాలతి కోసం వచ్చిన సారవ్వ అక్కడ బావను చూసి రాకూడని వేళ వచ్చాననుకొని చటుక్కున వెనుదిరిగింది. ''ఛ- నీకింకా ఆ అనుమానం పోలేదా అంటూ మాలతి సారవ్వను రెక్కపట్టుకొని లాక్కొచ్చి కూర్చోబెట్టింది. మాలతి చాకచక్యంవల్ల కొద్దిసేపట్లోనే తిరిగి ముగ్గురూ ఒక్క హృదయంలా మారిపోయారు. పాత జ్ఞాపకాల మీద జోకులు వేసుకున్నారు. ఆలస్యంగా వచ్చిన

సుశీల వారితో జతపడింది

''నువ్వు ఎన్ని చెప్పు. బావను నీకు నేను త్యాగం చేయలేదంటావా!'' అని నవ్వుతూ సీరియస్గానే మాలతిని నిలదీసింది సారవ్వ

మాలతి కోసం బావ కోసం తన జీవితాన్ని త్యాగం చేశాననే భావనే సారవ్వను సజీవంగా ఆశాజీవిగా వుంచుతోంది అది వాస్తవం కాదని తెలిస్తే ఆమె ఆశా విశ్వాస సౌధాలు కుప్పకూలిపోతాయని మాలతి గ్రహించలేకపోయింది.

''నీ కులం - ఆర్థిక స్థితి నిన్ను చదువుకోనీయలేదు నా కులం నన్ను ఆశయ్యతో లేచిపోనీయలేదు. అతని చదువే నిన్నూ నన్నూ - అతన్ని దగ్గర చేసింది దూరమూ చేసింది మీ బావ చదువుకొని యింతగా ఎదిగిపోయి వుంటే నీవింతగా ప్రేమించేదానివే కాదు. ప్రేమించినా వెంకటయ్యను మరిచినట్లే మరిచిపోయి వుండేదానివి. నేనూ అంతే. అతని చదువు వుద్యోగం మన ఇద్దరి ప్రేమల్ని పెంచి మన పీకలమీదికి తెచ్చింది. నీవు పుట్టిన కులం కారణంగానే నీవు నా బావను త్యాగం చేయాల్సి వచ్చింది ఇదొక సామాజిక అనివార్యత. ఇందులో నీ త్యాగం పాలు చాలా తక్కువ. నీవు లేకపోతే మరొకరి సాయంతోనైనా మీ బావను నేను వాటేసుకునే దాన్నే గదా - ఆలోచించు''

ఆ వివరణతో సారవ్వ దిగాలుపడిపోయింది. అకస్మాత్తుగా నిస్పృహతో తూలిపడిపోయింది. సుశీల, మాలతి కల్సి ఆమెను మంచంపైకి చేర్చారు. బావకోసం మాలతి కోసం తన జీవితాన్ని త్యాగం చేశాననే భావన ఒక్కసారిగా వేళ్ళ నరికిన చెట్టులా కూలిపోవడంతో సారవ్వ తట్టుకోలేకపోయింది. అది వాస్తవం అయినా కాకపోయినా ఆ భావనే ఆమెకు జీవితేచ్ఛనిస్తోందని మాలతికి అప్పుడు గానీ అర్థం కాలేదు. కొత్త ప్రాణం పోసి శారద ఎక్కించిన త్యాగం భావన ఇలా దిగిపోవడం చూసి సుశీల చకితురాలైంది.

వాస్తవాలకన్నా విశ్వాసాలు బలమైనవి. పైకి మొండిఘటంలా కన్పించే సారవ్వ హృదయం ఇంత సున్నితమైందా అని తొలిసారిగా చకితుడయ్యాడు ఆశయ్య. జీవిత సర్వస్వం కోల్పోయినా ఆమె ఆత్మాభిమానమే ఆమెను బతికిస్తోంది మాలతి కూల్చింది ఆ ఆత్మాభిమానాన్నే. స్పృహకొచ్చాక కడుపునొప్పితో గిలగిలా కొట్టుకుంది.

వారం రోజులకు కోలుకున్నప్పటికీ మునుపటిలా నవ్వలేకపోయింది సారవ్వ. మాలతి కళ్ళల్లోకి సూటిగా చూడలేకపోయింది. గర్భసంచిలో ఏవో మార్పులు చోటుచేసుకొంటున్నాయని డాక్టరు మేడం చెప్పిన విషయం సారవ్వకు చెప్పకుండా దాటేసింది మాలతి. అది కాన్సర్గా మారవచ్చునన్న ఆమె మాటకు తనలో తనే బాధపడ్తోంది మాలతి. సారవ్వకీ వివరాలు తెలియకపోయినా జైల్లో ప్రారంభమైన తెల్లబట్ట - కడుపునొప్పి రోజురోజుకూ పెరుగుతున్నట్టు మాత్రం గ్రహించింది. సారవ్వ పాత ఆదర్శాల్తో పాటు పాత ప్రణాళికలు సుడిగాలికి లేచిన ఎండుటాకుల్లా కొట్టుకుపోయాయి. ఎటూ పాలుపోక గమ్యం లేని నౌక అక్కడే లంగరు పడింది. నెలరోజుల్లో మాలతి పనిమనిషిలా చూడకపోయినా సారవ్వకు ఆ ఇంట్లో స్థిరపడిన స్థానం అదే. టేలర్ పని నేర్చుకోవడం పూర్తయ్యేదాకా ఓపిక పట్టి - చివరకు తన చెల్లెలి మొగుడే సర్పంచ్గా వున్నాడన్న ధీమాతో పోలీసుల భయాన్ని పారదోలి - తాను పుట్టి పెరిగిన ఊరికే పయనమైంది సారవ్వ.

టేలర్ పని చేసుకుంటూ తమ వాడ పిల్లల్తో ఆడుతూ పాడుతూ గతాన్ని మరచిపోతున్నంతలో అంగన్వాడి టీచర్గా ఎన్నికై సారవ్వకు ఒకస్థిర జీవితాధారం దొరికినట్టయింది. టేలర్ పని కూడా కొనసాగిస్తూ పిల్లల్తో తన ఆనందాన్ని కల్సి పంచుకుంటోంది.

తల్లిని కోల్పోయిన ముగ్గురు పిల్లలకు తల్లిగా - వేసక్టమీ చేయించుకున్న అతనికి భార్యగా ఓ పెళ్లి

సంబంధం వచ్చిందని ఎటూ తేల్చుకోలేకుండా ఉన్నాను - రమ్మని రాయడంతో సుశీల ఇంటికి వెళ్లింది సారవ్వ సారవ్వ వెళ్లిన మరుసటి రోజే శారద హఠాత్తుగా అక్కడ ఊడిపడింది ముగ్గురు నెచ్చెలులు కలుసుకున్న సంతోషంతో సుశీల బంధువుల ఇంట్లో (శారద టెక్ జాగ్రత్తల కోసం ఎన్నుకున్న స్థలం అది) మూడు రోజులు హాయిగా గడిచిపోయాయి ఏదో ట్రీట్‌మెంట్ కోసం వస్తూ అక్కడికి వచ్చానని చెప్పింది శారద శారద మొహం నిండు ముత్తయిదు జవ్వనిలా కళకళలాడుతోంది జైలులో కన్నా కొంచెం చిక్కిపోయినా ఒక నూతనోత్తేజంతో శరీరం పెటపెటలాడుతోంది.



''నువ్వు మళ్లీ పెళ్లి చేసుకున్నావా.. '' అని అడిగింది సారవ్వ ఎలా పసిగట్టిందబ్బా అని ఆశ్చర్యపోయింది శారద. నవ్వుతూ ఔనన్నట్టు తలవూపింది ''మస్తు మంచోడనుకుంట చెప్పినట్టు వినే మొగుడు దొరికితే అంతకన్నా కావల్సింది ఏముంది బాగా చదువుకున్న సంస్కార వంతుడా'' అని అభినందించింది సుశీల.

''చదువుకున్నోడు కాదక్కా. వాళ్లది గోండు వంశం గోండు రాజ్యం. పెద్దగా చదువుకోలేదు గానీ - నువ్వన్నట్టు చెప్పినట్టు వినే మొగుడే దొరికాడు. చక్కని హృదయం అయితే ఆ హృదయానికి భాష రాదు.. అది సరే గాని నీక్కూడా ఒక మంచి మొగుణ్ని చూసి పెట్టానక్కా. మరి ఎప్పుడు బయలుదేరుతున్నావు'' అని గలగలా నవ్వింది శారద.

సారవ్వ సుశీల కొద్ది క్షణాలు మాట్లాడలేదు దాంతో శారద మాటమార్చి ఏవో కబుర్లకు దిగింది. కాసేపాగి సారవ్వవైపు చూస్తూ నాతో రావడానికి నీకేం తక్కువైంది. ఇక్కడ నీకింకేం మిగిలింది. పార్టీకూడా నీకు జరిగిన అన్యాయానికి చాలా బాధపడ్తోంది - నేను చెప్పాక'' అంది శారద

''శారదా - నీలా నాది కాలేజీ సదువు చదువుకోగలిగిన జీవితం కాదని నీకు తెలియదా! ఎక్కడ పోగొట్టుకున్నామో అక్కడే వెతుక్కోవాలంటారు పెద్దలు. నేను పుట్టి పెరిగిన పల్లెలో కులంలో నా జీవితాన్ని పొగొట్టుకున్నాను. అక్కడ్నే నా జీవితాన్ని గెలుచుకుంటాను''

''ఏదోలా నీవు మీ ఊరి మదర్ తెరిసా ననిపించుకుంటానంటావు''

''అంత పెద్దవాళ్లతో పోలికెందుకుగానీ - మాలతి ఒక మాట చెప్పింది. మా ఊరి సర్పంచ్‌ను స్త్రీలకు రిజర్వు చేస్తున్నారు నీవెందుకు ప్రజల హృదయాలను గెల్చుకోకూడదు అని అడిగింది''

''ఆ విషయమే ఆలోచిస్తున్నాను''

''ప్రజల హృదయాలను గెలిచి పదవి సాధించగలవేమో గాని కొత్త భర్తను సాధించుకోగలవా''

''నాకా విషయంపై మనసు రోసిపోయింది. ఏదో కాస్త ఉన్న భ్రమల్ని మాలతి వాస్తవాలు చెప్పి పటాపంచలు చేసింది. ఇపుడు నేను బాగానే బతుకుతున్నాను. గతం మరచి నన్నూ నా కొత్త జీవితాన్ని నా చుట్టూ వాళ్లు గౌరవిస్తున్నారు. నాకు అడవుల్తో ఇతర ఊర్లతో పనిలేదు ఎందుకంటే నేనెక్కడ పోగొట్టుకున్నానో అక్కడే నా జీవితాన్ని గెలుచుకుంటున్నాను. నీవు కోల్పోయిన జీవితం అంటూ నీకేమిలేదు - ఉంటే నీవూ నాలాగే అదే బంధుమిత్రుల మధ్య అదే ఊర్లో అదే సమాజంలో తిరిగి గెలుచుకో నాకు యింతకన్నా గొప్ప విప్లవమూ జీవితమూ కనపడ్డం లేదు. నీ దయవల్ల నేనిపుడు పిరికిదాన్ని కానని నీకు తెల్సు''

తనకన్నా వయసులో ఎంతో పెద్దయిన సారవ్వతో మరింత వాదన పెట్టుకోలేకపోయింది శారద ఆమె పడిన కష్టాలు కన్నీళ్లు తనకు తెల్సు. ఆమె నిర్ణయంలో ఏదో సత్యం అంశ ఉండే వుంటుంది

అది ఆమె పట్ల తనకున్న విశ్వాస గౌరవం

అలా మాట్లాడుతూనే ఉన్నారు. అకస్మాత్తుగా (గర్భసంచి) కడుపునొప్పితో మెలి తిరిగిపోయింది సారవ్వ. సుశీల డాక్టరుకు చూపించి వారం గడిచాక మాలతి యింట దింపి వెళ్లింది శారద నాలుగో రోజే వెళ్లిపోయింది.

ఆశయ్య సారవ్వ స్థితి చూసి కన్నీళ్లు పెట్టాడు ఆశయ్య భార్య లక్ష్మి తమ ఇంటికి రమ్మంది ''ఈ అభిమానం యిలాగే వుండనీ'' అని లోతుకుపోయిన కళ్లతో నీరసంగా నవ్వింది సారవ్వ ''మీ బావను తీసుకొని లేచిపో అక్కా - నేను ఏమనుకోను'' అని లక్ష్మి నవ్వించే ప్రయత్నం చేసింది ''నిజంగానే మనం లేచిపోదామా సారవ్వా'' అని నవ్వుతాలకే అనబోయినా ఆశయ్య కళ్లల్లో నీళ్లు నిండాయి

ఆ మాటకు మాలతి అభ్యంతర పెట్టింది ''మొగుడు- మగతోడు లేకపోయినా ఎంత హాయిగా ఆనందంగా - సొంత వ్యక్తిత్వంతో - సొంత కాళ్లపై నిలబడి బతకగలమో - మా జీవితాల్ని మేం ఎలా గెలుచుకోగలమో - నిరూపించాక - ఇప్పుడు నీ అవసరం ఎవరికో ఉన్నట్టు - మగతోడు లేకపోతే ఆడవాళ్లు బతకలేరన్నట్టు - ఇపుడు లేచిపోదామా అంటావేమిటి? మళ్లీ మీ మగపెత్తనం మామీద రుద్దటానికా'' అని నవ్వింది మాలతి

''ఎంత చక్కగా జవాబు చెప్పావు'' అన్నట్టు మాలతికేసి చూస్తూ కళ్లతోనే అభినందించింది సారవ్వ అంతలో అకస్మాత్తుగా మళ్లీ తెరలు తెరలుగా లేచిన గర్భసంచి కడుపు నొప్పితో స్పృహ కోల్పోయింది సారవ్వ స్పృహలోకొచ్చాక ''ఒక్కసారి ఇలా రా బావా'' అని చేత్తో నీరసంగా దగ్గరకు తీసుకుని మనసారా ముద్దిడుకుని ఆనంద భాష్పాలు రాల్చింది.

''మీరంతా తోడుండగా - ఇంకేం కావాలి. నా జీవితానికిది చాలు'' అని అందరికీ నమస్కరించింది సారవ్వ.

★ ★ ★

కొన్నాళ్లకు కష్టాల 'గర్భసంచి' తొలగించబడ్డ సారవ్వ మసిగుడ్డ జీవితం పసిగుడ్డు జీవితంలా మళ్లీ కొత్తగా వికసించడం ప్రారంభమైంది. కాలక్రమంలో ఆమె జీవితంలాగే ఆమె పేరు ఇంటిపేరు కొంచెం మార్పుచెందింది. ఆ ఊళ్లో ఇపుడామెను అందరు ''సర్‌పంచ్ సారక్క'' అని ప్రేమగా పిలుచుకుంటారు.

★ ★ ★

రమేశ్‌గారూ! ఇందులో చెప్పిన ఆశయ్యను నేనే. మీరు సారవ్వను పెళ్లి చేసుకొంటే అది ఎందరికో ఆదర్శం అవుతుంది. మీ పిల్లల్ని సారవ్వ తన సొంత పిల్లల్లా చూసుకోగలదు. మాలతిని చేసికొంటే మీ స్థాయి జీవితంలో వెంటనే కలగల్సిపోతుంది. సుశీలను చేసుకొంటే మగవాళ్లంతా చెడ్డవాళ్లు కాదు అని అర్థం చేయించినట్టవుతుంది. ఒకటి చెప్పగలను. ఇన్ని అనుభవాలెదురైనా వాళ్ల హృదయాలు తెల్లబట్టలా నిర్మలమైనవి. వీళ్లలో ఎవర్ని చేసుకొన్నా మీ జీవితంతోపాటు ఆమె జీవితాన్ని కూడా చిగురింపజేసిన వారవుతారు. మీ నిర్ణయం కోసం వాళ్లూ నేనూ ఎదిరు చూస్తుంటాం ఉంటాను.

- మీ విద్యాధరరావు

(ఆంధ్రజ్యోతి సచిత వారపత్రిక - అక్టోబర్ '97 నాలుగు సంచికల్లో)

★

# ఒక హెచ్. సరస్వతి కథ

స్వామి

గోపాలస్వామి అయ్యంగార్ విద్యాసంస్థలో హెచ్.సరస్వతికి ఉద్యోగం రావడం వెనుక ఒక కథ ఉంది. ఆ స్కూలును స్థాపించింది బ్రాహ్మణుడు కాబట్టి, ఆ స్కూల్లో బెల్లు కొట్టే ప్యూను దగ్గరనుంచీ హెడ్మాస్టరుదాకా అంతా బ్రాహ్మణులే అంతో ఇంతో డబ్బు ముట్టజెప్పగలిగి, మితిమీరిన అణకువ ప్రదర్శించగలిగిన బి.సిలు కొన్ని పోస్టుల్ని దక్కించుకోగలిగారు.

అంతవరకూ బాగానే ఉంది. కానీ, ఆ స్కూలుకు గవర్నమెంట్నుంచి గ్రాంట్ - ఇన్ -ఎయిడ్ అడ్మిట్ అయింది. గవర్నమెంట్ ఆర్థిక సహాయం చెయ్యడం నిజానికి సంతోషించవలసిన విషయమే! కానీ ఆ గ్రాంట్ - ఇన్ - ఎయిడ్ రావడం అయ్యంగార్ ఎడ్యుకేషనల్ ట్రస్టుకు ఒక కొత్త సమస్య సృష్టించింది. అదేమంటే, ఇకమీదట జరగబోయే ఉద్యోగ నియామకాల్లో గవర్నమెంట్ కల్పించిన రిజర్వేషన్లను అమలు చేయవలసి రావడం, ఇక ఆ స్కూల్లో పడిన ఒకటీ అరా ఖాళీలు రోస్టర్ పద్ధతిలో ఎస్సి, ఎస్టిలకు చెందాలి ఆ ఒకటీ అరా పోస్టుల్ని ఎస్ సిలతో నింపి తమ స్కూలును మైలపరచుకోవలసి వచ్చినందుకు ఆ మేనేజ్మెంటువాళ్లు చాలా బాధపడిపోయారు. ధర్మచ్యుతి జరుగుతోందని కలియుగాన్ని ఆడిపోసుకున్నారు.

ఆ సంవత్సరం స్కూలు ఆఫీసుకు ఎంప్లాయిమెంటువారు ఎస్.సి క్యాండిడేట్స్ లిస్టు పంపించారు కానీ, అప్పుడు కొత్తగా వచ్చిన డి.ఇ.ఓను బుట్టలో వేసుకుని, ఆ ఎస్ సి క్యాండిడేట్లుకు అసలు ఇంటర్వ్యూ నిర్వహించకుండా దాటవేశారు స్కూలు మేనేజిమెంటువాళ్లు.

రెండవ సంవత్సరం కూడా ఎంప్లాయిమెంటువారు మరో లిస్టు పంపించారు. అప్పుడూ అంతే జరిగింది. కాకపోతే అప్పుడున్న డి ఇ.ఓకు ఇంటర్వ్యూ జరగాల్సిన విషయాన్నీ, తేదీని వాళ్లు తెలియజేయలేదు. ఆ ఇంటర్వ్యూ జరగనూ లేదు.

మూడవ సంవత్సరం కూడా అదే జరగబోయింది. కానీ అప్పుడున్న డి.ఇ.ఓ నూటికొక్కరు నిజాయితీ, నిబద్ధత ఉన్న ఆఫీసరు కావడంవల్ల మేనేజ్మెంటు వారిని నిలదీశాడు. 'ఎస్.సిలకు చెందాల్సిన ఎస్.జి పోస్టును మూడేళ్లు ఖాళీగా ఎందుకు ఉంచారు' అని మెమో కూడా జారీచేశాడు.

'ఫలానా డి.ఇ.ఓను ఇంటర్వ్యూ కండక్ట్ చేయమని ఓరల్గా అడిగాను. కానీ, అతనికి తీరుబాటు కాలేదు'' అంటూ నెపాన్నంతా పాత డి.ఇ.ఓల మీదకి తోసేశారు. మేనేజిమెంటువాళ్లు చివరికి ఇంటర్వ్యూ జరగక తప్పిందీ కాదు, హెచ్.సరస్వతికి సెకండరీ గ్రేడ్ పోస్టు ఇవ్వక తప్పిందీ కాదు.

ఈ విధంగా ఉద్యోగం రావడానికి వెనుక ఒక కథ ఉన్నట్లే, ఆమెకు ప్రమోషన్ రావడానికి కూడా ఒక్క తతంగం ఉంది.

ఆమెది పేరుకు ఎస్ జి పోస్టు అయినా, ఆ స్కూల్లోని ఎల్ టి పోస్టు పనిభారాన్ని అప్పటికే అదనంగా నిర్వహిస్తూ ఉంది అట్లా జరిగిన రెండేళ్ళకి ఆ స్కూలుకు ఎల్.టి అడిషనల్ పోస్టు గ్రాంటుతో సహా మంజూరు అయింది ఆ పోస్టుకు కావలసిన సైన్స్ సబ్జెక్టుకూ, సీనియారిటీ ఉన్న ఉద్యోగిని సరస్వతి మాత్రమే కానీ, ఆమెకు రావలసిన ఎల్ టి పోస్టు ప్రమోషన్‌ను ఆమెకు ఇవ్వడానికి స్కూల్ మేనేజ్‌మెంట్ తెగ బాధపడిపోయింది.

'ఆ ప్రమోషన్ ఓ సిలకు వస్తుందండీ మీకు రాదు' అని చెప్పుకుంటూ వచ్చారు హెడ్‌మాస్టరూ, స్కూలు ఆఫీసువాళ్ళూ తీరా వాకబు చేసి కనుక్కుంటే, విద్యాసంస్థలలోని ప్రమోషన్లకు రిజర్వేషన్లు వర్తించవు అన్న సంగతి బయటపడింది. ఆమె స్కూల్ కరస్పాండెంట్ దగ్గరికి వెళ్లి అదే విషయం అడిగితే, ''మీరు ఎలాగూ ఎమ్మెస్సీ కదా! పిహెచ్‌డి కూడా చెయ్యండి. ఏకంగా యూనివర్శిటీ లెక్చరరే అయిపోదురుగానీ'' అంటూ వ్యంగ్యంగా నవ్వాడు.

చివరికి తేలిందేమిటంటే, 'మా విద్యా సంస్థకు మీరు శాంక్షన్ చేసిన అడిషనల్ ఎల్.టి పోస్టుగానీ, అందుకు గ్రాంటుగానీ అవసరం లేదు'' అని డి. ఇ. ఓకు లెటర్ రాసేశారు మేనేజ్‌మెంటువాళ్లు.

'ఒక ఎస్.సికి ఉద్యోగమిచ్చి మైలపడటమే కాక, పైగా ప్రమోషనా' అని ఉడికిపోయాడు ఆ బ్రాహ్మణ కరస్పాండెంట్ కొత్త పోస్టుకు గ్రాంటును వదులుకోవడానికి కూడా సిద్ధపడ్డారు కానీ, ఒక ఎస్.సి క్యాండిడేటుకు ప్రమోషన్ ఇవ్వడానికి మాత్రం వాళ్లకు మనస్కరించకపోయింది

జి ఓను ఉటంకిస్తూ తనకు ప్రమోషన్ రావలసి ఉందని డి ఇ ఓకు రాసుకుంది సరస్వతి. డి.ఇ. ఓనుంచి హైస్కూల్ యాజమాన్యానికి కరస్పాండెన్స్ జరగడం మొదలైంది

'మీ స్కూలులో ఉన్న ఖాళీలెన్ని' అని డి.ఇ ఓ ఆఫీసువారు రాయడం, వీళ్లు ఏదో జవాబు ఇవ్వడం, 'ఎల్ టి. పోస్టుకు విద్యార్హతలు గలవాళ్లు మీ ఇన్‌స్టిట్యూట్‌లో ఎంతమంది ఉన్నారు? వాళ్లలో ఎవరి సీనియారిటీ ఎంత' అని వాళ్లు అడగడం, వీళ్లు మళ్లీ ఏదో జవాబు రాసేయడం..

చివరికి డి ఇ. ఓ ప్రత్యక్ష జోక్యంతో ఇంటర్వ్యూ జరగక తప్పిందీ కాదు, హెచ్. సరస్వతికి ప్రమోషన్ ఇవ్వక తప్పిందీ కాదు

డి.ఇ ఓ పోతూ పోతూ, 'ఎల్.టి పోస్టుకు అన్ని అర్హతలూ ఉన్న క్యాండిడేట్ ఈమె ఒక్కతే అటువంటప్పుడు ఈ ఇంటర్వ్యూ ఎందుకు? ఈ ప్రమోషన్‌ని పెద్ద సమస్యగా చేసి నా వరకూ తీసుకురావడం ఎందుకు? ఇంత బ్రిలియంట్ అమ్మాయికి ప్రమోషన్ ఇవ్వకుండా నాలుగేళ్లు ఎందుకు ఆలస్యం చేశారు' అంటూ నిలదీయడంతో హెడ్‌మాస్టరూ, కరస్పాండెంటూ ఏం జవాబు చెప్పుకోవాలో తెలియక నేలచూపులు చూడాల్సి వచ్చింది.

'మొదటి కథ కాకపోయినా, ఈ రెండవ కథ టీచింగ్ స్టాఫ్‌లో ఆమె ధీరగుణాన్నీ, వ్యక్తిత్వాన్నీ బాగానే రుజువు చేసింది.

ఇతర టీచర్ల మాదిరి కాకుండా ఆమె హెడ్‌మాస్టర్‌ను కాకా పట్టలేదు. అణిగిమణిగి పడి వుండలేదు. సాయంత్రం కాగానే కరస్పాండెంట్ ఇంటి అరుగుమీద కొలువు తీర్చి పైరవీలు చేసే వెన్నెముకలేని టీచర్ల మధ్య తనను ఎప్పుడూ హాజరు వేసుకోలేదు

పై కులాలవారి అహంకారం ఆత్మాభిమానంగానూ, నిమ్నకులాలవారి ఆత్మాభిమానం అహంకారంగానూ భాసించడంలో పెద్ద విచిత్రమేమీ లేదు కదా! సరస్వతి ధీర వ్యక్తిత్వం కూడా ఆ హెడ్‌మాస్టర్‌నూ, స్కూల్ కరస్పాండెంట్‌నూ అదేవిధంగా క్షోభపెట్టింది

'ఇంత అహంకారమా! అందులో ఒక ఎస్ సి ఆడదానికి. !' అని పళ్లు నూరుకున్నారు. ఆమె

ఎదురుగానే డి ఇ ఓ వాళ్లను మందలించడం వాళ్లకు భరించలేనిదిగా ఉంది

హెడ్‌మాస్టర్ ఆమెకు ఇబ్బందులు కలగజేసి, కసి తీర్చుకునే ప్రయత్నాలు చేస్తూనే వస్తున్నాడు ఆమెను వేధించుకు తినడంలో ప్రదర్శించే మేధా సామర్థ్యాన్నంతా కరస్పాండెంట్ దగ్గర విన్నవించుకుని, అతని మెప్పు పొందే ప్రయత్నం చేస్తూనే ఉంటాడు ఏదైనా అర్జెంటు పని పడి లీజర్ అవర్‌లో వెళ్లిరావడానికి సరస్వతి పర్మిషన్ అడిగితే, 'అట్లా పర్మిషన్ ఇవ్వడానికి రూల్సు ఒప్పుకోవండీ! ఒకరోజు ముందుగానే మీరు ప్రయర్ పర్మిషన్ లెటర్ పెట్టుకోవలసి వుంటుంది' అంటాడు.

'ఈ మధ్య నాకు ఆరోగ్యం బాగులేదు సార్ ఈసారి సైన్స్ ఫేర్‌కు హాజరు కాలేను' అని చెప్పుకుంటే, 'అట్లా అని రాసివ్వండి' అని ఇరకాటంలో పడేయజూస్తాడు. కానీ, ఈ చిన్న చిన్న హింసలతో సరిపెట్టుకునే ఉదారత్వం హెడ్‌మాస్టరులో లేకపోయింది. ఆమెను కరకరా నమిలి పారెయ్యడానికి కావలసిన గొప్ప అవకాశం కోసం అతను ఎదురుచూస్తూనే ఉన్నాడు

ఆ మధ్యాహ్నం పీరియడ్ ముగించుకుని వచ్చేసరికి సరస్వతికి తలనొప్పిగా ఉంది కణతలు నొక్కుకుంటూ స్టాఫ్‌రూమ్‌లో కూర్చుంది.

ఫ్లాస్కు నిండా కాఫీ నింపుకుని ప్రవేశించాడు స్కూల్ అటెండర్ గురుమూర్తి స్టాఫ్‌కు చెందిన గ్లాసుల్లో కాఫీ నింపి ఒక్కొక్కరికి అందిస్తున్నాడు తానూ ఓ కప్పు కాఫీ తాగితే బాగుణ్ణు అనిపించింది సరస్వతికి కానీ, అన్నీ ధర్మసందేహాలే! తాను కాఫీ తాగితే స్కూల్ గ్లాసులు మైలబడిపోతాయని టీచర్లు అనుకోవచ్చు ఒకవేళ తాగిందే అనుకో .. అందరి గ్లాసులూ కడిగే బ్రాహ్మణ అటెండర్ తన గ్లాసును కడగడానికి నిరాకరించవచ్చు). ఆ అవమానం కంటే తలనొప్పిని భరించగలగడమే సుఖమేమో అనుకుంది.

అటెండర్‌ని పిలిచి 'ఒక తలనొప్పి మాత్ర తెచ్చిపెడతారా' అని అడగడానికి మాత్రం సాహసించింది 'వీలుకాదు మేడమ్ నాక్కొంచెం పనివుంది' అనేసి నిర్లక్ష్యంగా వెళ్లిపోయాడు గురుమూర్తి తనమీద హెడ్మాస్టర్‌కు ఏ రిపోర్ట్ చేయడానికీ ఆమె అశక్తురాలని ఆ బ్రాహ్మణ అటెండర్‌కు బాగా తెలుసు.

బెల్లు మోగగానే టీచర్లు ఎవరి క్లాసులకు వాళ్లు వెళ్లిపోయారు తనకు 'లీజర్ అవర్' కాబట్టి అలాగే తల పట్టుకుని కూర్చుందామె.

అటెండర్ గురుమూర్తి తిరిగి వచ్చి ''హెడ్‌మాస్టర్ మిమ్మల్ని పిలుస్తున్నాడు మేడమ్'' అని కబురందించాడు సరస్వతి నీరసంగా లేచి నిలబడింది.

ఆ రూములోకి ఇంకా అడుగు మోపుతూ ఉండగానే ''రండి, రండి. . అయ్యో, నిలబడి ఉన్నారేం? కూర్చోండి'' అని మర్యాద చేశాడు ఆ ముసలి హెడ్‌మాస్టర్ రామశర్మ అతని గొంతులో వ్యంగ్యం! బట్టతలలోకి వ్యాపించిన అతని ఎరుపైన ముఖం గాలి రివటకు బుసకొట్టే నిప్పుగడ్డలా మండుతోంది

స్థూలంగా చూస్తే ఒక్కొక్క కులానికి ఒక్కొక్క సామూహిక గర్వం ఉంటుందేమో! ఇందులో ఏ కులానికీ మినహాయింపు ఉండదు. ఒక కులానికి అధికార గర్వమూ, ఒక కులానికి ధనగర్వమూ ఉన్నట్లుగానే బ్రాహ్మణ కులానికి విద్యాగర్వం ఉంటుందేమో! తనకు లేని పోస్టుగ్రాడ్యుయేషన్ డిగ్రీ హెచ్. సరస్వతికి ఉండటం కూడా అతనికి కంపరం కలిగించే విషయం

అతని రూములో ఎనిమిదవ తరగతి చదివే ఒక పిల్లవాడు కూడా నిలబడి ఉన్నాడు సరస్వతి ఆ పిల్లవాని తరగతికి క్లాస్ టీచర్ కూడా

''ఈ పిల్లవాడు మీ స్టూడెంటే కదా'' అని ప్రారంభించాడు హెడ్‌మాస్టర్

''అవును సార్''

''ఈ పిల్లవాడు స్కూలుకు సరిగ్గా హాజరుకాకపోవడానికి, క్లాసు పరీక్షలు రాయకపోవడానికి కారణమెవరో తెలుసా?''

''మీరే'' అన్నాడు తన ప్రశ్నకు తానే సమాధానమిస్తూ

''నేనా? నేనేం చేశాను సార్?'' సరస్వతి ఉలిక్కిపడింది

''ఇక్కడ చూడండి'' అంటూ పిల్లవాని చెయ్యి లాక్కుని పైకెత్తి చూపించాడు

''చూడండి మీరు బెత్తంతో కొడితే ఇక్కడ చేతిమీద ఎంతగా వాచిందో! అసలు ఎముక కూడా విరిగిందేమో! ఈ విధంగా పిల్లల్ని కొట్టి భయపెడితే వాళ్లు స్కూలుకు ఎలా వస్తారండీ?''

''నేను కొట్టలేదు సార్ అసలు నేను బెత్తం ఉపయోగించను కదా'' అని చెప్పుకుందామె

''అయితే, మీరు ఒక దెబ్బకూడా వెయ్యలేదన్నమాట''

సరస్వతి గుర్తుతెచ్చుకుంది - క్లాసులు ఎగ్గొట్టి మ్యాట్నీలు చూసే పిల్లల్లో వీడూ ఒకడు అప్పటికి తాను ఎన్నోసార్లు చెప్పి చూసింది. కానీ, ఆ మంచి మాటలేవీ వాని చెవికెక్కలేదు రెండు రోజుల క్రితం తాను పాఠం చెబుతుంటే, వెనుక బెంచీలో పక్క పిల్లలకు సినిమా కథ చెబుతున్నాడు. అప్పుడే వాణ్ణి దగ్గరగా పిలిచి దండించింది చివరగా ఒక మొట్టికాయ మాత్రం వేసి బెంచీమీద నిలబెట్టింది

''ఒక మొట్టికాయ మాత్రం వేశానండీ'' అని ఒప్పుకుంది

హెడ్‌మాస్టర్ తెలివిగా నవ్వాడు ''ఒకవైపు కొట్టానని ఒప్పుకుంటారు కానీ, మరోవైపు దెబ్బ మాత్రం మీరు కొడితే తగిలింది కాదని బుకాయిస్తారు''

అతను ఒక క్రిమినల్ లాయర్‌లాగా జరిగినదాన్ని వక్రీకరించి లా పాయింట్లు పీకే విధానానికి ఆమెకు అసహ్యమేసింది

''పిల్లలు దైవస్వరూపులండీ వాళ్లు అబద్ధం చెప్పరు'' అన్నాడు పిల్లవాని వైపు ఓసారి నిదానించి చూసింది సరస్వతి ఆ పిల్లవాడు ఏదో తప్పు చేసినట్లుగా తల వంచుకున్నాడు.

తాను ఏ విద్యార్థికైనా శిక్షవేయవలసి వచ్చి బెంచిమీద నిలబెడితే, ''ఎవర్రా నిన్ను బెంచీ ఎక్కించింది? సరస్వతి టీచరా? కూర్చోరా! ఆమెకు ఇంకేం పని ఉన్నట్లు లేదు'' అంటూ తనను తన పిల్లల మధ్య అన్‌పాపులర్ చెయ్యడమే పనిగా పెట్టుకున్న టీచర్లు ఉన్నప్పుడు ఈ పిల్లవానికి తనమీద తక్కువ చూపు ఏర్పడటంలో ఆశ్చర్యం ఏముంది? ఈ దైవస్వరూపుడైన పిల్లవాని మనసులో తనను ఒక మాదిగ టీచర్‌గా ముద్రవేసే ప్రయత్నంలో చాలామంది టీచర్లు కృతకృత్యులయ్యారు. పాపం! ఈ పిల్లవాని తప్పు మాత్రం ఏం ఉందీ అనుకుంది లోపల.

''నేను నిజంగా ఆ దెబ్బ కొట్టలేదు సార్. ఈ పిల్లవాడు అబద్ధం చెబుతున్నాడు'' అని ఆమె మరోసారి సంజాయిషీ ఇచ్చుకోవలసి వచ్చింది తనకు స్టూడెంటయిన ఆ పిల్లవాని మీద అలా ఫిర్యాదు చేయవలసి రావడం ఆమెకే చిన్నతనం అనిపించింది

''ఏమైతేనేం? కొట్టారు కదా ఒప్పుకుంటున్నారు కదా అదే .. ఎందుకు కొట్టారూ అని అడుగుతున్నాను'' అన్నాడు కర్కశంగా హెడ్‌మాస్టర్ తన స్టూడెంట్ ఎదురుగానే తనను దండించడం ఆమెకు భరించలేనిదిగా ఉంది

''డెబ్బయ్‌మంది పిల్లలు ఎవర్నీ ఒక మొట్టికాయ కూడా వేయకుండా క్లాసును నిశ్శబ్దంగా ఉంచలేమని మీకూ తెలుసుకదా సార్'' అంది.

''అయితే మాత్రం కొడతారా'' అని అరిచాడు హెడ్‌మాస్టర్

''టీచరుగా నా సమస్యలు ఏం ఉన్నప్పటికీ, పిల్లవానిమీద మొట్టికాయ వేయడం కూడా తప్పే అని ఒప్పుకుంటున్నాను సార్'' అంది నీరసంగా గొంతు పెగల్చుకొని

''సరే ఒప్పుకున్నారు గదా ఆ పిల్లవాణ్ణి కొట్టినందుకు క్షమాపణ రాసిచ్చి సంతకం చేసిపొండి ఈ కాగితంమీద'' అని గొంతు తగ్గించి అడిగాడు ఆమె ఒక నిముషం నిశ్శబ్దంగా ఉండిపోయింది ఆ నిముషం సేపూ చిట్టెలక్కోసం పొంచివున్న గండుపిల్లి మాదిరి, ఎగిరే పావురం కోసం ఉచ్చులు పన్నిన వేటగాని మాదిరి కాచుకుని కూర్చున్నాడు ఆ హెడ్‌మాస్టర్.

''తప్పు ఒప్పుకున్నానుకదా సార్'' అందామె బలహీనంగా

''రేపు ఈ పిల్లవాని పేరెంట్స్ వచ్చి నిలదీసి అడిగితే వాళ్లకి నేను ఏం సమాధానం చెప్పుకోవాలి?''

''అసలు వాస్తవేమిటో వాళ్లకి నేను చెప్పగలను సార్''

''నేను ఏం చర్య తీసుకున్నానని మేనేజిమెంట్‌వారు అడిగితే వాళ్లకి ఏం సమాధానం చెప్పుకోవాలి?''

''వాళ్లకి కూడా సమాధానం ఇచ్చుకుంటాను సార్''

తాను ఇస్తున్న జవాబులు తననే అవమానించేటట్లు పరిణమిస్తుండటంతో ఒక్కసారిగా తన ఉద్యోగంమీద విరక్తి పుట్టింది ఆమెకు.

''నా దగ్గర గాలిమాటలు కుదరవు. అంతా రాత మూలకంగా ఉండాలి'' అన్నాడు.

గ్రౌండ్‌లో తిరిగే పిల్లల్ని పి.ఇ టి పరమేశ్వరరావు పిడిగుద్దులు గుద్దితే తప్పులేదు. ఇదే హెడ్‌మాస్టర్ ప్రార్థన ఎగ్గొట్టిన పిల్లల్ని బెత్తం విరిగేటట్లు కొట్టినా తప్పులేదు. కానీ, ఒక దళిత టీచర్ పిల్లవాణ్ణి ఒక మొట్టికాయ వేస్తే అది ఒక పెద్ద నేరమే అయింది. పిల్లల వీపులు చిట్లగొట్టే టీచర్ల పేర్లను వరుసగా ఏకరువు పెట్టి తాను మొట్టికాయ చేయడం పెద్దనేరమేమీ కాదు అని రుజువు పరచుకోవడం ఆమెకు పెద్ద విషయమేమీ కాదు. కానీ, ఆ టీచర్ల చాటున తనను సమర్థించుకోవడం ఆమెకు అల్పత్వంగా తోచింది.

''అయితే, అపాలజీ లెటర్ రాసివ్వరన్నమాట'' అన్నాడు - ఒక అస్త్రం వ్యర్థమైతే మరో అస్త్రం తన దగ్గర ఉండకపోదు అని హెచ్చరిస్తున్నట్లు.

ఆమె చిరాకు చప్పున ఆవేశంలోకి మారింది. ఆ ఆవేశాన్ని నిగ్రహించుకోవడంలో ఆమె ముఖం గంభీరంగా మారిపోయింది.

''అంతేనండి! రాసివ్వను'' అని చకచకా నడిచి వచ్చేసింది.

స్టాఫ్ రూముకు వచ్చి చాకీసులూ, టెక్స్ట్ బుక్కూ తీసుకుని ఆమె తన క్లాసుకు వెళ్లిపోతుంటే, అప్పుడే క్లాసులనుంచి తిరిగి వచ్చిన కొంతమంది టీచర్లు పేపరు తిరగేస్తూ, బాతాఖానీ వేసుకుంటూ తమ లీజర్ అవర్ గడుపుతున్నారు వాళ్లలో శేషశాస్త్రి ప్రసాదరావులు కూడా ఉన్నారు.

శేషశాస్త్రి ఆ స్కూల్లో సంస్కృత పండితుడు. నలభై ఏండ్లు పైబడి ఉంటాయి. పొట్టిగా, లావుగా, పంచెకట్టుతో వుంటాడు. నుదుటిమీద సన్నటి నామం తీర్చిదిద్దుకుంటాడు. తన క్రాపులో కనపడీ కనపడకుండా ఒక సన్నటి పిలకను ముడివేసుకుని ఉంటాడు. కానీ, ఈ వేషమంతా బ్రాహ్మణ కులానికి సంబంధించింది తప్ప, నిజమైన బ్రాహ్మణత్వంతో ఏమాత్రమూ సంబంధం లేనిది. ఈ తారతమ్యం గుర్తించగలిగిన బుద్ధి వికాసం ఆయనలో లేదు.

ప్రకృతి గురించీ, జీవన పరమార్థాన్ని గురించీ తరతరాలుగా విజ్ఞానాన్ని పోగుచేసిన సంస్కృతం ఒక భాషే అయినప్పటికీ, దాన్ని కులపరంగా తప్ప చూడలేదు.

వ్యవస్థ మత ప్రాతిపదికమీద ఏర్పడినప్పటికీ, ఆయా కులాలకు అనుగుణంగా మారుతూ వస్తున్నదే తప్ప, ఆ వ్యవస్థ మార్పులకు అతీతమైన బ్రహ్మ సత్యమేమీ కాదన్న విషయంలో అతనికి ఏమాత్రమూ అవగాహన లేదు మధ్యయుగాల నాటి సామాజిక నియమ నిబంధనల్ని పునర్ వ్యవస్థీకరించడమే అసలైన హిందూ మతంగా భ్రమపడుతుంటాడు ప్రస్తుతం అతన్ని పరిపాలిస్తున్నది ఔపనిషదిక సత్యం కాదు, కాలంచెల్లిన మనువే

వ్యక్తిగతంగా అతను ఎంతటి సాధు స్వభావుడు అయినప్పటికీ, మానవ సంబంధాల్లో తొంగిచూసే అతని కుల కాఠిన్యత ఏమాత్రం క్షమించరానిది

అతని కొడుకు ఇంటర్ తరువాత ఎంసెట్ ఎంట్రెన్స్ రాశాడు కానీ, ఆ అబ్బాయికి బిటెక్ సీటు గవర్నమెంట్ కోటా కింద రాలేదు. శేషశాస్త్రి రిజర్వేషన్స్‌మీద అక్కసు వెళ్లబోసుకుంటూ, ప్రతిభ గురించి ఒక సుదీర్ఘ ఉపన్యాసం ఇస్తుంటే పక్కనే వున్న ప్రసాదరావు కల్పించుకున్నాడు.

''సార్ ప్రతిభ అనేది మన అగ్రవర్ణాల సొత్తు అనుకుంటాం కానీ, అది ప్రతిభకాదు పూర్వంనుంచీ మనకు పెద్దల ఆస్తిలా సంక్రమిస్తున్న ఎన్నెన్నో సామాజిక అవకాశాల ఫలితం దాన్ని వినయంగా అంగీకరించకపోవడం మన కృతఘ్నత. ఆ ప్రతిభ ఏదో మన రక్తంలో ప్రవహిస్తోంది అనుకోవడం మన అహంకారం''

ఆ మాటలు గుచ్చుకున్నట్లుగా అనిపించి, ''నువ్వెట్లా పుట్టావయ్యా మా బ్రాహ్మల్లో'' అన్నాడు శేషశాస్త్రి.

''కాకి గూట్లో కోకిల పుట్టినట్లు'' అని నవ్వాడు ప్రసాదరావు. ప్రసాదరావు కూడా బ్రాహ్మణుడే. కానీ, జంధ్యంలేని బ్రాహ్మణుడు మాంసం తిన్న రోజే జంధ్యాన్ని తీసివేసుకున్నాడు. 'అది బ్రాహ్మణ వ్యతిరేకతతో చేసిన చర్య కాదు, బ్రాహ్మణత్వంమీద భక్తితో చేసిన పనే' అని వ్యాఖ్యానించినవాళ్ళూ ఉన్నారు ఏమైతేనేం? తత్ఫలితంగా అతనికి బ్రాహ్మణుల్లో పిల్లనిచ్చేవారు ముందుకు రాలేదు - అతని వయసు ముప్ఫైలో ప్రవేశిస్తున్నా. తనకు దేవునిమీద నమ్మకం లేదంటాడు కానీ, దేవుణ్ణే వదులుకోగలిగినంత సులభంగా కులాన్ని వదులుకోలేని నాస్తికుల మీద అతనికి ఏమాత్రమూ గౌరవం లేదు.

''ఈ రిజర్వేషన్స్‌వల్ల ప్రతిభ ఇట్లా నాశనమవుతుంటే, దేశం ఇక ఏవిధంగా బాగుపడుతుంది'' అన్నాడు శేషశాస్త్రి

''మనం రిజర్వేషన్స్‌వల్ల కోల్పోతున్న ప్రతిభావంతులకంటే అగ్రకులాల అధికారమూ, డబ్బూ, పలుకుబడి వల్ల కోల్పోతున్న ప్రతిభావంతుల సంఖ్య చాలా చాలా ఎక్కువ అసలు ఏ వర్గానికి అధికారం ఉంటే ఆ వర్గంవారి ప్రయోజనాల కోసమే ప్రభుత్వం దొడ్డి వాకిళ్లు బాహాటంగా తెరిచి వుంటాయి ఆ విధంగా వీరికి అప్పనంగా అందివచ్చే ఉద్యోగాలూ, ప్రమోషన్లూ, పర్మిట్లూ, కంట్రాక్టులూ, నామినేటెడ్ చైర్మన్‌గిరీలకు నియామకాలూ .. వీటిముందు రిజర్వేషన్లు ఎంగిలి చేత్తో విదిలించిన మెతుకుల్లాంటివి'' అన్నాడు ప్రసాదరావు

''దళితులు రాజ్యానికి వస్తే వాళ్లు మాత్రం ఆ అధికారాన్ని తమ స్వార్థానికీ, కుల ప్రయోజనాలకూ ఉపయోగించుకోరా?''

''ఈ రాజకీయ వ్యవస్థ మారనంతవరకూ, ఎవరు అధికారానికి వచ్చినా జరగబోయేది అంతే కానీ, దళితులు ప్రభుత్వాధికారానికి రావాలి తమ దగ్గర చేతులు చాచే పరిస్థితులు పోయి, తామే దళితుల దగ్గర ఉద్యోగాల కోసమూ, పార్టీ టికెట్ల కోసమూ చేతులు చాచే పరిస్థితి వచ్చినప్పుడు . అప్పుడు మాత్రమే అగ్రవర్ణాలవారు దళితుల్ని గుర్తిస్తారు, గౌరవిస్తారు దోపిడీ వ్యవస్థకు సంబంధించి ఇది

మౌలిక మార్పును తీసుకురాకపోవచ్చు కానీ, దళితులు ప్రభుత్వాధికారానికి రావడం అనేది ఒక తాత్కాలిక సామాజిక అవసరం. సుదూర లక్ష్యం కోసం వెంటనే జరగాల్సిన ఒక సామాజిక ప్రక్రియ''

''అయ్యా! నీకున్నంత విశాల హృదయం నాకు లేదు నా కొడుకు కంటే తక్కువ మార్కులు వచ్చిన ఎస్.సి కాండిడేట్స్‌కు గవర్నమెంట్ కోటా కింద సీట్లు వచ్చాయి కదా అన్నదే నా చింత'' అన్నాడు శేషశాస్త్రి, ప్రసాదరావు మాటలకు విసుక్కుంటున్నట్లు.

''మీ అబ్బాయికి ప్రైవేట్ కోటా కింద బి టెక్ సీటు వచ్చింది కదా! సంవత్సరానికి పాతికవేల రూపాయల చొప్పున నాలుగేండ్లకుగాను లక్ష రూపాయల ఫీజు చెల్లిస్తే తప్ప మీ అబ్బాయి కోర్సు పూర్తికాదు మీకు అంత ఆర్థిక శక్తి లేదు. నిజమే. మీ అబ్బాయిలాంటి సామాన్యుల పిల్లలు ఇంజనీరింగూ, మెడికల్ కాలేజీల్లో చేరకపోతే ఆ సీట్లు ఎవరికి పోతాయి? తక్కువ మార్కులు వచ్చినా లక్షలు కుమ్మరించి డొనేషన్ కట్టగలిగిన ధనవంతుల పిల్లలకు పోతాయి. ఇరవై అయిదు శాతం రిజర్వేషన్లు వుండటం మీకు మంట పుట్టిస్తుంది కానీ, యాభై శాతం సీట్లు ధనవంతులకు అమ్ముడుపోతే మాత్రం మీకు చీమ కుట్టినట్లు కూడా ఉండదు. వారి ప్రతిభ పట్ల మీకు ఏ సందేహాలూ రావు పైగా, డబ్బుపెట్టి ఎంబిబిఎస్ సీట్లు కొనుక్కున్న ఈ డ్యాక్టర్లు తమ ప్రైవేట్ క్లినిక్ నేమ్‌ప్లేట్‌మీద ఎం బి బి ఎస్‌కు ( ఓ సి) అని తోక తగిలించుకుని ప్రదర్శించుకుంటారు - తామేదో ప్రతిభావంతులమైనట్లు సిగ్గులేకుండా''

ఆ పీరియడ్ అయిపోయినట్లు స్కూల్ బెల్లు మోగింది ప్రసాదరావు చిన్న సైజు ఉపన్యాసానికి ఏదో జవాబివ్వబోయిన శేషశాస్త్రి రూములోకి సరస్వతి రావడం గమనించి ఆ ప్రయత్నం మానుకున్నాడు

తమ హెడ్‌మాస్టర్ సరస్వతిని ముప్పుతిప్పలు పెడుతూ మాట్లాడిన విషయాన్ని జవాను గురుమూర్తి వెకిలిగా నవ్వుతూ, అందరికీ చాటింపు వేశాడు. ఆరోజు సాయంత్రానికల్లా టీచర్ల మధ్య సరస్వతి విషయమే పెద్ద చర్చనీయాంశమైంది

''ఏమిటండీ పిల్లల్ని కొట్టడమా'' అని శేషశాస్త్రి గబుక్కున అనేసి ఆ ప్రశ్న తిరిగి వచ్చిన బాణంలా తనకే గుచ్చుకోవడంతో తత్తరపడి మాట మార్చాడు. ''క్లాసును అదుపులో పెట్టుకోవాలంటే కొంచెం కొట్టవచ్చు అనుకోండి. కానీ చేతులూ, కాళ్ళూ విరిగేటట్లుగానా? ఈ ఎస్.సి.లకు చదువుకున్నా సంస్కారం రాదా'' అని అతను తన ఒంటిమీది జంధ్యాన్ని మరచిపోలేక మాట్లాడుతుంటే, ప్రసాదరావు మధ్యలో జోక్యం చేసుకున్నాడు.

''నేనంతా కనుక్కున్నానండీ. ఆ పిల్లవాని క్లాసుకు పోయి విచారించి వచ్చాను. వాని చేతికి ఎముక విరగలేదు. నరం డిస్‌లొకేట్ అయి కొంచెం వాచింది. అది కూడా సరస్వతి టీచర్ దెబ్బలవల్ల కాదు. గ్రౌండ్‌లో క్రికెట్ ఆడి చేతికి కార్కుబాలు తగిలించుకోవడం వల్ల. ఆ పిల్లవాడు మన హెడ్‌మాస్టర్ తమ్ముని కొడుకే కదా 'ఏరా క్లాసులూ, పరీక్షలూ ఎగ్గొడుతున్నావు' అని ఆయన నిలదీసి అడిగితే, భయపడి పోయి తప్పించుకోవడానికి మార్గంగా వాడు నెపమంతా సరస్వతిగారి మీద తోసేశాడు'' అని వివరించాడు

ఆ మరునాటి ఉదయం సరస్వతికి మెమో వచ్చింది హెడ్‌మాస్టర్‌నుంచి. ''మీరు పిల్లల్ని విపరీతంగా కొట్టి, హింసించి, వాళ్లను భయభ్రాంతులను చేస్తున్నట్లు మాకు రిపోర్టు వచ్చింది. మీ వివరణ ఏమిటి?'' అని ఆ మెమో సారాంశం

రైలుపట్టాల కింద పడిన మనిషి శవాన్ని చూస్తున్నట్లు టీచర్లంతా ఆ మెమోలోకి తలలు దూర్చి చూడసాగారు ఆ మెమోను చూసిన తక్షణమే శేషశాస్త్రి కూడా సరస్వతిపట్ల సానుభూతిపరునిగా

మారిపోయాడు నిన్నటిదాకా తన కులంవైపు వకల్తా పుచ్చుకొని మాట్లాడసాగాడు ''సరస్వతిగారి తప్పు ఏం ఉందండీ? డొనేషన్లకు కక్కుర్తిపడి క్లాసుకు ఎనభై, తొంభై మందిని చేర్చుకున్న మన మేనేజ్‌మెంట్ వారిది తప్పు అట్లాంటి బండలదొడ్డి తరగతుల్లో ఒక చిన్న మొట్టికాయ కూడా వేయకుండా పాఠం చెప్పడం టీచర్లకు దుస్సాధ్యమని తెలిసీ, తప్పంతా మన టీచర్లదే అయినట్లు సరస్వతిగారికి మెమో ఇవ్వడం మన హెడ్‌మాస్టర్ తప్పు'' అన్నాడు.

సరస్వతి ఆ సాయంత్రం ఇంటికి సైకిలెక్కబోతున్న ప్రసాదరావు వద్దకు పోయి, ''మెమోకు రిప్లై ఇవ్వడం గురించి మీ సలహా కావాలి ఈ రోజు నేనూ, సరళా మీ ఇంటికి వస్తాము. ఇంట్లో ఉంటారా'' అని అడిగింది

''రండి టీచర్'' అన్నాడు ప్రసాదరావు మర్యాదగా తల ఊగించి

ఏదో పొరపాటు చేస్తున్నట్లు చప్పున అనిపించి తన మాటలు సవరించుకుంది సరస్వతి.

''పోనీ మీరే మా ఇంటికి రాకూడదా సార్'' అని.

తాను ప్రసాదరావు ఇంట్లో అడుగుపెడితే సమస్య వుండొచ్చుగానీ, ప్రసాదరావు తమ ఇంటికి వస్తే సమస్య ఉండదు కదా! అదీ ఆమె ఉద్దేశ్యం.

ప్రసాదరావుపట్ల ఆమెకి సదభిప్రాయమే వుంది. కానీ, ప్రసాదరావుకు కులం పట్టింపులులేవు అన్నంత మాత్రాన అతని ఇంట్లో వాళ్లకి కూడా ఉండవని గ్యారంటీ ఏముంది?

''మీ ఇష్టం. ఎలాగైనా సరే'' అన్నాడు ప్రసాదరావు తన ఇంట్లో ఆమె పడబోయే ఇబ్బందిని ఊహించుకుని. ఒక దళిత యువతి తమ బ్రాహ్మణ కుటుంబపు బయటి గదిలో అడుగు మోపడం వరకూ ఫరవాలేదు. కానీ, ఆమె తాగిన కాఫీ కప్పు కడిగిపెట్టే స్థాయికి తన తల్లి ఇంకా ఎదగలేదన్న సంగతి అతనికి బాగా తెలుసు. ఆ కాఫీ కప్పును తాను నిరభ్యంతరంగా కడగగలడు. నిరభ్యంతరంగా అనడం కంటే సంతోషంగా అని కూడా అనవచ్చు. సరస్వతి పట్ల అతనికి ఉన్న ఇష్టం అంత రహస్యమైంది. కానీ, అంటరాని వారి ఎంగిలి కప్పు కడగడం ఒక పాపకార్యమైతే, ఒక స్త్రీ తాగి వదిలేసిన ఎంగిలి కప్పును కడగడం మరో హీనకార్యమై కూర్చుంటుంది తన తల్లి దృష్టిలో. 'అతిథి దేవో భవ' అనే సత్యం ఆమెకు ఎంత ఒంటబట్టినా, చెంబునీళ్లను ఇంత ఎత్తునుంచి పోసి అతిథిగా వచ్చిన సరస్వతితో కాఫీ కప్పు కడిగించక మానదు మా అమ్మ'' అనుకున్నాడు.

ఆ సాయంత్రం ప్రసాదరావూ, శేషశాస్త్రి ఇద్దరూ కలిసి సరస్వతి ఇంటికి వెళ్ళారు. వాళ్లు వెళ్ళేటప్పటికి జిల్లా దళిత సంఘం అధ్యక్షుడు ఆమెతో మాట్లాడుతూ కూర్చున్నాడు. మాట్లాడుతూ అనడం కంటే, ఉపన్యాసమిస్తూ అనడమే సరైనది. సరస్వతి కొంచెం ఇబ్బంది పడుతూనే భిన్నధృవాల్లాంటి ఆ ముగ్గురికీ పరిచయాలు గావించింది. పట్టుమని పది నిమిషాలు కూడా కాకుండానే ఆ దళిత సంఘం అధ్యక్షునికి అందరూ శ్రోతలుగా మారిపోవాల్సి వచ్చింది. అతను వివిధ భారతీయ తత్త్వ దర్శనాల్ని చదవకపోవచ్చు. కానీ, వాటిని విమర్శించి ఖండించే పుస్తకం ఎక్కడున్నా సరే గాలించి మరీ చదివినట్లున్నాడు. పుస్తకాలు చదవడం అనేది తన అవగాహనను విశాలం చేసుకోవడానికి కాక, తన రెడీమేడ్ అభిప్రాయాల్ని మరింతగా స్థిరపరుచుకుని, తన ఖండన మండనలకు మరింతగా పదును పెట్టుకోవడానికి అని భావించినట్లున్నాడు.

''ఆదిమ మానవుడు ఉరుములూ, మెరుపులూ, వర్షానికీ అబ్బురపడి ప్రకృతి పట్ల భయభక్తులు ప్రదర్శించిన ఆటవిక సాహిత్యం వేదాలు'' అన్నాడు. అతను ఆ విషయాన్ని వర్ణించడం అతని జీవితంలో ఏ తొమ్మిది వందల తొంభై తొమ్మిదవ సారో అయి వుంటుంది. ఆ మొరటు వాదాన్ని సరస్వతి లాంటి తన శ్రోతలు ఎన్నిమార్లో విని, చదివి వుండటానికి అవకాశం ఉందన్న స్పృహ

ఆయనకు ఉన్నట్లు లేదు

వశిష్ఠుడూ, యజ్ఞవల్క్యుడూ మొదలైన రుషుల్ని నేతులు తాగి బొజ్జలు పెంచిన కరణం బాపనయ్యల స్థాయికి దిగలాగి - అట్లాంటివాళ్లు తమ పబ్బం గడుపుకోవడానికి చేసిన కుట్ర అద్వైతం అని తీర్మానించాడు.

తాను నాస్తికవాదిని అని ప్రకటించుకున్నాడు చార్వాకమతాన్ని పొగిడాడు మనుస్మృతిని తెగిడాడు కానీ, ఈ భావజాలపు విలువ నిజజీవితంలో సత్యశోధనకు ఉపయోగపడేదా లేక ఒక మత విశ్వాసాల్ని ఖండించడానికి మాత్రమే ఉపయోగపడేదా అన్న ధర్మసందేహం అతనికి ఎప్పుడూ కలిగినట్లు లేదు

''దళితులకు మృత మాంస భక్షణ నిషేధించని గాంధీజీ ఒక కుట్రదారు'' అని అరిచాడు గాంధీగారి కొన్ని పనులు అతని అవగాహన రాహిత్యానికి సంబంధించినవా లేక ఉద్దేశపూర్వకంగా కుట్ర బుద్ధితో చేసినవా అన్న సంశయం కలగడానికి అతనిలో అవకాశమే లేదు

''బుద్ధుణ్ణి దశావతారాల్లో కలిపేసుకోవడం హిందువుల కుట్ర'' అన్నాడు బుద్ధుణ్ణేకాదు, బౌద్ధాన్ని కూడా ఏదో ఒక మేరకు స్వీకరించింది హిందూ మతం ఒక మత భావన కరడుగట్టి పోకుండా, ఇంకొక కొత్త భావజాలానికి ప్రభావితం కావడం ప్రోత్సహించదగినదే కానీ, ఒక కుట్రగా అభిశంసింపదగినది కాదని అతను ఒప్పుకోలేదు.

''నేను బౌద్ధుణ్ణి'' అన్నాడు పిడికిలి బిగించి.

సరస్వతి మెల్లగా జోక్యం చేసుకుంది - ''ఏదైతేనేం లెండి? బౌద్ధులు నిర్వాణమన్నా, హిందువులు మోక్షం అన్నా, క్రైస్తవులు స్వర్గరాజ్యం అన్నా. . అన్నీ ఒకటే కదా చివరకు'' అంది.

''అదెట్లా? బుద్ధుడు చెప్పిన నిర్వాణంలో దేవుడు లేడు'' అన్నాడతను.

''అద్వైతంలో కూడా భక్తుడూ, దేవుడూ అని ఇద్దరు లేరండీ! నేనూ, నా తండ్రీ ఇద్దరూ ఒక్కటే అంటాడు క్రీస్తు కూడా'' అంది.

అతను ఒకసారి సరస్వతివైపు నిదానంగా చూసి, ''మీరింకా చాలా విషయాల్నుంచి బయటపడాలి'' అన్నాడు, అజ్ఞానాంధకారంలో ఆమె పీక లోతు వరకూ దిగబడిపోయినట్లు.

''నాకు తెలిసింది మాట్లాడానండీ'' అందామె.

''సరేలెండి. మీకింకా జీవితంలో దెబ్బలు తగిలినట్లు లేవు. నిదానంగా మీరే తెలుసుకుంటారు'' అని వెళ్లబోయి, ''నేను కొన్ని పుస్తకాలు తెచ్చిస్తాను. చదవండి'' అంటూ వెళ్లిపోయాడు.

''బౌద్ధం చెప్పిన సామాజిక స్వరూపం అంటే నాకు ప్రత్యేకమైన ఇష్టం. కానీ, సారాంశంలో అన్ని మతాలు ఒక్కటే. ఆ విషయం ఒప్పుకోవడానికి మన మేధావులకు తమ మేధే అడ్డుపడుతూ వుంటుంది'' అంది.

మళ్లీ తానే అంది ''నా ఉద్యోగ బాధల్ని అతనికి యాథాలాపంగా చెప్తే అతను వాటిని సీరియస్‌గా తీసుకుని సంఘం తరఫున డీల్ చేస్తాం అన్నాడు''

''మరి మీరేమన్నారు'' అన్నాడు ఆత్రంగా శేషశాస్త్రి

''కులంతో సంబంధం లేకుండా నా సమస్యకు సానుభూతిగా స్పందించే నా కొలీగ్స్ పట్ల నాకింకా నమ్మకం పోలేదు అన్నాను'' అంది నవ్వి

ఆ దళిత సంఘం అధ్యక్షుడు అనుకున్నట్లు, సరస్వతికి కులపరమైనగాయాలు తగలకుండా పోలేదు ఒకవేళ తగలలేదంటే అంతకంటే విచిత్రం ఈ భూగోళం మీద ఉంటుందా? ఆ చేదు అనుభవాలు

కలగకపోవడడానికి ఆమెది ఇంకా చిన్న వయసు కూడా కాదు, ఇరవై ఎనిమిదేళ్లు

స్కూలు రికార్డుల్లో ఆమె కులాన్ని మాదిగ అని నమోదు చేసుకొని అంటరాని దానిగా దూరంగా కూర్చోబెట్టినప్పుడే ఆమెకు మొదటి దెబ్బ తగిలింది కానీ, ఆ అయిదేళ్ల పసితనపు అమాయకత్వాన్ని ఆ గాయం బాధపెట్టలేకపోయింది కానీ, లోకజ్ఞానం పెరిగేకొద్దీ ఆ గాయాలే పుండుమీద కారం పొడి చల్లినట్లు మండటం ప్రారంభించాయి ఎంతో బీదరికంలో మగ్గిన ఆమె కుటుంబం తన చిన్నప్పుడే క్రైస్తవమతం తీసుకుంది ఆమె తల్లిపేరు మేరీ ఒకప్పుడు పిలకంత పాండిత్యం కలిగిన తెలుగు పండితులు బళ్ళలో కొంచెం ఎక్కువగానే ఉండేవారు కదా! మారెమ్మ మేరీ కావడాన్ని అపహాస్యం చేస్తూ, ''నీవు ఉత్త'ముండవు' నేను పాత 'కుండనూ''' అని పదాలు విరిచి ఆ అయ్యవార్లు పిల్లల్ని నవ్విస్తుంటే, ఆ జోకుల జడివానల మధ్య తన బాల్యం ఎంత అవమానకరంగా ముడుచుకుపోయిందీ ఇప్పటికీ ఆమెకు గుర్తే

ఆమె పెరిగి పెద్దయ్యాక ఎదుర్కొన్న దారుణమైన హింస ఒకటుంది దళితులు అయినప్పటికీ, పురుషులు అనుభవమయ్యే అవకాశం లేని హింస అది.

ఉన్నత కులాల స్త్రీలపట్ల తమ లైంగిక వాంఛను వెల్లడించుకోవడానికి జంకే పురుషులు, అదే కోర్కెను ఒక దళిత స్త్రీ దగ్గర వెల్లడించుకోవడానికి అంతగా సంశయించరు వాళ్లకు తన కులంపై ఉన్న చిన్న చూపు అంతటితోనే ఆగిపోకుండా తన శీలంపట్ల కూడా ప్రవర్తించడం అనేది ఆమెకు ఎన్నోసార్లు దుస్సహంగా ఉండేది

సరస్వతి లోనికి పోయి కాఫీ చేసి తీసుకువచ్చింది మూడు కప్పుల్తో ప్రసాదరావు కాఫీ కప్పు చేతిలోకి తీసుకున్నాడు.

''ఇక్కడికి వచ్చేముందు తాగే వచ్చాను. నాకు వద్దండీ'' అన్నాడు శేషశాస్త్రి

సరస్వతి అతని పరిస్థితి అర్థమైనట్లుగా నవ్వి మరి బలవంతపెట్టలేదు

తన ఇంటికి ఎవరో ఇద్దరు అపరిచయస్థులు రావడం చూసి, తన ఇంటికి తానే పరాయిది అయిపోయినట్లు మూలమూలలకు నక్కుతూ పోతున్న ఒక ముసలావిడను చూపించి, ''మా అమ్మ'' అని చెప్పింది సరస్వతి.

ఆమె ఇంట్లో గోడలకి ఓవైపు సిలువనెక్కిన జీసస్ చిత్రమూ, మరోవైపు కణతలమీద చూపుడువేలు ఉంచుకుని లోతుగా దృష్టి సారిస్తున్న భగవాన్ రమణ మహర్షి చిత్రమూ ఉన్నాయి.

''సర్వమతాలూ మీ ఇంట్లోనే విడిది చేసినట్లున్నాయే'' అంటూ ప్రసాదరావు తమాషాగా నవ్వాడు

''ఈయన నాస్తికుడులెండి. అసలు నన్నడిగితే మాంసం తినడానికే మా బ్రాహ్మణులు నాస్తికులుగానూ, మార్క్సిస్టులుగానూ మారిపోతున్నారు'' అని ప్రసాదరావును హాస్యం చేశాడు శేషశాస్త్రి.

''నేను ఆస్తికురాలినేనండీ! కానీ, భగవంతునిమీద ఉన్నంత ఆసక్తి మతాల మీద లేదు'' అంటూ చెప్పుకొచ్చింది సరస్వతి ''మా అమ్మావాళ్లు మధ్యలో క్రిస్టియన్లుగా మారిపోయారు స్కూలు రికార్డుల్లో నన్ను క్రిస్టియన్‌గా రాయిస్తే రిజర్వేషన్ల అవకాశం ఎక్కడ దూరం అయిపోతుందో అన్న భయం చేత నా పేరును మాత్రం హిందువుగానే ఉంచారు అసలు మతం అనేది, మనిషి తన నిసర్గమైన ఉనికిని తెలుసుకోవడానికి ఉపకరించేదే కానీ, సమాజంలో తమ ఉనికిని భద్రం చేసుకోవడానికీ, చాటుకోవడానికీ ఏర్పాటు అయింది కాదని నా విశ్వాసం'' అంది

''అయితే, మీరు హిందువుల్లోనే పెళ్లి చేసుకుంటారు గానీ, క్రిస్టియన్‌ని పెళ్లి చేసుకోరన్నమాట'' అన్నాడు శేషశాస్త్రి తృప్తిగా గాలిపీల్చి పెట్టనమ్మ పెట్టదూ, అడుక్కో నివ్వదు అన్నట్లు - శేషశాస్త్రి లెక్క ప్రకారం దళితులు గుళ్ళలోకి రాకూడదు 'పోనీలే, మేం చర్చికిపోతాం' అంటే, 'అయ్యో నా మతం నాశనమైపోతోంది' అని గుండెలు బాదుకోకుండానూ ఉండలేడు

సరస్వతి అంది - ''అతను క్రిస్టియన్ అయితేనేమి? ముస్లిం అయితేనేమి? నాకు అతను నచ్చాలి అంతే! భర్త మతమే నా సాంఘిక జీవితమ్మీద కూడా రుద్దబడటానికి నేను ఒప్పుకోను''

''అనుకోవడానికి బాగానే ఉంటుంది కానీ, ఆచరణలో అది సాధ్యం కాదేమో'' అన్నాడు శేషశాస్త్రి

''సార్! ఆధునికులమని చెప్పుకునే మనకంటే మన పూర్వులు చాలా ఉన్నతులు కొన్ని విషయాల్లో పూర్వం రాజులు ఏ శైవులో, వైష్ణవులో అయితే, వాళ్ల రాణులు ఏ జైనులో, బౌద్ధులో అయి ఉండేవారు రాజులు హిందూ దేవాలయాలకు పోతే, రాణులు ఏ జైన, బౌద్ధ ఆరామాలకో వెళ్ళేవారు కానీ, ఈ కాలంలో భర్త మసీదుకు పోతే భార్య గుడికి పోవడాన్ని ఆమోదించే పరిస్థితిలో మన సమాజం ఉందా? ఎవరి మతంలో వాళ్లు ఉండిపోయి కాపురం చేస్తే అది మతాంతర వివాహం అవుతుంది కానీ, అతని మతంలోకి ఈమెనో లేక ఈమె మతంలోకి అతనో మారిపోయి పెళ్లి చేసుకుంటే అది మతాంతర వివాహం అవుతుందా'' అంది

ఆమె మాటలో, చూపులో ఉట్టిపడే విలక్షణమైన వ్యక్తిత్వాన్ని గమనిస్తూ, చిరునవ్వుతూ కూర్చున్నాడు ప్రసాదరావు

''భార్యాభర్తలకు ఒక్కొక్కరికి ఒక్కొక్క మతం ఉండటాన్ని గుర్తించడానికి మన ప్రభుత్వ రికార్డులు ఒప్పుకోవు'' అన్నాడు శేషశాస్త్రి.

''భార్యాభర్తలు ఇద్దరూ ఒకే మతంవారు అయి వుండాలనీ, వాళ్లకు పుట్టిన బిడ్డలు తమ తండ్రికి సంబంధించిన కులానికీ, మతానికీ మాత్రమే చెందుతారనీ. . వగైరా చట్టాలన్నీ మతాన్ని సమిష్టిపరం చేసి వికృతపరిచేవే కుటుంబ స్థాయిలో వ్యవస్థీకరించబడిన మతమే రాజ్యస్థాయిలో కూడా వ్యవస్థీకరించబడటానికి ప్రయత్నిస్తుంది. ముక్తీ, నిర్వాణమూ, స్వర్గరాజ్యమూ - ఇవేవీ సమష్టికి సంబంధించినవి కావని తెలిసి మతాన్ని సమష్టిపరం చెయ్యడంలో అర్థమేముంది'' అంది సరస్వతి

''ప్రసాదరావుగారు ఏం మాట్లాడరే'' అన్నాడు శేషశాస్త్రి.

''మీ చర్చలు ఆస్తికులకు మాత్రమే సంబంధించినవి. నాకు సంబంధించినవి కావు'' అని నవ్వాడు ప్రసాదరావు.

సరస్వతి అభిప్రాయాలు శేషశాస్త్రికి ఏమాత్రం నచ్చలేదు. కానీ, అతనికి వాదించే శక్తి లేకపోవడంవల్ల ఆమె దగ్గర చాలా వరకూ శ్రోతగానే మిగిలిపోవలసి వచ్చింది.,

ఆమెకు హెడ్‌మాస్టర్ నుంచి వచ్చిన మెమోకు రిప్లై ఇవ్వడం గూర్చి చర్చిస్తూ కూర్చున్నారు ముగ్గురూ.

''నేను ఆ పిల్లవాని తలమీద ఒక మొట్టికాయ వేసిన మాట నిజం అంతేకానీ, నేను కొట్టడంవల్ల ఆ పిల్లవాని చెయ్యి విరగలేదు'' అని రిప్లై ఇస్తానంటుంది ఆమె.

''వద్దమ్మా! అది మొట్టికాయ అయినాసరే! పిల్లవాణ్ణి కొట్టినట్లు మనం రాతమూలకంగా ఇరుక్కోకూడదు'' అన్నాడు శేషశాస్త్రి

ప్రసాదరావు శేషశాస్త్రిని సమర్థించాడు

''కానీ, అబద్ధం రాయడానికి నా మనసు ఒప్పుకోవడం లేదు సార్'' అంది సరస్వతి ఇబ్బందిగా నవ్వి.

''మీరు చాలా అమాయకులమ్మా! చేసిన తప్పు ఒప్పుకునే నిజాయితీ కొన్ని సందర్భాల్లో అసలు పనికిరాదు మీకు బొత్తిగా లౌక్యం తెలీదు'' అంటూ చప్పరించాడు శేషశాస్త్రి.

ప్రసాదరావు కూడా చెప్పిచూశాడు కానీ ఆమె ఉన్న వాస్తవాన్ని ఒప్పుకోవడానికి సిద్ధపడింది. ఆ ప్రకారంగానే మెమోకు రిప్లై తయారయింది

రెండు రోజుల తరువాత రిప్లైకి గాను మరో మెమో వచ్చింది సరస్వతికి. ''పిల్లవాణ్ణి కొట్టినందుకు ఉద్యోగంనుంచి మిమ్మల్ని సస్పెండ్ చెయ్యమని నేను మేనేజ్‌మెంట్ వారిని ఎందుకు కోరగూడదు'' అని

శేషశాస్త్రి విసుక్కున్నాడు - ''మనం పిల్లవాణ్ణి కొట్టినట్లుగా రాతమూలకంగా ఇరుక్కోకూడదని నేను ముందే చెప్పినాను'' అంటూ.

ఆ మెమోకు ఏం రిప్లై ఇవ్వడమో స్టాఫ్‌రూమ్‌లో ఎవరికీ అంతుబట్టలేదు

''కరస్పాండెంట్ శరణు కోరడమొక్కటే మార్గం'' అన్నారు కొందరు

''అంతకంటే ఉద్యోగం ఊడగొట్టుకోవడమే మంచిది'' అంది నెమ్మదిగా సరస్వతి.

ప్రసాదరావు హెడ్మాష్టర్‌ని కలిసి చెప్పి చూశాడు లాభం లేకపోయింది

శేషశాస్త్రి కూడా కలిసి ''పాపం! సరస్వతి టీచరు మంచిదండీ. ఆమె తప్పేం లేదు'' అని చెప్పబోయాడు

''ఏమిటండీ మీరు కూడా అట్లే మాట్లాడతారు! అది చిన్న దెబ్బే కావచ్చు కానీ, మన బ్రాహ్మణ పిల్లవాణ్ణి పట్టుకుని కొట్టడానికి ఆమెకి ఎంత ధైర్యం ఉండాలి'' అని అణచిపెట్టుకున్నదంతా బుస్సుమని వెళ్లగక్కాడు.

''ఆ మాల మాదిగల్ని ఎక్కడుంచాలో అక్కడుంచాలండీ'' అన్నాడు గొంతు తగ్గించి

''చూస్తూండండి ఆ పిల్లని ముప్పుతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్లు తాగిస్తాను. వద్దుబాబో ఈ ఉద్యోగం అని పారిపోయేట్లు చేస్తాను'' అని హుంకరించాడు.

''అప్పుడెప్పుడో మీరే అన్నారు కదా - బి.ఇడి చేసిన మన బ్రాహ్మణ కాండిడేటు ఎవరో ఉద్యోగం లేక చాలా కష్టపడుతున్నారని మన వాళ్లని మనమే ఆదుకోకపోతే ఎట్లండీ'' అన్నాడు మర్మంగా

ఇక హెడ్‌మాష్టర్‌తో ఏం మాట్లాడీ లాభం లేదని వెనక్కు వచ్చేశాడు శేషశాస్త్రి.

కులమతాలనేవి మనుషుల మధ్య ఘర్షణకు స్థూలకారణం కావచ్చు. కానీ ఒకే కులం, ఒకే మతం, ఒకే తరగతి మనుషుల మధ్య వైషమ్యాలకు కారణమేమిటి? అహంకారం! అన్ని ఘర్షణలకూ, వైషమ్యాలకూ, తాత్త్విక కారణం ఈ అహంకారమేనేమో!

హెడ్‌మాష్టర్ రామశర్మలోని మితిమీరిన అహంకారం వల్ల అతణ్ణి వ్యతిరేకించే వర్గమొకటి బ్రాహ్మణుల్లో కూడా తయారయింది వాళ్లంతా సరస్వతి సమస్య పట్ల సానుభూతిపరులే

ఆ మెమోకు రిప్లై ఇవ్వడానికి వారం రోజులు గడువు ఇచ్చాడు హెడ్‌మాష్టర్ ఆ వారంలో అప్పుడే నాలుగు రోజులు దొర్లిపోయాయి

ఆరోజు సరస్వతి స్కూలుకు సెలవు చీటీ పంపించింది ఆరోజు మధ్యాహ్నం దళిత సంఘం అధ్యక్షుడు వచ్చి హెడ్‌మాష్టర్‌ని కలిసి ''మీరు ఒక దళిత అమ్మాయిని వేధిస్తున్నట్లు కోర్టులో కేసును

ఫైల్ చేయబోతున్నాం'' అని చెప్పి వెళ్లాడు ఆ కబురు వినగానే అతను అంతవరకూ సరస్వతి టీచరు మీద చూపిన వీరత్వమంతా గాలికెగిరిపోయింది ఆ ఎర్రటి వెడల్పు ముఖంమీద ముచ్చెమటలు పోశాయి

''నేను . నేనేం చేశానండీ'' అని తత్తరపడ్డాడు

''ఇప్పుడేం చేద్దామండీ'' అంటూ రామనాథం చేతులు పట్టుకున్నాడు రామనాథం హెడ్‌మాస్టర్ నమ్మినబంటు ప్రతి సాయంత్రమూ స్కూలు కరస్పాండెంట్ కొలువులో హాజరయ్యే వేగులవాళ్లలో రామనాథం కూడా ఒకడు స్కూలు మేనేజిమెంటుకు వ్యతిరేకంగా ఎవరు ఏం మాట్లాడారో, ఏం జోకులు వేశారో .. అవన్నీ కరస్పాండెంటుకు చేరవేస్తుంటాడు

హెడ్‌మాస్టర్ రామశర్మ ఆ మరునాడు గుబగుబలాడే గుండెల్తో నిద్రలేచాడు. గబగబ కొట్టుకునే గుండెల్తోటే ఒకటికి రెండుసార్లు లెట్రిన్‌వైపు పరుగెత్తాడు గుండెచప్పుడు చెవులదాకా పాకుతుంటే ఇతర కాలకృత్యాలు ముగించుకున్నాడు. పూజలో కూడా నల్లకోటు స్మరణ మానలేకపోయాడు. భోజనంలో తనకిష్టమైన గుమ్మడికాయ కూర గొంతు దిగనేలేదు.

స్కూలుకు గంట ముందుగానే బయల్దేరాడు. రామనాథం లాంటి టీచర్లను వెంటబెట్టుకుపోయి సెంటర్‌లోని అంబేద్కర్ శిలావిగ్రహం చుట్టూ ప్రదక్షిణలు చేశాడు. వస్తూవస్తూ అంబేద్కర్ పటం వొకటి కొనుక్కొచ్చి తన హెడ్‌మాస్టర్ రూములో తగిలించుకున్నాడు. ఎప్పుడు ఏ ఉపద్రవం ముంచుకొస్తుందో అన్నట్లు తొండాబిక్కి మాదిరి గుడ్లు మిటకరిస్తూ కూర్చున్నాడు.

ఇంతలో పిడుగులు పడుతున్నట్లు అరుస్తూ ముప్పైమంది దళిత యువకులు వచ్చిపడ్డారు హెడ్‌మాస్టర్ రూముపైకి.

''నరుకుతాం రా'' అని అరిచారు.

''పొడుస్తాం రా'' అని అరిచారు.

''రా రా బైటికి! హెడ్మాస్టర్ నా కొడకా'' అంటూ ఘీంకరించారు.

కులం పేరిట బూతులు తిట్టారు. గట్లు తెగిన ప్రవాహమయ్యారు.

ఆ యువకులందరికీ కనబడేటట్లు, ''భక్తి.. భక్తి... నాకు అంబేద్కర్‌మీద భక్తి'' అంటూ రూములో తగిలించుకున్న అంబేద్కర్ పటానికి చేతులెత్తి దణ్ణం పెట్టాడు హెడ్‌మాస్టర్.

''కులాల్లో ఏముందండి? మనమంతా భారతీయులం. మెమోలా! అబ్బే! అవన్నీ నామినల్‌గా ఇచ్చినవి. నామ్ కేవాస్తే! ఉత్తుత్తివి. సరస్వతిగారు చాలా మంచి టీచరు. ఆమెపట్ల నాకు అభిమానం గౌరవం. అంబేద్కర్, అంబేద్కర్... అంబేద్కర్ మీద నాకు ఎంతో... భక్తి అండీ భక్తి'' భయంతో కంపించిపోయి, గొంతు పూడుకుపోయి, నోట్లోంచి మాట బయటికి రాక, అంబేద్కర్ పటంవైపు దణ్ణాలు పెడుతూ, మూగ సైగలు చేస్తూ పిచ్చివాని మాదిరి ప్రవర్తించడం మొదలుపెట్టాడు.

''జరిగిందేమిటో క్లాసుకు పోయి విచారించక, మెమో మీద మెమో ఇచ్చి ఏడిపిస్తారా? ఆమెను ఉద్యోగంనుంచి తొలగించారో... మీ అంతు చూస్తాం'' అని ఆ దళిత యువకులు వార్నింగ్ ఇచ్చి వెళ్లిపోయారు. వారు అలా వెళ్లిపోగానే వాన కురిసి వెలిసినట్లు అంతా ఒకసారి ఊపిరి పీల్చుకున్నారు.

ఆ సాయంత్రం తన ఇంటికి వచ్చిన శేషశాస్త్రి, ప్రసాదరావులతో, ''వాళ్లను ఎవరు రమ్మన్నారో, ఎవరు పంపించారో నిజంగా నాకు తెలీదండి'' అంది సరస్వతి

''దళిత సంఘం ప్రెసిడెంటుగారికి విషయమంతా చెప్పి, వాళ్లను రమ్మని పిలిచింది నేనేనండీ'' అంటూ బాంబు పేల్చాడు శేషశాస్త్రి సరస్వతి ఆశ్చర్యపోయింది ప్రసాదరావు

అవాక్కయిపోయాడు

ఒకప్పుడు సమాజమంటే మనుషుల గుంపు కానీ, ఆధునిక కాలంలో సమాజమంటే కొన్ని గుంపుల సముదాయం మనిషి ఏ ఒక్క గుంపుకో చెందినవాడుగా కాక, కులమూ, మతమూ, వర్గమూ, భాషా, జాతి మొదలైన కొన్ని గుంపులకు సంబంధించినవాడుగా జీవించవలసి వచ్చింది. ఇది ఒక ఆధునికమైన పరిణామం ఈ పరిస్థితులలో కులం దగ్గర విడిపోయిన వ్యక్తులు మతోద్యమంలోనూ, మతం దగ్గర విడిపోయినవాళ్లు ఉద్యోగ ప్రయోజనాల దగ్గర ఏకం కాక తప్పదు ఇది ఒక చిత్రమైన పరిస్థితి ఇదే శేషశాస్త్రి విషయంలోనూ జరిగింది.

వ్యక్తి ఎప్పుడు ఏ గుంపులో ఉంటాడో, మరో గుంపులోకి ఎందుకు మారతాడో, ఎప్పుడు ఏ గుంపు కోసం అతను పిడికిళ్లు బిగించవలసి వస్తుందో నిర్ణయించేది దేశకాల పరిస్థితులే కాదు, ఆ వ్యక్తి సంస్కారం కూడా! అట్లాంటి మంచితనమేదో శేషశాస్త్రిలో కూడా ఉంది

''అవును! నేనే! మీ సమస్య పిల్లవాణ్ణి కొట్టడం వల్లా కాదు, మెమోకు సరైన రిప్లై ఇవ్వకపోవడంవల్లా కాదు మీ సమస్య ఎంత లోతైనదో మీకంటే నాకే ఎక్కువ తెలిసిపోయింది ముందుగా చెప్తే మీరు వినరని నేనే చొరవ తీసుకోక తప్పలేదు. క్షమించండి'' అన్నాడు శేషశాస్త్రి వినమ్రంగా.

''అయ్యో! పెద్దవారు మీరట్లా అనకూడదు'' అని చేతులు జోడించి కృతజ్ఞతగా చూసింది సరస్వతి

''అంతా బాగానే జరిగింది కానీ, ఆ దళిత సంఘంవాళ్లు తిట్టిన తిట్లు గుర్తుకొస్తే మాత్రం, ఇప్పటికీ నా చెవుల్లో సీసం కరిగించి పోసినట్లుందండీ'' అన్నాడు శేషశాస్త్రి తమాషాగా చెవులు మూసుకుని

''తిడితే తిట్టారులెండి మీరు మంచి పనే చేశారు. కానీ, ఆ పని సరస్వతిగారు చేసి వుంటే ఇంకా బాగుండేది'' అన్నాడు ప్రసాదరావు

''సంఘాలూ, ఉద్యమాలూ ఎంతో పాక్షికమైనవి కదా! అవి మన జీవన దృక్పథాన్ని, విశాలత్వాన్ని సంపూర్ణంగా ప్రతిబింబించలేనప్పుడు వాటిలో ఇరుక్కోవడమెందుకు'' అంది సరస్వతి.

''ఉద్యమాలు ఎంత పాక్షికమైనవో, అంత అవసరమైనవి కూడా. ఆ మేరకు వాటి కోసం పనిచెయ్యడంలోనూ, వాటినుంచి సహకారం పొందడంలోనూ తప్పు లేదనుకుంటాను'' అన్నాడు ప్రసాదరావు

ఏదిఏమైనా, ఎంతో కష్టసమయంలో కూడా తన అభిప్రాయాల్ని బలిపెట్టుకోకుండా ధీరంగా నిలబడిన ఆమె వ్యక్తిత్వమే అతణ్ణి బలంగా ఆకర్షించసాగింది కానీ, 'అదను చూసి చెప్పేదే అందమైన మాట' కదా అనుకున్నాడు

సరస్వతివైపు మెచ్చుకోలుగా చూసి, ''మీలాంటి అమ్మాయి దళితుల్లో పుట్టాల్సింది కాదండి'' అన్నాడు శేషశాస్త్రి

ఆ మాట సరస్వతిని మెచ్చుకోవడమా లేక దళితుల్ని కించపరచమా? శేషశాస్త్రి ఉద్దేశం సరస్వతి వ్యక్తిత్వాన్ని మెచ్చుకోవాలనే! కానీ కులాన్ని బట్టి సంస్కారాన్ని నిర్ణయించే ఒక తప్పుడు కొలత కూడా అతనికే తెలియకుండా అతని మాటల్లో బహిర్గతమైంది శేషశాస్త్రి మాటను మెచ్చుకోలుగా స్వీకరింపలేని సరస్వతి ఒక గొప్ప గాంభీర్యంతో కాస్సేపు నిశ్శబ్దంగా ఉండిపోయింది



# సిగ్గు

## సతీష్‌చందర్

ఆకలికి అమ్మంటే భయం. అమ్మ ఇంకా ఆమడదూరంలో ఉండగానే ఆకలి పారిపోయింది.

కొబ్బరి ఆకుల సందుల్లోనుంచి తన తల్లి రాకను పోల్చుకున్నాడు అబ్బులు. మిట్టమధ్యాహ్నం. అందరికీ నడినెత్తిన సూర్యుడున్నాడు అమ్మనెత్తిన మాత్రం అన్నం ఉంది. అప్పుడు వీస్తున్న గాలి చల్లగా అనిపించింది. తేలిగ్గా ఉన్న జుట్టును తడిమి పోయింది. పొలం వైపు చూశాడు అబ్బులు. చిన్న చిన్న చెరకు మొక్కల మధ్య తన వాళ్లు. అందరూ ఆడవాళ్ళే. కొప్పులూ, చేతులూ కదులుతున్నాయి.

కలుపు తీస్తున్నారుకానీ, కబుర్లు నాటుతున్నారు. మందారాలున్న కొప్పులైతే మాటిమాటికీ ఎగసిపడుతున్నాయి జాకెట్లు కప్పనంత మేరా వీపులు ఎండకు మెరుస్తున్నాయి. కష్టజీవులకు కడుపు మాడితే తెలుస్తుంది. వీపు మాడితే తెలీదు.

అబ్బులు చిన్న మట్టిబెడ్డ తీసుకుని ఒక వీపుమీద కొట్టాడు ఒక మందారం వెనక్కి తిరిగింది

''ఏయ్ బావయ్యా! నీ యేసాలు నాకెరుకేగాని యేం కావాలో సెప్పు వణ్ణవా? ఇప్పుడు కాలిందన్నమాట కడుపు'' ఆ మందారం ఎవరో కాదు. అబ్బులి మరదలే పేరు సరస్వతి కానీ ఆరోతరగతి దగ్గరే బడి మానేసింది. అయినా చదువంటే పిచ్చి. కాగితం ముక్క కనిపిస్తే చాలు, అందులోని అక్షరాలు గుణించుకుని, గుణించుకుని చదువుతుంది. ఊహ తెలిసినప్పటినుండీ అబ్బులు వాళ్ల ఇంట్లోనే పెరుగుతోంది.

మరదలని వరస కలుపుకున్నారుగానీ, సరస్వతి బాగా దూరపు బంధువుల పిల్ల పెంచే తాహతు లేక తల్లిదండ్రులు చిన్నప్పుడే వదలుకున్నారు. అబ్బులు తండ్రి బతికున్నంత వరకూ సరస్వతి స్కూలుకు వెళ్లింది. అబ్బులు తండ్రి పంచాయతీ బోర్డు మెంబరుగా చేసేవాడు. మాలపల్లి మొత్తానికి ఆయనే నాయకుడు. కామెర్లొచ్చి చనిపోయాడు అప్పటినుంచీ అబ్బులు తల్లి వెంకమ్మే కుటుంబాన్ని చక్కబెట్టుకోవాల్సి వచ్చింది. అర ఎకరం పొలమూ, రెండు పాడిగేదెలూ ఆమె ప్రాణానికి పెద్ద బాధ్యతలే. వాటిని సరస్వతే పంచుకోవాల్సి వచ్చింది.

సరస్వతికి ఆ ఇంట్లో స్థానం ఎప్పుడో నిర్ణయం అయిపోయింది ఆ విషయం ఊరందరికీ తెలుసు. అందుకే కాబోలు, సరస్వతి అంటే కొందరికే తెలుసు. 'అబ్బులుగాడి పెళ్లాం' అంటే అందరికీ తెలుస్తుంది. పెళ్లి తంతు ఒక్కటే జరగాల్సి ఉంది. తల్లి వస్తున్న వైపు వేలు పెట్టి చూపించాడు అబ్బులు.

''ఓరి నీ సోకులు సంతకెల్లా కూడు తినమంటే టెక్కు సేసింది ఇందుకా? అయినా నిన్ననేం లాభం? దాన్ననాలి కానీ.. రానీయ్ సెపుతాను''

చేతిలోని కొడవల్ని లేచిన చోటనే వదిలేసి కచ్చా పోసిన (గోచీలా వెనక్కి దోపిన) చీర అంచుల్ని విడుదల చేసింది మనిషినలుపే కాకుంటే మున్నటి నలుపు. దానికి తోడు పట్టీ పట్టని చెమట. ఆపై వెండి వాన లాంటి సూర్యకాంతి. ఒళ్ళంతా నిగారింపే కపటం లేని నిగారింపు. కానీ ఖర్చు లేకుండా వచ్చింది. వంద చీకట్లూ, వెయ్యి పరదాలూ కలిసి కుట్ర పన్నినా దాచలేనిది యౌవనం. అలాంటి యౌవనానికి ఎండ ఎంతటి అద్భుతమైన స్వేచ్ఛ.

''ఏరా బాబా ఏంటీ? ఈ కర్రిది లేసి పడుతుంది?'' మనసారా తిట్టుకుంటూ నెత్తిమీద తట్ట దించుకుంది వెంకమ్మ. తిట్టులోని ప్రేమ కన్నా తీయనైన అభివ్యక్తి వేరొకటి ఉండదేమో?

''అది సరే కానీ ఎంకిదానా నీకొడుక్కెప్పుడు గేణ వొత్తాదే?'' చీర కుచ్చిళ్ళు సాపు చేసుకుని, అబ్బులు పక్కనే చతికిలపడుతూ అడిగింది సరస్వతి.

''నిన్నొదిలేసి ఇంకోదాన్ని తగులుకున్నప్పుడు'' నాలుగు అరల ఇత్తడి కేరియర్‌కి స్క్రూ తీస్తూ అంది

''లమ్మో! ఏం సెప్పావే సెకండియ్యా!'' అబ్బులు తన తల్లి కుడిచెయ్యి తీసుకుని ఆనందం నటిస్తూ ఊపేశాడు అబ్బులు బి కాంలో ఒక సబ్జెక్టు మిగిలిపోతే చదువుతున్నాడు. మరో రెండు వారాల్లోనే పరీక్షలు. దగ్గరుండి కలుపు తీయించినట్లూ ఉంటుందీ, చదువుకున్నట్లూ ఉంటుందీ అని రెండు రోజుల నుంచి పొలం గట్టుమీదే మకాం పెట్టాడు.

తల్లీ కొడుకుల ఎకసెక్కాలకి నిరసనగా మూతి వంకర్లు తిప్పుకుంటూ, రెండు చేతుల్తో ఒక పుస్తకాన్ని తీసి ఒళ్లో పెట్టుకుంది సరస్వతి కేరియర్‌లోని గిన్నెల్ని ఒబ్బిడిగా పరిచింది వెంకమ్మ. అడుగు గిన్నెలో అణచిపెట్టిన అన్నం, రెండో గిన్నెలో ఎర్రని ఉప్పు చేపల వేపుడూ, మూడో గిన్నెలో వేయించిన కరివేపాకులూ, పండు మిరపకాయలు తేలే పప్పుచారూ, పైగిన్నెలో మీగడ పెరుగూ అబ్బులి ఆకలి విలువను రెట్టింపు చేశాయి.

''కర్రిదానా దా, నీ కేరేజీ కూడా తీయే'' చెంబులో నీళ్లు స్టీలు గ్లాసులో వేస్తూ అంది వెంకమ్మ. మూతి మరోసారి వంకర్లు తిప్పుకుంది సరస్వతి.

''సద్దికూడు తిన్న ఆడది మొగుడాకలెరగదని ఊరికే అన్నారా? పూటుగా లాగించేసి పుత్తకాలు తిరగేత్తన్నావన్నమాట. గొప్ప సదవరి లెండి'' మరింత రెట్టించింది వెంకమ్మ. అయితే వెంకమ్మ వెటకారం సరస్వతికి రుచించలేదు పైపెచ్చు మనసులో కలుక్కుమంది. కష్టం కలిగింది. చాకిరీ కష్టం కాదు చాకిరీని గుర్తించక పోతేనే కష్టమనిపిస్తుంది ఆ కష్టాన్నే ప్రకటించకుండా ఉండలేక పోయింది

''సాలు సాల్లేవమ్మో. ముందు తిన్న ఆడదానికి సారు కూడు, యెనక తిన్న మొగోడికి సేవ వేపుడు. సాకిరీకి నేనూ, సదువుకీ నీ కొడుకూ'. ఈ మాటలంటున్నప్పుడు సరస్వతి కళ్లల్లో నీటి చారికలు మెరిశాయి వెంకమ్మ వెంటనే గ్రహించి, సరస్వతి తల మీద చెయ్యి వేసి చనువుగా దగ్గరికి లాక్కుంది.

''ఛా! నోర్ముయ్ గొప్ప సదువుల్లే! ఈడు ఎంత సదుంకున్నా నీ కొంగట్టుకుని తిరగాల్సిందే గందా! అదుగో మేట్టారమ్మాయి గేసమ్మ సూడు సివరాకరికి యేమయ్యిందో? బియ్యేదాకా సదుంకుందా... సదుంకున్నోణ్ణే సేసుకుందా.. కడకాడేం సేసాడూ? ఇంకోదాన్ని తగులుకుని దీన్ని తరిమేశాడు. పొద్దుటేలే బస్సు దిగింది. ఒకటే సోకండాలు. ''

వెంకమ్మ అలా చెపుతుండగానే మధ్యలో అబ్బులికి పలకమారింది సరస్వతి అబ్బులు నెత్తిమీద

చిన్న మొత్తి, గ్లాసులోని నీళ్లు పట్టించింది అబ్బులు తేరుకున్నాడు సరస్వతికి కోపం ఎగిరిపోయింది

''లమ్మా! గ్రేస్ నిజంగానే వచ్చేసిందా?'' తన అనుమానాన్ని నివృత్తి చేసుకుని, అయిదు నిమిషాల్లో భోజనాన్ని పూర్తిచేసి, పేటవైపు ప్రయాణమయ్యాడు అబ్బులు.

''లప్పోయ్! నీ కొడుక్కి గేసంటే పిచ్చి పోలేదే!'' అబ్బులు వెళ్తున్న వైపు చూస్తూ అంది సరస్వతి.

''పిచ్చికాదే జాలి పొద్దున్న ఆ పిల్ల వాలకం సూత్తే నాకే యేడుపాగలేదు'' అభియోగాన్ని ఒక్క ముక్కతో కొట్టి పారేసింది వెంకమ్మ



గ్రేస్! ఆ పేరంటే అబ్బులికి ఒక తుళ్ళింత ఆమె అరచేతి స్పర్శ అతడికి తెలుసు. అదమరచి నిదురిస్తున్నప్పుడు మీద పడ్డ మొదటి చినుకులా ఉంటుంది ఆ స్పర్శ ఆమె ముక్కుపుటాల్లోంచి వచ్చే వెచ్చటి శ్వాస అతడికి తెలుసు. వేడివేడి అన్నం మూకుడు మీద మూత తీసినట్టుంటుంది ఆ శ్వాస.

మరి ఆమె రంగు? తెలుపు కాదు. నలుపు కాదు. మధ్యస్తం. చామనఛాయ అని ఒక్కముక్కలో చెప్పడం వీలు కాదు. తెలుపు, నలుపులు శరీరపు కాంతిని మాత్రమే చెబుతాయి. శరీరాన్ని నిర్వచించలేవు. వొయ్యారాన్ని ప్రకటించలేవు. కానీ చామనఛాయ అలా కాదు. అదొక చురుకైన రంగు చూడగానే చురుక్కుమనే రంగు. వేడివేడి చెరకు పానకంలో వేలుపెట్టి, చటుక్కున తీసి నోట్లో పెట్టుకుంటే ఎలా ఉంటుందీ? ఆమె ఒంటి రంగును చూసినప్పుడల్లా అబ్బులికీ అలా ఉంటుంది. నిజానికి గ్రేస్ రంగు ఒక్క చామనఛాయ కాదు. రెండు చామనఛాయలు! రుతువును బట్టి ఆమె ఒంటిరంగు మారేది. గ్రేస్‌కు సంబంధించినంతవరకు రెండే రెండు రుతువులు. ఒకటి: చదువుల రుతువు. రెండు: సెలవుల రుతువు. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే చీరలు కట్టే రుతువొకటి. చీరలు కొనుక్కునే రుతువొకటి. కాలేజీకి సెలవులిస్తే చాలు. కచ్చా బిగించి, కొడవలి చేత పట్టి, పొలం పనుల్లోకి దూకేది. సరదాకి కాదు, కూలికే.

వాళ్ల అమ్మా, నాన్నా టీచర్లే. అయినా అదేం ఖర్మ. రకరకాల చీరలు కట్టాలి. కాస్త చిన్నప్పుడైతే పరికిణీలు కట్టాలి. అమ్మా నాన్నల్ని నమ్ముకుంటే ఏడాదికి రెండే చీరలు. ఒకటి ఈస్టర్‌కీ, మరొకటి క్రిస్మస్‌కీ. మరీ గట్టిగా పేచీ పెడితే, ''చాలు చాల్లే మా జీవితమంతా నీ చీరల మీదే తగలేస్తే, రేపు నీకు పెళ్లెవరు చేస్తారే?'' అంటారు. అందుకే గ్రేస్ కూలీకెళ్తుంది

ఒక్క గ్రేసే కాదు. దాదాపు అక్కడి మాల, మాదిగపల్లెల్లోని కాలేజీ చదివే ప్రతి అమ్మాయీ, అబ్బాయీ ఇదే పని చేస్తారు.

''అందరూ చేస్తే చేశారు. గ్రేస్ ఎందుకు చెయ్యాలి?'' అన్నది విలవిల్లాడే అబ్బులి ప్రాణానికి సంబంధించిన ప్రశ్న. గ్రేస్ కూలీకి వెళ్తున్నప్పుడు, రోజురోజుకీ వన్నె తగ్గుతుండేది. చామనఛాయ చిక్కపడుతుండేది రెండు వారాల సెలవులైతే దాదాపు నలుపుకి దగ్గరయ్యేది.

కూలి కొత్త వర్ణాన్నిస్తుందన్న మాట. కాలేజీ తెరిచినప్పుడల్లా కొత్త కొత్త చీరల్లో గ్రేస్ ప్రత్యక్షమయ్యేది. కానీ, తన చీరకు రంగు నివ్వడం కోసం, తన వన్నెను కోల్పోయేది. బస్టాండులో నిలబడ్డప్పుడు చీర మాత్రమే కనిపించేది. తాను కాదు. పాలకొల్లు వెళ్ళే బస్సు రాగానే డోర్ దగ్గరకు పరిగెత్తేది వెనువెంటనే అబ్బులు. పై మెట్టుమీద ఆమె, క్రింద మెట్టుమీద అబ్బులు. ఆమె వీపుమీద అతడి శ్వాస చిన్నగా నవ్వేది. ఇది రోజూ జరిగే సన్నివేశం. ఇద్దరూ ఎదురుచూసే సన్నివేశం! ఒకరోజు మాత్రం ఈ సన్నివేశమే అబ్బుల్ని కలవరపరిచింది. కారణం ఆమె వీపు పెరిగింది. ఇందులో ఎవరి

నేరమూ లేదు. మారిన హీరోయిన్ జాకెట్ల ననుసరించి టైలర్ ఒక ప్రయోగం చేశాడు. జాకెట్ మెడ కాస్త ఎక్కువగా కత్తిరించాడు వీపు ఇంకాస్త ఎక్కువగా కనపడేటట్లు కుట్టాడు. దాంతో ఎండబారిన పడని వీపు భాగం కూడా ఒక చారికలా కనిపించింది. ఆమె కాయకష్టానికి అదో సరిహద్దు రేఖ

ఆమె వీపు పైభాగాన అబ్బులు భారంగా వదిలాడు శ్వాస. ఎప్పటిలాగే గ్రేస్ వెనక్కి తిరిగింది కానీ నవ్వలేకపోయింది. అతడి శ్వాసలోని రవంత వేదన యేదో ఆమెను తాకినట్టుంది.

ఆరోజు ప్రయాణమంతటా ఆమె వీపుమీద సరిహద్దు రేఖనే చూశాడు. పాలకొల్లులో బస్సు ఆగింది ఇద్దరూ దిగారు. అబ్బులు దిగులు ముఖం గ్రేస్‌కు నచ్చలేదు. ''ఏయ్ అబ్బులూ! కాఫీ ఇప్పిస్తావా?'' నవ్వుతూ అడిగింది. ''ఇంటి దగ్గర తాగలేదా?'' అనాలోచితంగా అనేశాడు అబ్బులు. అసలు గ్రేస్ కాఫీ మాట ఎత్తితే చాలు ఎప్పుడూ ఎగిరి గంతేసేవాడు. ఎందుకంటే, రెస్టారెంట్‌లో ఆమె ఎదురుగ్గా కూర్చొని ముచ్చట్లాడవచ్చు. కానీ, ఈసారి మనసులోని దిగులు, అలా మాటల్ని తారుమారు చేసింది.

''అమ్మ తిట్టింది. ఏమీ తినకుండా వచ్చేశాను'' అబ్బులి ముఖంలోకి తొంగిచూస్తూ పసిపిల్లలా చెప్పింది.

''ఎందుకూ?''

''డబ్బులన్నీ చీరలకు తగలేశానని'' బదులిస్తూ నవ్వేసింది. అది దుఃఖాన్ని దాచిన నవ్వు. అందుకే కాలే పెనంమీద నీటిబొట్టులా అది క్షణంలోనే ఆవిరయ్యింది. కష్టార్జితాన్ని గుర్తించనందుకు ఆ క్షణంలో కన్నతల్లి కూడా కామందులాగే కనిపించింది. దుఃఖం ఉబికి వచ్చింది. తల పక్కకు తిప్పుకుంది.

''ఏయ్ గ్రేసూ... గ్రేసూ...! నిన్నే ఇటు చూడు... అరె .. నిన్నే'' ఆమె గడ్డం పట్టుకుని తనవైపునకు తిప్పుకున్నాడు. మూసిన కళ్ళు! మళ్లీ నవ్వే ప్రయత్నం చేస్తూ కళ్ళు తెరిచింది. రెండు కన్నీటి బొట్లు రాలాయి. కొబ్బరి ఆకుమీద వానబొట్లు గాలికి రాలినట్లు. గబగబా కొత్త చీర కొంగుతో ఆనవాళ్లు లేకుండా కన్నీళ్లను తుడిచేసుకుని, ''కాఫీ వద్దులే కాలేజీ కెళ్లిపోదాం'' అంది.

''కాలేజీకెళ్లిపోతావా...? కొట్టానంటే... మళ్లీ!'' అభిమానాన్నీ, చనువునీ మిళితం చేసి చెయ్యెత్తాడు అబ్బులు. అటూ ఇటూ చూసుకుంది గ్రేస్ ఎత్తిన అతడి కుడిచేతిని, తన ఎడమ చేతిలోకి తీసుకుని కిందకు దించింది. అంతటితో ఆగలేదు. బలంగా నొక్కడం మొదలుపెట్టింది

''ఇప్పుడు చెప్పు.... కొడతావా? నిండా నీళ్ల బాల్చీ ఎత్తలేనోడివి నన్ను కొడతావా?''

''ప్లీజ్! గ్రేసూ! ప్లీజ్... వదులు... ఏయ్. నిన్నే .. ఎవరైనా చూస్తే బాగుండదు... వదులూ...'' ఆమె చెయ్యి గట్టిగా ఉంది. అయితేనేం? వెచ్చగా ఉంది అలా చెయ్యి వదలకుండానే బస్టాండ్‌నుంచి రెస్టారెంట్‌వైపు దారి తీసింది గ్రేస్. ఆమె నిర్ణయానికి ఆనందపడ్డాడు కానీ, అరచేతిలోని నొప్పిని తాళలేకున్నాడు. ఈలోగా ఆర్టీసీ బస్సొకటి వాళ్ల పక్కనుంచి దూసుకెళ్లింది. ''ఛీ... ఛీఛీ... ఛీఛీ... చీరనిండా మురికినీళ్లు'' అన్నాడు అబ్బులు. ఉలిక్కిపడి అబ్బులు చెయ్యి వదిలేసింది. చీర కుచ్చిళ్లు పట్టుకుని ముందూ, వెనకా చూసుకుంది అలాంటి ప్రమాదమేమీ జరగలేదు. ''హమ్మయ్య! గుండె జారిపోయిందనుకున్నాను. మూడొందల రూపాయల చీర!''

బిక్కచచ్చిపోయింది. పసిపిల్లలా వణికిపోయింది

'ఎహ్హెహ్హెహ్హె . ' అని వెక్కిరించబోయిన అబ్బులికి, మూడొందలంటే పదిహేనురోజుల కూలి, అన్న లెక్క గుర్తుకొచ్చి, ఆమె చేతిని మృదువుగా తన చేతిలోకి తీసుకుని రెస్టారెంట్లోకి అడుగుపెట్టాడు

అప్పటికదే ఆఖరి స్పర్శ ఆ తర్వాత గ్రేస్ గురించి వినడమే తప్ప చూడలేదు ఆ రాత్రి ఇంటికి వెళ్లాక, గ్రేసకు తల్లితో చీరల గొడవ మళ్లీ రాజుకుంది ప్రేమ వచ్చినా, కోపం వచ్చినా పాడి పాడి మాటల్తో తీర్చుకోవడం తల్లీకూతుళ్లిద్దరికీ తెలీదు కలబడ్డారు. కొట్టుకున్నారు.

తెల్లవారుజామున తన చీరలు, సర్టిఫికెట్లూ సర్దుకుని బస్సు ఎక్కి ఏడుస్తూ వెళ్లిపోయింది వారించిన వాళ్లందర్నీ ఒండబూతులు తిట్టిందని పేటలో వాళ్లు ఇప్పటికీ చెబుతుంటారు

అంతే. ఆ తర్వాత ఎప్పుడో, ఆమె భీమవరంలో వాళ్ల మేనత్త ఇంటికి వెళ్లిందని తెలిసింది కోపం తగ్గాక తిరిగొస్తుంది కదా అని ఇంట్లో వాళ్లు ఎదురుచూశారు అబ్బులు కూడా అలాగే అనుకున్నాడు కానీ, ఇంతలోనే పిడుగులాంటి వార్త వచ్చింది ఎవరో రాజుల కుర్రాడితో లేచిపోయిందని వాళ్ల మేనత్త కబురు మోసుకొచ్చింది

ఆ విషయం తెలిసిన రోజు, తన గదిలో దూరి తలుపేసుకుని అబ్బులు రెండు గంటలసేపు వెక్కివెక్కి ఏడ్చాడు కన్నీరు కార్చిన కళ్ళను తుడుచుకున్నా గుర్తుపట్టవచ్చు

''ఏయ్ బాయ్యా మందు కొడతావా?'' ఏడ్చి బయటికొచ్చిన అబ్బుల్ని సరస్వతి అడి..న ప్రశ్న అది

''ఛీ . అలా అడుగుతున్నావేంటీ?'' కళ్ళు మరొకసారి నులుముకుంటూ అడిగాడు.

''ప్రేమించిన పిల్ల ఎగిరిపోతే సినిమాలో నాగార్జున ఏం సేత్తాడు? మందుకొట్టడా?'' అని తుర్రుమని పారిపోయింది

అబ్బులు నవ్వేశాడు. నిజమైన జీవితంలో నవ్వుకీ ఏడుపుకీ మధ్య సరిహద్దు రేఖ ఉండదు. గ్రేస్ గుర్తొచ్చినప్పుడల్లా అబ్బులికి కాస్త దిగులూ, కొంచెం గుబులూ కలుగుతుంది. ఆమె మాట, ఆమె స్పర్శ, ఆమె శ్వాస.. అన్నీ కోల్పోయానని అనుకుంటే దిగులు. కొన్నాళ్ళయినా పొందగలిగాననుకుంటే గుబులు



ఆమెను చూసి రెండేళ్ళయింది. ఇప్పుడెలా ఉంటుందో?'' అలా అనుకునే లోగానే నిలువెత్తు అంబేద్కర్ విగ్రహం దగ్గరికి వచ్చేశాడు అబ్బులు. వేలెత్తి చూపించే ఆ విగ్రహం పక్కనే గ్రేస్ ఇల్లు.

అరుగుమీదే ఒక పక్కగా కూర్చుని బియ్యంలో రాళ్లు ఏరుతోంది గ్రేస్ అమ్మమ్మ. మరోపక్క మడతమంచంమీద వెల్లకిలా పడుకుని ఉన్నాడు గ్రేస్ తమ్ముడు లివింగ్స్టన్. కొబ్బరి చెట్టు మీదినుంచి పడి కాలు బెణకడంవల్ల, పది రోజుల్నించి మంచంమీదనే ఉన్నాడు.

''మామ్మా గ్రేస్ వచ్చేసిందా?'' అబ్బులు అడిగాడో లేదో, ముసలావిడ జాకెట్‌లేని భుజాన్ని తెల్లచీర కొంగుతో కప్పుకుంది. ఒక్కసారి గుమ్మంలోంచి ఇంట్లోకి తొంగిచూసి, మాటల్ని గుసగుసల్లోకి దించేసింది. ''అబ్బులా! దీని బులుపు వొదిలిపోయింది. నీకు తెల్దా? ఆరాసోడు దీన్ని తరిమేశాడు బాబా ఇదిలా అగపడద్ది కాని. దీనికెంత పొగరో తెలుసా? నా కూతురు ఎర్రి బాగుల్ది. దీని శోకండాలు సూసి కరిగిపోయింది. అనకూడదు కాని బుల్లోడా, ఇది సెంకిణీ ముండ. సీరముక్క కోసం నా కూతుర్నట్టుకు కొడలాదా ఈ ఆడదీ...? ఇంకా ముసలావిడ నిష్టూరాలకి తెరపకుండానే మంచంమీది లివింగ్స్టన్ మధ్యలో ఆతృతగా కలుగజేసుకున్నాడు ''ఎవరూ? అబ్బులా? ఓరి... నీ కోసమే

కబురెడదామనుకుంటున్నా(నా ఎంతువుద్దో కనుక్కున్నావా? ఉత్తి బట్టకే మూడేలవుద్దంటకదా, కుట్టుకూలి అయిదొందల్లో అయిపోద్దంటావా?'' దొరికాడు కదా అని పీకట్టుకున్నంత పని చేశాడు లివింగ్‌స్టన్ లివింగ్‌స్టన్‌కి పెళ్ళి కోటు పిచ్చి అతనెప్పుడూ ఒకే ఒక ఊహలో ఉంటాడు. చర్చిలో తనకు పెళ్లి జరుగుతున్నట్టు అలాగని ఏ అందమైన పెళ్లికూతురో తన పక్కనున్నట్టు కల కనడం ఊహించుకోడు. అసలు వధువు ఎవరన్నది అతనికి అప్రస్తుతం. అతని ఊహలన్నీ పెళ్ళిరోజు తాను వేసుకోబోయే సూటు మీదే.

ఎక్కడన్నా పెళ్లి జరుగుతుంటే పిలవకపోయినా హాజరవుతాడు. ఇంకెందుకూ? పెళ్ళికొడుకు సూటు చూడ్డం కోసమే. గోరింటాడలో ఆరోజుకూడా పెళ్లి ఉంది. పైగా దగ్గరి బంధువుల ఇంట్లో పెళ్ళి ఆహ్వానం కూడా వచ్చింది. ఇంటిల్లిపాదీ వెళ్లినా తాను, గ్రేసూ, ముసలావిడా ఉండిపోయారు. కారణం కాలు. ఆ రోజంతా పెళ్ళికి వెళ్ళలేకపోయానన్న దిగులుతోనే ఉండిపోయాడు లివింగ్‌స్టన్.

అసలు కాలు బెణకడానికి కారణం కూడా పెళ్లికోటే. కొబ్బరికాయల డబ్బు, కోటు కుట్టుకూలీకి పనికొస్తుందని, ఎవరూ లేకుండా చూసి వాళ్ల ఇంటి చుట్టూరా ఉన్న కొబ్బరి చెట్టెక్కడం మొదలుపెడితే మధ్యలో జారిపడ్డాడు.

అబ్బులు ఇద్దరి మాటల్నీ పెడచెవిని పెట్టి, లోపలికెళ్లాడు. నవారు మంచంమీద గోడవైపుకు తిరిగి పడుకుని ఉంది గ్రేస్. కాస్త వొళ్ళు చేసినట్టుంది. చిలకాకుపచ్చ చీరా, అదేరంగు జాకెట్టు వేసుకుంది. చీరకప్పని నడుం భాగం చూశాడు. అది గ్రేస్ రంగు కాదు. చామనిఛాయ కాదు. కూలీకి వెళ్లి మాడిన నల్లరంగూ కాదు. ఇదొక కొత్త వర్ణం. తెల్లవర్ణం. నడుముమీద వేసుకున్న చెయ్యి చూశాడు. అదే వర్ణం, ఆమెది కాని వర్ణం.

చనువుగా చేతిమీద కొట్టి లేపుదామన్న ప్రయత్నాన్ని విరమించుకున్నాడు. ''ఏయ్. గ్రేసూ'' అంటూ వెళ్లి మంచం పక్కనే కూర్చున్నాడు. ఆమె గిరుక్కున వెనక్కి తిరిగింది. కనుగుడ్ల నిండా నీళ్లు.

గ్రేస్ వర్చస్సే మారిపోయింది. బుగ్గలొచ్చాయి చిక్కటి కనుబొమల స్థానంలో సన్నటి గీతలొచ్చాయి. ముక్కు నునుపు తేలింది. ఒకప్పుడు పెదవుల మీద ఉండే నల్లటి నీడ, మచ్చుకి కూడా కానరావడం లేదు. మెడలో పూసల దండ పోయి, తెల్లటి ముత్యాలొచ్చాయి.

అబ్బులు నిశ్చేష్టుడై చూస్తుండగానే ఆమె అతని చేతిని అరచేతుల్లోకి తీసుకుని, మెడ దగ్గర పెట్టుకుని, కుమిలి కుమిలి ఏడ్వడం మొదలుపెట్టింది. ఆమె అరచేతులు దృఢంగా లేవు. మెత్తగా ఉన్నాయి. వెచ్చగా లేవు. చల్లగా ఉన్నాయి.

గ్రేస్ స్పర్శ అతణ్ణి నిరుత్సాహపరచింది. గ్రేస్ సుకుమారమైన ముఖం - అతణ్ణి నిస్తేజుణ్ణి చేసింది. అక్కణ్ణించి తక్షణం వెళ్లిపోదామనుకున్నాడు. ఈలోగా ఆమె వెచ్చని కన్నీటి బొట్టొకటి అతడి ముంజేతి మీద పడింది. ప్రాణం లేచి వచ్చింది. ఆమె కళ్లనీ, బుగ్గల్నీ తుడిచాడు అలా చెరిగిన కంటి కాటుక బుగ్గల్ని అక్కడక్కడా నలుపు చేసింది. ఆ నలుపులో గ్రేస్‌కు పాత పోలికలొచ్చాయి. లేని జవసత్వాలు వచ్చాయి. హఠాత్తుగా, గ్రేస్ లేచి కూర్చుంది. అతడి చేతుల్ని తన మెడ చుట్టూ వేయించుకుని గాఢంగా కౌగిలించుకుంది. బావురుమంది. తనివితీరా ఏడ్చుకుంది. జడివాన తర్వాత ఆకాశం తేరుకున్నట్టు ఆమె తేరుకుంది.

'అబ్బులూ! నన్నెక్కడికన్నా తీసుకెళ్లవా?'' చెవి దగ్గరగా అడిగింది. ఏడ్చి ఏడ్చి బొంగురు పోయిన గొంతుతో.

''పాలకొల్లు సినిమా కెళ్దామా? ఇప్పుడు బస్సుండదే! సైకిల్‌మీద వెళ్దామా'' అలా అన్నాడో లేదో, అతడి చెవి పట్టుకుని బలంగా కొరికింది ''అమ్మా!'' అబ్బులు పెద్దకేక పెట్టి ఆమెను విదిలించుకున్నాడు.

''అయ్యో! అయ్యో! అయ్యో! ఏమయిందే ముదనష్టపుదానా?'' బయటినుంచి అరిచింది ముసలమ్మ అబ్బులు తత్తరపడి, మళ్లీ తేరుకున్నాడు ''ఏం లేదు మామ్మా! మొగుణ్నొదిలేసి రావడం మంచిదేనా?'' అన్నాను. నీళ్ల చెంబిచ్చుకు కొట్టింది. తగ్లేదులే'' అనవసరపు సంజాయిషీలన్నీ ఇచ్చేశాడు.

''నిన్ను కూడా కొట్టిందా మాయదారి ముండ మోసుకుంటాదిలే'' తన బియ్యం తాను చెరుగుకుంది ముసలావిడ

''ఏయ్! అలా చెవి పట్టుకు కరిచావేంటీ?'' చేత్తో తన చెవిని తడుముకుంటూ అడిగాడు.

''మరి కరవక ముద్దెట్టుకుంటానా? ఏదో ఏడుపొచ్చి మీద పడ్డాను కదాని, పరాయ ఆడదానిని చూడకుండా సైకిలెక్కించుకుని ఊరేగుతావా?''

ముఖం కొంచెం ముడుచుకుని గోడకు చేరబడింది గ్రేస్. ''ఛీ. . సైకిలంటే ఒక సైకిల్ కాదు. రెండు సైకిళ్లు'' అబ్బులి ముఖంలోకి చిరుకోపం పొడుచుకుని వచ్చింది. గ్రేస్ పగలబడి నవ్వింది ఆ నవ్వుతో, కొత్త గ్రేస్ పూర్తిగా పాతబడింది.



సాయంత్రం ఎండలో సైకిళ్ల ప్రయాణం. ఇద్దరికీ చెరో గూబా గుయ్యిమంటోంది బస్సు మిస్సయినప్పుడెల్లా ఇలా కాలేజీకి కలిసి సైకిళ్ళమీద వెళ్లడం ఇద్దరికీ అలవాటే. కానీ, గ్రేస్ సైకిల్ ఎక్కి చాలాకాలం అయింది కదా, కాస్త ఆయాసపడుతోంది దానికితోడు మెల్లమెల్లగా ఆమె భర్త వివరాలు రాబడుతున్నాడు అబ్బులు.

తీరని ఆవేశం, ఆయాసాన్ని పెంచుతుంది కదా! అదే జరిగిందక్కడ గ్రేసూ, నిజం చెప్పు, మీ ఆయన కొట్టాడా?'' సైకిల్‌ని కాస్త 'స్లో' చేసి, ఆమెకు పక్కగా వెళ్లనిస్తూ అన్నాడు. ''కొడతాడా? చేతులు ఇరిచెయ్యనూ?'' కిలోమీటరు దూరంలో ఎక్కడో ఎదురువస్తున్న మనిషిని చూసి, 'బెల్లు' మోగిస్తూ అంది.

''ఆగమ్మా గంటలరాణీ! ఆడింకా ఎదురు రావడానికి టైముందిలే. అది సరే, మీ ఆయన చేసే వ్యాపారమేంటీ?''

''రాజాస్ క్లాత్ స్టోర్స్, మెయిన్‌రోడ్, భీమవరం!''

''అందులో సేల్స్‌మన్‌గా పనిచేస్తాడా?''

''కాదు. గేటు దగ్గర నిలబడతాడు''

''ఓహో! సెక్యూరిటీ గార్డా?''

''మొహం చూడు. ఎలాగుందో, ఈడు ఆ షాపుకి వోనరు. అర్థమయిందా? అందుకే ఆడికంత కొవ్వు''

''ఇంకేం? పూటకో చీర కట్టొచ్చన్న మాట''

అబ్బులన్న ఈ మాట గ్రేస్ చెంపమీద చెళ్ళుమని కొట్టినట్లనిపించింది

మౌనం ఆమె రోడ్డుని కాక శూన్యాన్ని చూస్తూ సైకిల్ తొక్కుతోంది. కిలోమీటరు దూరంనుంచే కనిపిస్తున్న వ్యక్తి ముందు చక్రం దగ్గరికి వచ్చేవరకూ చూసుకోలేదు.- అప్పుడు బెల్లు మోగించింది అతడు చిందులు వేశాడు ఆమె కంగారుపడి, అబ్బులి సైకిల్కి చేరువగా వెళ్ళింది. ఆమె సైకిల్ పెడల్ అతడి ముందు చక్రంలో ఇరుక్కుంది ఇంకేముంది? ఇద్దరూ పడ్డారు. గాభరాగా లేచాడు అబ్బులు. ముందు ఆమెను లేవనెత్తాడు. ''ఎక్కడా తగల్లేదు కదా?'' అబ్బులి ప్రశ్నను ఆమె లక్ష్యపెట్టకుండా చీరంతా పరికించి చూసుకుంది. మిసమిసలాడే నిమ్మపండు రంగు, పాలియస్టర్ చీర కొంగు దగ్గర కొంచెం మరక అయింది సైకిల్ది కాబోలు. ''ఏం కాదులే, పోతాది'' భరోసా ఇచ్చాడు. ఆమె నలుదిక్కులా చూసింది. కాస్త దూరంగా పశువుల కొట్టం కనిపించింది. ఆ ప్రాంతమంతా ఆమెకు తెలిసిందే. వడివడిగా నడుచుకుంటూ అక్కడున్న బావి దగ్గరకు వెళ్లింగి.

అబ్బులు రెండు సైకిళ్ళనూ వేరు చెయ్యడానికి కష్టపడ్డాడు. రెండు సైకిళ్ళకూ స్టాండు వేశాడు. తన సైకిల్కి ఊడిన 'చైన్' ని తిరిగి సరిచేసుకుని, గ్రేస్ వెళ్ళినవైపు వెళ్లాడు. అప్పటికే, ఆమె బావిలోంచి నీళ్ళు చేదుకుని, కొంగుకు పట్టిన మసిని, వంగి అదే పనిగా కడిగి పిండుతోంది. అబ్బులు రాగానే పైకి లేచింది.

''అదలా పోదులే, పెట్రోలుతో కడగాలి'' అని ఆమెవైపు చూశాడు. ముఖమంతా ముచ్చెమటలు పోసి ఉన్నాయి.

''ఏయ్... ఏయ్... అబ్బులూ నా కళ్ళు. కళ్ళు. తిరుగుతున్నాయేంటి?'' అతడి భుజంమీద వాలిపోయింది. ఆమె స్పృహ తప్పింది. అతడి గుండె బేజారెత్తింది. క్షణం ఆలోచించి, ఆమెను రెండు చేతుల్లోకి ఎత్తుకుని పశువుల కొట్టంలోకి తీసుకెళ్లాడు. పొడిగా ఉన్నచోట, ఎండుగడ్డిమీద పడుకోబెట్టాడు. బాల్చీతో నీళ్ళు తెచ్చి, పక్కన పెట్టుకుని, ఆమె తలను తన వొళ్ళో పెట్టుకుని, ముఖమంతా కడిగాడు. కళ్ళమీద నీళ్ళు కొట్టాడు. ఆమె మెల్లిగా కళ్ళు తెరిచింది. అరచేతిని గుంటగా చేసి, నీళ్ళను కొంచెం కొంచెంగా ఆమెకు పట్టించాడు. ఆమె తేరుకుని, అతడి చేతిని ముద్దుపెట్టుకుంది.

''అబ్బులా, నన్ను చేసుకుంటావా?'' ప్రశ్న అడిగి కళ్ళార్పకుండా అతడివైపు చూసింది. ''ముందు ఆస్పత్రికి వెళ్దాం. నడు'' తన వొళ్ళోనుంచి ఆమెను తప్పించబోయాడు.

''చేసుకోవడం కుదరదులే. సరస్వతి ఉన్నాదిగా. పోనీ.. పోనీ... ఉంచుకుంటావా?''

''ఛీ ఛీ! అవేం మాటలు?''

''నీకు తెలీదులే పెళ్ళి చేసుకోవడం కన్నా ఉంచుకోవడమే గొప్ప. మా ఆయన ఉన్నాడా? నా దగ్గిర రెండు రోజులుంటే, దాని దగ్గిర అయిదు రోజులుంటాడు''

''ముందు నువ్వు లే చెప్తాను'' మొండిగా ఆమెను కదిలించాడు ఈసారి. ఒకే సైకిల్ మీద ఇద్దరి ప్రయాణం అనివార్యమైంది



''మీ యావిడ నెల తప్పింది''

నర్సు నవ్విపోయింది.

చీర కుచ్చిళ్లు సరిచేసుకుంటూ డాక్టర్ రూమ్లోంచి నీరసంగా బయటకు వచ్చింది గ్రేస్. ఆమెకు షేక్హ్యాండ్ ఇస్తున్నట్టు చేతిని పట్టుకు గట్టిగా ఊపాడు అబ్బులు

''తెలిసిపోయిందా?'' బయట ఉన్న బెంచీమీద కూలబడింది గ్రేస్.

''ఏయ్ సంబరపడ్డావనుకున్నాను ఏంటీ దిగాలుగా ఉన్నావ్?'' పక్కగా కూర్చుని ఆమె చెయ్యి పట్టుకున్నాడు

''నీకూ సంబరం నాకెందుకూ? నా పీడొదిలిందిగా నన్నేలుకోమని ఇంక పీక్కుతిననులే!'' ఈ మాటకి అబ్బులి ప్రాణం చివుక్కుమంది తల వంచుకున్నాడు కాసేపు.

''గ్రేసూ నిజం చెప్పు అసలు నీకూ, మీ ఆయనకూ గొడవెందుకొచ్చింది? ఇంకో మనిషిని ఉంచుకున్నాడనా?''

''ఛ అది కాదు అందుకే అయితే మూణ్ణెల కిందటే వచ్చెయ్యాలి. ఆడికి నేనంటే లోకువ. నా జాతంటే లోకువ''

''ఏమన్నాడని. ?''

''గోచీలెట్టుకు తిరిగేదానికి పట్టుచీరలెందుకన్నాడు అదిలేదా? అదే, ఈడుంచుకున్న ముండ. అది గొప్ప జాతి బిడ్డ కదా, నేత చీరల్లే సింగారిస్తాదంట దాన్లా నేనెందుకుండనూ అంటాడు ఇదిగో అబ్బులా, నేనోటి చెప్పనా? కలిగినమ్మ ఇప్పుకున్నా అందమే. కానీ లేనమ్మ కప్పుకుంటేనే అందం అయినా దాన్నునుకుని ఏం లాభం? నా బతుకే అలా తగలడింది నన్ను కనుక్కున్న తల్లే నేను మంచి చీర కొనుక్కుంటే ఏడ్చేది ''

''నీకేమన్నా తిక్కా! మీ యమ్మ అలా ఎందుకనుకుంటుందీ?''

''తిక్కే. నా తిక్క నాకే అర్థం కాదు. నాకెందుకో ఉజ్జోగాలు చెయ్యాలనీ, ఊళ్ళేలానీ ఉండదు నన్నెవరూ హీనంగా చూడకూడదు. తక్కువ చేసి మాట్లాడకూడదు. నలుగుర్లోనూ తీసిపోకుండా కనబడాలి కడుపు మాడినా సరే, శుభ్రమైన బట్ట కట్టాలి. నా తిక్క కాట్లోకెళ్ళాకే పోతుంది''

''చంపుతా .. ఏంటా వాగుడు'' ఆమె నోరు నొక్కాడు అబ్బులు.

''బాబ్బాబు. ఆ పనేదో తొందరగా చెయ్యి. నా పీడ వదుల్తుంది చంపితే చంపావుకానీ, కాటికి పంపేటప్పుడైనా కొత్త చీరతో పంపుతావా?'' పిచ్చిగా నవ్వేసింది గ్రేస్

ఆమెవైపు ముందు కోపంగా, తర్వాత జాలిగా చూశాడు అబ్బులు. ఆలోగా నర్సు 'ప్రిస్క్రిప్షన్' చేతిలో పెట్టింది

''ఇప్పుడే వస్తాను. ఇక్కడే కూర్చో'' అని గ్రేసుకు చెప్పి బయటకు వెళ్ళాడు. అన్నట్టుగా కాకుండా, కాస్త ఆలస్యంగా తిరిగొచ్చాడు.

''సిస్టర్! ఇవేనా మందులు? ఒక్కసారి డాక్టర్‌కి చూపిస్తారా?''

నర్సుకి మందుల పాకెట్ ఇచ్చి, గ్రేస్ చేతిలో వేరే ఒక పెద్ద ప్యాకెట్ పెట్టాడు అందుకని అతడివైపు ప్రశ్నార్థకంగా ఒక చూపు చూసి, ప్యాకెట్ విప్పడం మొదలుపెట్టింది గ్రేస్

''నాకు తెలుసు చీర తెచ్చావ్ కదా?''

''మొత్తానికి చీరంటే పడి చస్తావ్!''

''అవును దీన్ని కట్టడం కోసమైనా తొందరగా చస్తాను'' అలా అంటూనే ప్యాకెట్లో వస్తువును చూసి నోరు వెళ్ళబెట్టింది. అది చీర కాదు. బుల్లిగౌను. నీలాకాశం మీద చుక్కలున్నట్టుంది గౌసుమీది పాలిథిన్ కాగితాన్ని చేత్తో నిమిరింది అబ్బులువైపు తీక్షణంగా చూసింది. లోపల నుంచి పొర్లుకొస్తున్న

ఆనందాన్ని అదిమిపెట్టడం ఆమె వల్లకావడం లేదు

''ఎవరికీ గౌను?'' సమాధానం తెలిసి కూడా ప్రశ్నించడంలోని థ్రిల్‌ని అనుభవించిందామె

''నీకే, తొడుక్కో. చీరల పిచ్చి పోతుంది తెలిసిపోయే అబద్ధాన్ని తియ్యగా వదిలిపెట్టాడతను. అతడి మాటని ఆసరాగా చేసుకొని ఆనందాన్ని అంచెలంచెలుగా విడుదల చేసింది. ఆ ఆనందం ముందు నవ్వయింది తర్వాత ఏడుపయింది మళ్ళీ నవ్వయింది

''అవునూ, నాకు పాపే పుడుతుందని నీకెలా తెలుసు?'' తేరుకున్నాక అడిగింది. అతడి దగ్గర సమాధానం లేదు

''పోనీలే, బాబు పుట్టినా గౌనే వేస్తాను'' మురుసుకుంటూ ప్యాకెట్‌ను గుండెలకు హత్తుకుంది.

''గ్రేసూ, నీకో మాట చెప్పనా?'' ఆమె భుజంమీద భరోసాగా చెయ్యి వేశాడు.

''చెప్పు'' చాలా మామూలుగా అతడివైపు చూసింది

''నిన్ను పెళ్లి చేసుకుంటాను'' దృఢ నిశ్చయంతో అన్నాడు.

''అదేంటి ? అది ఇందాకటి మాట. ఇప్పుడు నాకు కడుపు కదా'' లోపల ఆనందం ఉన్నా ఇది జరగని ప్రతిపాదనేమోనన్న భయం ఆమెలో కనిపించింది

''అది అడ్డు కాదు. ఒకప్పుడు నాకు నువ్వంటే ఇష్టం. ఇప్పుడు నీ తిక్క కూడా ఇష్టమయింది ...'' ఆమె రెండు అరచేతుల్నీ తీసుకుని తన అరచేత్తో దాస్తూ అన్నాడు. ఆమె చేతుల్లోకి వెచ్చదనం వచ్చింది

సినిమా చూసి ఇంటికి వెళ్లాక, గ్రేస్ అత్తింటి నుంచి తెచ్చుకున్న చీరలన్నీ పెట్టుకుని అబ్బులు ఇంటికి వచ్చింది. ''ఈ రాత్రికి మా ఆయనొస్తున్నాడు, నన్ను తీసుకెళ్లడానికి నన్ను చంపినా వెళ్లను. ఉడుక్కుపోయి చీరలు పట్టుకుపోతాడు. అబ్బులా, వీటిని నీ దగ్గరే ఉంచు'' గుక్క తిప్పుకోకుండా చెప్పి తుర్రుమని వెళ్ళిపోయింది గ్రేస్. అబ్బులు ముచ్చటగా నవ్వుకున్నాడు కానీ, ఆ రాత్రి నిద్ర పట్టలేదు. బయట అరుగుమీద మడత మంచం వేసుకొని పడుకున్నాడు. చాలాసేపటి వరకూ కళ్ళు మూతలు పడలేదు గ్రేస్ మాటలే చెవుల్లో గింగురుమంటున్నాయి.

''కడుపు మాడినా సరే, శుభ్రమైన బట్ట కట్టాలి'' ఆ మాట ఒక పరిశోధనలా అనిపించింది. కొత్తగా సిగ్గొచ్చినట్లనిపించింది జాకెట్ వేసుకోని గ్రేస్ అమ్మమ్మ గుర్తొచ్చింది వస్త్రాలకు నోచుకోని మూడువేల సంవత్సరాల బానిసత్వం తరుముకొచ్చింది పెంకిపిల్ల గ్రేస్ వీరనారిలా అనిపించింది. తృప్తిగా గుండెలమీద చేతులు వేసుకున్నాడు నిద్ర ఎగురుకుంటూ వచ్చింది. కలలు కూడా నిద్రను వెంబడించాయి లెక్క ప్రకారం కలలోకి ఎవరు రావాలి? గ్రేస్ రావాలి కదా! కానీ గ్రేస్ తమ్ముడు లివింగ్‌స్టన్ వచ్చాడు.

''ఒరేయ్ అబ్బులూ, సూటుకి వెయ్యి తక్కువొచ్చాయి. నువ్వివ్వకపోతే చంపేస్తాను'' అబ్బుల్ని మూడుసార్లు పీకపిసికి చంపబోయాడు మూడుసార్లూ అబ్బులు నిద్రలో మూలిగాడు. పక్కనే చాపమీద పడుకున్న తల్లి వెంకమ్మ గాభరాగా లేచింది. కొడుక్కి మంచినీళ్లు తాగించింది ''అలా ఎల్లకిలా తొంగోకు. ఆ యెంపికి వొడ్డీగిలు'' అని పడుకోబెట్టింది. అయినా ఏం ప్రయోజనం? లివింగ్‌స్టన్ విక్రమార్కుడిలా ఉన్నాడు. నాలుగోసారి కూడా కలలోకి వచ్చాడు ఈసారి పీక పిసుకుతూ కాదు, పారిపోతూ వచ్చాడు.

''వేయి నువ్విచ్చేదేంటి ఈ చీరలమ్మితే రావా?'' అని గ్రేస్ దాచుకున్న చీరల పెట్టెను పట్టుకుని

లివింగ్స్టన్ పారిపోతున్నాడు లివింగ్స్టన్‌ని పట్టుకోవడానికి పరిగెత్తబోతే అబ్బులికి కాళ్ళాడటం లేదు

''ఆగు చంపుతా'' అని అనబోతుంటే నోరు పెగలడం లేదు లివింగ్స్టన్ కలలోంచి విజయవంతంగా పారిపోయాడు అబ్బులికి నిద్ర వీడిపోయింది. తెలతెలవారుతోంది కంగారుగా తల్లిని నిద్రలేపాడు ''లమ్మా, ఓపాలు గ్రేస్ చీరల పెట్టె ఇలా తేయే' అన్నాడు మంచంమీద బాసంపట్టు వేసుకుకూర్చుని

''అదేంటి? ఇందాకే కదా గేసొచ్చి అట్టుకెల్లిందీ. నువ్వేమో ఒల్లు తెలవకుండా నిద్దరోతున్నావ్. లేపటమెందుకని నానే ఊరుకున్నాను అల్లాయనొచ్చి గేసును తీసికెళ్లాడు. అడు దీన్నంత సితకబాదాడా? అయినా పట్టుసీర సూపిత్తే అయిసయిపోయింది నాలుగేలంట! నిద్దరకల్లతో సూసాను'' చాలా మామూలుగా చాప చుట్టేసింది వెంకమ్మ. ఆశ్చర్యపోయాడు కానీ, దిగులు పడలేదు దీర్ఘంగా ఊపిరొదిలాడు బ్రష్ చేసి, చల్లటి నీళ్లతో ముఖం కడుక్కుని గ్రేస్ ఇంటివైపు వెళ్లాడు. వేలెత్తి చూపించే అంబేద్కర్ విగ్రహం ముందు కాసేపు ఆగాడు విగ్రహం కళ్ళజోడు మీద పొద్దు పొడుపు వెలుతురు పడుతోంది అంబేద్కర్ ఎందుకో ఆ ఉదయం కొత్తగా కనిపిస్తున్నాడు. విగ్రహాన్ని ఆపాదమస్తకం పరిశీలించాడు అబ్బులు.

నెక్ టై, కోటుమీద కోటూ, మడత నలగని ప్యాంటూ, మెరిసే బూటూ - ఠీవిగా కనిపించాడు. లివింగ్స్టన్ కోరుకునే పెళ్ళి దుస్తులివే.

మూడువేల ఏళ్ళు ముంత వేళ్లాడిన స్థానంలో నెక్‌టై అబ్బులికి కళ్ళు చెమర్చాయి. స్తంభానికి జెండా ఎగరడం కాదు. అంటరాని మనిషి ఒంటి మీద వస్త్రం రెపరెపలాడటమే తిరుగుబాటు. విగ్రహంవైపు తదేకంగా చూస్తూ, మనుసులోనే సైనికవందనం చేశాడు అబ్బులు. అంతే ఠీవిగా నడుచుకుంటూ గ్రేస్ వాళ్ల ఇంటి గుమ్మంలోకి వచ్చాడు.

''అబ్బులూ, ఈ సెంకిణీ ముండ ఎల్లిపోయింది. దీనికీ సిగ్గు లేదు, ఆడికీ సిగ్గులేదు. పట్టుసీరట్టుకొచ్చాడు. దీని సేతిలో ఎట్టాడు అక్కడ్తో ఆగాడేంటీ? ఏకంగా దీన్ని కొల్లట్టేసుకున్నాడు. సూట్టానికి నాకు సిగ్గేసిందనుకో'' జరిగిన వృత్తాంతాన్ని మూడు ముక్కల్లో తేల్చేసింది ముసలావిడ.

''అలా అనకు మామ్మా గ్రేస్ సిగ్గు తెలుసుకున్న పిల్ల'' అబ్బులి మాటకు పకాలున నవ్వింది ముసలావిడ. ''దీనికి సిగ్గా. సీర కోసం మొగుణ్ణొదిలిన ఆడదానికి సిగ్గా?'' ముసలావిడ మాటల్ని ఖాతరు చెయ్యకుండా మంచంమీద ఉన్న లివింగ్స్టన్‌వైపు చూశాడు అబ్బులు. లివింగ్స్టన్ మెలకువగానే ఉన్నాడు కానీ, నిద్రమత్తునుంచి కోలుకున్నట్టు లేడు.

''ఒరేయ్ లివింగ్స్టన్, నువ్వు కోటెప్పుడు కుట్టించుకుంటావో చెప్పు. నీకు వెయ్యి రూపాయ లిస్తాను'' అన్నాడు అబ్బులు. అలా అంటున్నప్పుడు అబ్బులి స్వరం దానంతటదే పెరిగింది.

''ఏంటి! కోటే?'' ఠక్కున లేచి నిలబడ్డాడు.

''ఓలమ్మో, ఈడు నుంచున్నాడు!'' ముసలావిడ అరిచింది. కాలు బెణికిన తర్వాత లివింగ్స్టన్ లేచి నిలబడటం ఇదే ప్రథమం. కాలదన్నినవాణ్ణే కాళ్లమీద పడేసిందీ వస్త్రమే! లేవలేనివాణ్ణే లేచి నిలబెట్టిందీ వస్త్రమే!!

మిట్టమధ్యాహ్నమైంది. బనీను మాత్రమే వేసుకుని చెరుకు మొక్కల మధ్యకు వెళ్ళాడేమో - సరస్వతి వీపుతోపాటు, అబ్బులు వీపు కూడా మాడుతోంది

''బాయ్యా గౌను నాకెప్పుడు కొంటావ్?'' భుజం, భుజం రాసుకుంటూ అడిగింది సరస్వతి. తత్తరపడ్డాడు అబ్బులు

''అదిరిపోకు మీ గేసు పొద్దుటేలొచ్చి, ఎంకిదాని సెవి కొరికిందిలే అప్పుడిన్నాను''

''నిన్నా !'' ఉడుక్కుంటూ ఆమె నెత్తిన మొత్తబోయాడు అబ్బులు.

''ఎయ్యిరా ఎయ్యి, నాలొయ్యి ఈ మదిద్న కఱ్ఱిదానికి ఒల్లు ఒంగటం లేదు'' ఎప్పుడొచ్చిందో కాని, గంప నెత్తిన పెట్టుకుని వెనకాలే గట్టుమీద నిలబడింది వెంకమ్మ

''అవునే లమ్మా, దీనికి కబుర్లు తప్ప పనిలే తల్లికి ఊతమిచ్చాడు

''హూఁ రాగాల కొడుక్కి కోడేపుడు అట్టుకొచ్చింది కామోలు ఎల్లు నాయనా ఎల్లు ఎల్లీ పీకల్దాకా మెక్కు'' సరస్వతి ఉడుక్కుంది

''సొల్లేయే సిగ్గులేనిదానా, దా. ఇలాగొచ్చీ గంప దించు'' వెంకమ్మ ఆప్యాయంగా ఆదేశించింది సణుక్కుంటూనే దింపి గంపలోకి చూసి ఆశ్చర్యపోయింది.

''ఏయ్! పుత్తకాలు! ఆకాశం చిల్లులు పడేటట్లు కేకలు పెట్టింది గంపలో పొందిగ్గా పేర్చి ఉన్నాయి పుస్తకాలు అందులో 'తెలుగు వాచకం' అనే పుస్తకాన్ని ముక్కు దగ్గర పెట్టుకుని పేజీలు జఱ్ఱున తిప్పింది. కొత్త పుస్తకాల వాసన. ఒక్కొక్క పుస్తకం గంపలోంచి తీసింది. మొత్తం పది పుస్తకాలు. పుస్తకాల అడుగున అన్నం కేరియర్

వెంకమ్మ క్రమం తప్పలేదు. అన్నం తర్వాతనే, అక్షరాలు పేర్చింది. ''ఇవన్నీ నీకే ఇక పొలం గట్టున నువ్వు సెయ్యాల్సిన పని ఇదే'' సరస్వతి కొప్పు పట్టుకుని ఆడించి, మరీ చెప్పాడు. అలా చేస్తున్నప్పుడు కొప్పులోని మందారం కింద పడబోతే బంతిని పట్టుకున్నట్టు వొడుపుగా పట్టుకున్నాడు.

''హిహిహి! అంది సరస్వతి. ముందు నవ్వుతుందనే అనుకున్నాడు అబ్బులు. ముక్కు ఎగపీల్చింది. కింద చతికిలపడింది. రెండు చేతుల్తో కళ్ళు గట్టిగా మూసుకుని శోకాలు తీసింది. ''ఛీ ఛీ ఛీ! ఏంటిది?'' సరస్వతి ఎదురుగా చతికిలబడి, ఆమె తలను తన భుజంవైపు వాల్చుకున్నాడు ఆమె ఏడుపు వెలిసిపోయి వెక్కిళ్ళలోకి వచ్చింది.

''ఒరేయ్ బాబా! నీ పిచ్చిగాని సదవేత్తే ఉన్న మతి పోతాదిరా. పక్కనే కాస్త దూరంగా కూర్చుంటూ అంది వెంకమ్మ

''లమ్మా! నువ్వన్నది కరెక్టేనే. ఉన్న మతి పోతుంది కానీ, లేని సిగ్గు వస్తుంది'' అలా అని అబ్బులు అన్నాడో లేదో, అతడి భుజాన్ని గట్టిగా కరిచింది సరస్వతి.

''లమ్మా కరిచిందే'' పెద్దగా అరిచి ముందుకు తోసి, పైకి లేచాడు అబ్బులు.

''ఏయ్, నా కొడుకుని కరిసావెందుకే కఱ్ఱిదానా?'' సరస్వతి పిలక పట్టుకుంది వెంకమ్మ.

''సిగ్గొచ్చీ . !''

ఆ సమాధానం చెప్పినప్పుడు తడిసిన సరస్వతి కళ్ళు తళుక్కుమన్నాయి ముఖం తుడుచుకోవడానికి ఆమె విడుదల చేసిన పైటకొంగు పైరగాలికి జెండాలా రెపరెపలాడింది

